


పూర్వం సుపర్వగిరి మీద కేసరి అనే గొప్ప వానరుడు ఉండేవాడు. ఆ పర్వతం మీద అరవైవేలమంది వానరులు ఉండే వారు. కేసరి వారికి నాయకుడు.

ఒకప్పుడు ప్రభాసతీర్థంలో ఉండే మునులను శంఖమూ, శబలమూ అనే రెండు ఏనుగులు బాధిస్తూ ఉంటే, కేసరి ఆ రెండు ఏనుగులనూ చంపేశాడు. అందుచేత అతనికి కేసరి (సింహం) అనే పేరు వచ్చింది.

కేసరి మహా బలవంతుడూ, భాగ్యవంతుడూ అయి ఉండి కూడా, బ్రహ్మచర్యం అవలంబించి, మహా ఘోరమైన తపస్సు చేసి, అంతులేని శక్తులు సంపాదించాడు.

ఆ కాలంలో శంబసాధనుడు అనే రాక్షసుడు తపస్సు చేసి బ్రహ్మను మెప్పించి, మూడు లోకాలనూ జయించేటట్టు వరం పొంది, మునులనూ, సిద్ధులనూ, దేవతలనూ అమితంగా హింసించ నారంభించాడు.

దేవతలందరూ కలిసి బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి, శంబసాధనుడు పెట్టే బాధలు భరించలేమని మొరపెట్టుకున్నారు. బ్రహ్మ వారిని కేసరి వద్దకు పంపాడు. దేవతలు కేసరి వద్దకు వెళ్ళి, అతన్ని ఆశీర్వదించి, శంబసాధనుడు పెట్టే బాధలన్నీ చెప్పుకుని, "బాబూ, ఆ దుర్మార్గుణ్ణుంచి నువే మమ్మల్ని కాపాడాలి!" అన్నారు.



ఇదే సమయంలో నారదుడు శంబసాధనుడి వద్దకు వెళ్ళి, "శుభమస్తు," అన్నాడు.

శంబసాధనుడు నారదుడికి నమస్కారంచేసి, "ఎక్కడినుంచి వస్తున్నారు? ఏమిటి విశేషాలు?" అని అడిగాడు.

"హేమకూటం నుంచి వస్తున్నాను. అక్కడ ఇంద్రుడు మొదలైన దేవతలందరూ చేరి, నిన్ను చంపమని ఒక వానరుణ్ణి ప్రార్థిస్తూ ఉన్నారు. ఈ మాట నీతో చెప్పిపోదామనే వచ్చాను," అన్నాడు నారదుడు.

ఈ మాట వినగానే శంబసాధనుడు ఆజ్యంపోసిన అగ్నిలాగా మండిపడి, "ఓహో! పాపం గదా అని ప్రాణాలతో వదిలిపెడితే, ఇదా దేవతలు చేస్తున్న ఆలోచన? నన్ను కోతి చేత ఎలా చంపిస్తారో నేనూ చూస్తాను! ఇంత కాలమూ చచ్చినట్టు పడి ఉన్న వాళ్ళు నన్ను చంపటానికి చూస్తున్నారా? నా భుజబలం ఏమిటో యీ దేవతలందరికీ చూపిస్తాను," అన్నాడు.

ఆ రాక్షసుడు ప్రళయకాలరుద్రుడిలాగా చేతిలో మెరిసే కత్తి పట్టుకుని కేసరి ఉన్న చోటికి అతి వేగంగా వచ్చి పడ్డాడు. అతని పెడబొబ్బలు విని కేసరి వద్ద ఉన్న దేవతలకు గుండెలు అవిసిపోయాయి. వాళ్ళు కొండగుహల్లోనూ, కేసరి చాటునా దాక్కునే ప్రయత్నాలు చేశారు.

"ఎక్కడికి పోతారు? మిమ్మల్నందరినీ ఒక్క దెబ్బతో చంపేస్తాను," అంటూ శంబసాధనుడు దేవతలను తరుముతూ ఉంటే, కేసరి అతనికి అడ్డం వెళ్ళి, "ఒరే, దుర్మార్గుడా! నా చేత చావటానికే వచ్చావు. యుద్ధం చెయ్యి," అన్నాడు.

"ఛీ, ఛీ! కోతితో యుద్ధం చెయ్యటమా? నాతో యుద్ధం చెయ్యటానికి శివుడే భయపడతాడు గద! ఒక్క క్షణంలో నీ సంగతి తేల్చేస్తాను," అంటూ శంబసాధనుడు కత్తి ఎత్తాడు.



ఇంతలో కేసరి పెద్ద రాయి ఎత్తి, రాకసుడి రొమ్ము అదిరేటట్టు కొట్టాడు. రాకసుడు కేసరి మీద ఒక గద విసిరితే, అది కేసరి రొమ్ముకు తగిలి పిండి అయి పోయిరిది. కాని కేసరి చలించలేదు. శంబసాధనుడు ఒక శూలాన్ని విసిరితే, కేసరి దాన్ని ఒడిసి పట్టుకుని, తన మోకాలికి పెట్టి విరిచేశాడు. అప్పుడు రాకసుడు కేసరిని కత్తితో కొట్టటానికి ముందుకు వచ్చాడు. కేసరి తన తోకతో రాకసుడి చేతి మీద కొట్టేసరికి కత్తి జారి కింద పడింది.

కిందపడిన కత్తి తీసుకోవటానికి శంబసాధనుడు ఒప్పుకోక, బాహుయుద్ధానికి సిద్ధపడ్డాడు. కాని కేసరి పిడికిలితో ఒక్క పోటు పొడిచే సరికి, ఆ రాకసుడు నెత్తురు కక్కుకుని చచ్చాడు. రాకసుడు చావటంతో దేవతల కష్టాలు తీరి పోయాయి.

దేవతలు కేసరితో, "ఇంకా ఎంత కాలం బ్రహ్మచారిగా ఉంటావు? ఇంక పెళ్ళి చేసుకుని గృహస్థువు అయిపో!" అని కేసరిని హెచ్చరించి వెళ్ళిపోయారు. కేసరి కూడా తనకు అనుకూలంగా ఉండే కన్య కోసం చూడసాగాడు.

బ్రహ్మదేవుడు సర్వాంగ సౌందర్యం గలిగిన అహల్య అనే కన్యను సృష్టించి గౌతముడు అనే మునికి భార్యగా ఇచ్చాడు. కొంతకాలానికి వారిద్దరికీ అంజన అనే కూతురు పుట్టింది.

అంజన పూర్వజన్మలో ఒక విద్యాధరుడి కూతురు. ఆమె గొప్ప గాయకురాలు. అందుచేత ఆమెకు సుకంఠి అనే పేరు వచ్చింది. ఆమె ఒకసారి తన చెలికత్తెలతో హిమాలయానికి వెళ్ళి, అక్కడ ఒక సరోవరంలో జలకాలాడి, ఒక చెట్టు కింద ఉండగా, అగ్నిహోత్రుడు అటు పోతూ కనిపించాడు. అతన్ని చూసి సుకంఠి నవ్వింది. అగ్నికి కోపం వచ్చి, వచ్చే జన్మలో వానరుణ్ణి కనమని శపించాడు.

తరవాత కుంజరుడనే వానరుడు సంతానం కావాలని శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు కుంజరుడికి ప్రత్యక్షమై, "నాయినా, నీకు కొడుకులు పుట్టే యోగంలేదు. కాని నీకు ఒక కూతురు దొరుకుతుంది. ఆ చక్కని పిల్లకు నా అంశన లోకోత్తరుడైన కొడుకు పుట్టి, నీ వంశాన్ని ఉద్ధరిస్తాడు," అని చెప్పాడు.



తరవాత కుంజరుడు తనకు కూతురు ఎప్పుడు దొరుకుతుందో గదా అని ఎదురు చూస్తూ ఉండగా, ఒకనాడు గౌతముడు అంజనను అతని వద్దకు తెచ్చి, పెంచుకోమని ఇచ్చి, వెళ్లిపోయాడు. శివుడి వరం యిలా ఫలించింది. కుంజరుడి సంతోషానికి అంతులేదు.

అంజన త్వరలోనే తన అసలు తల్లి దండ్రులను మరిచిపోయి, కుంజరుణ్ణి తన తండ్రిగానూ, అతని భార్య అయిన వింధ్యావళిని తన తల్లిగానూ చూడనారంభించింది. క్రమంగా ఆమెకు యుక్తవయసు వచ్చింది. కుంజరుడు ఆమెకు వివాహం చేసే ఆలోచన ఆరంభించాడు.

ఈ లోపల కేసరి అంజన అందం గురించీ, పాట గురించీ విని ఆమెను చూడటానికి బయలు దేరివచ్చి, ఆమె వనవిహారం చేస్తుండగా చూశాడు. ఆమె బంగారు శరీరచ్ఛాయా, అందమూ చూసి కేసరికి అమిత ఆశ్చర్యం కలిగింది. ఆమె తనను వరించేటట్టుంటే ఇంకేదీ జీవితంలో అవసరం లేదని అతనికి అనిపించింది.

అంజనకు కూడా కేసరి పైన మోహం పుట్టుకొచ్చింది. కాని ఆమె ఆ విషయాన్ని తన చెలికత్తెలకు తెలియనీయకుండా, వనవిహారం కట్టిపెట్టి ఇంటికి వచ్చేసింది.

కేసరి మర్నాడు తన అప్తులతో అంజన తనకు నచ్చిందని చెప్పి, ఆమెను తాను పెళ్ళాడే మార్గం ఏమిటని అడిగాడు.



''కుంజరుడు మనకు బంధువు కాదగిన యోగ్యుడే. అతన్ని మంచిగా అడిగి చూద్దాం. పిల్ల నియ్యనంటే బల ప్రయోగం చేద్దాం,'' అన్నారు కేసరి బంధుగణం.

తరవాత కేసరి పంపిన పెళ్ళి పెద్దలు కుంజరుడి వద్దకు వచ్చి, కేసరి ఉద్దేశం తెలిపారు. కేసరి అంత వాడు తనకు అల్లుడు అవుతున్నందుకు సంతోషించి, కుంజరుడు అంజనను అతనికి శాస్త్రోక్తంగా పెళ్ళి చేశాడు.

అయితే చాలా కాలం అంజనకు సంతానం కలగలేదు. సంతానం కోసరం అంజనా, కేసరీ ఎన్నో నోములూ, వ్రతాలూ చేశారు, కాని ఫలితం లేకపోయింది. చివరకు అంజన పిల్లల కోసం వాయు దేవుణ్ణి గూర్చి తపస్సు చేయ నిశ్చయించింది. కేసరి అందుకు సమ్మతించి, పుంజకస్థలం అనే చోట ఆమెను తపస్సు చెయ్యమన్నాడు. అలాగే అంజన వాయు దేవుణ్ణి ధ్యానిస్తూ తపస్సు ప్రారంభించింది.

చివరకు వాయుదేవుడు కరుణించి, తాను చాలా కాలంగా మోస్తున్న శివుడి తేజస్సును ఒక పండు రూపంలో తెచ్చి, అంజన ముందు పెట్టి, వెళ్ళిపోయాడు. అంజన ఆ పండు తిని గర్భవతి అయింది. ఆమె తనలో గర్భచిహ్నాలు నా నాటికీ ఎక్కువ అవుతూ ఉండటం చూసి ఆశ్చర్యపడి, ఆందోళన చెందింది. ఒంటిగా తపస్సు చేసుకునే స్త్రీకి గర్భం ఎలా కలుగుతుంది? ఈ సంగతి తెలిస్తే నలుగురూ ఏమంటారు? ఆమెకు ఏమి చెయ్యాలో తోచలేదు.

ఇంతలో ఆకాశం నుంచి అశరీరవాణి ఇలా పలికింది:

"అమ్మాయీ, విచారించకు. ఒకప్పుడు శివుడు వానరరూపంలో ఉండి, తన తేజస్సును వాయుదేవుడికి ఇచ్చాడు. వాయుదేవుడు దాన్ని నీకు పండు రూపంలో ఇచ్చాడు. దాన్ని నువు తినటం

చేత సాక్షాత్తూ ఆ శివుడే నీ గర్భంలో పెరుగుతున్నాడు. నీకు గర్భం కలగటానికి వాయువు సహాయ పడ్డాడు గనక ఆ కుర్రవాడు వాయునుతుడుగా ప్రఖ్యాతి పొందుతాడు; మూడు లోకాలలోనూ అంతులేని కీర్తి సంపాదిస్తాడు.''

అశరీరవాణి ఇలా చెప్పిన మీదట వాయుదేవుడు అంజన ఎదట ప్రత్యక్షమై, ''అశరీరవాణి చెప్పినదంతా యదార్థం. విచారించక, నువు వెళ్ళి నీ భర్తతో ఇలా జరిగిందని చెప్పు.'' అని అదృశ్యమయాడు.

అంజన కేసరి వద్దకు తిరిగి వచ్చి, అతనితో జరిగినదంతా చెప్పింది. కేసరి సంతోషించాడు.

ఒక సంవత్సరం గడిచిన మీదట అంజన ఒక పిల్లవాణ్ణి కన్నది. వెంటనే దేవదుందుభులు మోగాయి, పుష్పవర్షం కురిసింది. ఆ కుర్రవాణ్ణి చూసి కేసరి అపరిమితమైన ఆనందం పొంది, పండగ చేసుకున్నాడు.

పిల్లవాడికి ఆకలి తీరటానికి పళ్ళు తీసుకొద్దామని అంజన, తన బిడ్డను తమ పర్ణశాలలో చిగురుటాకుల పక్క మీద పడుకోబెట్టి, అడవికి వెళ్ళింది. కాని ఆ పిల్లవాడు ఆకలి మీద ఉండి, తల్లి వెనకగా పర్ణశాల బయటికి వచ్చి, తూర్పు దిక్కుగా చూశాడు. అప్పుడే



తూర్పు కొండమీది నుంచి ఎర్రగా పైకి వస్తున్న సూర్యబింబం కనిపించింది.

దాన్ని చూసి ఆ కుర్రవాడు పండు అనుకుని, తెలియని తనంవల్ల దాన్ని పట్టుకునే ఉద్దేశంతో ఆకాశానికి ఎగిరాడు. అలా సూర్యుడి కేసి ఎగిరి పోతున్న ఆ కుర్రవాణ్ణి చూసి యక్షులూ, రాక్షసులూ, నాగులూ నివ్వెరపోయి, ఏదో ప్రళయం ముంచుకొస్తున్న దనుకున్నారు. ఇదేదో అపూర్వ మైన కొత్త అవతారంగా వాళ్ళకు కనబడింది.

తన అనుచరులు ఆ కుర్రవాణ్ణి చూసి భయపడుతూ ఉంటే సూర్యుడు వారితో, ''ఇతడు ఈశ్వరతేజస్సుతో లోకాలను

రక్షించటానికి పుట్టిన ఆంజనేయుడు. గొప్ప బలశౌర్యాలు కలవాడు. అయితే కుర్రతనం చేత నన్ను చూసి, పండు అని భ్రమపడి, తినటానికి వస్తున్నాడు. భయపడకండి," అన్నాడు.

తనను చూసి పండు అని భ్రమపడి దగ్గిరికి ఎగిరి వచ్చే ఆంజనేయుణ్ణి చూసి సూర్యుడు ముచ్చటపడి, తన వేడిని తగ్గించేసుకున్నాడు. ఇంతలో ఆంజనేయుడు వచ్చి సూర్యుణ్ణి పట్టుకుని నోట్లో పెట్టుకుని, వేడి అనిపించి మళ్ళీ బయటికి తెచ్చి, చేత్తో కొట్టి, తిట్టి, గొడవ పడసాగాడు.

ఆరోజు అమావాస్య. రాహువు సూర్యుణ్ణి పట్టుకునే రోజు. అందుచేత సూర్యుణ్ణి మింగటానికి రాహువు ఆ సమయంలో వచ్చాడు. రాహువుని చూసి ఆంజనేయుడు పెద్ద పెడబొబ్బ పెట్టాడు. అది విని రాహువు భయకంపితుడై అతివేగంగా పారిపోయి, స్వర్గం చేరి, ఇంద్రుడి కొలువుకు వెళ్లాడు.

ఇంద్రసభలో విద్యాధరులు ఇంద్రుడికి స్తోత్రపాఠాలు చదువుతున్నారు. తుంబుర నారదులు వీణలు వాయిస్తున్నారు. అప్సరసలు నాట్యం చేస్తున్నారు. ఇంద్రుడు చింతామణిపీఠం మీద వైభవంగా కూర్చుని ఉన్నాడు. రాహువు ఇంద్రుణ్ణి చేరి, "నీకేం? నువు హాయిగా ఆటలతో పాటలతో కాలం గడుపుతూ, ఉన్న మతి కూడా పోగొట్టుకున్నావు!" అన్నాడు.

"అదేమిటి?" అన్నాడు ఇంద్రుడు.

"ఇవాళ పర్వదినం గదా, సూర్యుణ్ణి పట్టుకుందామని నేను వెళ్ళేసరికి, నాకు శత్రువుగా మరొక రాహువు దాపరించి సూర్యుణ్ణి పట్టేశాడు. సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ పట్టటానికి ఇంకో రాహువు ఉంటే నేను దేనికి?" అన్నాడు రాహువు.

ఇంద్రుడు నివ్వెరపోయి, "ఏమిటీ? ఇంకొకడెవడో వచ్చి సూర్యుణ్ణి పట్టాడా? ఏదీ, నా వెంట రా!" అని, ఐరావతాన్ని ఎక్కి, చేతిలో వజ్రాయుధాన్ని పట్టుకుని, వేగంగా బయలుదేరాడు.





# వీర హనుమాన్

ఇంద్రుడు అంత ఉన్నాడు గదా అన్న ధైర్యంతో రాహువు ఆంజనేయుడి మీదికి వెళ్ళాడు. ఆంజనేయుడు రాహువును ఎగాదిగా చూసి, పండు అనుకుని పట్టుకోబోయాడు. ఆంజనేయుడు ఆర్భాటం చేసి ఉగ్రనరసింహమూర్తి లాగా మీదికి రావటం చూసి రాహువు కంగారుగా ఇంద్రుడి దగ్గిరికి పరిగెత్తుకుంటూ పోయి, "ఈ అబ్బాయి నన్ను చంపేస్తున్నాడు. రక్షించు!" అని కేకలు పెట్టాడు.

"భయపడకు," అంటూ ఇంద్రుడు తన ఏనుగును ముందుకు తోలాడు.

ఘీంకరిస్తూ తన మీదికి వచ్చే ఐరావతాన్ని చూసి ఆంజనేయుడు, "ఈ పండు తెల్లగా బాగుంది. దీన్ని తిని ఆకలి తీర్చుకుంటాను," అనుకుని, మీదికి వచ్చేసరికి, ఐరావతం కూడా బెదిరింది.

ఇంద్రుడికి కోపం వచ్చి, ఆంజనేయుడి పైన వజ్రాయుధం విసిరాడు. ఆ దెబ్బకు ఆంజనేయుడి దవడ విరిగి పోయింది. అతను ఉదయాద్రి మీద పడిపోయి, కదలకుండా ఉండిపోయాడు.

ఇది చూసి వాయుదేవుడికి దుఃఖం ముంచుకు వచ్చింది. అతనికి కోపం కూడా వచ్చి, సంచరించటం మానేశాడు.

ఈ లోపల అంజన పర్ణశాలకు తిరిగి వచ్చి చూసేసరికి, పక్కమీద బిడ్డలేడు. ఆమె తన బిడ్డ కోసం రకరకాలుగా ఏడవటం మొదలు పెట్టింది.

2. సుగ్రీవుడి వద్ద మంత్రిత్వం



కేసరి ఆమెను ఊరడిస్తూ, ''ఏడవకు. నీ కొడుకు ఉదయించే సూర్యుణ్ణి చూసి పండు అని భ్రమపడి పట్టుకోబోయాడు. ఈ సంగతి రాహువు చెప్పేసరికి ఇంద్రుడు వచ్చి, దవడ పగిలేటట్టు కొట్టాడు. నీ కొడుకు స్పృహ తప్పి, తూర్పు కొండ మీద పడి ఉన్నాడు. వాయుదేవుడు ఇంద్రుడి పైన అలిగి, సంచారం మానేశాడు. నీ కొడుక్కు సమస్త శుభాలు కలుగుతాయి,'' అన్నాడు.

ఈ మాటలతో అంజన ఊరడిల్లింది.

వాయుదేవుడు అలిగి స్తంభించి పోయేసరికి దేవతలు కంగారుపడి, బ్రహ్మ వద్దకు వెళ్ళి, ఇంద్రుడు ఆంజనేయుడి దవడ పగలగొట్టి మూర్ఛ పోగొట్టిన సంగతీ, వాయుదేవుడు అలిగిన సంగతీ చెప్పి, కాపాడమని వేడుకున్నారు.

బ్రహ్మదేవుడు హంస వాహనం మీద వాయుదేవుడు ఉన్న చోటికి వెళ్ళి, ''నాయనా, సమస్త ప్రాణులకూ ప్రాణమిచ్చే వాడివి, అంతటా ఉండే వాడివి! నువు అలగటం ధర్మమా?'' అన్నాడు.

వాయుదేవుడు వెళ్ళి, మూర్ఛపోయి ఉన్న ఆంజనేయుణ్ణి తన చేతుల్లో ఎత్తి తీసుకు వచ్చి, బ్రహ్మ కాళ్ళవద్ద పెట్టి నమస్కారం చేశాడు. బ్రహ్మ ఆ కుర్రవాణ్ణి తన చేత్తో తాకే సరికి, అతనిలో తిరిగి చైతన్యం వచ్చింది.

ఇది చూసి వాయుదేవుడు సంతోషించి, లోక సంచారం చెయ్యటానికి బయలుదేరి పోయాడు. బ్రహ్మ దేవతలతో, ''ఈ కుర్రవాడు లోకాలన్నిటినీ సంతోషపెట్టగలవాడు. ఇతనికి వరాలు ఇద్దాం. ఇతను సాక్షాత్తూ శివుడి అవతారం,'' అన్నాడు.

అప్పుడు ఆంజనేయుడికి భూదేవి వేదశాస్త్రాలు వచ్చేటట్టుగా శక్తినిచ్చింది; నీటి భయం లేకుండా వరుణుడు వరమిచ్చాడు; మృత్యు భయమూ, ముసలితనమూ లేకుండా యముడు వరమిచ్చాడు; కుబేరుడు యుద్ధాలలో విజయం ఇచ్చాడు; విశ్వకర్మ కనక

కుండలా లిచ్చాడు. ఇంద్రుడు ఆంజనేయుడికి హనుమంతుడు అనే పేరుపెట్టి, వజ్రాయుధం చేత అతనికి హాని లేకుండా వర మిచ్చాడు. (హనుమ అంటే దవడ.) బ్రహ్మ హనుమంతుడికి దీర్ఘాయువూ, చిరంజీవిత్వమూ ఇచ్చాడు.

తరవాత బ్రహ్మ వాయుదేవుడితో, "నీ కొడుకు నిష్కల్మషమైన కీర్తి సంపాదిస్తాడు. ఎన్నడూ ఓడడు. ఏక వీరుడు. పర్వతంలాటి ధీరత్వం గలవాడు. అణిమాది సిద్ధులన్నీ ఇతనికి ఉంటాయి. తలుచుకున్న మాత్రాన విశ్వమంతా చూడగలడు. విరాగి, ఎలాటి కామమూ లేనివాడు. కామరూపి. ఇతనిలో అంతులేని శౌర్య, ధైర్య, దయాది గుణాలుంటాయి. ఎన్నో అద్భుతమైన పనులు చేస్తాడు. వాటిని నువే చూస్తావు," అని చెప్పి వెళ్ళి పోయాడు. హనుమంతుణ్ణి గురించీ, అతను సూర్యుణ్ణి పట్టుకోబోవటం గురించీ చిత్రంగా చెప్పుకుంటూ దేవతలు కూడా వెళ్ళిపోయారు.

వాయుదేవుడు హనుమంతుణ్ణి తీసుకుపోయి అంజన కిచ్చాడు. ఆమె తన కొడుకును తిరిగి సంపాదించి ఆనంద బాష్పాలు రాల్చింది. ఆ ప్రాంతాల తపస్సు చేసుకునే వాళ్ళు హనుమంతుడి సంగతివిని ఆశ్చర్యపడుతూ, "సూర్యుడి



కాంతి మీదపడితేనే తాపం కలుగుతుంది గదా. ఈ పిల్లవాడు వెళ్ళి సూర్యుణ్ణి పట్టుకోవట మేమిటి?" అనుకున్నారు.

తన కొడుక్కు దేవతలందరూ వరాలిచ్చిన సంగతి తెలిసి కేసరి చాలా సంతోషించాడు.

హనుమంతుడు పెరిగివస్తూ, సమస్తమైన జ్ఞానమూ కలిగి ఉండి కూడా ఆకతాయి పనులు చేస్తూ తిరగసాగాడు. మంచి పనులు చెయ్యాలిగాని, మర్కట చేష్టలు చెయ్యరాదనీ, దరిద్రులను బాధించటం చాలా అసహ్యమనీ తల్లిదండ్రులు ఎంత చెప్పినా వినక, అతను కోతివేషాలు వేస్తూ కాలం గడిపే వాడు.



కొంతకాలం గడిచింది. ఒకనాడు అంజన హనుమంతుడితో, "నాయనా, కిష్కింధలో వాలి, సుగ్రీవులని ఇద్దరు అన్నదమ్ములున్నారు. మా తల్లి అయిన అహల్య రహస్యంగా వాళ్ళను ఇంద్రుడికీ, సూర్యుడికీ కన్నది. ఆ సంగతి తెలిసి మా తండ్రి గౌతముడు వారిని వానరులు కమ్మని శపించాడు. అందుచేత వాళ్ళు నీకు మేనమామలు. నువు కిష్కింధకు వెళ్ళి, సుగ్రీవుడి అండ చేరు. ఏ కారణం చేతనైనా వాలి సుగ్రీవుల మధ్య వైరం వస్తే నువు వాలిని చంపేవు సుమా!" అన్నది.

లోకాలను రక్షించటానికి పుట్టిన ఈ హనుమంతుడు చిన్నతనంలోనే ఇంత ఆకతాయి పనులు చెయ్యట మేమిటో బ్రాహ్మణులకు అర్థం కాలేదు. ఏదన్నా శాపం పెడదామన్నా, అతనికి శాపాలు తగలకుండా బ్రహ్మ ఇచ్చిన వరం ఉన్నది! అంతే గాక, ఇంత మహాశక్తిమంతుడికి ఏ అడ్డూ, అదుపూ లేక పోతే లోకాలను తారుమారు చేయడా? అందుచేత ఆ బ్రాహ్మణులు హనుమంతుడికి తన బలం తెలియకుండా ఉండాలన్నారు.

వెంటనే హనుమంతుడు సాత్వికుడుగా మారిపోయాడు. కొడుకులో ఈ మార్పు చూసి, అంజనా, కేసరీ తృప్తి పడ్డారు.

హనుమంతుడు తల్లికి నమస్కరించి, సెలవు తీసుకుని, కిష్కింధకు వెళ్ళాడు. వాలి సుగ్రీవులు అతన్ని ఆదరించారు. అతను సుగ్రీవుడికి మంత్రిగా ఉండనారంభించాడు. అతనికి వేదాలూ, శాస్త్రాలూ నేర్చుకోవాలని కోరిక కలిగింది.

ఒకనాటి ఉదయం హనుమంతుడు కాలకృత్యాలు తీర్చుకుని, సూర్యుడు ఉదయించే సమయానికి గగన మార్గాన ఎగిరి సూర్యుడి వద్దకు వెళ్ళి, నమస్కారం చేశాడు.

సూర్యుడు సంతోషించి, "సంకల్ప సిద్ధిరస్తు! ఏం, నాయనా, ఏం పని మీద వచ్చావు?" అని అడిగాడు.

''అయ్యా, వేదశాస్త్రాలు నేర్చుకోవటానికి వచ్చాను.'' అన్నాడు హనుమంతుడు.

''బాగానే ఉంది. కాని నేను- మేరు పర్వతం చుట్టూ అతివేగంగా తిరుగుతూ ఉంటాను. నా నుంచి శాస్త్రం నేర్చుకోవటం చాలా కష్టం అవుతుందే!'' అన్నాడు సూర్యుడు.

దానికి హనుమంతుడు, ''మహాత్మా, ఉదయపర్వతం మీద ఒక కాలూ, అస్తమయ పర్వతం మీద ఒక కాలూ పెట్టి మీ వద్ద చదువుకోమన్నారా, లేక మీకు ముందు-నడుస్తూ చదువుకోమన్నారా?'' అని సూర్యుణ్ణి అడిగాడు.

సూర్యుడు ఈ మాటకు సంతోషించి, ''నాయనా, నీ వంటి ఘాడు సృష్టిలో మరెవడూ లేడు. రెండు కొండల మీదా పాదాలుంచి నిలబడు; దేవతలు చూసి ఆనందిస్తారు.'' అన్నాడు.

వెంటనే హనుమంతుడు సూర్యుడికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి, తన శరీరాన్ని నక్షత్రాల కన్న పైగా ఉండేటట్టు పెంచి, అన్ని దిక్కులూ ఆక్రమించి, బ్రహ్మాండం నిండేటట్టు చేశాడు. ఆ అవతారం చూసి బ్రహ్మదేవుడే నివ్వెర పోయాడు. మునులూ, దేవతలూ హనుమంతుణ్ణి చూసి నమస్కారాలు చేశారు.




సూర్యుడు పొందిన అద్భుతం అంతా ఇంతా కాదు. ఆయన హనుమంతుడితో, ''ప్రత్యక్ష రుద్రావతారుడివి! నాకు కీర్తి కలిగించటానికి వచ్చావే గాని, నేను నీకు ఏం ఉపదేశించగలను?'' అన్నాడు.

హనుమంతుడు వినయంగా, ''మహాత్మా, మీరు ఇలా అనవచ్చునా? వేదాలకు మూలమైనవాడివి. నన్ను శిష్యుడుగా చేసుకుని దయతో వేదత్రయం బోధించు.'' అంటూ తన మామూలు రూపం ధరించి, సూర్యుడి రథానికి ఎదురుగా నిలబడ్డాడు.

సూర్యుడు గడియకు తొమ్మిది లక్షల డెబ్భైవేల యోజనాల వేగంతో నడుస్తాడు. అంత వేగంతోనూ హనుమంతుడు



ఎగురుతూ, సూర్యుడికి ఎదురుగా నిలబడి, నేర్చుకోవలిసిన దంతా, స్మృతి పురాణాలతో కూడా నేర్చుకున్నాడు.

చదువు పూర్తికాగానే హనుమంతుడు సూర్యుడికి నమస్కారం చేసి, సెలవు పుచ్చుకుని, కిష్కింధ వెళ్లి, తన సంగతులన్నీ చెప్పాడు. సుగ్రీవుడు హనుమంతుడి పట్ల హెచ్చు ప్రేమ కలిగి, అతన్ని తన వద్దనే ఉంచుకున్నాడు.

వాలి సుగ్రీవులు చాలా అన్యోన్యంగా ఉండేవారు. వారిని పెంచిన తండ్రి ఋక్షవిరజుడు చనిపోయినాక వానరరాజ్యానికి వాలి రాజూ, సుగ్రీవుడు యువరాజూ అయారు.

వాలి బలపరాక్రమాలు సాటిలేనివి. అతనితో యుద్ధం చేసి ఎవరూ గెలవలేదు. రాజులందరినీ జయించిన మదంతో రావణుడు ఒకసారి వాలి వద్దకు వచ్చి, అతన్ని యుద్ధానికి పిలిచాడు. వాలి రావణాసురుడితో యుద్ధం చేసి, అతన్ని చావ చితకగొట్టేశాడు. తరవాత రావణుడు వాలితో స్నేహంగా ఉంటూ వచ్చాడు.

తరవాత వాలిని యుద్ధానికి పిలిచినవాడు దుందుభి అనే రాక్షసుడు. వాడు మదించి హిమవంతుణ్ణి యుద్ధానికి పిలిచాడు. హిమవంతుడు దుందుభితో, "బాబూ, నీతో యుద్ధం చేసే శక్తి నాకు లేదు. నీతో యుద్ధం చెయ్యగలవాడు వాలి ఒక్కడే. నువు మధువనానికి వెళ్ళి, అతన్ని యుద్ధానికి పిలు, తప్పక వస్తాడు," అన్నాడు.

ఆ మాట విని దుందుభి మధువనానికి వచ్చి, ఆ వనాన్ని ధ్వంసం చేస్తూ, వాలిని యుద్ధానికి పిలిచాడు. మధువనం కిష్కింధకు బయట ఉన్నది. వాలి దుందుభి పిలుపు విని వచ్చి, యుద్ధంలో వాణ్ణి చంపి, వాడి శరీరాన్ని విసిరివేశాడు. దుందుభి కళేబరం దూరాన ఉన్న ఋశ్యమూక పర్వతం మీద పడింది. వాడి రక్తం, ఆ పర్వతం మీద తపస్సు చేసుకుంటున్న మతంగ

మహాముని మీద పడింది. ఆ ముని కోపించి, వాలి ఋశ్యమూకం మీదికి వస్తే అతని తల పగిలి పోతుందని శాపం పెట్టాడు.

తరవాత వాలికి దుందుభి కొడుకైన మాయావితో వైరం వచ్చింది. దుందుభిని వాలి చంపి ఉండటమేగాక, ఒక స్త్రీ విషయంలో కూడా మాయావికీ, వాలికీ వైరం ఏర్పడింది.

ఒకనాటి అర్ధరాత్రి మాయావి కిష్కింధ నగర ద్వారం వద్దకు వచ్చి, పెడబొబ్బలు పెట్టుతూ, వాలిని యుద్ధానికి పిలిచాడు. నిద్రపోతున్న వాలి లేచి, శత్రువు దర్పం సహించలేక, వాడితో యుద్ధానికి బయలు దేరాడు. సుగ్రీవుడూ, వాలి భార్య అయిన తారా వద్దని వారించబోయారు. కాని వాలి వినలేదు.

వాలిని ఆపలేక సుగ్రీవుడు కూడా అతని వెంట బయలుదేరాడు. అన్న దమ్ము లిద్దరూ వస్తూండటం చూసి మాయావి భయపడి, పారిపో సాగాడు. వాలి, సుగ్రీవులు అతన్ని తరుముకుంటూ వెళ్ళారు. మాయావి వారిని చాలా దూరం తీసుకుపోయి, ముళ్ళకంపలు కప్పి ఉన్న ఒక కొండ బిలంలో ప్రవే శించాడు.

''నేను మాయావిని హతమార్చి వచ్చిన దాకా నువు ఇక్కడే ఉండు,'' అని సుగ్రీవుడితో చెప్పి, వాలి కూడా బిలం ప్రవేశించాడు.

వాలి ఎంతకూ తిరిగి రాకపోయేసరికి, అతను చచ్చిపోయాడేమో నని సుగ్రీవుడికి భయం వేసింది. ఇంతలో బిలంలో నుంచి నురుగుతో కూడిన రక్తం బయటికి రాసాగింది. బిలంలో నుంచి వచ్చే ధ్వనులు రాకసుడివిగా అతనికి విని పించాయి.

సుగ్రీవుడు తన అన్న కోసం దుఃఖించి, ఆ బిలానికి కొండరాయి అడ్డంపెట్టి, అన్నకు జలతర్పణాలు విడిచి, కిష్కింధకు తిరిగి వచ్చాడు. వానరులు అతన్ని రాజుగా అభిషేకించారు.






అయితే వాలి మాయావి చేతిలో చావలేదు, తానే మాయావిని చంపి తిరిగి వచ్చాడు. తిరిగి వచ్చిన వాలికి సుగ్రీవుడు గౌరవంగా నమస్కారం చేశాడు. వాలి సుగ్రీవుణ్ణి ఆశీర్వదించక, అతన్ని కోపంగా చూసి, తిట్టిపోశాడు. సుగ్రీవుడు తన కిరీటం తీసి వాలి పాదాల వద్ద పెట్టి, అతనికి సాష్టాంగనమస్కారం చేశాడు.

వాలి కోపం పోగొట్టటానికి సుగ్రీవుడు, "అహా, అన్నా! నువు శత్రువును చంపి తిరిగి రావటం నా మహాభాగ్యం. అంతకన్న మాకందరికీ సంతోషం ఏమున్నది? నేను బిలం దగ్గిర ఎంతోసేపు నిలబడ్డాను. అందులో నుంచి రక్తం బయటికి వచ్చినప్పుడు నాకు కలిగిన దుఃఖం ఏమని చెప్పను? అప్పుడా బిలాన్ని కొండరాయితో కప్పిపెట్టి, కిష్కింధకు తిరిగి వచ్చాను. నేను రాజ్యాభిషేకం కోరలేదు. పౌరులూ, మంత్రులూ రాజుండాలని పట్టుబట్టి నాకు రాజ్యాభిషేకం చేశారు. ఇప్పుడు నువే రాజువు, నేను యువరాజును. నన్ను అపార్థం చేసుకోకు," అన్నాడు.

కాని సుగ్రీవుడి మాటలను వాలి వినిపించుకోలేదు. అతను అందరినీ పిలిచి, వారి ఎదట సుగ్రీవుణ్ణి నానా మాటలూ అన్నాడు:

"వీడూ, నేనూ మాయావిని తరుముకుంటూ వెళ్ళాం. మాయావి ఒక భయంకరమైన బిలంలో దూరాడు. వాణ్ణి చంపిగాని కిష్కింధకు తిరిగి రానని శపథం



అయిన తారను తన భార్యగా చేసు కున్నాడు. సుగ్రీవుడు వాలి భయం కొద్దీ ఋశ్యమూకపర్వతం మీద తల దాచుకున్నాడు. ఈ వనవాసంలో సుగ్రీవుడి వెంట హనుమంతుడూ, జాంబవంతుడూ, మైందుడూ, ద్వివిదుడూ అనే వానరులు అతని మంత్రులుగా ఉన్నారు.

సుగ్రీవుడి వెంట ఉంటున్న సమయం లోనే హనుమంతుడికి రాముడితో పరిచయం కలిగింది. అది ఇలా జరిగింది.

ఋశ్యమూకం మీద ఉన్న సుగ్రీవుడు ఒకనాడు పంపాసరోవరం పక్కన ఉన్న వనంలో ఇద్దరు మనుషులు సంచరిస్తూ ఉండటం చూశాడు. వాళ్ళు ధనుర్బాణాలు ధరించి, చూడటానికి చాలా అద్భుతంగా ఉన్నారు. వాళ్ళను చూస్తూనే సుగ్రీవుడు భయపడిపోయాడు. వాళ్ళు వాలి పంపిన మనుషులు అయి ఉంటారనీ, వాలి ఋశ్యమూకపర్వతం మీదికి రాకూడదని శాపం ఉన్నది గనక, తనను చంపించటానికి ఎవరినో పంపాడనీ సుగ్రీవుడు అనుకున్నాడు. అతను కాలు కాలిన పిల్లిలాగా తిరుగుతూ, ఎక్కడికైనా పారిపోవాలనుకుంటున్నాడు.

అప్పుడు హనుమంతుడు సుగ్రీవుడితో, ''వాలి ఇక్కడికి రాలేడు. అతను వచ్చిన జాడ లేదు. భయం దేనికి?'' అన్నాడు.

చేసి, ఈ సుగ్రీవుణ్ణి బిలద్వారం వద్దనే ఉండమని చెప్పి, లోపలికి వెళ్ళాను. బిలంలో నాకు మాయావి ఒకంతట దొరకలేదు. శ్రమపడి వాణ్ణి వెతికి, పట్టుకుని చంపి, వాడి వాళ్ళనందరినీ చంపి తిరిగి వచ్చేసరికి, బిలద్వారం కూడా నాకు కనిపించలేదు. 'సుగ్రీవా' అని కేకలు పెట్టితే జవాబు లేదు. ఈ దుర్మార్గుడు రాజ్యం కోసం ఆ బిలాన్ని మూసి, నన్ను బయటికి రాకుండా చేద్దామనుకున్నాడు. బిలానికి అడ్డంగా ఉన్న రాతిని తన్ని పగలగొట్టి వచ్చేశాను.''

ఇలా అని వాలి సుగ్రీవుణ్ణి కట్టుబట్టలతో వెళ్ళగొట్టాడు, సుగ్రీవుడి భార్య



"వాలి వచ్చాడని నేను అనలేదు. ఆ ఇద్దరు మనుషులనూ చూడు. వాళ్ళ వద్ద ఉన్న ధనుర్బాణాలూ, ఖడ్గాలూ చూడు. వాళ్ళను చూస్తే ఎవరికైనా భయం కలిగితీరుతుంది. వాళ్ళను వాలి నాపైకి పంపాడని నా అనుమానం. రాజైన వాడికి ఎందరో సహాయకులు ఉంటారు. మనం గూఢచారులను గురించి ఏమరి ఉండరాదు; ఉంటే చచ్చిపోతాం. రాజులు శత్రువులను నాశనం చెయ్యటంలో అనేక ఉపాయాలు ఆలోచిస్తారు. అందులోనూ వాలి మహా తెలివిగలవాడు. చూడు, హనుమంతుడా! నువు వెళ్ళి, వాళ్ళు మాట్లాడుకునే మాటలు విని, వాళ్ళు మంచివాళ్ళో, దుర్మార్గులో తెలుసుకో. వాళ్ళు అరణ్యాలలో ఆయుధాలు ధరించి ఎందుకు తిరుగుతున్నారో అడుగు. వారికి నా మీద ఏదైనా ద్వేషభావం ఉంటే దాన్ని పోగొట్టి, నాపై వారికి సద్భావం కలిగేటట్టు చెయ్యి," అన్నాడు సుగ్రీవుడు.

అలాగే చేస్తానని చెప్పి, హనుమంతుడు రామలక్ష్మణులు సంచరిస్తున్న చోటికి బయలుదేరాడు. అతను తన వానర రూపాన్ని మార్చుకుని ఒక బ్రహ్మచారి రూపం ధరించి, రామలక్ష్మణులను సమీపించి, అతి వినయంగా, "అయ్యలారా, మిమ్మల్ని చూస్తే రాజర్షులు గానూ, దేవతా సమానులు గానూ, తపోవ్రతం పూనినవారు గానూ కనిపిస్తున్నారు. మీరు ఈ పంపా తీరానికి ఎలా వచ్చారు? మీరెవరు? మిమ్మల్ని చూసి ఇక్కడి వన్యమృగాలు బెదిరిపోతున్నాయి! మీ విశాలమైన భుజాలూ, ఏనుగుతొండాల వంటి చేతులూ చూస్తే, సమస్తమైన ఆభరణాలూ ధరించి, రాజ్యాలు ఏల దగినవారిలా ఉన్నారు," అన్నాడు.

రామలక్ష్మణులు మాట్లాడ లేదు.

తిరిగి హనుమంతుడే ఇలా అన్నాడు:

"సుగ్రీవు డనే వానరరాజు మహా ధర్మాత్ముడు, గొప్ప బలశాలి. అన్న వెళ్ళ



గొట్టగా ఆయన చాలా ఇక్కట్లు పడు తున్నాడు. నేను ఆయన మంత్రిని, హనుమంతుడనే వానరుణ్ణి. సుగ్రీవుడు పంపగా ఋశ్యమూకం నుంచి వచ్చాను. నేను కామరూపుణ్ణి. అందుచేత ఈ బ్రహ్మచారి వేషం ధరించి వచ్చాను. ఎక్కడికైనా వెళ్ళగల శక్తి నాకున్నది. సుగ్రీవుడు మీ స్నేహం కోరుతున్నాడు."

ఈ మాట వినగానే రాముడి ముఖం సంతోషంతో వికసించింది. రావణుడు ఎత్తుకుపోయిన సీతను తిరిగి సంపాదించటానికి వానరరాజైన సుగ్రీవుడి సహాయం పొందమని కబంధుడు రాముడికి చెప్పి ఉన్నాడు.

రాముడు లక్ష్మణుడితో, "తమ్ముడూ, వెదకబోయిన తీగ కాళ్ళకు చుట్టుకున్నట్టు, మనం చూద్దామనుకుంటున్న సుగ్రీవుడే మనకోసం తన మనిషిని పంపాడు. ఇతను చాలా బుద్ధిమంతుడుగా కనిపిస్తాడు. మాట్లాడుతున్నంత సేపూ ఇతని ముఖం చాలా నిర్మలంగానూ, నిష్కపటంగానూ ఉన్నది. ఇతనితో నువు మాట్లాడు." అన్నాడు.

లక్ష్మణుడు హనుమంతుడితో, "సుగ్రీవుడి సుగుణాలు మాకు తెలిసినవే. మేం ఆ సుగ్రీవుణ్ణే వెతుక్కుంటూ వస్తున్నాం. నువు కోరినట్టే మేం సుగ్రీవుడితో స్నేహం చేసుకుంటాం." అన్నాడు.

రాముడికి సుగ్రీవుడి వల్ల ఏదో పని ఉన్నది; కాబట్టి రాముడు సుగ్రీవుడికి తిరిగి రాజ్యం వచ్చేటందుకు తోడ్పడ వచ్చునని హనుమంతుడు ఊహించి, సంతోషం పొంది, "మీ రిద్దరూ అసలు భయంకరమైన దండకారణ్యానికి ఎందుకు వచ్చారు?" అని అడిగాడు.

రాముడు లక్ష్మణుణ్ణి తమ వృత్తాంతం చెప్పమన్నాడు. లక్ష్మణుడు ఇలా చెప్పాడు:

"ఇతను దశరథమహారాజు పెద్ద కొడుకు, రాముడు. రాజు కావలసిన వాడు. తండ్రి మాట దాటనివాడు. అలాటివాడు రాజ్యభ్రష్టుడై, నాతో కూడా

వనవాసం వచ్చాడు. మాతో బాటు ఇతని భార్య సీతాదేవి కూడా వనానికి వచ్చింది. నేను ఇతని తమ్ముణ్ణి. నా పేరు లక్ష్మణుడు. ఈ రాముడి గొప్ప గుణాలకు నేను దాసుణ్ణి. మేం లేని సమయంలో ఎవడో రాక్షసుడు ఇతని భార్యను అపహరించి తీసుకుపోయాడు. వాడెవడో మాకు తెలియదు. ఆ రాక్షసుడి జాడ సుగ్రీవుడి ద్వారా తెలుస్తుందని మాకు మరొక రాక్షసుడు చెప్పాడు. అడిగావు గనక, మా సమాచారం దాచకుండా నీకు చెప్పాం. ఎంతటి వారికైనా శరణు ఇయ్యగల ఈ మహాపురుషుడు ఇప్పుడు సుగ్రీవుడి శరణు కోరుతున్నాడు. సుగ్రీవుడు అనుగ్రహించాలి.''

దానికి హనుమంతుడు, ''మా రాజు సుగ్రీవుడే మిమ్మల్ని వెతుక్కుంటూ రావలిసిన పరిస్థితి. తన రాజ్యాన్నీ, భార్యనూ వాలి కాజేయటం చేత ఆయన చాలా విచారకరమైన స్థితిలో ఉన్నాడు. సీతాదేవిని వెతకటానికి ఆయన మీకు సహాయపడగలడు.'' అన్నాడు.

తరవాత అతను వారిని సుగ్రీవుడి వద్దకు రమ్మన్నాడు.

లక్ష్మణుడు రాముడితో, ''మనం సుగ్రీవుడి వద్దకు పోదాం. అతని సహాయం వల్ల నీ కార్యం నెరవేరుతుంది.'' అన్నాడు.



వెంటనే హనుమంతుడు తన బ్రహ్మచారి రూపం వదిలిపెట్టి, వానరరూపం ధరించి, రామలక్ష్మణులను తన భుజాలపై ఎక్కించుకుని, ఋశ్యమూక పర్వతం మీదికి వెళ్ళాడు. అయితే సుగ్రీవుడు ఋశ్యమూకపర్వతం మీద లేడు, సమీపంలోనే ఉన్న మలయపర్వతం మీద భయంతో దాక్కున్నాడు.

హనుమంతుడు మలయపర్వతం మీద ఉన్న సుగ్రీవుణ్ణి కలుసుకుని, ''ఆ వచ్చిన వాళ్ళు రామ, లక్ష్మణులు. ఇక్ష్వాకు వంశంలో పుట్టినవాళ్ళు. దశరథమహారాజు కొడుకులు. రాముడు నియమం పాటించి అరణ్యవాసం వచ్చాడు. అతని



భార్యను ఎవడో రాక్షసుడు ఎత్తుకు పోయాడు. అందుచేత ఆ రాముడు నిన్ను శరణు జొచ్చాడు. అన్నదమ్ములయిన రామ, లక్ష్మణులు నీ స్నేహం కోరుతున్నారు. వీరిని చేరదీసి ఆదరించు,'' అన్నాడు.

ఈ మాట విని సుగ్రీవుడు ఎంతో సంతోషించాడు. అతను అందమైన మానవుడి రూపం ధరించి, రామలక్ష్మణుల వద్దకు వచ్చి, ''మిమ్మల్ని గురించి హనుమంతుడు నాతో అంతా చెప్పాడు. రాజువైన రామా, నువు నా వంటి వానరుడి స్నేహం కోరటం నాకు ఎంతో గౌరవమూ, లాభదాయకమూనూ. నీకు నా స్నేహం కావాలంటే నా చేతిలో చెయ్యివేసి, స్నేహధర్మం నిర్వర్తించు,'' అన్నాడు.

రాముడు సుగ్రీవుడి చేతిలో చెయ్యివేసి, అతన్ని గాఢంగా కౌగలించుకున్నాడు. అప్పుడు హనుమంతుడు అరణి మథించి అగ్నిచేసి, ఆ అగ్నిని పూజించి, రాముడికీ, సుగ్రీవుడికీ మధ్యగా దాన్ని ఉంచాడు. రామ, సుగ్రీవులు ఆ అగ్నికి ప్రదక్షిణం చేసి, అగ్నిసాక్షిగా సఖ్యం చేసుకున్నారు.

రాముడు సుగ్రీవుడితో, ''నువు నాకు స్నేహితుడవయావు. ఇక నీ దుఃఖమే నా దుఃఖం, నీ సుఖమే నా సుఖం,'' అన్నాడు.

సుగ్రీవుడు దట్టమైన ఆకులు గల ఒక మద్దికొమ్మ విరిచి, దానిపైన రాముడితో సహా కూర్చున్నాడు. లక్ష్మణుడు కూర్చోవటానికి హనుమంతుడు ఒక చందనవృక్షం కొమ్మ విరిచాడు.

తరవాత సుగ్రీవుడు తనకూ, వాలికీ మధ్య వైరం ఎలా వచ్చినదీ వివరంగా చెప్పాడు. అంతా చెప్పి అతను రాముడితో, ''వాలి భయంతో నేను కుంగిపోయి ఉన్నాను. నా భయం తొలగించు,'' అన్నాడు.

రాముడు వాలి సుగ్రీవుల వృత్తాంతమంతా విని, చిరునవ్వు నవ్వుతూ,

''స్నేహానికి ఉపకారమే ఫలం. నీ భార్యను కాజేసిన వాలిని నేను చంపుతాను.'' అన్నాడు.

సుగ్రీవుడు ఈ మాటకు ఎంతో సంతోషించి, ''రామా, నీ దయవల్ల నాకు నా భార్యా, రాజ్యమూ తిరిగి రావాలి. అందుకోసం నువు వాలిని చంపే ప్రయత్నం చెయ్యి. సీతాదేవిని నేను నీకు తెచ్చి యిస్తాను. ఆమె పాతాళంలో ఉండనీ, స్వర్గంలో ఉండనీ, నేను ఆమెను తెచ్చి యియ్యటం మటుకు నిజం. ఇప్పుడు నాకు జ్ఞాపకం వస్తున్నది—నేను చూసినది సీతే అయి ఉండాలి. ఆమె నన్నూ, నా వెంట ఉన్న నలుగురు వానరవీరులనూ చూసి, మా ముందు నగలమూట పడవేసింది. వాటిని దాచి ఉంచాను. వాటిని నువు గుర్తించగలవేమో చూడు.'' అన్నాడు.

రాముడు ఆత్రంగా, ''మిత్రమా, వాటిని వెంటనే తెచ్చి నాకు చూపించు.'' అన్నాడు.

సుగ్రీవుడు వెంటనే లేచి ఒక గుహలోకి వెళ్ళి, సీతాదేవి పైబట్టలో మూట గట్టి ఉన్న అందమైన ఆభరణాలను తెచ్చి రాముడి ముందు పెట్టి, ''చూడు!'' అన్నాడు.

రాముడు వాటిని చూస్తూనే, ''హా సీతా!'' అని పడిపోయి, కంట నీరు కార్చుతూ, నిట్టూర్పులు విడవసాగాడు. అతను లక్ష్మణుడితో, ''లక్ష్మణా, రాక్షసుడు తనను తీసుకు పోయేటప్పుడు సీత ఈ నగలను మెత్తని గడ్డి గల ప్రాంతంలో పడవేసి ఉంటుంది. అందుచేతనే ఇవి చెక్కుచెదరకుండా ఉన్నాయి.'' అన్నాడు.

లక్ష్మణుడు రాముడితో, ''ఈ కేయూరాలూ, కుండలాలూ నేను గుర్తించలేను. కాని సీత కాళ్ళకు రోజూ నమస్కరించేటప్పుడు కనిపించే ఈ అందెలను గుర్తించగలను.'' అన్నాడు.

రాముడు దీనంగా సుగ్రీవుణ్ణి, ''నువు చూస్తూండగా ఆ రాక్షసుడు సీతను ఎటుగా తీసుకు పోయాడు?'' అని అడిగాడు.





# వీర హనుమాన్

రాముడు తనను రావణుడు ఉండే చోటు అడిగేసరికి, అతని బాధ చూసి తాము కూడా కన్నీరు కార్చుతూ సుగ్రీవుడు, "రామా, ఆ రావణుడు ఎక్కడ ఉంటాడో నాకు తెలియదు. కాని ఒక్క ప్రతిజ్ఞ చెయ్యగలను; సీత నీకు తిరిగి దొరకటానికి అవసరమైన ప్రయత్నం చేస్తాను. నీకు సంతోషం కలిగిస్తాను. నువు ధైర్యంగా ఉండు. నేను కూడా నీ లాగే భార్యను పోగొట్టుకున్నాను. కాని ధైర్యాన్ని విడవలేదు," అన్నాడు.

సుగ్రీవుడు ఇలా ఊరడించేసరికి రాముడు కన్నీటితో తడిసిన తన ముఖాన్ని తుడుచుకున్నాడు. అతను సుగ్రీవుడితో, "నిజమైన మిత్రుడి లాగా మాట్లాడావు. ఇప్పుడు నేనున్న స్థితిలో నీలాటి ఆప్తుడు దొరకటం దుర్లభం. నువు మాత్రం రావణుడు ఎక్కడ ఉంటాడో, సీతను ఎక్కడ ఉంచాడో వెతికించాలి. పోతే, నా నుంచి నీకు ఏం కావాలో చెప్పు, ఆ పని నా వల్ల అవుతుందా, కాదా అని సంశయించకు. నేను వాలిని చంపుతానన్న మాట యథార్థం. నేను ఇంతవరకు ఎన్నడూ అబద్ధం చెప్పలేదు, ఇక ముందు చెప్పను," అన్నాడు.

ఈ మాటలకు సుగ్రీవుడూ, అతని మంత్రులైన వానరులూ ఎంతో సంతోషించారు. సుగ్రీవుడు రాముడితో ఇలా అన్నాడు: "రామా, నన్ను నా అన్న మోసం చేసి, నా భార్యను అపహరించాడు. నాకు

4. వాలి సుగ్రీవుల యుద్ధం



ఎంతకాలం జీవించేది! వాలి చస్తేనే గాని నాకు క్షేమం లేదు.''

రాముడు ఈ మాటలకు నవ్వి, ''నా ఒక్క బాణంతో వాలిని చంపగలను. నా కంటపడిన మరుక్షణం అతను చచ్చిపోతాడు. నువు కూడా నేనున్నస్థితిలోనే ఉన్నావు, సందేహంలేదు. నీదుఃఖం త్వరలోనే తీరిపోతుంది. ధైర్యం వహించు,'' అన్నాడు.

సుగ్రీవుడు రాముడికి వాలి బలసత్వాలను గురించి ఇలా చెప్పాడు: వాలి తెల్లవారకముందే లేచి, సూర్యోదయం అయేలోపల నాలుగు సముద్రాలలోనూ స్నానం చేసి, సంధ్యావందనం చేస్తాడు; పర్వత శిఖరాల మీదికి ఎక్కి, పెద్ద పెద్ద కొండ రాళ్ళను బంతుల్లాగా ఎగరవేసి పట్టుకుంటాడు; అరణ్యాలలో పెద్ద పెద్ద చెట్లను విరిచి తన బలం చూసుకుంటాడు; వెయ్యి ఏనుగుల బలంగల దుందుభి అనేవాణ్ణి చంపాడు.

దుందుభి ఎనుబోతు రూపంగల రాక్షసుడు. వాడు మదగర్వంతో మొట్టమొదట సముద్రుడి వద్దకు వెళ్ళి, తనతో ద్వంద్వ యుద్ధానికి రమ్మన్నాడు.

సముద్రుడు వాడితో, ''నాయనా, నీతో యుద్ధం చేసే శక్తి నాకు లేదు. అందుకు సమర్థుడు హిమవంతుడు. అతనితో

ఏం చెయ్యాలో తెలియదు. ఇలా బతుకుతున్నాను. బలవంతుడైన వాలి నన్ను రాజ్యభ్రష్టుణ్ణి చెయ్యటమే గాక, నన్ను చంపించటానికి అనేక ప్రయత్నాలు చేశాడు. అతను నా మీదికి పంపిన వానరులను ఎంతోమందిని నేను చంపాను. నేను నా అన్న భయం చేతనే నీ దగ్గిరికి కూడా రాలేదు. నాకిప్పుడు ఈ హనుమంతుడు మొదలైన వారు ఎంతో సహాయంగా ఉన్నారు. నా పట్ల స్నేహం కలిగి వాళ్ళు నన్ను రక్షిస్తున్నారు. నేను ఎక్కడికి పోతే అక్కడికి వస్తారు, నన్ను ఎల్లప్పుడూ రక్షిస్తూ ఉంటారు. ఇలా ప్రాణభయంతో, యీ పర్వతం మీద

యుద్ధం చేస్తివా, నీ భుజాల తీట తీరు తుంది. కనక వెంటనే బయలుదేరి అక్కడికి పో," అని చెప్పాడు.

సముద్రుడు తనను చూసి భయపడ్డా డని సంతోషించి, దుందుభి శరవేగంతో హిమాలయానికి వెళ్ళి, ఏనుగులంతేసి కొండరాళ్ళను తన కొమ్ములతో విసిరేస్తూ, గర్జించాడు.

ఇది తెలిసి హిమవంతుడు ఒక కొండ శిఖరం మీదికి వచ్చి నిలబడి, "దుందుభీ, నన్ను యుద్ధంతో ఎందుకు బాధిస్తావు? నేను యుద్ధం చెయ్యటానికి పనికి రాను. ఇక్కడ ఎందరో మునులు తపస్సు చేసు కుంటున్నారు. ఇది యుద్ధం చేసే స్థలం కాదు," అన్నాడు.

దుందుభి మహా కోపంతో, "యుద్ధం చెయ్యటం నీకు చేతగాకపోతే చేతనైన వాడెవడో చెప్పు. వాణ్ణి క్షణాల మీద చంపి, నా శక్తి చూపుతాను," అన్నాడు.

"నీకు యుద్ధమే కావాలంటే కిష్కిం ధలో ఉండే వాలి వద్దకు వెళ్ళు. అతన్ని గెలవటం అసాధ్యం," అని హిమవం తుడు చెప్పాడు.

దుందుభి కిష్కింధా నగర ద్వారం వద్దకు వచ్చి, గొప్ప గర్జన చేశాడు. వాడు అక్కడ ఉన్న చెట్లను విరుస్తూ, తన గిట్టలతో నేలను గీరుతూ, కొమ్ములతో



నగర ద్వారాన్ని కొడుతూ ఆర్భాటం చేయటం వాలి విన్నాడు. అతను అంతః పురం నుంచి స్త్రీజనాన్ని వెంట బెట్టుకుని దుందుభి వద్దకు వచ్చి, "ఒరే దుందుభీ, నేను నిన్ను ఎరుగుదును. ఎందుకిలా గర్జిస్తున్నావు? ప్రాణాల మీద ఆశలేదా?" అని అడిగాడు.

ఈ మాటలకు దుందుభి మండిపడి, "ఆడవాళ్ళ ముందు ప్రగల్భాలాడితే కాదు, నాతో యుద్ధం చేసి, నీ శక్తి చూపించు. లేదా, రేపు పొద్దుటి దాకా నీకు గడువు ఇస్తున్నాను. అనుభవించ వలసిన సుఖాలన్నీ ఈ రాత్రి అనుభ వించు. నీ బంధువు లందరికీ ఇచ్చేసేది



ఇచ్చెయ్యి; మిత్రులతో చెప్పుకునేదంతా చెప్పుకో; నీ నగరమంతా ఒక్కసారి చూసుకో; నీ బదులు మరొకణ్ణి రాజుగా నియమించు. అప్పుడు నేను నీ మదం అణగిస్తాను," అన్నాడు.

వాలి స్త్రీజనాన్ని అంతఃపురానికి తిప్పి పంపి, దేవేంద్రుడు తన కిచ్చిన కాంచన మాలను మెడలో వేసుకుని, దుందుభి మీద కలియబడి, వాడి కొమ్ములు పట్టుకుని గిరగిరా తిప్పి, నేల కేసి కొట్టి, సింహనాదం చేశాడు. దుందుభి చెవుల నుంచి రక్తం వచ్చింది.

అయినా వాళ్ళిద్దరూ చాలాసేపు పిడికిళ్ళతోనూ, మోకాళ్ళతోనూ, రాళ్లతోనూ, చెట్లతోనూ యుద్ధం చేశారు. క్రమంగా దుందుభి బలం క్షీణించి, వాలి బలం పెరిగింది. అది చూసి వాలి దుందుభిని పైకెత్తి, నేల కేసి కొట్టి చంపేశాడు. తరవాత అతను దుందుభి కళేబరాన్ని ఎత్తి, ఊపి, ఆమడదూరం పోయి పడేటట్టు విసిరి వేశాడు. నోటి నుండి రక్తం కారుతున్న ఆ కళేబరం మతంగముని ఆశ్రమం మీదుగా వెళ్ళి పడింది. దాని తాకిడికి ఆశ్రమప్రాంతంలోని కొన్ని చెట్లు విరిగాయి.

ఆశ్రమంలో రక్తపు మరకలు చూసి, మతంగమహాముని కోపించి, అందుకు కారకుడు వాలి అని తెలుసుకుని, వాలి తన ఆశ్రమానికి ఆమడదూరంలో అడుగు పెడితే చస్తాడని శాపం పెట్టి, వాలి భృత్యులనందరినీ తన వనం నుంచి వెళ్లగొట్టాడు; ఒక్క రోజు లోపల వెళ్లిపోని వాళ్ళు శిలలైపోతారన్నాడు.

తన వద్దకు తిరిగి వచ్చిన భృత్యులను చూసి వాలి, "మీ రందరూ తిరిగి వచ్చారేం? వానరులకు ప్రమాదం ఏదీ కలగలేదు గద?" అని అడిగాడు. వాళ్ళు జరిగినదంతా చెప్పారు. వాలి మతంగ మహామునిని శాపం ఉపసంహరించమని వేడుకున్నాడు. కాని ఆయన వినిపించుకోలేదు. అది మొదలు వాలి ఋశ్యమూక

పర్వతం కేసి చూడటం కూడా మానేశాడు. ఈ శాపం ఆపదసమయంలో సుగ్రీవుడికి లాభించింది. అతను తన మంత్రులతో ఋశ్యమూకం మీద నిర్భయంగా ఉంటున్నాడు.

సుగ్రీవుడు రాముడికి వాలిని గురించి ఇదంతా చెప్పి, రాముడికి దుందుభి కళేబరాన్ని చూపించి, "ఈ లావుపాటి మద్దిచెట్లు ఇక్కడ ఏడు ఉన్నాయి చూడు; వీటిలో దేనినుంచి అయినా దూసుకుపోయేటట్టు బాణం వేసేపాటి బలం వాలికి ఉన్నది. అలాంటి బలశాలిని యుద్ధంలో ఏ విధంగా చంపుతావు?" అని అడిగాడు

ఈ మాటకు లక్ష్మణుడు నవ్వి, "ఇతను ఏం చేస్తే, వాలిని చంపగలడన్న నమ్మకం నీకు కుదురుతుంది?" అని అడిగాడు.

"రాముడు కూడా మద్దిచెట్టు నుంచి దూరి పోయేటట్టు బాణం కొట్టి, బాణంతో ఈ దుందుభి కళేబరాన్ని రెండు వందల బారల దూరం పోయిపడేటట్టు కొట్టితే, ఇతను వాలిని చంపగలడని నమ్ముతాను," అని సుగ్రీవుడు లక్ష్మణుడితో అన్నాడు.

అతను రాముడి కేసి తిరిగి, "రామా, వాలి మహాబలశాలి. అతను ఇంతవరకూ



అపజయం ఎరగడు. అతని బలం నాకు తెలుసు, కాని నీ బలం నాకు తెలియదు. అందుచేత, నిన్ను భయపెట్టటానికి నేనీ మాటలు చెప్పటం లేదు: వాలి అంటే నాకున్నభయం కొద్దీ చెబుతున్నాను," అన్నాడు.

రాముడు చిరునవ్వు నవ్వి. "నా పరాక్రమంలో నీకు నమ్మకం కలిగేటట్టు నేను చేస్తాను," అని, దుందుభి కళేబరాన్ని కాలి బొటనవేలితో ఎత్తి, పది ఆమడల దూరం పోయి పడేటట్టు విసిరాడు.

అది చూసిన సుగ్రీవుడు, "రామా, ఇప్పుడా కళేబరం ఎండి, తేలిక అయి



పోయింది. దుందుభితో భయంకరంగా యుద్ధం చేసి అలసిపోయి ఉన్న సమయంలో వాలి పచ్చికళేబరాన్ని ఇంత దూరం విసిరాడు. అందుచేత, నీకూ, వాలికీ బలంలో గల తేడా గురించి నా సందేహం తీరలేదు. ఒక్క మద్ది చెట్టు కుండా దూసుకుపోయేటట్టు బాణం వేశావంటే, మీ ఇద్దరి బలాబలాలు నాకు తెలుస్తాయి,'' అన్నాడు.

సుగ్రీవుడికి తన యందు నమ్మకం కలగ గలందులకు రాముడు ధనుస్సు చేత బట్టుకుని, ఒక బాణం తీసుకుని మద్దిచెట్టును కొట్టాడు. ఆ బాణం ఏడు మద్ది చెట్లనూ దూసుకుని పోయి, కొండను భేదించి, భూమిలోకి వెళ్ళిపోయింది. అది చూసి సుగ్రీవుడు నిర్ఘాంత పోయాడు. అతను చేతులు జోడించి, రాముడి ముందు సాష్టాంగ నమస్కారం చేసి, '' రామా, నువు ఇంద్రుణ్ణీ, దేవతలనూ కూడా జయించ గలవు; వాలిని చంప గలవనటానికి సందేహం లేదు. నీ స్నేహం కలిగినందుకు నేనెంతో సంతోషిస్తున్నాను,'' అన్నాడు.

రాముడు సుగ్రీవుణ్ణి కౌగలించుకుని, లక్ష్మణుడితో సంప్రదించి, '' సుగ్రీవా, మనం బయలుదేరి కిష్కింధకు పోదాం. నువు మా కన్న కొంచెముందుగా వెళ్ళి, వాలిని యుద్ధానికి పిలు,'' అన్నాడు.

వెంటనే రామలక్ష్మణులూ, సుగ్రీవుడి అనుచరులూ కిష్కింధకు వెళ్ళి, నగరం వెలపల ఉన్న వనంలో చెట్ల చాటున దాక్కున్నారు.

సుగ్రీవుడు దట్టి గట్టిగా బిగించి, వాలిని పిలవటానికి భయంకరమైన గర్జనలు చేశాడు. తన తమ్ముడి పిలుపు విని కోపించి, వాలి వచ్చాడు. ఇద్దరూ దారుణంగా యుద్ధం చేశారు; ఒకరి నొకరు పిడికిళ్ళతోనూ, అరచేతులతోనూ కొట్టుకున్నారు, పట్టుకున్నారు.

వారిద్దరూ ఒకే పోలికగా ఉండటం చేత రాముడికి, వారిలో ఎవరు సుగ్రీవుడో,

ఎవరు వాలో తెలియరాలేదు. అందుచేత అతను బాణం వదలలేక పోయాడు. ఈలోపల సుగ్రీవుడు ఓడిపోయి పారి పోసాగాడు.

వాలి అతన్ని మతంగమహాముని ఆశ్రమం దాకా వెంటబడి తరిమి, సుగ్రీవుడు నెత్తురు ఓడుతూ మతంగాశ్రమం ప్రవేశించగానే, ''బతికి పోయావు పో!'' అని కిష్కింధకు తిరిగివెళ్ళాడు.

రాముడు హనుమంతుణ్ణీ, లక్ష్మణుణ్ణీ వెంట బెట్టుకుని తాను కూడా సుగ్రీవుడి వెనక వెళ్ళాడు. సుగ్రీవుడు రాముణ్ణి చూసి తల వంచుకుని, ''నీ పరాక్రమం చూపినవాడివి, నన్ను వాలి పైకి యుద్ధానికి పంపి, వాలి చేత చావుదెబ్బలు తినిపించావే, ఇదేం పని? వాలిని చంపటం నీకు చేతగాదని ముందే చెబితే నేను వెళ్ళనే వెళ్ళను గద!'' అని దీనంగా అన్నాడు.

''సుగ్రీవా, నేను వాలిని కొట్టక పోవటానికి కారణం చెబుతాను విను. మీ ఇద్దరి అలంకరణలూ, రూపాలూ, నడకా, కంఠధ్వనీ, కళ్ళూ, శరీరచ్ఛాయా ఒకేవిధంగా ఉన్నాయి. మీ ఇద్దరిలో నాకు కొంచెం కూడా తేడా తెలియరాలేదు. మొదటికే మోసంవస్తుందని నేను బాణం విడవలేదు. నీకు అభయం ఇచ్చిన వాణ్ణి భ్రమపడి నీ ప్రాణమే తీస్తే అది మహాపాపం కదా? నేనూ, లక్ష్మణుడూ, సీతా కూడా నీ అధీనంలో ఉన్నవాళ్ళం. నన్ను గురించి సందేహించక, నువు మళ్ళీ వెళ్ళి వాలితో యుద్ధం చెయ్యి. ఈసారి నాకు గుర్తుగా ఉండేటందుకు ఏదైనా ధరించు. ఒకే ఒక్క బాణంతో వాలిని చంపుతాను. లక్ష్మణా, పూసి ఉన్న ఈ గజపుష్పిని తెంపి, సుగ్రీవుడి మెడకు చుట్టు,'' అన్నాడు రాముడు.

సుగ్రీవుడికి రాముడి మాటలలో యీసారి గట్టి నమ్మకం కుదిరింది. అతను ఎంతో ఉత్సాహంగా గజపుష్పి మెడకు చుట్టుకుని, మళ్ళీ కిష్కింధకు బయలు దేరాడు.





# వీర హనుమాన్

గజపుష్పి లతను సుగ్రీవుడు తన మెడకు చుట్టుకున్న తరవాత రాముడు అతన్ని వెంటబెట్టుకుని కిష్కింధకు వెళ్ళాడు. అతని వెంట ధనుస్సూ, బాణాలూ ఉన్నాయి. రాముడికి ముందు సుగ్రీవుడూ, లక్ష్మణుడూ నడిచారు; అతని వెనకగా వీరుడైన హనుమంతుడూ, నళుడూ, నీలుడూ, తారుడూ నడిచారు.

దారిలో రాముడికి దట్టమైన చెట్లతో కూడిన ఒక మహారణ్యం కనబడింది. అతను సుగ్రీవుణ్ణి ఆ అరణ్యం గురించి అడిగాడు.

సుగ్రీవుడు నడుస్తూనే ఇలా చెప్పాడు:

"ఇది ఒకప్పుడు ఆశ్రమం; చల్లని నీడగల చెట్లతోనూ, రుచిగల కందమూల ఫలాలతోనూ ఉండేది. ఇందులో సప్త జనులనే ఋషులు తపస్సు చేసి శరీరాలతోనే స్వర్గానికి వెళ్ళిపోయారు. ఇప్పుడు ఇందులోకి ఎవరూ ప్రవేశించ లేరు; పక్షులూ, జంతువులూ కూడా ప్రవేశించ లేవు. ఒక వేళ లోపలికిపోయినా, తిరిగి బయటికి రాలేవు. ఇందులో నుంచి అప్సరసలు నాట్యం చేసేధ్వనులూ, పాడేధ్వనులూ ఎప్పుడూ వినవస్తూంటాయి: వివిధజాతుల పూలచెట్ల నుంచి మంచి సువాసనలు కూడా వస్తాయి. చెట్లపై భాగాల మీద మసి కనిపిస్తున్నది గదా, దానికి కారణం ఏమంటే, ఇందులో సర్వకాలాలలోనూ త్రేతాగ్నులు వెలుగుతూంటాయి."

5. వాలివధ

ఈ మాట విని రామలక్ష్మణులు సప్త జనులను తలచుకుని, ఆ అరణ్యానికి నమస్కారం చేశారు.

అక్కడి నుంచి చాలాదూరం నడిచి వాళ్ళు కిష్కింధను సమీపించి చెట్ల చాటున దాక్కున్నారు.

సుగ్రీవుడు ఒక్కసారి చుట్టూ కలయ జూసి, గట్టిగా గొంతెత్తి, వాలిని యుద్ధానికి పిలిచాడు. తరవాత అతను రాముడితో, ఈసారైనా మాట నిలబెట్టుకో మన్నాడు.

"నీ మెడకు లత ఉన్నది గనక నిన్ను తేలికగా గుర్తించగలను. వాలిని ఒకే ఒక బాణంతో కూల్చుతాను. నువు భయ పడకు. నేను ఎంత కష్టంలో కూడా అబద్ధం ఆడినవాణ్ణి కాను. ఇక ముందు కూడా ఆడను. నువు ఏమాత్రం భయ పడక వాలిని గట్టిగా పిలు," అన్నాడు రాముడు.

సుగ్రీవుడు ఆకాశం దద్దరిల్లేటట్టు భయంకరంగా అరిచాడు. ఆ ధ్వని విని పశువులు బెదిరాయి, వనంలో తిరిగే లేళ్ళు చప్పున నిలిచిపోయాయి.

ఈ సింహనాదాన్ని అంతఃపురంలో ఉన్న వాలి విన్నాడు. తనను చూసి హడిలిపోయే సుగ్రీవుడికి ఇంత ధైర్యమా అని వాలికి పట్టరాని ఆగ్రహం కలిగింది. అతను వెంటనే యుద్ధానికి బయలుదేరి వచ్చాడు.

వచ్చేస్తున్న వాలిని తార కౌగలించు కుని ఆపి, "సుగ్రీవుణ్ణి చంపటానికి



ఈ రాత్రివేళ వెళ్లాలా? తెల్లవారి వెళ్ళ వచ్చు. ఇందులో పౌరుషం ప్రసక్తిలేదు. అతను నీతో సమానమైన బలం కల వాడు కాడు. నేను ఎందుకు వెళ్లవద్దంటున్నానో చెబుతాను. ఒకప్పుడు నీ చేత చావు దెబ్బలు తిని పారిపోయినవాడు మళ్ళీ నీ మీదికి కయ్యానికి వచ్చాడంటే, అతనికి ఎవరి సహాయమో ఉండి ఉంటుంది. లేకపోతే అతను రానేరాడు. 'అతనికి ఎవరి సహాయం ఉన్నా నేను చంపగలను,' అని అనుకోకు. సుగ్రీవుడు తెలివిగలవాడు; తనకు సహాయం వచ్చే వాళ్ళ శక్తిసామర్థ్యాలు చక్కగా పరీక్షించి గాని రాడు. నీ కన్న పరాక్రమవంతుణ్ణి సహాయం తీసుకునే వచ్చి ఉంటాడు. అంగదుడు అరణ్యంలోకి వెళ్ళి తిరిగి వచ్చి, ఒక సమాచారం తెచ్చాడు. ఇక్ష్వాకువంశం వాళ్ళూ, దశరథుడి కొడుకులూ అయిన రామలక్ష్మణులు ఋశ్యమూకం మీదికి వచ్చారుట. మహాబలపరాక్రమ సంపన్నులైన ఆ అన్నదమ్ములు సుగ్రీవుడికి సహాయంగా ఉన్నారుట. ఆ రాముడు విరాధుణ్ణీ, ఖర, దూషణులనూ, కబంధుణ్ణీ చంపి ఉన్నాడుట," అన్నది.

తార వాలికి ఈ విధంగా సలహా కూడా ఇచ్చింది:

"రాముడితో విరోధం పెట్టుకునే కన్న సుగ్రీవుడితో స్నేహం చేసుకో. అతన్ని పిలిచి మళ్ళీ యువరాజుగా చెయ్యి.





నీ రక్తం పంచుకున్నవాడే గాని, పరాయి వాడు కాడు గద! నీ మంచి కోరే నేనీ మాట చెబుతున్నానని తెలుసుకో.''

కాని ఆమె మాటలు మహాబలశాలి అయిన వాలికి రుచించలేదు. అతను తారతో ఇలా అన్నాడు:

''సుగ్రీవుడు ఒక వంక నన్ను యుద్ధానికి పిలుస్తూంటే నేను సహించనా? పిరికి దానివి, నీకేమీ తెలియదు. మహా శూరులకు యుద్ధంలో వెనక్కు తీయటం చావు కన్న హీనం. రాముణ్ణి గురించి భయపడకు. అతను నిరపరాధినైన నన్ను చంపి పాపం కట్టుకోడు. నా మేలుకోరే నువు మాట్లాడావు. నా వెంటరాకు. నేను సుగ్రీవుడి మదం అణుస్తాను గాని, చంపను. నా దెబ్బలకు తట్టుకోలేక వాడే పారిపోతాడు.''

తార ఇంకేమీ చెప్పక, వాలికి ప్రదక్షిణం చేసి, యుద్ధంలో అతనికి జయం కలిగించే మంత్రాలు చదివి, తన స్త్రీలతో సహా వెనక్కు పోయింది.

తరవాత వాలి ముందుకు పోయి, తనతో యుద్ధానికి సిద్ధంగా ఉన్న సుగ్రీవుణ్ణి చూశాడు. తాను కూడా సుగ్రీవుడిలాగే నడుము బిగించి, పిడికిలి పట్టి సుగ్రీవుడి మీదికి వెళ్ళాడు. సుగ్రీవుడు కూడా పిడికిలి బిగించి వాలి మీదికి వచ్చాడు.

ఇద్దరూ ఒకరినొకరు పిడికిళ్ళతో పొడుచుకున్నారు. సుగ్రీవుడు ఒక సాల వృక్షం పెరికి, దానితో వాలిని కొట్టాడు. వాలి ఆ దెబ్బకు కొంత చలించాడు. అయితే, క్రమంగా వాలి బలం కన్న సుగ్రీవుడి బలం వేగంగా క్షీణించసాగింది.

సుగ్రీవుడి బలం తగ్గుతూండటమూ, అతను మధ్య మధ్య దిక్కులు చూడటమూ గమనించి, రాముడు వాలిని చంపటానికి అనువైన బాణం ఎన్నుకుని, తన ధనుస్సుకు ఎక్కుపెట్టి, చెవిదాకా లాగి వదిలాడు. అది పెద్ద ధ్వనితో వెళ్ళి, వాలి రొమ్ములో గుచ్చుకున్నది. దాని



దెబ్బకు దిమ్మరపోయి వాలి పడి పోయాడు.

ఇంద్రు డిచ్చిన కాంచనమాల వాలి కంఠంలో ఉండిన కారణం చేత, అతని ప్రాణాలు వెంటనే పోలేదు. అతను తనను కొట్టిన వాడికోసం కళ్ళతో వెతుకు తూంటే, లక్ష్మణుడితో సహా రాముడు వాలి దగ్గిరికి వచ్చాడు. అప్పుడు వాలి రాముణ్ణి చూసి ఇలా అన్నాడు:

"నువు మహారాజు కొడుకువు. గుణ వంతుడని కీర్తి తెచ్చుకున్నావు. శాస్త్రం తెలిసినవాడివి. గొప్ప వంశంలో పుట్టావు. బలశౌర్యాలు గలవాడివి. నేను మరొక రితో యుద్ధం చేస్తూండగా నా రొమ్మును బాణంతో కొట్టావే, ఇందువల్ల నీకేం గొప్ప తనం వచ్చింది? నువు పొంచి ఉండి నన్ను కొట్టుతావని కూడా నాకు తెలియదే! రాజులకు ఉండవలసిన గుణాలు ఇంద్రియ నిగ్రహమూ, చిత్తశుద్ధీ, ఓర్పూ, సత్యమూ, ధర్మమూ, పరాక్రమమూ, దుష్టశిక్షణా — ఇవి నీలో ఉన్నాయని నమ్మి, తార వద్దంటున్నా యుద్ధానికి వచ్చాను. నువు దుర్బుద్ధివనీ, పాపాచా రుడివనీ, లోక వంచకుడవనీ గ్రహించ లేకపోయాను. నీకు గాని, నీ-దేశానికి గాని నేనేమీ అపకారం చెయ్యలేదు. నిన్ను అవమానించలేదు. నీతో యుద్ధానికి రాలేదు. మరెవరితోనో యుద్ధం చేస్తున్న నన్ను నువు ఎందుకు కొట్టావు? నన్ను వేట ధర్మంగా కొట్టావనుకు నేటందుకు కూడా లేదు; నా చర్మంతో గాని, రోమా లతో గాని, ఎముకలతో గాని, మాంసంతో గాని నీకు పనిలేదు. నీవంటి రాజులవల్ల భూమి చక్కగా పాలించబడదు. నీవంటి కుటిలుడూ, పాపీ దశరథమహారాజు కడు పున ఎలా పుట్టాడు? ఎవరైనా నిన్ను ఇలాటి పని ఎందుకు చేశావని అడిగితే ఏం చెబుతావు? ఈ నీ పరాక్రమం నా మీద చూపకపోతే, నీకు ద్రోహం చేసిన ఆ రావణుడి మీద చూపలేకపోయావా? నువు నాకు ఎదురుగా నిలిచి యుద్ధం

చేసి ఉంటే ఈపాటికి నిన్ను యముడి వద్దకు పంపి ఉందును. నన్ను అడిగి ఉంటే, నీకు ఒక్క రోజు లోపల సీతను వెతికి, తెచ్చి ఇచ్చి ఉందును. సుగ్రీవుడు నన్ను చంపించి వానరరాజు కాగోరటం సహజం. కాని నువు నన్ను చాటునుంచి చంపటం మాత్రం అక్రమం.''

ఇలా చెప్పి, క్రమంగా స్పృహకోల్పోతున్న వాలితో రాముడు, ''నీకు ధర్మసూక్ష్మం తెలియక నన్ను నిందించావు. ఈ భూప్రపంచమంతా ఇక్ష్వాకుల రాజ్యం. దీనికి భరతుడు రాజు. అతని ఆనతి మీద మేం ధర్మాన్ని కాపాడుతూ సంచరిస్తున్నాం. నువు ధర్మం తప్పావు. తమ్ముడు కొడుకుతో సమానుడు. నీ తమ్ముడి భార్య అయిన రుమను నువు కాజేశావు. ఆ తప్పుకు నువు ఈ విధంగా శిక్ష పొందావు. అంతేగాక, నాకు సుగ్రీవుడు లక్ష్మణుడి లాటి వాడు. అతని స్నేహం కోసం కూడా నేనీ పని చేశాను. నిన్ను నేను చంపటం అధర్మం ఎంత మాత్రమూ కాదు. నిన్ను చాటున ఉండి కొట్టినందుకు నేనేమీ విచారించటం లేదు. వనమృగాలను కొట్టేవాళ్ళు దాగి ఉండీ, వలలను పన్నటం లాటి అనేక మాయోపాయాలను అవలంబించీ ఆ పని చేస్తారు. తినే జంతువులనే గాక, తినని జంతువులను కూడా రాజర్షులు చంపుతారు. నువు తినరాని మృగానివి,'' అన్నాడు.



ప్రాణం పోయే ముందు వాలి రాముడితో, ''నేను చచ్చిపోతున్నందుకు విచారించను. తారను గురించీ, బంధువులను గురించీ నాకు చింతలేదు. నా చింత అంతా అంగదుణ్ణి గురించి. వాడికి నేనంటే ప్రాణం. నా కోసం బెంగపడతాడు. అతన్ని కాపాడు. వాణ్ణి సుగ్రీవుణ్ణి చూసినట్టు చూడు. తారను సుగ్రీవుడు నా కారణంగా అవమానించకుండా ఉండేటట్టు చూడు'' అన్నాడు.

రాముడు అలాగే చేస్తానని చెప్పాడు. వాలికి స్పృహతప్పింది.

ఈ లోపల వాలి సంగతి తారకు తెలిసింది. ఆమె అమితమైన దుఃఖంతో, కొడుకును వెంట బెట్టుకుని కిష్కింధ నుంచి వచ్చింది. దారిలో ఆమెకు కొందరు వానరులు ఎదురై, "తారా, వెనక్కు వెళ్ళు. నీ కొడుకు అంగదుణ్ణి కాపాడుకో. రాముడి రూపంలో మృత్యువు వచ్చి వాలిని తీసుకుపోతున్నది. నగరద్వారాలు భద్రంగా మూయించి, అంగదుడికి పట్టాభిషేకం చెయ్యి. లేకపోతే నీకు కిష్కింధలో నిలవనీడ దొరకదు; శత్రువులైన వానరులు వచ్చి ఆక్రమించుకుంటారు," అన్నారు.

ఆ మాటకు తార, "నా భర్తే పోగా, కొడుకూ, రాజ్యమూ, నా శరీరమూ ఏమయితే నేం? ఆ వాలి దగ్గిరికే పోతాను," అని తలా, రొమ్ము బాదుకుని ఏడుస్తూ వేగంగా వెళ్ళి, నేల మీద పడి ఉన్న వాలినీ, దగ్గిరే నిలబడి ఉన్న రామ, లక్ష్మణులనూ చూసింది. తరవాత ఆమె వాలి వద్దకు వెళ్ళి, అతన్ని కౌగలించుకుని ఏడ్చింది. తారనూ, అంగదుణ్ణీ చూడగానే సుగ్రీవుడికి కూడా దుఃఖం వచ్చింది.

హనుమంతుడు తారను చూసి, ఆమెను ఈ విధంగా ఓదార్చాడు: "తారా, పోయిన వారిని గురించి దుఃఖించ నవసరం లేదు. ఎందుకంటే, అంతా పోయే వాళ్ళే. విచారించవలసినదీ, దిగులు పడవలసినదీ నిన్ను గురించి. నీకు కొడుకున్నాడు. వాడి యోగక్షేమాలు విచారిస్తూ, వాడి జీవితం తీర్చిదిద్దు. వాలి మహాత్ముడు. అతనికి ఉత్తమ లోకాలు కలిగాయి. అంగదుడు రాజయితే, నువు అతనికి సహాయంగా ఉండు. వాలికి ఉత్తరక్రియలు జరపాలి. అంగదుడికి రాజ్యాభిషేకం చెయ్యవలసివుంది."

ఈ మాటకు తార, "హనుమంతుడా, నువు చెప్పినవేవీ నేను చేసే పనులు కాదు, సుగ్రీవుడు చెయ్యవలసినవి. నేను వాలితో పోవలసినదాన్నే," అన్నది.






వాలి ప్రాణాలు ఇంకా పోలేదు. అతను కళ్ళు తెరిచి అటూ ఇటూ చూశాడు. తన కొడుకు దగ్గిర నిలబడి ఉన్న సుగ్రీవుడు కనిపించాడు. వాలి సుగ్రీవుడితో ఇలా అన్నాడు :

"నిన్ను రాజ్యం నుంచి వెళ్ళగొట్టి, నీ భార్యను హరించానని నన్ను తప్పు పట్టకు. మనమిద్దరమూ రాజ్యసుఖం పంచుకోవటమూ, సోదర స్నేహంతో ఉండటమూ రాసిపెట్టిలేక నా బుద్ధి అలా పోయింది. నేను చచ్చిపోతున్నాను గనక, నువు వానర రాజువుకా. నా ఈ చివరి కోరిక ఎంత కష్టమైనా తీర్చు. నాకు ప్రాణం కన్న ఎక్కువైన వాడు అంగదుడు; వాణ్ణి నీ కొడుకులాగే చూసుకో. వాడికి ఏ లోటూ రానీకు. వాడికి ఇక నువు తప్ప ఎవరూ లేరు. వాడు నీ అంత పరాక్రమం గలవాడు: అన్ని విషయాలలోనూ నీకు తోడుగా ఉండగలడు. సుషేణుడి కూతురూ, నా భార్యా అయిన తార చాలా సూక్ష్మబుద్ధి గలది, రానున్న కష్టాలను ముందుగా తెలుసుకోగలదు. అందుచేత ఆమె చెప్పినట్టు చెయ్యి. లేకపోతే నీకు ఆపద కలుగుతుంది. నాకు దేవేంద్రుడిచ్చిన కాంచనమాల ఇప్పుడే నువు తీసుకో. నేను చచ్చిపోతే దీని కాంతి పోతుంది."

వాలి చెప్పినదానికి సుగ్రీవుడు వినయంగా తల ఆడించి, కాంచనమాల తీసుకున్నాడు.



తరవాత వాలి అంగదుణ్ణి దగ్గిరికి పిలిచి, కొన్ని హితాలు చెప్పాడు: అతను తన పట్ల ప్రవర్తించినట్టే, సుగ్రీవుడి పట్లా ప్రవర్తించాలి: సుగ్రీవుడి శత్రువులతో ఎన్నడూ చేరరాదు; సుగ్రీవుడు చెప్పిన పనులు శ్రద్ధగా చెయ్యాలి; ఎవరితోగాని అమిత స్నేహం చెయ్యటం గాని, అసలే స్నేహం చెయ్యకపోవటం గాని తప్పు. ఇలా చెప్పి వాలి ప్రాణాలు వదిలాడు. వానరులందరూ గొల్లున ఏడ్చారు. వాళ్లు వాలి చేసిన మహా కార్యాలు తలుచుకున్నారు.

ఈ వాలి గొలభు డనే గంధర్వుడితో పదిహేను సంవత్సరాలు పోరాడి చంపాడు. వాలి ఉండగా వానరులకు ఎవరి భయమూ లేకపోయింది.

తార తన భర్త కోసం తలుచుకుని, తలుచుకుని ఏడిచింది. నీలుడు వాలి రొమ్ము నుంచి బాణం లాగేశాడు. తార చెప్పిన మీదట అంగదుడు వాలి కాళ్ళు పట్టుకుని నమస్కారం చేశాడు. తార దుఃఖం చూస్తూ సుగ్రీవుడు, తానే వాలిని చంపించి నందుకు మహా బాధపడ్డాడు. అతను కంట నీరు పెట్టుకుంటూ రాముడి దగ్గిరికి వెళ్ళాడు.

అలా వెళ్ళి సుగ్రీవుడు రాముడితో, "రామా, నువు నీ మాట నిలబెట్టుకుని వాలిని చంపావు, నాకు రాజ్యం ఇచ్చావు. కాని నాకు జీవితం మీద కోరిక పోయింది. తారా, వానరులూ ఇలా ఏడుస్తూంటగా నాకీ రాజ్యం ఎందుకు? మొదట వాలి నన్ను పెట్టిన బాధల మూలంగా వాలి చావు కోరాను, కాని తీరా వాలి చచ్చి పోయాక పశ్చాత్తాపం నన్ను దహిస్తున్నది. నా జీవితమంతా ఋశ్యమూకం మీదనే వెళ్ళబుచ్చటం మంచిదని తోస్తున్నది. ఇప్పుడు నాకు స్వర్గం కూడా వద్దు. వాలి నన్ను ప్రాణాలతో వదిలాడు. నేను వాలి ప్రాణాలు తీయించాను. నా కంటె పాపి ఉండడు. ఇప్పుడు నేను యువరాజుగా ఉండటానికి కూడా తగను,

రాజును ఎలా కాగలను? నేను కూడా వాలితోపాటు దహనమవుతాను. వానరులు నీ పని చూడగలరు; సీతాదేవిని వెతుకుతారు," అన్నాడు.

తార రాముణ్ణి చూసి దుఃఖిస్తూ ఇలా అన్నది:

"వాలిని చంపిన బాణంతోనే నన్ను కూడా చంపి, వాలి దగ్గిరికి పంపు. నేను వెంట లేకపోతే వాలికి సుఖం లేదు. సీతా వియోగంతో నువు ఎలా బాధపడుతున్నావో, స్వర్గంలో వాలి నా కోసం అలా బాధపడతాడు. నన్ను చంపితే నీకు వాలిని చంపిన దోషం పోతుంది."

రాముడు ఆమెను ఓదార్చుతూ, "వీరపత్నివైన నువు ఇలా దుఃఖించరాదు. వాలి ఉన్నప్పుడు సుఖపడినట్టే నువు మళ్ళీ సుఖపడతావు. నీ కొడుకు అంగదుడు యువరాజు అవుతాడు," అన్నాడు.

అతను వానరులతో, "ఎంత ఏడిచినా చచ్చిపోయిన వాడికి అందువల్ల మేలు జరగదు. కాలయాపన ఎందుకు. వాలికి ఊర్ధ్వలోకాలు కలిగే కార్యక్రమం చెయ్యండి," అన్నాడు.

అప్పుడు లక్ష్మణుడు, దుఃఖంలో మునిగి ఉన్న సుగ్రీవుడితో, "సుగ్రీవా, వాలికి దహన సంస్కారం జరగాలి. వానరుల చేత చందనం మొదలైనవి ఎండు కట్టెలు తెప్పించు. అంగదుణ్ణి ఓదార్చి, తండ్రి తలకింద కొరివి పెట్టటానికి అతన్ని సిద్ధం చెయ్యి. ఇక నుంచీ





కిష్కింధను పాలించవలసిన సువు ఏడుస్తూ కూచుంటె జరగదు. అంగదుడి చేత పూలూ, బట్టలూ, నెయ్యీ, నూనే, గంధ ద్రవ్యాలూ వెంటనే తెప్పించు. పల్లకి ఒకటి తీసుకురావాలి. వాలిని మోసే వానరులు సిద్ధంగా ఉండాలి,'' అన్నాడు.

లక్ష్మణుడు ఇలా చెప్పగానే తారుడు పల్లకిని పట్టుకురావటానికి కిష్కింధకు వెళ్ళి, త్వరలోనే తిరిగి వచ్చాడు. సుగ్రీవుడూ, అంగదుడూ కలిసి వాలి శరీరాన్ని పల్లకిలో పడుకోబెట్టారు. సుగ్రీవుడు వాలి శరీరం మీద పూలు కప్పి, పల్లకీ తీసుకుపోయే దారి వెంట పూలు చల్లమని వానరులను ఆజ్ఞాపించాడు. శవం వెంట అంగదుడితోబాటు, వాలి బంధువులైన తారుడు మొదలైన వాళ్లూ, స్త్రీలూ నడిచారు. ఒక వాగు సమీపాన ఇసుకలో చితి ఏర్పరిచారు. తరవాత వాలిని దహనం చేసి, జల తర్పణాలు విడిచారు. రాముడు దగ్గిర ఉండి వానరుల చేత కర్మకాండ అంతా యథావిధిగా చేయించాడు.

సుగ్రీవుడు స్నానం చేసి, తడి బట్టలతో రామలక్ష్మణుల వద్దకు వచ్చాడు. వానరులంతా అతనితోబాటే నిలబడ్డారు. అప్పుడు హనుమంతుడు రాముడితో, ''రామా, నీ దయవల్ల సుగ్రీవుడికి రాజ్యం వచ్చింది. నీ సెలవైతే అతను ఇప్పుడు కిష్కింధ ప్రవేశించి, ఎన్నో పనులు చెయ్యాలి. అతను శాస్త్రోక్తంగా పట్టాభిషేకం చేయించుకుని, నిన్ను తగిన విధంగా సన్మానిస్తాడు. అందుచేత నువు కిష్కింధకు వచ్చి, నీ చేతి మీదుగానే పట్టాభిషేకం జరిపించి, వానరులకు ఆనందం కలిగించు,'' అన్నాడు.

దానికి రాముడు, ''హనుమంతుడా, తండ్రి ఆజ్ఞ ప్రకారం పధ్నాలుగేళ్ళు వనవాసం చెయ్యవలసిన నేను గ్రామాలలోకి గాని, పట్టణాలలోకి గాని ప్రవేశించరాదు. మీరే సుగ్రీవుణ్ణి తీసుకుపోయి, అతనికి



వైభవంగా పట్టాభిషేకం చెయ్యండి. అలాగే ఈ అంగదుణ్ణి యువరాజుగా అభిషేకించండి. శ్రావణమాసం ఆరంభమయింది. నాలుగు నెలల పాటు వర్షాకాలం. యుద్ధానికి తగిన కాలం కాదు. మీరంతా కిష్కింధకు వెళ్ళండి. నేనూ, లక్ష్మణుడూ ఈ పర్వతం మీద ఉంటాం. ఇక్కడ ఉన్న గుహ విశాలంగా, ఉండటానికి చాలా బాగున్నది. పక్కనే నీరూ, పద్మాలూ ఉన్నాయి. తిరిగి కార్తికమాసం వచ్చినప్పుడు రావణుణ్ణి యుద్ధంలో చంపే ప్రయత్నం చేద్దాం.'' అన్నాడు.

ఈ విధంగా రాముడి ఆజ్ఞ పొంది సుగ్రీవుడు కిష్కింధ ప్రవేశించాడు. వానరులంతా అతన్ని అనుసరించారు. అతను తనను చూడవచ్చిన వానరులనందరినీ పరామర్శించి, తారను ఊరడించటానికి వాలి అంతఃపురానికి వెళ్ళాడు.

సుగ్రీవుడు వాలి అంతఃపురం నుంచి తిరిగి రాగానే వానరులు అతని పట్టాభిషేకం కోసం బంగారు అలంకరణలు గల తెల్ల గొడుగూ, రెండు వింజామరలూ, అన్ని రకాల మణులూ, సమస్త విత్తనాలూ, ఓషధులూ, పూలూ, చందనమూ, అక్షింతలూ, కుంకుమపువ్వూ, తేనే, నెయ్యీ, పెరుగూ మొదలయినవన్నీ సిద్ధం చేశారు. అడవిపంది చర్మంతో కుట్టిన పాదరక్షలు సుగ్రీవుడి కోసం సిద్ధం చేశారు.

తరవాత బ్రాహ్మణులు అగ్నిహోత్రం చేసి, పూజించి, సుగ్రీవుడికి వేదోక్తంగా పట్టాభిషేకం చేశారు. గజుడూ, గవాక్షుడూ, గవయుడూ, శరభుడూ, గంధమాదనుడూ, మైందుడూ, ద్వివిదుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ, నళుడూ బంగారు కలశాలతోనూ, ఎద్దుకొమ్ముల తోనూ నదీ జలం తెచ్చి సుగ్రీవుణ్ణి అభిషేకించారు.

రాముడు చెప్పిన ప్రకారం సుగ్రీవుడు అంగదుణ్ణి యువరాజుగా అభిషేకించాడు. అలా చేసినందుకు వానరులు సుగ్రీవుణ్ణి

మెచ్చుకున్నారు. వానరులందరూ పండగ చేసుకున్నారు.

సుగ్రీవుడు రాముడి వద్దకు వెళ్ళి, జరిగినదంతా చెప్పి, తిరిగి వచ్చి, తన భార్య అయిన రుమతో సుఖంగా జీవించ సాగాడు.

రామలక్ష్మణులు వానాకాలం గడప టానికి నిర్ణయించుకున్న గుహ ప్రస్రవణ పర్వతం మీద ఉన్నది. అది చాలా అందమైన పర్వతం. గుహకు సమీపం లోనే తామర కొలను ఉన్నది. గుహ ద్వారం నైరృతి దిక్కుగా ఉండటం చేత వానజల్లు లోపలికి రాదు. తూర్పు నుంచి ఈదురు గాలి కూడా లోపలికి రాదు. గుహ ముందర చక్కని సమ ప్రదేశం ఉన్నది. సమీపంలోనే చక్కని నది కూడా ప్రవహిస్తున్నది. కిష్కింధ అక్కడికి ఎంతో దూరం లేదు. కిష్కింధలో జరిగే కోలాహలమూ, వాద్యాల ధ్వనులూ గుహకు స్పష్టంగా వినిపించాయి.

అలాటి అందమైన ప్రదేశంలో ఉంటూ రాముడు ఒక వంక సీత కోసం విరహ పడుతూ, రావణుణ్ణి చంపటానికి సుగ్రీ వుడు సహాయ పడతాడని ఆశపడుతూ, శరత్కాలం కోసం ఎదురు చూడసాగాడు. అతనికి ఆ వానాకాలం చాలా కష్టం మీద గడిచింది.



చివరకు వానలు వెనకపడ్డాయి. కాని సుగ్రీవుడు రాముడి పని సంగతి పూర్తిగా మరిచిపోయాడని హనుమంతుడికి తోచింది. సుగ్రీవుడు రాజ్యభారమంతా మంత్రులకు వదిలేసి, పూర్తిగా తన కాలమంతా స్త్రీలతో సుఖించటంలో ఇన్నాళ్ళూ గడిపాడు. అతను తన భార్యను రుమనేగాక, తన అన్న భార్యను తారను కూడా తన భార్య చేసుకున్నాడు.

ఇది గమనించిన హనుమంతుడు సుగ్రీవుడి వద్దకు వెళ్ళి, "నీకు రాజ్యమూ, వైభోగమూ వచ్చాయి. స్నేహితుల పట్ల బాధ్యత కూడా నిర్వర్తించు. సొంత పనులు పాడు చేసుకుని అయినా మిత్రుల

పనులు చూసేవాడు నశించడు. మనం ఇప్పుడు రాముడి కోసం సీతను వెదక వలసి ఉన్నది. ఈ పని ఇప్పటికే ప్రారంభం కావలిసింది. రాముడు మంచి వాడు గనక ఓపిక పట్టాడు. సీతను వెదకటానికి వానరులను పంపించు," అన్నాడు.

సుగ్రీవుడికి ఈ మాటతో తొందరకలిగింది. అతను నీలుణ్ణి పిలిచి, అన్ని దిక్కులా ఉన్న వానరసేనలను పిలిపించమని ఆజ్ఞాపించాడు; పదిహేను రోజుల లోపల కిష్కింధకు వచ్చి చేరని వానరులందరికీ మరణదండన ప్రకటించాడు.

ఈ లోపల రాముడు, వర్షకాలం పోయినా సుగ్రీవుడు రాక పోయేసరికి, చాలా బాధపడ్డాడు. అతను లక్ష్మణుడితో, "సుగ్రీవుడు శరత్కాలం రాగానే సీతను వెతికిస్తానని మాట యిచ్చి, తన పని తీరిందిగదా అని ఉపేక్షిస్తున్నాడు. అతనికి నా బాణం దెబ్బతినాలని కోరికగా ఉన్నట్టున్నది. నువు వెళ్ళి, నేను కోపంగా ఉన్నానని అతనితో చెప్పు. వాలిని పంపిన మార్గాన సుగ్రీవుణ్ణి కూడా పంపగలనని చెప్పు. వాలిని ఒక్కణ్ణే చంపాను; సుగ్రీవుడు మాట తప్పితే అతన్నీ, అతని బంధువులనూ కూడా చంపుతాను. ఇదంతా అతనికి ఎలా చెప్పాలో అలా చెప్పు," అన్నాడు.

లక్ష్మణుడికి కూడా సుగ్రీవుడి పైన చాలా కోపం వచ్చింది.

"ఈ సుగ్రీవుడు తనకు రాజ్యం ఎలా వచ్చినదీ మరిచాడు. అతని రాజ్యం నిలవదు. నేనిప్పుడే వెళ్ళి, ఆ సుగ్రీవుణ్ణి చంపి, అంగదుడి సహాయంతో సీతాదేవిని వెదికిస్తాను," అంటూ లక్ష్మణుడు బయలుదేరేసరికి, రాముడు అతన్ని ఆపి, "లక్ష్మణా, అంత పని చెయ్యకు. మనకూ అతనికీ మధ్య ఉన్న స్నేహాన్ని మరవకు. సుగ్రీవుడితో మంచిగానే మాట్లాడు. అతను జాప్యం చేశాడే తప్ప, మనకు అపచారం ఏమీ చెయ్యలేదు," అన్నాడు.






రాముడు చెప్పిన ప్రకారం లక్ష్మణుడు కిష్కింధకు బయలుదేరి వెళ్ళాడు. అతను భుజానికి విల్లు తగిలించుకుని, సుగ్రీవుడి ఇంటికి పోతూ, తాను సుగ్రీవుడితో ఏమనాలో, దానికి సుగ్రీవుడేమంటాడో, అందుకు తాను ఏమి బదులు చెప్పాలో ఆలోచించుకున్నాడు. లోపల అతనికి చాలా కోపంగా ఉన్నది.

లక్ష్మణుణ్ణి దూరాన చూసి వానరులు, ఎవరో శత్రువు వస్తున్నాడనుకుని, చెట్లూ, రాళ్ళూ తీసుకుని యుద్ధానికి సిద్ధమయారు. దీని మూలంగా లక్ష్మణుడి కోపం మరింత అయింది. అతని ముఖంలో కోపం తాండవించటం చూసి, వానరులు భయపడి, సుగ్రీవుడి వద్దకు వెళ్ళి, లక్ష్మణుడు వస్తున్నట్టు చెప్పారు. కాని సుగ్రీవుడు తారతో సరసాలాడుతూ వాళ్ళు చెప్పినది వినిపించుకోలేదు.

అంగదుడు మాత్రం భయం భయంగా లక్ష్మణుడికి ఎదురు వెళ్ళాడు. లక్ష్మణుడు అతనితో, "అబ్బాయీ, నేను వచ్చానని సుగ్రీవుడితో చెప్పు. మా అన్న చాలా దుఃఖంలో ఉండటం మూలాన నేను వచ్చానని చెప్పు; వెంటనే నా దగ్గిరకు వచ్చి, నేను చెప్పేది వినమను." అన్నాడు.

అంగదుడు సుగ్రీవుడి వద్దకు వెళ్ళి, లక్ష్మణుడు మాట్లాడటానికి వచ్చాడనీ, చాలా కోపంగా ఉన్నాడనీ చెప్పాడు. అది విని సుగ్రీవుడు తన మంత్రులతో,



"నేను ఏమీ పొరపాటు మాట అనలేదు; తప్పు పని చెయ్యలేదు. లక్ష్మణుడికి నా పైన కోపం ఎందుకు కలిగి ఉంటుంది? నా శత్రువులు నా మీద అతనికి ఏదో చాడీలు చెప్పి ఉంటారు. నేను భయపడుతున్నాననుకోకండి. నాకు రాముడన్నా, లక్ష్మణుడన్నా ఏమీ భయం లేదు. కాకపోతే, స్నేహితులైన వాళ్ళకు నిష్కారణంగా కోపం వస్తే ఎవరికైనా కొంచెం బాధగానే ఉంటుంది. నాకు భయమల్లా దేనికంటే, రాముడు నాకు చేసిన ఉపకారానికి తగిన ప్రత్యుపకారం చెయ్యలేనే అని. ఇది నాకు విచారం కలిగిస్తున్నది," అన్నాడు.

అప్పుడు బుద్ధిమంతుడైన హనుమంతుడు మిగిలిన మంత్రుల సమక్షంలో సుగ్రీవుడితో, "రాజా, నువు రాముడి మేలు మరవక పోవటం సహజమే. ఏమరుపాటులో నువు కాలగతి గమనించ లేదు. శరదృతువు వచ్చేసింది. యుద్ధ ప్రయత్నాలకు ఇదే సమయం. అందుకే లక్ష్మణుడు వచ్చి ఉంటాడు. భార్యను పోగొట్టుకున్న దుఃఖంలో రాముడు లక్ష్మణుడి చేత కటువుగా మాట్లాడించినప్పటికీ నువు సహించాలి. కర్తవ్యం మరచి అపచారం చేశావు గనక, లక్ష్మణుణ్ణి మంచి చేసుకోవటం తప్ప మరొక మార్గం ఉన్నట్టు నాకు తోచదు. మంత్రిగా నీ హితం కోరి చెప్పాను. నువు నీ కొడుకునూ, బంధువర్గాన్నీ వెంట బెట్టుకుని లక్ష్మణుడి వద్దకు వెళ్ళి, వినయంగా నమస్కరించి, అతను చెప్పినట్టు చెయ్యి. అప్పుడు లక్ష్మణుడి కోపం తప్పక చల్లారిపోతుంది," అన్నాడు.

అంగదుడు లక్ష్మణుణ్ణి తీసుకు వచ్చాడు. లక్ష్మణుడు కిష్కింధలో వానర ప్రముఖుల ఇళ్ళన్నీ చూస్తూ, సుగ్రీవుడి గృహం ప్రవేశించాడు. ఆ ఇల్లు ఇంద్రభవనం లాగున్నది. సుగ్రీవుడి అంతఃపురంలో వీణావాద్యం వినబడుతున్నది. అమిత సౌందర్యవతులైన స్త్రీలు



అనేకమంది ఉన్నారు. సుగ్రీవుడు గొప్ప భోగపురుషుడిలాగా జీవిస్తున్నట్టు స్పష్టమయింది. లక్ష్మణుడు పట్టరాని కోపంతో, తన వింటి నారి లాగి పెద్ద ధ్వని చేశాడు.

ఆ ధ్వని వినగానే సుగ్రీవుడికి లక్ష్మణుడు వచ్చినట్టు తెలియటమేగాక గుండె కూడా దడదడలాడింది. నోరు ఎండుకుపోయింది. అతను తారతో, "తారా, ఈ లక్ష్మణుడు చాలా మెత్తనివాడు గదా, అతనికి ఇప్పుడు కోపం ఎందుకు వచ్చిందంటావు? నేను ఇతనికి చెయ్యరాని పని ఏదన్నా చేశానా? ఎందుకైనా మంచిది, నువు ముందు వెళ్ళి, అతన్ని ప్రసన్నుణ్ణి చెయ్యి. తరవాత నేను వస్తాను," అన్నాడు.

తార లక్ష్మణుడి వద్దకు వచ్చింది. తాగిన మత్తు కూడా పూర్తిగా వదలక, అప్పుడే పక్క మీది నుంచి లేచి వచ్చినట్టు కనబడుతున్న తారను చూసి లక్ష్మణుడు తలవంచుకున్నాడు.

తార అతనితో, "లక్ష్మణా, నీకు కోపం తెప్పించిన వారు ఎవరు? అంత సాహసం ఎవరికి కలిగింది?" అన్నది.

"భర్తహితం కోరే దానివి, నీకు తెలీదా? నీ భర్త ఎప్పుడూ తాగుతూ, స్త్రీలోలుడై, ధర్మార్థాలను పూర్తిగా మరిచాడు. ఉపకారానికి ప్రత్యుపకారం చెయ్యకపోవటం ధర్మానికి, అర్థానికి చేటు కాదా? మమ్మల్ని ఇలా ఉపేక్ష చేస్తే మేం ఏం చెయ్యాలో నువే చెప్పు," అన్నాడు లక్ష్మణుడు తారతో.

దానికి తార, "లక్ష్మణా, స్నేహితుడైన సుగ్రీవుడి మీద ఇంతగా అలగవచ్చునా? అతనికి మీ పని చూడాలనే ఉన్నది. కొంచెం జాప్యం చేశాడు. నీ వంటి మహాపురుషుడు అల్పుడి మీద ఆగ్రహించరాదు. అతను మీ పని చూడటంలో ఏమరుపాటుగా ఉండటానికి నేను పక్కన ఉండటమే కారణం. నువు సుగ్రీవుణ్ణి క్షమించు. మహామహా రుషులే

అడదానికి లొంగిపోతుంటే, ఈ సుగ్రీవు డెంత?" అన్నది.

ఆమె లక్ష్మణుణ్ణి లోపలికి తీసుకు పోయింది. సుగ్రీవుడు మహావైభవంగా ఆభరణాలూ, పుష్పమాలలూ ధరించి వెలిగిపోతూ బంగారు సింహాసనం మీద కూర్చుని ఉన్నాడు. అతని చుట్టూ అనేక మంది అప్సరసలలాటి స్త్రీలున్నారు. సుగ్రీవుడు రుమను కౌగలించుకుని ఉన్నాడు. ఆ దృశ్యం చూస్తూనే లక్ష్మణుడు మహా కోపంతో కాలరుద్రుడిలాగా అయిపోయాడు.



లక్ష్మణుణ్ణి చూడగానే సుగ్రీవుడు భయపడి ఆసనం దిగి, కింద నిలబడ్డాడు. అతనితోబాటు స్త్రీలందరూ లేచి నిలుచున్నారు.

తనకు నమస్కారం చేస్తూ తల వంచుకుని నిలబడిన సుగ్రీవుడితో లక్ష్మణుడు ఇలా అన్నాడు:

"రాముడి చేత నీ పని తీరిపోయినాక నువు రాముడి పని చూడవద్దా? కృతఘ్నుడివి, అసత్యవాదివి! సీత కోసం ఎందుకు వెదికించావు కావు? తప్ప తాగి ఆడవాళ్ళతో ఎందుకు కులుకుతున్నావు? నీవు ఇలాటి వాడివని తెలిస్తే రాముడు నిన్ను వానరరాజుగా చేస్తాడా? నిన్ను నా బాణాలతో వాలి దగ్గిరికి పంపేస్తాను."

తార మళ్ళీ సుగ్రీవుణ్ణి సమర్థిస్తూ, "లక్ష్మణా, సుగ్రీవుడు ద్రోహి, దుర్మార్గుడూ, కృతఘ్నుడూ కాడు. చాలాకాలం అనేక కష్టాలకోర్చి అతను ఇప్పుడు సుఖలాలసలో ఉంటే, మిత్రుడివైన నువు క్షమించవచ్చు. రాముడి కోసం సుగ్రీవుడు నన్నూ, రుమనూ, తన సమస్తాన్నీ వదిలిపెట్టగలడు. సీతను రాముడికి తెచ్చి ఇయ్యగలడు. అందుకై రావణుడితో యుద్ధం చెయ్యగలడు. మీ పని మీదనే అతను వానరుల కందరికీ కబురు చేసి ఉన్నాడు. వాళ్ళు రావలసి ఉన్నది. ఇవాళే వాళ్ళు వచ్చే రోజు. అందుచేత నువు కోపం మాని శాంతించు." అన్నది.



ఈ మాటలతో లక్ష్మణుడు మెత్తబడ్డాడు. అది చూసి మనసు స్థిమితపడి, సుగ్రీవుడు లక్ష్మణుడితో, "లక్ష్మణా, నా వల్ల కొంచెం జాప్యం జరిగి ఉంటే క్షమించు. లోకంలో తప్పు చెయ్యని వాడెవడు ?" అన్నాడు.

లక్ష్మణుడు అతన్ని మెచ్చుకుంటూ, "రావణుడితో యుద్ధం చెయ్యటానికి నీ సహాయం ఉంటే అంతకన్న మాకు కావలసినదేమిటి ? నువు ఇప్పుడే నా వెంట వచ్చి, భార్య కోసం తపిస్తున్న రాముణ్ణి ఓదార్చు," అన్నాడు.

సుగ్రీవుడు తన పక్కనే ఉన్న హనుమంతుడితో ఇలా అన్నాడు:

"ప్రపంచంలో ఉండే వానరులనందరినీ పిలవటానికి దూతలను పంపించు. నేను ముందు పంపిన దూతలను తొందర పెట్టించు. వెళ్ళటానికి బద్ధకించే సోమరిపోతులను నా వద్దకు పంపు. పది రోజుల లోపల ఇక్కడ చేరని వానరులకు మరణ దండన ప్రకటించు."

హనుమంతుడు సుగ్రీవుడి ఆజ్ఞ ప్రకారం కిష్కింధలో ఉండే వానరులనందరినీ అన్ని దిక్కులకూ పంపించాడు.

సుగ్రీవుడు ఒక బంగారు పల్లకి తెప్పించి, అందులో తనతోబాటు లక్ష్మణుణ్ణి ఎక్కించుకుని, వానర పరివారాన్ని వెంటబెట్టుకుని, మహా వైభవంగా రాముడున్న చోటికి వచ్చాడు. సుగ్రీవుడు లక్ష్మణుడితో సహా పల్లకీ దిగి, చేతులు మోడ్చి నిలబడ్డాడు. తరవాత అతను తన కాళ్ళకు సాష్టాంగపడితే, రాముడు అతన్ని ప్రేమగా లేవనెత్తి ఆలింగనం చేసుకున్నాడు. తరవాత అందరూ కూర్చున్నారు.

రాముడు సుగ్రీవుడికి, యుద్ధకాలం ఆసన్నమయిందని జ్ఞాపకం చేశాడు.

"రామా, వీరాధి వీరులైన వానరులు కోట్ల సంఖ్యలో నీకు సహాయపడటానికి వస్తున్నారు. రావణుణ్ణి సకుటుంబంగా

చంపి సీతను వాళ్ళు నీకు అప్పగిస్తారు." అన్నాడు సుగ్రీవుడు.

తన కోసం సుగ్రీవుడు సాగించిన చర్యలు తెలుసుకుని రాముడు సంతో షించాడు.

"సుగ్రీవా, నీ సహాయంతో నేను తప్పక శత్రువును చంపగలను." అని రాముడు అన్నాడు.

ఇదే సమయంలో ఆకాశంలో చాలా ఎత్తుకు ధూళి లేచింది. వానరమూకలు వచ్చి చేరుతున్నాయి. నదీతీరాలలోనూ, సముద్రతీరానా, కొండలలోనూ నివసించే వానరులు కోట్ల సంఖ్యలో వస్తున్నారు. కొందరు ఎర్రగా ఉన్నారు, కొందరు తెల్లగా ఉన్నారు, కొందరు బూడిద రంగులో ఉన్నారు. అలాటి వానరులను వెంటబెట్టుకుని శతవలి అనే వానర శ్రేష్ఠుడు వచ్చాడు. బంగారు వర్ణం గల మహా వీరుడు సుషేణుడు, తారతండ్రి, కొన్ని కోట్ల వానరులతో వచ్చాడు. అలాగే రుమ తండ్రి తారుడు కూడా వచ్చాడు. ఇరవైరెండువేల వానరులతో హనుమం తుడి తండ్రి కేసరి వచ్చాడు. గవాక్షుడూ, ధూమ్రుడూ వానర, భల్లూక సేనలతో వచ్చారు. నీలుడు నల్లటి వానరుల సేనతో వచ్చాడు. గవయుడు కొన్ని కోట్ల వానరు లను తెచ్చాడు. దరీముఖుడూ, మైంద.



ద్వివిదులూ, గజుడూ అసంఖ్యాకులైన వానరులను తెచ్చారు. జాంబవంతుడు పది కోట్ల భల్లూక యోధులను తెచ్చాడు. గంధమాదనుడూ, అంగదుడూ కూడా గొప్ప సంఖ్య గల వానరులను వెంట బెట్టుకు వచ్చారు. మొత్తం మీద ప్రపం చంలో గల వానర యోధులందరూ కిష్కింధ చేరారు. వాళ్ళ కోలాహలం మిన్నుముట్టింది.

వానర ముఖ్యులందరూ సుగ్రీవుణ్ణి చేరుకుని నమస్కరించారు. సుగ్రీవుడు వారిని రాముడికి సమర్పించి, వాళ్ళతో, "మీరు మీమీ సేనలను సెలయేళ్ళ సమీపంలోనూ, వనాలలోనూ విడియించి,

వాటి మంచి చెడ్డలు తెలుసుకుంటూ ఉండండి,'' అన్నాడు.

అతను రాముడితో, ''నువు చెప్పినట్టు చెయ్యటానికి వానరులు కోట్ల సంఖ్యలో వచ్చి ఉన్నారు. వారిలో కామరూపులూ, పర్వతకాయులూ, కామగమనం గలవారూ, భయంకర పరాక్రములూ ఉన్నారు. వారిని నీ యిష్టం వచ్చినట్టు ఆజ్ఞాపించు. ఈ వానర వీరులు ఏం చెయ్యాలో నాకు తెలుసు. అయినా వారిని నువే ఆజ్ఞాపించు,'' అన్నాడు.

రాముడు సంతోషంతో సుగ్రీవుణ్ణి కౌగలించుకుని, ''సుగ్రీవుడా, సీత బతికి ఉన్నదా, లేదా? రావణుడు ఎక్కడ ఉంటాడు? ఈ సంగతులు తెలియాలి. సీత బతికి ఉన్నట్టు తెలిస్తే, ఆ తరవాత ఏం చెయ్యాలో అది మనిద్దరమూ చేద్దాం. అందుచేత నా కోరికకు తగినట్టుగా నువే వానరులను ఆజ్ఞాపించు,'' అన్నాడు.

సుగ్రీవుడు వినతుడు అనేవాణ్ణి, పర్వతాకారుణ్ణి, పిలిచి, అతన్ని ఒక లక్ష వానరులను వెంటబెట్టుకుని తూర్పుగా వెళ్ళమన్నాడు; అక్కడ రావణుడు ఉండే ప్రదేశం కోసమూ, సీత కోసమూ వెదకమన్నాడు; వాళ్ళు తిరిగి రావటానికి ఒక మాసం గడువు ఇచ్చాడు.

అలాగే సుగ్రీవుడు దక్షిణంగా కొందరు వానరులను పంపాడు. దక్షిణంగా వెళ్లే వారిలో నీలుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ, సుహోత్రుడూ, శరారీ, శరగుల్మడూ, గజుడూ, గవాక్షుడూ, గవయుడూ, ఋషభుడూ, మైందుడూ, ద్వివిదుడూ, విజయుడూ, గంధమాదనుడూ, ఉల్కాముఖుడూ, అనంగుడూ, అంగదుడూ మొదలైన వాళ్ళున్నారు. వారి వెంట విస్తారమైన వానర సైన్యం కూడా ఉన్నది.

తరవాత సుగ్రీవుడు తార తండ్రి అయిన సుషేణుణ్ణి, అనేకమంది వానర వీరులతో సహా పడమటి దిక్కుకూ, శతవలిని లక్షమంది వానర వీరులతో సహా ఉత్తరానికీ పంపాడు.





# వీర హనుమాన్

ఇతర వానరుల కన్న హనుమంతుడికే కార్యం సాధించే శక్తి, అవకాశమూ, ఎక్కువగా ఉన్నాయనుకుని సుగ్రీవుడు హనుమంతుడితో ఇలా అన్నాడు:

"మహావీరుడవైన హనుమంతుడా, నువు గాలిలోనూ, నీటిలోనూ, భూమి మీదా, పై ఆకాశంలోనూ కూడా సంచరించగలవాడివి. నీకు తెలియని లోకంగాని, సముద్రంగాని, పర్వతంగాని లేదు. నువు వాయుదేవుడిలాటి గమనమూ, వేగమూ కలవాడివి. భూమి మీద నిన్ను మించిన బలంగల ప్రాణిలేదు. అందుచేత సీతాదేవి తిరిగి దొరికే ప్రయత్నం నీ వల్లనే కావాలి. బలమూ, బుద్ధీ, దేశకాలానుగుణంగా ప్రవర్తించే నేర్పూ, పరాక్రమమూ నీలో ఉన్నట్టుగా మరెవరిలోనూ లేవు."

హనుమంతుడితో సుగ్రీవుడు ఇలా మాట్లాడటం విని రాముడు, కార్యభారాన్ని సుగ్రీవుడు హనుమంతుడి పైన పెట్టుతున్నట్టు గ్రహించాడు. హనుమంతుడి శక్తిసామర్థ్యాలు సుగ్రీవుడికి బాగా తెలిసి ఉండాలి. రాముడి ఆశలన్నీ హనుమంతుడి మీదికి మళ్లాయి. అతను తన పేరుగల ఉంగరాన్ని హనుమంతుడికి ఇస్తూ, "వానరశ్రేష్ఠుడా, ఈ ఉంగరాన్ని చూసినట్టయితే సీతాదేవి నిన్ను చూసి భయపడదు, అనుమానించదు; నువు నా వద్ద నుంచి వచ్చావని గుర్తిస్తుంది. నీ వల్ల తప్పక పని జరుగుతుందని

8. స్వయంప్రభ కథ



49



సుగ్రీవుడి మాటలను బట్టి నాకు తోస్తున్నది,'' అన్నాడు.

హనుమంతుడు ఆ ఉంగరాన్ని తీసుకుని, నెత్తి మీద చేతులు పెట్టుకుని నమస్కారం చేసి, రాముడి పాదాలకు ప్రణామంచేసి, బయలుదేరాడు. అతనితో మరొకసారి రాముడు, ''హనుమంతుడా. నేను నీ శక్తినే నమ్ముకుని ఉన్నాను. శక్తివంచన లేకుండా పాటుపడి, సీతాదేవి తిరిగి దొరికేటట్టు చూడు,'' అన్నాడు.

వానరులు మిడతల దండులాగా అన్ని దిక్కులకూ బయలుదేరారు. వాళ్ళు తిరిగి రావటానికి ఒక మాసం మాత్రమే గడువు వున్నది.

వానరులు బయలుదేరిన అనంతరం రామ, లక్ష్మణులు ప్రస్రవణపర్వతం మీది గుహలో వారు తిరిగి రావటం కోసం ఎదురుచూస్తూ ఉండిపోయారు.

వినతుడి బృందం తూర్పుగానూ, సుషేణుడి బృందం పడమరగానూ, మరి కొందరు ఉత్తరంగానూ వెళ్ళగా, హనుమంతుడూ, తారుడూ, అంగదుడూ మొదలైన వాళ్ళు దక్షిణదిక్కుగా బయలుదేరారు. అందరినీ అన్ని దిక్కులకూ పంపి, రాముడికి తాను ఇచ్చిన మాట నిలబెట్టుకున్న సంతృప్తితో సుగ్రీవుడు వెనకటి కన్నా మరింత సుఖంగా జీవించసాగాడు.

సుగ్రీవుడు పంపిన వానరులు సీతాదేవి కోసం చాలా శ్రద్ధగా వెతికారు. వారు ఎక్కడికి వెళ్ళినా పగలల్లా ప్రతి సరస్సూ, నదీ, పొదా, కొండా, గుహ వెతికి, రాత్రికాగానే ఒక చోటికి చేరుతూ, చెట్ల కింద రాత్రి గడుపుతూ ముందుకు సాగారు. తూర్పుగానూ, ఉత్తరంగానూ, పడమరగానూ వెళ్ళిన వానరబలగాల వాళ్ళు నెల గడువు తీరేసరికి తిరిగివచ్చి, సీతాదేవి జాడ తెలియలేదని సుగ్రీవుడితో చెప్పారు. అప్పుడు సుగ్రీవుడు ప్రస్రవణ పర్వతం మీద రాముడితో కూర్చుని ఉన్నాడు.

అయినా, ఇంకా ఆశ ఉన్నది. దక్షిణంగా వెళ్ళిన బృందం ఇంకా తిరిగి రాలేదు. సీతను తీసుకుపోయిన రావణుడు దక్షిణ దిక్కుగానే వెళ్లాడు. అందుచేత హనుమంతుడు సీతను చూసి వచ్చే అవకాశం ఉన్నది.

ఈ లోపుగా హనుమంతుడు మొదలైన వాళ్ళు సీత కోసం వెతుకుతూ వింధ్యపర్వత ప్రాంతాన్ని చేరుకున్నారు. అది చాలా విస్తృతమైన ప్రదేశం. అక్కడ ఎన్నో గుహలున్నాయి. శిఖరాలున్నాయి. అరణ్యాలున్నాయి. దాటటానికి కష్టమైన నదులున్నాయి. చాలా ఎత్తయిన చెట్లున్నాయి. పళ్లూ, దుంపలూ తింటూ వానరులు ఆ ప్రాంతంలో ఒకొక్క ప్రదేశమే సీతాదేవి కోసం వెతుకుతూ ముందుకు వెళ్ళారు.

ఒక ప్రదేశం బొత్తిగా శూన్యంగా ఉన్నది. అక్కడ చెట్లు నిలువునా ఎండి ఉన్నాయి. నదులలో నీరులేదు. లతలూ, పుష్పాలూ, దుంపలూ లేవు. ఎలాటి జంతువులు గాని, పక్షులు గాని లేవు. ఆ ప్రదేశం భయంకరంగా ఉన్నది.

ఆ వనంలో కండుమహర్షి ఉండేవాడు. ఆయనకు తపోబలం ఎంత ఎక్కువో, కోపం కూడా అంత ఎక్కువ. తన కొడుకు పదహారేళ్ళవాడు అకాలమరణం పొందే



సరికి, ఆయన ఆ వనాన్ని శపించి ఎడారిగా చేశాడు. వానరులు ఆ శూన్యప్రదేశంలో కూడా సీతాదేవి కోసం శ్రద్ధగా వెతికారు.

అలా వెతుకుతూ వాళ్ళు ఒక భయంకరమైన అరణ్యం గల ప్రదేశంలో ప్రవేశించారు. అక్కడ వాళ్లకు ఒక రాక్షసుడు కనిపించాడు. మహాకాయుడైన ఆ రాక్షసుణ్ణి చూస్తూనే వానరులు దట్టీలు బిగించి, వాడితో యుద్ధానికి సిద్ధపడ్డారు.

వాడు కూడా వానరులను చూస్తూనే, ''మిమ్మల్నందరినీ చంపేస్తాను,'' అంటూ పిడికిలి బిగించి వారి మీదికి వచ్చాడు. అంగదుడు వాణ్ణి చూసి, వాడే రావణుడు అయి ఉంటాడనుకుని, వాడి నెత్తి మీద



51



బలంగా కొట్టాడు. ఆ ఒక్క దెబ్బకే ఆ రాక్షసుడు నెత్తురు కక్కుతూ, నేల మీద పడిపోయి, ప్రాణాలు వదిలాడు.

రావణుడు చచ్చాడనీ, సీత వాడి గుహ లోనే ఉంటుందనీ అనుకుని, వానరులు వాడి గుహ అంతా శ్రద్ధగా వెతికి చూశారు. అక్కడ సీత లేదు. వానరులు దాని సమీపంలో గల మరొక పెద్ద గుహ కూడా వెతికారు; ఆ అరణ్యమంతా వెతికారు. ఎక్కడా సీత కనిపించకపోయేసరికి, వాళ్ళు నిస్పృహ చెంది, ఒక చెట్టు కింద చేరి కూర్చున్నారు.

అప్పుడు అంగదుడు వాళ్ళతో, "మనం ఇంత కాలంగా ఎన్నో అరణ్యాలూ, నదులూ, పర్వతాలూ, గుహలూ ఎంతో శ్రమపడి వెతుకుతున్నా, మనకు సీత జాడగాని, ఆమెను ఎత్తుకుపోయిన రావణుడి జాడగాని తెలియరాలేదు. సుగ్రీవుడి ఆజ్ఞ మహా దారుణమైనది. మనం నిరుత్సాహపడి పని చెయ్యలేం. సోమరితనం పనికిరాదు. మరొకసారి ఈ వనం అంతటా వెతకండి. మీరంతా ఇప్పుడు నిద్రపోవటం భావ్యం కాదు. లేదా, ఇంకా మంచిపద్ధతి ఏమైనా ఉంటే చెప్పండి." అన్నాడు.

గంధమాదనుడు కూడా అంగదుడు చెప్పినట్టే చెప్పాడు.

అప్పుడు వానరులు తమ అలసటను మరిచిపోయి, తిరిగి వింధ్యపర్వతారణ్యాలలో సీత కోసం వెతకటం ఆరంభించారు. వాళ్ళు వెండి కొండలాటి ఒక శిఖరం ఎక్కి, అక్కడ కూడా సీతను చూడలేక పోయారు. తరవాత వాళ్ళు ఆ శిఖరం నుంచి దిగివచ్చి, కొంతసేపు విశ్రాంతి తీసుకుని, మళ్ళీ వెతకటం ప్రారంభించారు. వాళ్ళు వింధ్యపర్వతం మీద సీత కోసం వెతుకుతూ ఉండగానే సుగ్రీవుడు పెట్టిన నెల గడువు దాటిపోయింది.

వానరులు ఒక్కొక్క ప్రదేశాన్నే వెతుకుతూ వింధ్యపర్వతపు నైరృతి కొనకు చేరుకున్నారు. ఇక్కడికి చేరిన

వానరులలో ప్రముఖులు హనుమంతుడూ, గజుడూ, గవాక్షుడూ, గవయుడూ, శరభుడూ, గంధమాదనుడూ, మైందుడూ, ద్వివిదుడూ, సుషేణుడూ, జాంబవంతుడూ, నళుడూ, యువరాజు అంగదుడూ, తారుడూ ఉన్నారు.

వాళ్లు ప్రతి గుహలోనూ చూసుకుంటూ ఒక పెద్ద బిలం వద్దకు వచ్చారు. అది ఋక్షబిలం. దాన్ని మయుడు నిర్మించాడు. దానికి లతలు అడ్డంగా పెరిగి ఉండి, ప్రవేశించ రాకుండా ఉన్నది. వానరులు ఆకలి, దప్పులతో అలమటించి పోతున్నారు. ఆ ప్రాంతాల ఎక్కడా నీరు లేదు. వాళ్లు చాలా అలసిపోయి కూడా ఉన్నారు.

అయితే వాళ్లకు, ఋక్షబిలం నుంచి క్రౌంచపక్షులూ, హంసలూ, బెగ్గురు పక్షులూ, చక్రవాకాలూ మొదలైన నీటి పక్షులు బయటికి ఎగురుతూ రావటం కనిపించింది. అది చూసి హనుమంతుడు మొదలైన వాళ్ళు చాలా ఆశ్చర్యపడ్డారు. వాళ్లు ఆ బిలాన్ని సమీపించారు.

పర్వతాలను గురించీ, అరణ్యాలను గురించీ విశేషంగా తెలిసిన హనుమంతుడు మిగిలిన వారితో ఇలా అన్నాడు :

"చూడండి, ఈ గుహా ముఖం నుంచి నీటి పక్షులు ఎగురుతూ వస్తున్నాయి. దీని ద్వారంలో ఉన్న లతలూ, చెట్లూ నేవళంగా ఉన్నాయి. లోపల నీరు గల బావిగాని, చెరువుగాని ఉన్నదనటానికి





సందేహంలేదు. మనమూ, దాహంతో బాధ పడుతూ, చాలా డస్సి ఉన్నాం."

హనుమంతుడు ఈ మాట అనగానే వానరులు బిలంలోకి ప్రవేశించారు. లోపల కన్ను పొడుచుకున్నా కానరానంత చీకటిగా ఉన్నది. వానరులు తాము ఎటు పోతున్నదీ కూడా తెలియకుండా, తడువు కుంటూ ముందుకు పోయారు. పోగా, పోగా చీకటి పోయి, కాంతి వచ్చింది. తరవాత అమిత అందమైన ప్రదేశం వారికి కనబడింది. అక్కడ ప్రకాశవంత మైన కాంచనవృక్షాలూ, మద్దిచెట్లూ, తాటిచెట్లూ, సురపొన్న చెట్లూ, అశోక వృక్షాలూ, చంద్రచెట్లూ మొదలైనవి ఉన్నాయి. కొన్ని చెట్లూ, కాయలూ, పూలూ కాంతులు వెదజల్లుతున్నాయి. అక్కడ ఒక తామరకొలనులో బంగారు తామరలూ, బంగారు చేపలూ, బంగారు తాబేళ్ళూ ఉన్నాయి.

ఆ ప్రదేశంలో గొప్ప ఇళ్ళు కూడా ఉన్నాయి. వాటి కిటికీలు బంగారువి; కప్పులు బంగారంతోనూ, వెండితోనూ చేసినవి. ఆ ఇళ్లలో ముత్యాల తోరణాలు కట్టి వున్నాయి: మణులు అలంకరించి ఉన్నాయి.

ఆ ప్రదేశంలో వానరులకు పగడపు కాంతిగల చెట్ల మీద పూలూ, పళ్ళూ కనిపించాయి; రకరకాల మద్యాలు కని పించాయి; రత్నాలు తాపిన బంగారు కుర్చీలూ, మంచాలూ, వాహనాలూ కని పించాయి. అక్కడక్కడ బంగారు, వెండి, కంచుపాత్రలు రాసులు రాసులుగా ఉన్నాయి. అలాగే అగరూ, చందనమూ, పళ్లూ, దుంపలూ, పానీయాలూ, తేనే, వస్త్రాలూ, కంబళాలూ, రకరకాల చర్మాలూ, బంగారమూ కుప్పలు కుప్ప లుగా కనిపించాయి.

వానరులు ఆ ప్రదేశమంతా వెతు కుతూ ఒకచోట ఒక స్త్రీని చూశారు. ఆమె జింకచర్మం కట్టుకుని, తపస్సు చేసు కుంటున్నది. ఆమె వెలిగిపోతున్నది.

అది చూసి వానరులు ఆశ్చర్యమూ, భయమూ కలిగి ఆగిపోయారు.

హనుమంతుడు ఆమెను, "నువ్వు ఎవరు? ఈ బిలం ఎవరిది?" అని అడిగాడు, చేతులు జోడించి ఆమెకు నమస్కారం చేస్తూ. అతను ఇంకా ఇలా అన్నాడు:

"మేం మార్గాయసంతో అలసిపోయి, ఆకలి దప్పులతో బాధపడుతూ, ఇక్కడ నీరూ, తిండీ దొరుకుతాయన్న నమ్మకంతో, చీకటి కోణంలాగా ఉన్న ఈ బిలంలో ప్రవేశించాం. కాని ఇక్కడ ఉండే ఈ అద్భుతమైన వస్తువులన్నీ చూస్తే ఇదేదో రాక్షసమాయలాగా కనబడుతున్నది. ఈ బంగారు చెట్లూ, ఈ బంగారు, వెండి, ఇళ్లూ ఎవరివి? ఈ కొలనులో ఉన్న బంగారు తామరలను ఎవరు సృష్టించారు? బంగారు తాబేళ్లూ, బంగారు చేపలూ ఎవరి కల్పన? మాకు ఇదంతా అయోమయంగా ఉన్నది. మాకు కాస్త తెలియ జెప్పు."

హనుమంతుడికి ఆ తపస్విని ఇలా సమాధానం చెప్పింది:

"మయుడు అనే గొప్ప దానవుడు ఇక్కడ ఉండేవాడు. అతను దానవుల విశ్వకర్మ. అతని మాయాబలం వల్ల ఈ బంగారు వృక్షాల వనం ఏర్పడింది. అతను గొప్ప తపస్సు చేసి, సమస్తమైన ధనమూ బ్రహ్మ నుంచి వరంగా పుచ్చుకున్నాడు. అతను హేమ అనే అప్సరతో



ఈ ప్రదేశంలో సుఖంగా ఉంటూండగా ఇంద్రుడు అలిగి, మయుణ్ణి వజ్రాయుధంతో కొట్టాడు. తరవాత బ్రహ్మ ఈ ప్రదేశాన్ని హేమకు ఇచ్చాడు. నేను మేరుసావర్ని కుమార్తెను. నా పేరు స్వయంప్రభ. హేమకు చెందిన ఈ ప్రదేశాన్ని రక్షిస్తూ, నేను ఇక్కడ ఉంటున్నాను. హేమ నా స్నేహితురాలు. ఆమె సంగీత, నృత్యాలలో సమర్థురాలు. ఆమె నాకిచ్చిన వరం మూలాన నన్ను ఎవరూ జయించలేరు. మీరు ఏ కారణంచేత ఈ ప్రాంతాల తిరుగుతున్నారు? ప్రవేశించటానికి సాధ్యం కాని ఈ ప్రదేశానికి ఎందుకు వచ్చారు? మీరు ముందు పళ్ళు తిని, నీరు తాగి, మీ వృత్తాంతం నాకు సవిస్తరంగా చెప్పండి.''

హనుమంతుడు ఏమీ దాచకుండా స్వయంప్రభకు జరిగినదంతా వివరంగా చెప్పాడు. చివరకు అతను ఆమెతో, ''అమ్మా, నువు మాకు తిండి పెట్టి మా ప్రాణాలు నిలబెట్టావు. ఇందుకు మేం ఏం ప్రత్యుపకారం చెయ్యగలమో చెప్పు.'' అన్నాడు.

''చాలా సంతోషం! నాకు మీ నుంచి ప్రత్యుపకారం ఏమీ అవసరం లేదు.'' అన్నది స్వయంప్రభ.

''అమ్మా, ఇప్పటికే మాకు సుగ్రీవుడు ఇచ్చిన గడువు దాటింది. ఈ బిలం నుంచి మేము శీఘ్రంగా బయట పడేటట్టు చూడు. మమ్మల్ని కాపాడు. మేం ఇక్కడ చిక్కుకుపోతే, సీతను వెతికే పని నిలిచి పోతుంది.'' అన్నాడు హనుమంతుడు.

దానికి స్వయంప్రభ, ''నేను నా తపశ్శక్తితో మిమ్మల్ని బయటికి పంపిస్తాను. మీరందరూ కళ్ళుమూసుకోండి.'' అన్నది.

వానరులందరూ వేళ్లతో కళ్ళు మూసుకుని, మరుక్షణమే బిలం వెలపల ఉన్నారు! అప్పుడు వారి వెంట ఉన్న స్వయంప్రభ వారితో, ''ఇది వింధ్య పర్వతం. అది సముద్రం. మీకందరికీ శుభం కలుగుగాక!'' అని తిరిగి వెళ్ళిపోయింది.






స్వయంప్రభ ధర్మమా అంటూ బిలం నుంచి బయటపడిన వానరులకు ఎట్టెదట సముద్రం, పెద్ద పెద్ద కెరటాలతో ఘోషపెట్టుతూ, కంటపడింది. వాళ్ళు వింధ్యపర్వతపు నైరృతి ప్రాంతంలో పుష్పవృక్షాల కింద ఒక తిప్ప మీద చేరి ఆలోచన చేశారు; ఎందుకంటే, సుగ్రీవుడు పెట్టిన గడువు దాటిపోయింది. వాళ్ళు సుగ్రీవుడి ఆగ్రహానికి చాలా భయపడ్డారు.

ఆ స్థితిలో, యువరాజైన అంగదుడు మిగిలిన వానరులతో ఇలా అన్నాడు:

"వానరులారా, మనను పంపిన సుగ్రీవుడు మనకు నియమించిన నెల గడువు, మనం ఋక్షబిలంలో ఉండగానే తీరిపోయిన సంగతి మీకు తెలుసుగదా? మొట్టమొదట, హనుమంతుడి సూచన మీద సుగ్రీవుడు మనకు పదిహేను రోజులు గడువు ఇచ్చి పిలిపించాడు. ఇది ఆశ్వయుజ మాసంలో జరిగింది. తరవాత లక్ష్మణుడు కోపించి వచ్చిన మీదట మళ్ళీ పదిరోజులు గడువిచ్చి సుగ్రీవుడు మనలనందరినీ పిలిపించాడు. తరవాత మనకు తిరిగి రావటానికి ఒక్క మాసం గడువు ఇచ్చాడు. ఆ గడువు తీరిపోయింది. ఇప్పుడు మనం ఏంచెయ్యాలో ఆలోచించండి. మనకేమో సీత జాడ ఇంకా తెలియలేదు. మనం సుగ్రీవుడి ఆజ్ఞను రెండు విధాలా ఉల్లంఘించాం. అమిత క్రూర స్వభావుడైన సుగ్రీవుడు

9. సంపాతి కథ



మనను తప్పక చంపేస్తాడు. మనం అక్కడికి తిరిగి వెళ్ళి, భయంకరంగా చావటం కన్న, ఇక్కడే ప్రాయోపవేశం చేసి, ప్రాణాలు విడవటం మంచిది. సుగ్రీవుడికి నా మీద సద్భావం లేదు. నన్ను యువరాజును చేసిన వాడు రాముడేగాని సుగ్రీవుడు కాడు. అందు చేత నెపం దొరికితే ఆయన నన్ను చంపక మానడు. అయిన వాళ్ళందరికీ దుఃఖం కలిగేటట్టుగా నేను కిష్కింధలో ఎందుకు చావాలి? ఇక్కడ నిరశన వ్రతం అవలంబించి, ఈ సముద్ర తీరాన చచ్చిపోతాను."

ఈ మాటలకు వానర వీరులంతా దుఃఖించి, "మనం సీత సమాచారం తెలుసుకో గలిగితే సుగ్రీవుడి వద్దకు పోదాం. లేకపోతే ఇక్కడే చచ్చిపోదాం," అన్నారు.

"మనం చావటం దేనికి? ఈ బిలం లోకి వెళ్ళి, అక్కడ హాయిగా ఉందాం. విచారించకండి. ఈ బిలంలోకి ఎవరూ రాలేరు. ఇక్కడ తినటానికీ, తాగటానికీ పుష్కలంగా వున్నది. ఇక్కడ మనకు రాముడి భయంగానీ, సుగ్రీవుడి భయం గానీ లేదు," అన్నాడు తారుడు.

ఈ మాటలన్నీ వింటున్న హనుమంతుడు తనలో, "సుగ్రీవుడి వానర రాజ్యాన్ని అంగదుడు తప్పక కాజేస్తాడు. ఈ వాలి కొడుకు సూక్ష్మబుద్ధి గలవాడు, దేశ కాలాలు తెలిసినవాడు," అనుకున్నాడు.

అతను అంగదుడితో, "అంగదుడా, నువు యుద్ధంలో నీ తండ్రికన్న గొప్పవాడివి కావు. చపలచిత్తులైన ఈ వానరులు ఎల్లప్పుడూ నీ వెంట ఉండరు. వాళ్ళకు భార్యలూ, బిడ్డలూ ఉన్నారు. నన్నూ, ఈ జాంబవంతుణ్ణీ, ఇతర వానర వీరులనూ సుగ్రీవుడి నుంచి వేరుచేసి నీ పక్షం చేసుకోవటం నీకు సాధ్యం కాదు. ఈ ఋక్ష బిలం లక్ష్మణుడి బాణాలకు గొప్ప ప్రతిబంధకం కాదు; అతను దీన్ని ఆకును ఛేదించినట్టు ఛేదిసాడు. అసలు నువు

సుగ్రీవుడి మీద విరోధం కట్టి ఈ బిలంలో ప్రవేశిస్తే, ఈ వానరులు నిన్ను విడిచి పెట్టేస్తారు. తరవాత నువు గడ్డిపోచ విలువ చెయ్యవు. రామలక్ష్మణులు నిన్ను ప్రాణాలతో వదలరు. సుగ్రీవుడు ధర్మాత్ముడు. అతనికి నీ పైన పగలేదు. పైపెచ్చు నీ తల్లి అంటే చాలా ప్రేమ గలవాడు. ఆమె కొడుకువైన నిన్ను తన కొడుకులాగే చూసుకుంటాడు," అన్నాడు.



హనుమంతుడి మాటలను అంగదుడు ఆమోదించక, "సుగ్రీవుడిలో ఏ సుగుణమూ లేదు. తన అన్న తనను గుహ వద్ద కాపు పెట్టి, శత్రువు బయటికి రాకుండా చూడమని చెప్పి లోపలికిపోతే, సుగ్రీవుడు దుర్బుద్ధితో గుహకు రాయి అడ్డం పెట్టాడు. రాముడివల్ల అంత ఉపకారం పొంది, ప్రత్యుపకారం చెయ్యటం మాట మరిచాడు. చివరకు అతను సీతను వెదికిస్తున్నది కూడా లక్ష్మణుడికి భయపడే గాని, సద్బుద్ధితో కాదు. అలాటి వాడికి, నేను ఇప్పుడు అందరికీ తెలిసినట్టు చేసిన ఆలోచన తెలిసిన మీదట ప్రాణాలతో ఉండగలనా? నేను కిష్కింధకు రాను. ఇక్కడే ప్రాయోపవేశం చేసాను. మీరంతా కిష్కింధకు తిరిగి వెళ్ళండి. రామలక్ష్మణుల క్షేమం అడిగాననని చెప్పండి," అన్నాడు.

అంగదుడు ఇలా అని, తన తల్లి అయిన తారను తలుచుకుని దుఃఖిస్తూ, నేల మీద దర్భలు పరుచుకుని, వాటి మీద పడుకున్నాడు. అది చూసి వానరులందరూ పెద్దగా ఏడ్చారు. అంగదుడి నిశ్చయం మారదని గ్రహించి, వాళ్ళందరూ సముద్రంలో స్నానాలు చేసి, దర్భలు పరుచుకుని, వాటి మీద తాము కూడా పడుకున్నారు. తరవాత వాళ్ళు తమలో తాము రాముడి వనవాసం గురించీ, సీతాపహరణం గురించీ, జటాయు మరణం గురించీ, వాలి వధ గురించీ, తమ సీతాన్వేషణ గురించీ మాట్లాడుకోసాగారు.



వానరుల కోలాహలం విని, ఒక గుహ నుంచి పెద్ద గద్ద ఒకటి బయటికి వచ్చి, ''ఆహా, నాకు కడుపు నిండా కావలసినంత తిండి!'' అన్నది. ఆ మాట విని వానరులు హడలిపోయారు.

అంగదుడు హనుమంతుడితో, "ఈ గద్ద సూర్యుడి కొడుకైన సంపాతి. రాముడి కోసం జటాయువు రావణుడితో యుద్ధం చేసి ఎలా ప్రాణాలు వదిలినదీ మనకు తెలుసు గదా. మనం అలా రామ కార్యంలో ప్రాణాలు పోగొట్టుకున్న వాళ్ళమైనా కాలేకపోయాం,'' అన్నాడు.

ఈ మాటలు విని సంపాతి గట్టిగా, ''నా తమ్ముడైన జటాయువు చచ్చాడని చెప్పి నా మనస్సుకు బాధ కలిగిస్తున్న వాడెవడు? జటాయువుకూ, రావణుడికీ యుద్ధం ఎందుకు జరిగింది? చాలా కాలానికి జటాయువు పేరు వింటున్నాను,'' అని అరిచాడు.

తరవాత అతను వానరులతో, ''వానరులారా, సూర్యుడి కిరణాలకు నా రెక్కలు కాలిపోయాయి. ఈ పర్వతం మీద నుంచి నేను దిగి రాలేను. నన్ను కిందికి దింపండి,'' అన్నాడు.

తమను తింటానన్న సంపాతి మాటలు వానరులు నమ్మలేకపోయారు. కాని, తాము ఎలాగూ చచ్చిపోవటానికే నిశ్చయించుకున్నప్పుడు సంపాతి తింటాడని భయపడటం అనవసరమనుకున్నారు.

అంగదుడు కొండ మీదికి వెళ్ళి, సంపాతిని కిందికి తెచ్చి, అతనికి జరిగినదంతా ఇలా చెప్పాడు:

''ఇక్ష్వాకువంశపు రాజైన దశరథుడి కొడుకు రాముడు తండ్రి మాట శిరసా వహించి, తమ్ముడు లక్ష్మణుణ్ణీ, భార్య సీతనూ వెంటబెట్టుకుని దండకారణ్యానికి వచ్చాడు. అతను జనస్థానంలో ఉండగా రావణుడు సీతను బలాత్కారంగా ఎత్తుకుపోయాడు. రావణుడు ఆకాశమార్గాన పోతూండగా, దశరథుడికి మిత్రుడైన జటాయువు చూశాడు. జటాయువు

రావణుడితో యుద్ధం చేసి, కొంతసేపు సీతను కాపాడి, చివరకు చనిపోయాడు. రాముడు జటాయువుకు సంస్కారం చేసి, మా ప్రాంతానికి వచ్చి, మా పినతండ్రి అయిన సుగ్రీవుడితో స్నేహం చేసి, నా తండ్రి అయిన వాలిని చంపి, సుగ్రీవుణ్ణి వానర రాజును చేశాడు. ఆ సుగ్రీవుడి ఆజ్ఞ మీదనే మేం సీత కోసం వెతుకుతూ ఇలా వచ్చాం. మాకు సీత జాడ తెలియలేదు. మేం వెనక్కు తిరిగిపోతే నిశ్చయంగా రాముడి చేతనో, సుగ్రీవుడి చేతనో మరణం పొందుతాం,'' అన్నాడు.




సంపాతి పెద్ద గొంతుతో, ''వానరులారా, మీరు, రావణుడితో యుద్ధం చేసి చనిపోయాడని చెప్పే జటాయువు నా తమ్ముడు. ముసలివాణ్ణి; రెక్కలు లేనివాణ్ణి; రావణుణ్ణి చంపి పగ తీర్చుకోలేను. ఏం చెయ్యను? వృత్రాసురుడి వధ జరిగిన రోజుల్లో, అన్నదమ్ములిద్దరమూ పోటీపడి ఎగిరిపోతూ, సూర్యుడికి సమీపంగా వెళ్ళాం. సూర్యుడు నడినెత్తికి వచ్చేసరికి జటాయువు ఎండ దెబ్బ తిన్నాడు. అప్పుడు నేను వాడికి ఎండ తగలకుండా నా రెక్కలు అడ్డం పెట్టాను. ఆ కారణంగా నా రెక్కలు కాలాయి. నేను వింధ్యపర్వతం మీద పడ్డాను. అది మొదలు నేను ఇక్కడే ఉంటున్నాను. నా తమ్ముడి సమాచారం తెలియరాలేదు,'' అన్నాడు.

ఈ మాట విని అంగదుడు సంపాతిని, ''ఆ రాకస రాజైన రావణుడు ఎక్కడ ఉంటాడో తెలుసునా ?'' అని అడిగాడు.

''నాయనలారా, ఆ రావణుడు ఒక అందమైన స్త్రీని తీసుకుపోవటం నేను స్వయంగా ఎరుగుదును. ఆమె తన్నుకోవటం నాకు తెలుసు. ఆమె 'రామా, రామా', అని కేకలు పెట్టటాన్ని బట్టి సీతే అయి ఉండాలి. ఇక రావణుడు లంక అనే నగరంలో ఉంటాడు. అతను విశ్రవసుడి కొడుకు; కుబేరుడి తమ్ముడు.



జాంబవంతుడు మిగిలిన వానరుల పక్షాన సంపాతితో, సీతాపహరణం గురించి ఇంకా వివరంగా చెప్పమన్నాడు. దానికి సంపాతి యిలా చెప్పాడు :

"నేను రెక్కలు కాలి, ఈ వింధ్య పర్వతం మీద పడిపోయినది మొదలు ఇక్కడే ఉండి, వృద్ధుణ్ణి అయిపోయాను గద. అందుచేత నా కొడుకు సుపార్శ్వుడు నాకు వేళకు ఇంత తిండి తెచ్చిపెడుతూ ఉంటాడు. ఒకనాడు వాడు సూర్యాస్తమయం అయిన దాకా రాకపోగా, ఆలస్యంగా వచ్చిన వాడు ఆహారం తీసుకు రాకుండా వచ్చాడు. అసలే ముసలివాణ్ణి, దాని పైన ఆకలితో ఉండటం చేత, వాడి మీద మండిపడ్డాను. అప్పుడు వాడు నన్ను శాంతపరుస్తూ, జరిగిన సంగతి చెప్పాడు. వాడు సరి అయిన వేళకే మహేంద్ర పర్వతం మీదికి ఆహారంకోసం వెళ్లాడట. అప్పుడు వాడికి నల్లటి వాడొకడు ధగధగ మెరిసే స్త్రీని తీసుకుపోతూ కనిపించాడు. మా వాడు వాళ్ళనే ఆహారంగా పట్టుకుందామని వాళ్ళకు అడ్డం వెళ్ళాడు. ఆ నల్లనివాడు సుపార్శ్వుణ్ణి మర్యాదగా, అడ్డం తొలగమన్నాడు. ఆ మనిషి మర్యాదను పాటించి సుపార్శ్వుడు వాళ్ళకు దారి ఇచ్చాడు. తరవాత ఆ మనిషి అతివేగంగా వెళ్లిపోయాడట. తరవాత

సముద్రం మధ్య ఇక్కడికి నూరు యోజనాల దూరంలో ఒక ద్వీపం మీద లంకా నగరం ఉన్నది. మీరు సముద్రం దాటి లంకా నగరం చేరారంటే మీకు అక్కడ రావణుడూ, సీతా కూడా కనిపించవచ్చు. మీరు రాముడి చేత ఆ రావణుణ్ణి చంపించారంటే నా పగ తీరుతుంది. మీరు సముద్రం దాటే మార్గంచూడండి," అన్నాడు సంపాతి.

తరవాత వానరులు తనను సముద్ర తీరానికి చేర్చగా, సంపాతి తన తమ్ముడైన జటాయువుకు జలతర్పణాలు విడిచాడు. సీత జాడ తెలిసినందుకు వానరులకు అమితానందం కలిగింది.

సుపార్శ్వుడు ఆకాశభూతాలను అడగగా ఆ నల్లటివాడు రాకసరాజైన రావణుడనీ, రామలక్ష్మణులను ఎలుగెత్తి పిలిచే ఆ స్త్రీ సీత అనీ, రావణుడు ఆమెను ఎత్తుకుపోతున్నాడనీ తెలిసింది. ఇదే వాడు ఆలస్యంగా రావటానికి కారణం.''



తరవాత వానరులు సంపాతిని తిరిగి పర్వతం మీదికి చేర్చారు. అక్కడ వానరప్రముఖులకు తన పాత అనుభవాలను సంపాతి ఇలా చెప్పాడు :

''నేను రెక్కలు కాలి ఈ వింధ్య పర్వతం మీద పడినప్పుడు ఇక్కడ ఒక ఆశ్రమం ఉండేది. అందులో నిశాకరుడు అనే గొప్ప మహర్షి ఉండేవాడు. ఇదంతా ఎనిమిదివేల ఏళ్ళనాటి సంగతి. పర్వతం మీద పడిపోయిన నేను అతికష్టం మీద మిట్టపల్లాలను దాటుకుంటూ ఆ మహర్షి ఆశ్రమానికి వచ్చాను. అక్కడ ఒక చెట్టు కింద మహర్షి దర్శనం కోసం వేచి ఉన్నాను. అప్పుడు నాకొక వింత కనిపించింది. దక్షిణదిశ నుంచి ఆయన స్నానం చేసి వస్తూంటే, ఆయన వెంట ఎలుగుబంట్లూ, చమరీమృగాలూ, పులులూ, సింహాలూ, ఏనుగులూ, సర్పాలూ రావటం నాకు కనబడింది. ఆయన ఆశ్రమంలోకి వెళ్ళగా అవి అన్నీ వెళ్ళిపోయాయి. లోపలికి పోతూ నన్ను చూసిన నిశాకరమహర్షి, కొంతసేపటికి తిరిగి వచ్చి, 'గద్దలకు రాజులైన ఇద్దరు అన్నదమ్ములను నేను ఎరుగుదును. అందులో నువు పెద్ద వాడైన సంపాతివి కాదూ? జటాయువు నీ తమ్ముడు కదా? మీరిద్దరూ అప్పుడప్పుడూ మనుష్యరూపాలలో నాకు కనబడి నమస్కరించే వాళ్ళు. నీ కేమైనా జబ్బుగాని చేసిందా? నీ రెక్కలు ఎందుకు పడిపోయాయి? నిన్ను ఎవరైనా శిక్షించారా?' అని అడిగాడు.

''నేను ఆ మహర్షికి జరిగినదంతా చెప్పాను. కైలాసపర్వతం మీద ఋషుల దగ్గిర నేనూ, నా తమ్ముడూ శపథం చేసి,

సూర్యుడు అస్తమించే లోపల సూర్యుడి వెనకాల ఎగిరిపోతామన్నాం. మేం చాలా ఎత్తుకు ఎగిరాం. భూమి మీద ఉన్న నగరాలన్నీ బండిచక్రాల ప్రమాణంలో కనిపించాయి. దారిలో మాకు వేదఘోష వినిపించింది; ఎర్రని చీరలుధరించి పాటలు పాడే స్త్రీలు కనిపించారు. ఇంకా ఎత్తుకు ఎగిరాం. అడవులు పచ్చిక బీళ్ళలాగానూ, పర్వతాలు చిన్న రాళ్ళలాగానూ, నదులు దారపు పోగులలాగానూ కనిపించాయి. మాకు ఆయాసంతో బాటు భయమూ, మతిచలించటమూ, దృష్టి చెదరటమూ, మూర్ఛరావటమూ లాటి లక్షణాలు కూడా కలిగాయి. దిక్కులు తెలియరాలేదు. ఆ ఎత్తున సూర్యుడూ, భూమీ ఒకే ప్రమాణంలో కనిపించారు.

"అంతలో జటాయువు స్పృహతప్పి నేలమీద పడసాగాడు. వెంటనే నేను కూడా దిగివస్తూ, జటాయువును నా రెక్కలతో కప్పాను. ఆ సమయంలో జటాయువు సూర్యుడి వేడి నుంచి తప్పించుకున్నాడు గాని, నా రెక్కలు కాలిపోయాయి. జటాయువు జనస్థానంలో పడ్డాడనుకుంటాను. ఇదంతా నిశాకర మహర్షికి చెప్పి, నాకు జీవించాలని లేదనీ పర్వతం మీది నుంచి దూకి చచ్చిపోతాననీ అన్నాను.

"ఆ మహర్షి నాకు రానున్నది చెప్పాడు. మీరు సీతను వెతుకుతూ వస్తారనీ, నేను మీకు సహాయం చేస్తాననీ, తరవాత నాకు రెక్కలు వస్తాయనీ, నన్ను ఇక్కడే ఉండమనీ ఆయన అన్నాడు."

ఇలా అంటుండగానే సంపాతికి రెక్కలు రావటం వానరులకు కనబడింది. ఆ రెక్కల ఈకలు ఎర్రగా ఉన్నాయి. సంపాతి పరమానందభరితుడై, "నిశాకర[illegible]ర్షి చెప్పినట్టే నాకు మళ్ళీ రెక్కలు వచ్చాయి. బలం తిరిగి వచ్చింది. దీన్ని బట్టి మీ ప్రయత్నం తప్పక విజయవంతమవుతుంది. నేను నా రెక్కల బలం చూసుకుంటాను," అంటూ ఆకాశంలోకి ఎగిరిపోయాడు.





# వీర హనుమాన్

సంపాతి సీత జాడ ఆ విథంగా చెప్పేసరికి వానరులు పట్టరాని ఆనందంతో చిందులు తొక్కుతూ, సింహనాదాలు చేశారు. వాళ్లు లంకకు వెళ్ళే ప్రయత్నంలో సముద్ర తీరాన్ని చేరారు. ఆ మహాసముద్రాన్ని చూడగానే వాళ్ళకు పెద్ద నిరుత్సాహం పుట్టుకొచ్చింది. అది మహాభయంకరంగా ఉన్నది. అందులో భయంకరమైన ప్రాణులున్నాయి. అది ఒక ప్రాంతంలో ప్రశాంతంగా నిద్రపోతున్నట్టు కనిపించినా, అక్కడక్కడ ఎత్తయిన తరంగాలు లేచి విరిగిపడుతూ భయపెట్టుతున్నది. దాని అవతలి ఒడ్డు కనిపించటం లేదు.

“ఇప్పుడేం చెయ్యాలి?” అని వానరులు తమనుతాము ప్రశ్నించుకున్నారు.

తన వాళ్ళందరూ సముద్రాన్ని చూసి బెదిరినట్టు గ్రహించి అంగదుడు, “భయపడకండి. భయంవల్ల ప్రయోజనం లేకపోగా అది మననే తినేస్తుంది. ఇది మన పరాక్రమం చూపవలసిన సమయం. పరాక్రమంతోగాని పని జరగదు,” అని హెచ్చరించాడు.

ఆ రాత్రికి అందరూ సముద్రతీరానే మకాం వేశారు. మర్నాడు తెల్లవారగానే అంగదుడు వానర సేనను సమావేశపరిచాడు. ఆ వానరులను సమావేశపరచగల శక్తి అంగదుడికీ, హనుమంతుడికీ తప్ప మరెవరికీ లేదు.

“మనలో ఏ మహావీరుడు ఈ సముద్రాన్ని దాటి, లంకలో ఉన్న సీతాదేవిని

**10. లంకకు హనుమంతుడి ప్రయాణం**



చూసి తిరిగి వచ్చి, సుగ్రీవుడి ఆజ్ఞ నిర్వర్తించామన్న మాట దక్కేటట్టు చేయగలడు? లంకకూ ఇక్కడికీ మధ్య నూరు యోజనాల దూరం ఉన్నది. దాన్ని దాటగల వాడే మనకు ఇళ్ళకు తిరిగి వెళ్ళే ప్రాప్తి, మన భార్యలతోనూ, బిడ్డలతోనూ సుఖంగా జీవించే ప్రాప్తి మనకు కలిగించగలడు. మనం తిరిగి వెళ్ళి, సుగ్రీవుడికీ, రామ, లక్ష్మణులకూ మన మొహాలు చూపించటానికి అతడే పుణ్యం కట్టుకోవాలి. నూరుయోజనాల సముద్రాన్ని మీలో ఎవరు దాటగలరో చెప్పండి. మా ఆరాటం తీర్చండి,'' అన్నాడు అంగదుడు వానరపరివారంతో.

ఎవరూ ఏమీ మాట్లాడలేదు. అందరూ చెక్కిన బొమ్మల్లా ఉండిపోయారు.

అది చూసి అంగదుడు తిరిగి, ''మీరంతా మేటి బలపరాక్రమాలు గల వాళ్ళు! గొప్ప పేరు ప్రఖ్యాతులూ, గొప్ప పుట్టుకలూ కలవారు; ప్రసిద్ధమైన గమనం గలవారు కదా! కనీసం మీరు ఎంతెంత దూరం దాటగలరో చెప్పండి!'' అన్నాడు.

ఈ ప్రశ్నకు కొందరు వానరవీరులు తమ తమ శక్తిసామర్థ్యాలు ఈ విధంగా వివరించారు:

గజుడు తాను పది యోజనాలు దూకగల నన్నాడు; గవాక్షుడు ఇరవైయోజనాలు దూకగల నన్నాడు; గవయుడు ముప్ఫైయోజనాలు దూకగల నన్నాడు; శరభుడు నలభైయోజనాలు దూకగల నన్నాడు; గంధమాదనుడు యాభై యోజనాలూ, మైందుడు అరవై యోజనాలూ, ద్వివిదుడు డెభ్భై యోజనాలూ, సుషేణుడు ఎనభై యోజనాలూ దూకగలమని చెప్పారు.

తరవాత జాంబవంతుడు, ''దూకటంలో నాకు పెద్ద నేర్పే ఉండేది. ఇప్పుడంటే ముసలివాణ్ణి అయిపోతిని. అయినా రామ కార్యం గనక ఒళ్ళు దాచుకోవటం తగదు. నన్ను మీరంతా దూకమంటే

తొంభై యోజనాలు నిస్సందేహంగా దూకుతాను,'' అన్నాడు.

అందరూ చెప్పిన మాటలు విన్న మీదట అంగదుడు, ''ఈ నూరు యోజనాల దూరమూ నేనే దూకగలను. తిరిగి రాగలనా అన్నదే నా సందేహం,'' అన్నాడు.

అది విని జాంబవంతుడు, ''అబ్బే, నీ శక్తి సామర్థ్యాలు మాకు తెలియవా? నూరు యోజనాలేమిటి, వెయ్యి యోజనాలు కూడా నువు అవలీలగా దూకగలవు! తిరిగి అలాగే వచ్చెయ్యగలవున్నూ! అందులో ఎలాటి సందేహమూ లేదు. కాని నువు రాజువు. అందుచేత నిన్ను పంపటానికి ఎంత మాత్రమూ వీలు లేదు. నువు మాలో ఎవరిని పంపినా పంపవచ్చుగాని, నీవై పోరాదు! నీ క్షేమం చూడటం మా అందరి బాధ్యత! నువు లంకకు వెళ్ళితే మమ్మల్ని ఎవరు చూస్తారు? మేం ఏం చెయ్యగలం?'' అన్నాడు.

దానికి అంగదుడు, ''సముద్రాన్ని నేనూ దాటక, మీలో ఎవరూ దాటలేక పోతే మనమంతా ప్రాయోపవేశంచేద్దామా? పని పూర్తి కాకుండా కిష్కింధకు తిరిగి వెళ్ళి ప్రాణాలతో ఉంటామన్న ఆశ లేదుగదా! ఆ సుగ్రీవుడు మనని తప్పక



చంపించేస్తాడు. అందుచేత, మాలో పెద్దవాడివైన నువు పని జరిగే మార్గం ఏమిటో బాగా ఆలోచించి చెప్పు!'' అన్నాడు జాంబవంతుడితో.

దానికి జాంబవంతుడు అంగదుడితో, ''పని జరిగి తీరుతుంది. ఈ పని చెయ్యగల వాణ్ణి, ఇదుగో చూపిస్తాను,'' అని, ఒక పక్కగా ఏమీ పట్టనట్టు కూర్చుని ఉన్న హనుమంతుణ్ణి సమీపించి ఇలా అన్నాడు:

''హనుమంతుడా, నువు వానర వీరులలో కెల్లా మేటివీ, సమస్త శాస్త్రాలూ చదివినవాడివీ అయి ఉండి కూడా, మాటా పలుకూ లేకుండా ఇలా కూర్చుని



ఉన్నావేమిటి? ఆ గరుత్మంతుడి రెక్కలకు ఉన్నంత బలం నీ బాహువుల కున్నది. పరాక్రమంలో నువు సుగ్రీవుడికీ, లక్ష్మణుడికీ తీసిపోవు. ఇక ఇతర ప్రాణులను నీతో పోల్చటానికే లేదు. ఈ సంగతి నీకు తెలీదా? నాయనా, నువు పుట్టుతూనే సూర్యుణ్ణి చూసి పండుగా భ్రమపడి మింగటానికి ఆకాశంలోకి ఎగిరావే, దూకటంలో నీకు సాటి ఎవరు? మా అందరికీ నీ శక్తి ఇప్పుడు చూపించు. ఈ సముద్రాన్ని దాటు.''

ఈ మాటలు వినగానే అత్యద్భుతంగా హనుమంతుడి శరీరం విపరీతంగా పెరిగిపోయింది. హనుమంతుడు సముద్రాన్ని దాటటానికి సంసిద్ధుడు కావటమూ, అతని శరీరం పెరగటమూ చూసి మిగిలిన వానరలు పరమానంధంతో అతన్ని ప్రశంసిస్తూ పెద్దగా సింహనాదాలు చేశారు.

వానరులు మెచ్చుకుంటున్న కొద్దీ హనుమంతుడు వామనుడిలాగా పెరిగిపోయాడు. అతని బలపరాక్రమాలు కూడా పెరిగాయి. అతని ముఖం ఎర్రగా, పొగ లేని నిప్పులాగా ఉన్నది.

అప్పుడు హనుమంతుడు లేచి నిలబడి, వృద్ధ వానరులకు నమస్కారం చేసి, ''నేను సముద్రాన్ని వాయువు దాటినంత సులభంగా దాటుతాను. మధ్యలో ఎక్కడా ఆగను. నేను ఉదయగిరి నుంచి సూర్యుడితో బాటే బయలుదేరి, అతని కన్న ముందే అస్తగిరి చేరి, అతనికి ఎదురుగా రాగలను. నేను ఆకాశంలో వెళ్ళే వేగానికి సముద్రం నా వెంట రాగలదు. నేను సముద్రం దాటేటప్పుడు ఆకాశంలో మేఘాలు చెల్లా చెదరవుతాయి; పర్వతాలు కంపిస్తాయి. నేను తప్పక సీతను చూసి వస్తాను. నాకు మంచి శకునాలు కనబడుతున్నాయి. అవసరమైతే లంకను మొత్తంగా పెల్లగించి, భుజానవేసుకొని వెంట తెస్తాను,'' అన్నాడు.

హనుమంతుడు ఇలా చెబుతుంటే వానరులకు ఆనందంతో బాటు ఆశ్చర్యం కూడా కలిగింది.

జాంబవంతుడు అతనితో, ''నాయనా, నువు మా అందరి బాధా పోగొట్టావు. నువు వెళ్ళే పని నెరవేరగలందులకు మేమందరమూ ధ్యానిస్తాం. మా ఆశీర్వచనాలతో నువు సముద్రాన్ని దాటు. మా అందరి ప్రాణాలూ నీ చేతిలో ఉన్నాయి,'' అన్నాడు.

''నేను పైకి ఎగిరేటప్పుడు నా పాదాల తోపుడుకు భూమి ఆగదు. అందుచేత నేను ఈ మహేంద్ర పర్వతం మీది నుంచి ఎగురుతాను,'' అంటూ హనుమంతుడు, వేగంగాపోయి ఆ పర్వతం పైకి ఎక్కాడు.

అతను పర్వతం మీదికి వెళ్ళి, ఎగిరే ముందు పర్వతాన్ని చేతులతోనూ, కాళ్ళతోనూ ఊపి చూశాడు. అచలంగా ఉండవలసిన ఆ పర్వతం చాలాసేపు కంపించిపోయి, దాని మీద వున్న చెట్లపూలన్నీ రాలిపోయాయి; రాళ్లు దొర్లాయి; పర్వతం మీది గుహలలో ఉండే జంతువులు వికృతంగా ఏడ్చాయి. పర్వతం మీద ఉండే ఋషులూ, విద్యాధరులూ పర్వతం బద్దలైపోతున్నదని భయపడ్డారు. విద్యాధరులు తమ స్త్రీలతో సహా ఆకాశంలోకి



లేచారు. వాళ్ళకు మహాకాయుడైన హనుమంతుడు కనిపించాడు.

హనుమంతుడు గాలిలోకి లేవబోతూ తన తోకను విదిలించి, చేతులు బిగబట్టి, కాళ్ళు వంచి, శ్వాస స్తంభించి, తాను పోబోయే ఆకాశ మార్గం చూసుకుని వానరులతో, ''నేను లంకకు పోతున్నాను. అక్కడ సీత కనిపించకపోతే, అక్కడి నుంచి తిన్నగా స్వర్గానికే వెళతాను. అక్కడ కూడా సీత కనబడకపోయిందో, తిరిగి లంకకు వచ్చి రావణుణ్ణి బంధించి తెస్తాను. లేదా, రావణుడితో సహా లంకనే తెస్తాను,'' అన్నాడు.



ఇలా చెప్పి హనుమంతుడు ఆకాశం లోకి ఎగిరాడు. అతనితోబాటు అనేక చెట్లు కూడా లేచాయి. అతని శరీరం నిండానూ, సముద్రం నిండానూ పూలు రాలాయి. చాచిన హనుమంతుడి చేతులు అయిదు తలల పాముల్లాగా ఉన్నాయి. అతని కళ్ళు సూర్య చంద్రులు ఒకేసారి ఉదయించినట్లుగా ఉన్నాయి. అతని తోక నిటారుగా పైకి లేచి ఉన్నది.

హనుమంతుడు అతివేగంగా పోతూంటే అతని చేతుల కిందుగా గాలి చేసే ధ్వని మేఘగర్జనలాగా ఉన్నది. అతను లంకకు చేటు కలిగించే తోకచుక్కలాగా ఉన్నాడు. అతని నీడ సముద్రం మీద అతనితో పాటు కదులుతున్నది. అతను వెళ్ళే దిక్కుగా సముద్రం తెర్లుతున్నది.

అలా వెళుతున్న హనుమంతుణ్ణి చూసి సముద్రుడు ఇలా అనుకున్నాడు: ''నేను ఈ హనుమంతుడికి సహాయం చెయ్యాలి. ఇతను ఇక్ష్వాకు కులానికి చెందిన రాముడి నిమిత్తం వెళుతున్నాడు. నన్ను ఉద్ధరించిన సగరుడు ఇక్ష్వాకు కులం వాడేగద! ఆయన పేరనే నాకు సాగరం అన్నమాట వచ్చింది గద! అందుచేత ఈ హనుమంతుడికి లంకకు పోయే మధ్య దారిలో కొంత విశ్రాంతి కలగజేస్తాను.''.

ఇలా అనుకుని సముద్రుడు మైనాకుడనే పర్వతంతో, ''మైనాకుడా, నిన్ను ఇంద్రుడు పాతాళంలోని రాక్షసులు పైకి రాకుండా మూసి ఉంచమని ఆదేశించాడు గదా! నువ్విప్పుడు నీటి అడుగు నుంచి పైకి పెరగాలి. హనుమంతుడు నువ్వుండే దారి మీదుగా ఎగిరిపోతున్నాడు. అతను నిన్ను దాటి ముందుకు వెళ్ళిపోక మునుపే, నీ బంగారు శిఖరాలను నీటిపైకి పెంచి, వాటి పైన హనుమంతుడు విశ్రమించే సదుపాయం చెయ్యి.'' అన్నాడు.

వెంటనే మైనాకపర్వతం నీటిపైకి పెరిగింది. అది, చూడటానికి, తూర్పు సముద్రంలో నుంచి పైకిలేచే సూర్యుడులాగా

ఉన్నది. ఆ పర్వతం తన దారికి అడ్డంగా పైకి పెరగటం చూసి, హనుమంతుడు తనకు ఆ పర్వతం విఘ్నం కలిగించ జూస్తున్నదనుకున్నాడు. ఈ అపోహతో హనుమంతుడు గట్టిగా హుంకరించి ఆ పర్వత శిఖరాన్ని తన రొమ్ముతో ఒక్క తోపు తోసి, పడగొట్టాడు.

అంతులేని హనుమంతుడి బలం చూసి మైనాకుడు పరవశుడై, మానవ రూపంలో పర్వత శిఖరాన ప్రత్యక్షమై, ''హనుమంతుడా! నీ బలం ఎలాటిదని చెప్పాలి? ఏ ప్రాణికీ సాధ్యంకాని విధంగా సముద్రాన్ని లంఘిస్తూ కూడా, ఏ మాత్రమూ అలసట చెందకుండా, నీ బలంతో నన్ను పడదోయగలిగావే! కొంచెంసేపు ఈ శిఖరం మీద విశ్రాంతి తీసుకో! సముద్రుడు, రాముడికి పూర్వ పురుషుడైన సగరుడి వల్లా, అతని కొడుకుల వల్లా చాలా మేలు పొందాడు. ఆ కారణంగా సముద్రుడు, రామకార్యం మీద పోతున్న నీకు, తగిన సత్కారం చేసి, సగరవంశానికి కృతజ్ఞత చూపగోరుతున్నాడు. అందుచేత నువు ఇక్కడ కొంచెంసేపు విశ్రమించి నీ దారిన వెళ్లు,'' అన్నాడు.

మైనాకుడు హనుమంతుడితో ఇంకా ఇలా అన్నాడు:

''వాయుదేవుడి కొడుకువుగా కూడా నేను నిన్ను పూజించవలసి ఉన్నది. దానికి కారణం ఉన్నది. కృతయుగంలో పర్వతాలకు రెక్కలుండేవి. అవి గాలిలో తిరిగేటప్పుడు కిందపడతాయేమోనని దేవతలూ, ఋషులూ భయపడేవారు. అది తెలిసి దేవేంద్రుడు తన వజ్రాయుధంతో అనేకవేల పర్వతాల రెక్కలను ఖండించాడు. అతను నా రెక్కలను ఖండించటానికి వస్తూండగా వాయుదేవుడు చూసి, నన్ను కాపాడటానికి దూరంగా నెట్టుకుపోయి, సముద్రంలో పడేశాడు. ఆ విధంగా నేను వాయుదేవుడికి ఋణపడి ఉన్నాను. కనక, నువు నా ఆతిథ్యం స్వీకరించు. నిన్ను చూడటం నాకు ఎంతో ఆనందంగా ఉన్నది.''






మైనాకుడు తనకు సాదరంగా ఆతిథ్యం ఇస్తానన్నందుకు హనుమంతుడు సంతోషించి, "నీ మాటలే నాకు గొప్ప ఆతిథ్యం. నీ ఆతిథ్యం నిరాకరిస్తున్నందుకు కోపించవద్దు. నేను ఈ సమయంలో ఏ మాత్రమూ జాప్యం చెయ్యరాదు. సాయంకాలం లోపుగా తిన్నగా లంకకు పోతానని మాట ఇచ్చి ఉన్నాను. మధ్యలో నేను ఆగకూడదు," అన్నాడు.

ఇలా అని హనుమంతుడు మైనాక పర్వతాన్ని చేత్తో తాకి, ఆకాశ మార్గాన ముందుకు సాగాడు. "నీకు కార్య సిద్ధి కలుగుగాక!" అని మైనాకుడూ, సముద్రుడూ హనుమంతుణ్ణి ఆశీర్వదించారు. హనుమంతుడు మైనాక పర్వతాన్ని చూస్తూ ఆకాశంలోకి ఇంకా ఎత్తుగా పోయి, ముందుకు వెళ్లాడు.

ఇది అంతా చూస్తున్న దేవతలూ, మహర్షులూ, సిద్ధులూ, దేవేంద్రుడూ మైనాకుణ్ణి మెచ్చుకుని, "మైనాకుడి అంత గొప్పవాడి ఆతిథ్యం నిరాకరించటం ఒక్క హనుమంతుడికే తగింది. లోకంలో మరెవరూ అలాచేసి ఉండరు," అనుకున్నారు.

ఇంద్రుడు మైనాకుడితో, "మైనాకుడా, నిన్ను చూసి చాలా సంతోషించాను. ఇక ఎన్నడూ నీకు నా భయం ఉండదు," అన్నాడు. ఈ మాట విని మైనాకుడు కూడా తనకు ఇంద్రుడి భయం తీరిపోయినందుకు ఎంతో సంతోషించాడు.

11. సముద్రతరణం



ఈ లోపుగా హనుమంతుడు సముద్రం మీద చాలా దూరం వెళ్లిపోయాడు. ఆ సమయంలో దేవతలూ, గంధర్వులూ మొదలైన వారికి హనుమంతుడి బలం ఇంకా ఎంత ఉన్నదో చూడాలన్న కోరిక కలిగింది. వాళ్లు సర్పాలకు తల్లి అయిన సురస వద్దకు వెళ్లి, "హనుమంతుడనే వాడు, వాయుపుత్రుడు, సముద్రం మీదిగా ఎగిరి వెళ్లుతున్నాడు. నువు పర్వతాకారం గల రాకసి రూపం ధరించి, పెద్ద కోరలూ, గోరోచనం రంగుగల కళ్లూ పెట్టుకుని, అతణ్ణి అటకాయించు. అతను నిన్ను గెలిచి ముందుకు పోతాడో, లేక భయపడతాడో చూడాలి," అన్నారు.

సురస దేవతల కోరికను పాటించి, మహా భయంకరమూ, వికారమూ అయిన శరీరం ధరించి, హనుమంతుడి మార్గానికి అడ్డంగా నిలబడి "ఓ, హనుమంతుడా, దేవతలు నిన్ను నాకు ఆహారంగా ఇచ్చారు. నిన్ను తింటాను. నా నోట ప్రవేశించు," అని నోరు తెరిచింది.

ఈ మాట విని హనుమంతుడు ముఖాన సంతోషం కనబరుస్తూ, చేతులు జోడించి, "దశరథుడి కొడుకైన రాముడు అనేవాడు, లక్ష్మణుడు అనే తమ్ముడితోనూ, సీత అనే భార్యతోనూ దండకారణ్యానికి వచ్చాడు. ఆ రాముడు కార్యాంతరము మీద ఉన్న సమయంలో రావణుడు సీతను ఎత్తుకు పోయాడు. నేను రాముడి దూతగా సీత దగ్గిరికి పోతున్నాను. అందుకు నువు కూడా సహాయపడు. లేదంటావా, సీతను చూసి, రాముడి పని పూర్తిచేసి, నేనే నీ నోటిలోకి వస్తాను. ఇది నిజం," అన్నాడు.

ఈ మాటకు సురస, "నన్నుదాటి ఎవరూ పోలేరు. అలా నాకు వరం ఉన్నది," అన్నది.

సురస నోరు తెరుచుకుని ఉన్నది. ఆ నోరు పెద్ద గుహలాగా ఉన్నది. హనుమంతుడు తన శరీరాన్ని అంగుళం ప్రమాణానికి తగ్గించి, అతి వేగంగా సురస

నోట్లోకి పోయి మళ్లీ బయటకి వచ్చి, "దక్షుడి కూతురా, నమస్కారం. నీ నోట్లోకి వెళ్లి వచ్చాను. ఇక నన్ను సీత దగ్గిరికి వెళ్లనీ," అన్నాడు.

సురస వెంటనే రాకసి రూపం మాని తన మామూలు రూపం ధరించి, "హను మంతుడా, నువు సుఖంగా వెళ్లిరా. నువు వెళ్లే పని జరుగుతుంది. సీతా రాములను తిరిగి కలుపు," అన్నది.

హనుమంతుడు తిరిగి లంక కేసి ఎగురుతూ వెళ్లాడు. అతను అలా ఆకాశంలో వెళ్లుతూండగా సముద్రంలో ఉన్న సింహిక అనే రాకసి చూసి, "ఇదేదో జంతువు నా పాలపడింది. దీన్ని తిని నా ఆకలి తీర్చుకుంటాను," అను కుని, హనుమంతుణ్ణి అతని నీడను పట్టు కుని లాగసాగింది.

ముందుకు పోయే పెద్ద ఓడను బల మైన ఎదురుగాలి వెనక్కు తోసుకు పోయినట్టుగా అయింది హనుమంతుడి పని. అతను అమిత ఆశ్చర్యంతో అన్ని పక్కలా, పైనా, కిందా చూసేసరికి, సముద్రంలో తేలుతూ ఒక మహా జంతువు కనిపించింది. దక్షిణ సముద్రంలో ఒక అద్భుత శక్తిగల జంతువు ఉన్నదనీ, అది నీడను పట్టుకుని లాగగలదనీ సుగ్రీవుడు ముందే చెప్పాడు. ఇదే



ఆ జంతువు అయి ఉంటుందని హనుమం తుడు గ్రహించాడు.

అతను తన దేహాన్ని పెంచాడు. అది చూసి సింహిక తన శరీరాన్ని పెంచి, తన నోరు హనుమంతుడి శరీరం కన్న పెద్దదిగా చేసి తెరిచి, అతన్ని కబళించ బోయింది. ఆ సమయంలో హనుమం తుడు సింహిక శరీరం లోపలి మర్మాం గాలు కనిపెట్టాడు. అతను వెంటనే తన శరీరాన్ని చిన్నదిగా చేసి, సింహిక నోటి లోకి పోయి, దాని మర్మాంగాలు చీల్చి, అది తిరిగి నోరు మూసుకునే లోపల బయిటికి వచ్చేసి, శరీరం మామూలు ప్రమాణానికి పెంచాడు. గుండె చీలి



పోయి సింహిక కళేబరం సముద్రం మీద తేలింది.

హనుమంతుడు మళ్ళీ ప్రయాణం సాగించాడు. ఇప్పుడతనికి సముద్రం అవతలి తీరమూ, చాలా దూరాన అరణ్యాలూ కనిపిస్తున్నాయి. లంకా ద్వీపమూ, మలయపర్వతం మీది వనాలూ, నదులు సముద్రంలో కలిసే ప్రదేశాలూకూడా కనబడుతున్నాయి.

అతనికి ఒక ఆలోచన వచ్చింది: తన ఈ పెద్ద దేహాన్నీ, వేగాన్నీ రాక్షసులు చూసినట్టయితే తను వచ్చిన పని పాడవుతుంది. అందుచేత అతను తన శరీరాన్ని చాలా చిన్నదిగా చేసుకున్నాడు. అతను సముద్ర తీరానగల ఒక కొండ శిఖరం మీద వాలి, దేవేంద్రుడి అమరావతికి తీసిపోని లంకానగరాన్ని చూశాడు.

లంకా నగరం త్రికూటశిఖరం మీద ఉన్నది. హనుమంతుడు లంకా నగరం కేసి పోతూ, బాగా పూచి, దట్టంగా ఉన్న చెట్లుగల పర్వత శిఖరాలనూ, ఉద్యాన వనాలనూ చూశాడు. అతనికి అనేక రకాల పూలచెట్లూ, పక్షులూ, పౌర ఉద్యానాలూ, రాజ ఉద్యానాలూ, అనేకమైన అందమైన దృశ్యాలూ కనిపించాయి.

లంకానగరం చుట్టూ అగడ్తలున్నాయి. వాటిలో తామరలూ, కలువలూ ఉన్నాయి. నగరం చుట్టూ బంగారు ప్రాకారాలున్నాయి. నగరంలోకి ఎవరూ పోకుండా సాయుధులైన రాక్షసులు కాపలా కాస్తున్నారు. చాలా ఎత్తుగా, తెల్లగా ఉన్న ఇళ్ళ మధ్యగా వీధులున్నాయి. ఎక్కడ చూసినా కోట బురుజులున్నాయి; జెండాలున్నాయి. త్రికూట శిఖరం మీద ఉన్న కారణంగా లంకానగరం ఆకాశంలో నిర్మించినట్టుగానే కనబడింది. దాన్ని నిర్మించినవాడు విశ్వకర్మ.

హనుమంతుడు క్రమంగా లంకా నగరపు ఉత్తర ద్వారాన్ని చేరుకుని, రావణుడి బలం ఎంతటిదో గ్రహించటానికి ప్రయత్నించాడు. ఈ మహా నగ



రాక్షసులంటే చాలా క్రూరులు, సామం వల్ల వారిని జయించటం సాధ్యం కాదు. సంపదలో మునిగి తేలుతున్న వాళ్ళకు దానోపాయం పని చెయ్యదు. బల గర్వం గల వాళ్ళు కావటంచేత భేదోపాయం పారదు. అతి బలం గల వాళ్ళు గనక యుద్ధానికి అవకాశం లేదు. ఇంతకూ సముద్రం దాటి ఇక్కడికి వచ్చే శక్తి నలుగురికి మాత్రమే ఉన్నది - తనకూ, అంగదుడికీ, నీలుడికీ, సుగ్రీవుడికీనూ! మరెవ్వరూ రాలేరు.

ఇలా ఆలోచిస్తున్న హనుమంతుడికి తన ఆలోచన అప్రస్తుతమని తోచింది. "ఈ ఆలోచనలన్నీ ఇప్పుడెందుకు? ముందు సీత బతికి ఉన్నదో, లేదో తెలుసుకోవాలి. బతికి ఉంటే సీతను చూడాలి. తరవాతనే ఏ ఆలోచన అయినా!" అనుకున్నాడతను.

రాన్ని జయించటం ఎవరితరం? ఒకప్పుడు ఇది కుబేరుడిది, కాని ఈ నాడు కుబేరుడు కూడా ఇందులో ప్రవేశించలేడు. గుహకు పాములు కాపలా ఉన్నట్టు, ఈ నగరానికి సాయుధులైన రాక్షసులు కాపలా ఉన్నారు; దానికి రక్షగా దాటరాని సముద్రం ఉన్నది. వానరులు సముద్రాన్ని దాటి ఇక్కడికి రావటమే అసాధ్యం; ఒక వేళ వచ్చినా ప్రయోజనం ఉండదు. ఎందుకంటే, ఈ లంకను దేవతలు కూడా జయించలేరు. రాముడు ఎంత పరాక్రమ వంతుడైతేమాత్రం ఏం లాభం? లోపలికి పోవటమే అసాధ్యమైన ఈ లంకా నగరంలో రాముడు ఏం చెయ్యగలడు?

అతని మొదటి సమస్య లంకానగరం ప్రవేశించటం. మరీ పెద్ద శరీరంతో ప్రవేశిస్తే రాక్షసులకు అతను దొరికి పోతాడు. మరీ చిన్న శరీరమైతే లంక అంతా కలయ దిరగటం చాలా కష్టమవుతుంది. అందుచేత హనుమంతుడు తన శరీరాన్ని అంత పెద్దదీ, మరీ చిన్నదీ కాకుండా చేసుకుని, రాత్రివేళ లంక అంతా తిరగ నిశ్చయించాడు. సీతను చూచేలోపల

అతను రాక్షసులకు దొరికి పోవటం ప్రమాద కరం; వాళ్ళు అతన్ని తీసుకు పోయి రావణుడి ముందు పెడతారు. రావణుడు దూత అని మన్నించి, వదిలే వాడు కాడు.

అందుచేత హనుమంతుడు సూర్యుడు అస్తమించేదాకా వేచి ఉండి, తన శరీ రాన్ని పిల్లి ప్రమాణానికి తగ్గించుకుని, చూడటానికి వింతగా కనిపించాడు. అతను మామూలు కోతిలాగే దూకుతూ, లంకా నగరం సమీపించాడు.

నగరంలో వీధులన్ని తీర్చి దిద్దినట్టుగా ఉన్నాయి. ఇళ్ళకు చక్కని ప్రాకారా లున్నాయి. వెండి స్తంభాలూ, బంగారు స్తంభాలూ ఉన్నాయి; బంగారు పూత గల కిటికీలున్నాయి. మేడలు ఏడెనిమిది అంతస్తులు గలవి. నగరంలో ఎక్కడ చూసినా స్ఫటికంతోనూ, మణులతోనూ చేసిన అలంకరణలున్నాయి. లంకా నగరం గంధర్వ నగరంలాగున్నది. భయంకరులైన రాక్షసుల రక్షణలో ఉన్న ఆ నగరాన్ని వానరులు ఎలా జయిస్తారో హనుమంతుడికి అంతుబట్టలేదు. సీతను చూడబోతున్నానన్న సంతోషంలో అతను ఈ విచారాన్ని మరిచిపోయాడు.

అంతలో చంద్రోదయమయింది. లంక స్త్రీరూపంలో, భయంకరాకారంతో హను



మంతుడి ముందు ప్రత్యక్షమై, "ఎవరు నువు? ఎందుకు ఇక్కడికి వచ్చావు? నీవంటి కోతి ఈ లంకానగరంలోకి అడుగు పెట్టరాదు," అన్నది.

దానికి హనుమంతుడు, "నీకు కావలి సినదంతా చెబుతాను. ముందు నువు ఎవతెవో చెప్పు. నగరద్వారం దగ్గిర నన్ను అటకాయించి ఎందుకు బెదిరిస్తున్నావు?" అని అడిగాడు.

"మహా పరాక్రమశాలి అయిన రావ ణుడి కింకరిని నేను. రావణుడి ఆజ్ఞచేత నేను లంకాపట్టణాన్ని రక్షిస్తున్నాను. నన్ను జయించి ఎవరూ ఈ నగరంలోకి పోలేరు. నిన్నిప్పుడే చంపేస్తాను. నేనే ఈ

లంకను. ఇక నీ సంగతి చెప్పు," అన్నది లంక కోపంగా.

"నాకు లంకా నగరం చూడాలని పించి ఇలా వచ్చాను," అన్నాడు హనుమంతుడు.

"నన్ను జయించి గాని నువు లంకా నగరాన్ని చూడలేవు," అన్నది లంక.

"నేను నగరం చూసి నా దారిన వెళ్లిపోతాను. ఇంకేమీ చెయ్యను," అన్నాడు హనుమంతుడు.

లంక భయంకరంగా అరిచి, హనుమంతుణ్ణి చేత్తో కొట్టింది. హనుమంతుడు మరింత భయంకరంగా అరిచి, ఎడమ చేతి పిడికిలితో లంకను పొడిచాడు. ఆ దెబ్బకే లంక విలవిలా తన్నుకుంటూ కింద పడి, "అయ్యో, నన్ను చంపకు. నువు చాలా బలంగలవాడివి. నన్ను ఒక కోతి జయించిన నాడు రాక్షసులకు ప్రమాదమని బ్రహ్మ ఒకప్పుడు చెప్పాడు. రావణుడు సీతను తీసుకురావడం వల్ల ప్రమాదం రానున్నట్టు కనబడుతుంది. వెళ్ళి, నగరమంతా నీ యిష్టం వచ్చినట్టు తిరుగు," అన్నది.

తరవాత హనుమంతుడు నగరంలోకి ద్వారంకుండా ప్రవేశించక, శత్రువుకు తగినట్టుగా ప్రాకారం మీది నుంచి దూకి, ఎడమకాలు ముందు నగరంలో పెట్టాడు. అతడు రాజవీధి వెంబడి పోతూంటే, సంగీత వాద్యాల ధ్వనులూ, మనుషులు నవ్వుతున్న ధ్వనులూ వినిపించాయి. ఇళ్ళు చాలా ఎత్తుగా, మణులతోనూ, పుష్పమాలలతోనూ అలంకరించి, ఎంతో అందంగా ఉన్నాయి. ఆడవాళ్ళు మద్యం తాగి, మూడు స్థాయిలలోనూ మనోహరంగా పాడుతున్నారు. కొందరు రాక్షసుల ఇళ్ళ నుంచి వేదపఠనం వినిపిస్తున్నది. కొందరు రాక్షసులు గట్టిగా అరుస్తున్నారు. వీధులలో అక్కడక్కడా రాక్షస సైనికులు కూడి ఉన్నారు.

"ప్రవేశించరాని లంకలో ప్రవేశించాను. సీతను తప్పక చూస్తాను," అనుకున్నాడు హనుమంతుడు.






హనుమంతుడు లంకానగరంలోకి పోతూంటే అతనికి రకరకాల రాక్షసులు కనిపించారు. యజ్ఞదీక్షలో ఉన్నవాళ్ళూ, జడలు ధరించినవాళ్ళూ, తలలు గొరిగించుకున్నవాళ్ళూ, ఎద్దుతోలు కట్టుకున్నవారు, అభిచారహోమాలు చేసి శత్రువుల మీద చేతబడి చేసేవాళ్ళూ, రకరకాల ఆయుధాలు పట్టుకుని తిరిగేవారూ, వికారాకారులూ, పొట్టివాళ్ళూ, నల్లగా ఉండేవారూ, చేటల్లాటి చెవులుగలవాళ్లూ, అందంగా ఉన్నవాళ్ళూ, ధ్వజాలు పట్టుకు తిరిగేవాళ్లూ లంకలో ఉండటం హనుమంతుడు చూశాడు.

రాత్రి గడుస్తున్నది. ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. హనుమంతుడు రావణుడు ఉండే ప్రాసాదంలోకి ప్రవేశించాడు. స్త్రీలు పాడుతున్నారు. కొందరు తమ శరీరాలకు చందనలేపాలు పూసుకుంటున్నారు. కొందరు స్త్రీలు పురుషులతో విహరిస్తున్నారు. కొందరు అప్పుడే నిద్రపోతున్నారు.

తనకు కనిపించే స్త్రీలలో మనుష్యస్త్రీ అయిన సీత ఎక్కడన్నా కనబడుతుందేమోనని చాలా శ్రద్ధగా చూశాడు, కాని అతనికి సీతలాటి స్త్రీ ఎక్కడా కనిపించలేదు. హనుమంతుడికి దిగులు పట్టుకున్నది. అతను కామరూపికనక, అనుకూలమైన రూపం ధరించి లంక అంతా చెడ తిరిగి, మళ్ళీ రావణుడి గృహానికి వచ్చాడు.

12. సీతా సందర్శనం



రావణుడి ఇల్లు హనుమంతుడికి అద్భుతంగా కనబడింది. దాన్ని వెండితో నిర్మించి బంగారు అలంకరణలు చేశారు. దానికి రంగురంగుల తోరణాలున్నాయి. వాకిళ్ళు చక్కని అలంకరణలు కలిగి ఉన్నాయి. మేలుజాతి ఏనుగులూ, గుర్రాలూ ఉన్నాయి. మహా శూరులైన రాక్షసులు ఆ ఇంటికి కాపలా కాస్తున్నారు. స్త్రీలూ, పురుషులూ అటూ ఇటూ తిరుగుతున్నారు. వాతావరణం చాలా సందడిగా ఉన్నది. అంతటా సుఖ. సౌఖ్యాలు తాండవిస్తున్నాయి. ఆ ఇల్లు ఇంద్రభవనం లాగా ఉండి, లంకానగరానికి ఒక గొప్ప అలంకారంగా ఉన్నది.

హనుమంతుడు రావణుడి భవనం అంతటా తిరగసాగాడు. ఆ భవనంలో మంచాలూ, బల్లలూ, ఆసనాలూ, పాత్రలూ అన్నీ బంగారంతో చేసినట్టు కనిపించాయి. మణులు పొదిగిన కిటికీలలో పక్షుల పంజరాలున్నాయి. హనుమంతుడికి పుష్పకవిమానం కూడా కనబడింది. అది మొదట కుబేరుడిది. అందులో కొండలూ, భూమీ, పూలచెట్లూ, పద్మాలుగల కోనేరులూ చిత్రించి ఉన్నాయి. అది చాలా పెద్ద విమానం. అందులో ఎంతమందికైనా చోటు ఉంటుందట. ఏ ఇంటికన్నా కూడా పెద్దదిగా ఉన్న ఆ పుష్పక విమానం చూసి ఆశ్చర్యపడి, హనుమంతుడు రావణుడి భవనం కలయతిరగసాగాడు. ఎంత తిరిగినా ఆ భవనాన్ని పూర్తిగా చూసినట్టు హనుమంతుడికి తోచలేదు. అతనికి సీత మాత్రం ఎక్కడా కనపడలేదు.

రావణుడి భవనంలోగల అన్ని మందిరాలూ తిరిగి, హనుమంతుడు రావణుడి భార్యలు ఉండే అంతఃపురంలో ప్రవేశించాడు. రావణుడి స్త్రీలలో రాక్షస స్త్రీలూ, రావణుడు తన పరాక్రమంతో తెచ్చిన రాజకన్యలూ, అతన్ని వలచి వచ్చిన వారూ ఉన్నారు. అంతటా దీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి.



రావణుడి అంతఃపురంలో అనేకమంది స్త్రీలు నిద్రావస్థలో ఉన్నారు. వాళ్ళు చిత్ర కంబళాల మీద, రకరకాల బట్టలూ, నగలూ, పూలమాలలూ ధరించి పడుకుని ఉన్నారు. అప్పటికి అర్థరాత్రి గడిచి ఉండటంచేతా, అందరూ బాగా తాగి వుండటంచేతా ఎక్కడ కూర్చుండినవారు అక్కడే రకరకాల భంగిమలలో ఒళ్ళు మరిచి నిద్రిస్తున్నారు.

హనుమంతుడు శ్రద్ధగా అందరి ముఖాలలోకి చూశాడు. అతను మంచం మీద నిద్రపోతున్న రావణుణ్ణి కూడా చూశాడు. రావణుడి చేతులు అయిదు తలలుగల మహాసర్పాలలాగున్నాయి. అతని శరీరానికి రక్తచందనం పూసి ఉన్నది. పెద్ద శరీరం గలిగి అతను పడుకున్న పర్వతం లాగున్నాడు. అతని శరీర మంతటా ఆభరణాలున్నాయి.

రావణుడి లాగే, అతని భార్య మండోదరి కూడా వేరే ఒక మంచం మీద పడుకుని ఉన్నది. ఆమె అందచందాలూ, యౌవనమూ చూసి హనుమంతుడు, ఆమె సీత అయివుంటుందనుకుని చాలా సంతోషించాడు.

కాని మరుక్షణమే అతని ఆనందం మాయమయింది. రాముణ్ణి విడిచిన సీత అలంకరించుకుంటుందా? ఆమెకు నిద్రా హారాలుంటాయా? ఆమె పరపురుషుడికి భార్య అవుతుందా? తాను చూసినది సీత కాదని హనుమంతుడు నిర్ణయించుకున్నాడు. అతను అక్కడినుంచి కదిలాడు.

హనుమంతుడు సీత కోసం ప్రతి పొదరిల్లూ, ప్రతి చిత్రశాలా వెతికాడు. అతనికి ఒక అనుమానం వచ్చింది: సీత చచ్చిపోయి ఉంటుందా? తనకు లోబడలేదని రావణుడు ఆమెను చంపేసి ఉంటాడా? లేక ఈ వికారాకారలైన రాక్షసస్త్రీలను చూసి సీత ప్రాణాలు పోయి ఉంటాయా? సుగ్రీవుడు పెట్టిన గడువు తీరిపోయి ఎంతో కాలమయింది గదా, సీతను చూడకుండా



ఎలా తిరిగిపోవటం? తాను ఇలాగే తిరిగి పోతే, "నువు ఎందుకు వెళ్ళి వచ్చినట్టు?" అని అందరూ తనను అడగరా? తను ఏమని చెప్పాలి?

ఏమైనా చింతిస్తూ కూర్చోవటం వల్ల ఫలం ఉండదనుకుని హనుమంతుడు దూర ప్రదేశాలు వెతకటానికి బయలు దేరాడు. అతను ఎత్తులు ఎక్కాడు, లోతులు దిగాడు, పాతాళ గృహాలు ప్రవేశించాడు, అడవులూ, బావులూ వెతికాడు. అతనికి ఎందరెందరో రాక్షస స్త్రీలు కనిపించారుగాని, సీత మాత్రం కనబడ లేదు. అందగత్తెలు కనిపించినప్పుడల్లా అతనికి ఆశ కలిగేది; వాళ్ళు సీత కారని తెలియగానే విచారం పట్టుకునేది. సీత, రావణుడు తీసుకువస్తూ ఉండగానే మధ్యదారిలో పడిపోయిందేమో? భయపడి సముద్రంలో పడిపోయిందేమో? లేక రాముడి కోసం మనోవేదనపడి చచ్చిపోయిందో?

సీతను తాను చూడలేని పక్షంలో హనుమంతుడు సముద్రతీరాన చితి పేర్చుకుని, కాలి పోవటానికి సిద్ధపడ్డాడు. అలా కాకుండా రావణాసురుణ్ణి చంపేస్తే తగిన ప్రతిక్రియ అవుతుందని అతనికి తోచింది. లేకపోతే రావణుణ్ణి యజ్ఞపశువు లాగా పట్టుకుని తీసుకుపోయి రాముడి ముందు పెట్టవచ్చు!

ఇలా అనుకుంటున్న హనుమంతుడికి దూరంగా, ఎత్తయిన చెట్లుగల వనం ఒకటి కనబడింది. అది అశోకవనం. హనుమంతుడు ఆ వనాన్ని ఇంకా వెతకలేదు. దాని జాడ కూడా అతనికి ఇప్పుడే తెలిసింది. అక్కడకూడా సీత కోసం వెతకటానికి హనుమంతుడు నిశ్చయించుకున్నాడు.

అతను అతివేగంగా దూకుతూ అశోకవన ప్రాకారం చేరాడు. అతను తన దేహాన్ని మరింత చిన్నదిచేసి, ఆ వనంలో రకరకాల చెట్లు చూశాడు. అప్పుడే ఆరంభమవుతున్న వసంతకాలం కారణంగా



సాలవృక్షాలూ, అశోకవృక్షాలూ, చంపక వృక్షాలూ, ఉద్దాలక వృక్షాలూ, నాగ వృక్షాలూ, మామిడి చెట్లూ, కపిముఖాలు అనే చెట్లూ, చక్కగా పూతపట్టి ఉన్నాయి. అనేక వృక్షాలకు లతలు పెనవేసుకుని ఉన్నాయి.

ప్రాకారం మీద కూర్చుని ఉన్న హనుమంతుడు చెట్లలోకి బాణంలాగా దూకి, చెట్లమీదుగా పోసాగాడు. చెట్ల మీద నిద్రపోతున్న పక్షులు కలవర పడుతూ లేచి, అరిచాయి. చెట్లమీది పూలు అతని శరీరం నిండా పడ్డాయి. అతనికి ఆ అశోకవనంలో కోనేరులూ, తిన్నెలూ, వెండి బంగారాలతో అలంకారార్థం తయారుచేసిన కృత్రిమవృక్షాలూ కని పించాయి.

అశోక వనంలో ఒక క్రీడా పర్వతం కూడా ఉన్నది. దానిమీద ఎత్తయిన వింత శిఖరాలూ, అనేక రాతి ఇళ్ళూ, చెట్లూ ఉన్నాయి. దానిమీది నుంచి ఒక నది లాంటిది కిందికి ప్రవహిస్తున్నది. వనంలో ఒక దిగుడు బావి ఉన్నది. దానిచుట్టూ ఎత్తయిన మేడలున్నాయి, బంగారు తిన్నెలున్నాయి.

హనుమంతుడు దట్టమైన ఆకులుగల చెట్టు మీద కూర్చుని చుట్టూ కలయ జూశాడు. కొంత దూరంలో అతనికి తెల్లగా ఒక చైత్యప్రాసాదం కనిపించింది. ఆ అద్భుతప్రాసాదానికి వెయ్యిస్తంభా లున్నాయి. ఆ ప్రాంతంలోనే హనుమంతు డికి సీత కనబడింది.

ఆమె చిక్కి శల్యమై ఉన్నది. మాసి పోయిన పసుపు పచ్చ చీర ధరించి ఉన్నది. గొప్ప విచారంలో, కన్నీరు కార్చుతూ ఉన్నది. ఆమె చుట్టూ రాక్షస స్త్రీలు ఉన్నారు. రావణుడు ఎత్తుకుపోయి నప్పుడు హనుమంతుడు ఆమెను చూశాడు. ఆ పోలికలు కొన్ని కనిపిస్తూ న్నప్పటికీ, ఆమెలో మార్పు చాలా ఉన్నది. ఆమె ఋశ్యమూక పర్వతం మీద కొన్ని నగలు పడేసింది. అలా పడవెయ్యని

ఆభరణాలను రాముడు వర్ణించి చెప్పాడు. వాటిని హనుమంతుడు గుర్తించగలిగాడు. అంతేగాక ఆమె పడవేసిన ఆభరణాల స్థానంలో ఇప్పుడామెకు ఏ ఆభరణాలూ లేవు. గుర్తించటం ఎంత కష్టంగా ఉన్నా, ఈమె సీతే అయి ఉండాలని హనుమంతుడు నిశ్చయించుకున్నాడు. అతనికి అమితమైన ఆనందం కలిగింది. తాను రాక్షసస్త్రీల కంట పడకుండా ఉండటానికి గాను ఎత్తుగావుండి ఆకులతో గుబురుగా వున్న కొమ్మల చాటున దాగివుండి, సీతనూ, ఆమెను చుట్టుముట్టి ఉన్న రాక్షసస్త్రీలనూ శ్రద్ధగా గమనించాడు.

రాత్రి చాలావరకు గడిచి పోయింది. రాక్షసులు వేదాధ్యయనం ప్రారంభించటం హనుమంతుడికి వినిపించింది. అదే సమయంలో మంగళవాద్యాలు మోగాయి. రావణుడు మేలుకున్నాడు. మేలుకుంటూనే అతనికి సీత జ్ఞాపకం వచ్చింది. అతను వెంటనే అలంకరించుకుని అశోక వనానికి బయలుదేరి వచ్చాడు. అతని వెంట నూరుమంది దేవతాస్త్రీలూ, గంధర్వ స్త్రీలూ వచ్చారు. కొందరు స్త్రీలు బంగారు దివిటీలు పట్టుకున్నారు. మరి కొందరు చామరాలూ, విసనకర్రలూ పట్టుకున్నారు. కొందరు స్త్రీలు కత్తులు పట్టుకుని అతని వెనుక నడిస్తే, మరి కొందరు బంగారు పాత్రలలో నీరు తీసుకుని అతని ముందు నడిచారు. ఒకతె రావణుడికి గొడుగు పట్టింది.



ఆడవాళ్ళు నడిచేటప్పుడు కలిగే నూపురధ్వని హనుమంతుణ్ణి అటుకేసి ఆకర్షించింది. దీపాల వెలుతురులో అతను రావణుణ్ణి చూశాడు. రావణుడు ఏం చేస్తాడో చూడాలన్న కోరికతో అతను తాను కూర్చుని ఉన్న చెట్టుకొమ్మ మీది నుంచి కింది కొమ్మకు దిగి, తాను ఇతరులకు కనబడకుండా ఆకు గుబురులచాటున మళ్ళీ దాగి, శ్రద్ధగా చూడసాగాడు.

రావణుడు తిన్నగా వచ్చి సీత సమీపంలో ఆగాడు.

సీత రావణుణ్ణి దూరానేచూసి వణికిపోయింది. ఆమె కాళ్ళు ముడుచుకుని, రొమ్ముకు చేతులు అడ్డం పెట్టుకుని ఏడుస్తూ కూర్చున్నది. ఆమె తనకెవరైనా అడ్డపడతారా అన్నట్టు నాలుగు దిక్కులా చూసింది.

మూర్తీభవించిన శోకదేవతలాగున్న సీతతో రావణుడు ఇలా అన్నాడు:

"సీతా, నన్నుచూసి భయపడి ఎందుకు అలా ముడుచుకు పోతావు? నీ అందం చూసి మోహించాను. నన్ను స్వీకరించు. నీకు ఇక్కడ నా భయంగాని, ఇతరుల భయంగాని ఏ మాత్రమూ లేదు. నీకు నా మీద ప్రేమకలగలేదు, అందుచేత నేను నిన్ను తాకను. దుఃఖించకు. మాసిన బట్టతో, ఉపవాసాలుంటూ, తల దువ్వుకోకుండా ఇలా ఉండటం నీకు తగదు. నన్ను స్వీకరించి, పూలమాలలు ధరించు, మంచి నగలు పెట్టుకో, మేలైన మద్యాలు తాగు, మంచి మంచాలమీద పడుకో, ఆట పాటలతో కాలం గడుపు. సుఖంగా ఉండు. నీ యవ్వనం వృథాకానీకు. నీ వంటి సుందరి సృష్టిలో లేదు. నేను పరపురుషుణ్ణి అనే భ్రమ వదులుకో. నిన్ను నా పట్టమహిషిగా చేస్తాను. నీ దాసుణ్ణిగా ఉంటాను. నీకు ఏం కావాలన్నా నన్ను ఆజ్ఞాపించు. అడవులపాలైన ఆ రాముడు నీ కెందుకు? అతనింకా బతికి ఉన్నాడన్న ఆశలు పెట్టుకోకు. అతను నిన్ను చూడటానికైనా యిక్కడికి రాలేదు."





# వీర హనుమాన్

రావణుడు అలా అన్న మీదట సీత భయంతో వణుకుతూ, ఏడుపు గొంతుతో, ఒక గడ్డిపోచను చేత బట్టుకుని, దానితో ఇలా అన్నది :

"నువు నన్ను గురించి ఆలోచించకు. పాపికి ఉత్తమలోకం ఎంత అసాధ్యమో, నేను నీకు అంత అసాధ్యమైన దాన్ని. నేను గొప్పకులంలో పుట్టిన పుణ్యాత్మురాలిని. తప్పుడు పనులు చేసే దాన్ని కాను. పతివ్రతను. నేను పరపురుషుడి భార్యను. నీ భార్యలు ఎలా ఉండాలని కోరుకుంటావో ఇతరుల భార్యలూ అలాగే ఉండాలనుకో. నీకు బుద్ధి చెప్పేవారు లేక ఇలాటి బుద్ధులు అవలంబించావు. లేదా, వినాశకాలం వచ్చి, వాళ్ళమాటలు నువు వినటం లేదో! నీ మూలాన ఈ లంక త్వరలో నాశనం అవుతుంది. అప్పుడు ప్రజలందరూ సంతోషిస్తారు. నాకు నీ అంతఃపురమూ, అధికారాలూ, సంపదా అవసరం లేదు. నేను రాముడికి మాత్రమే తగిన భార్యను. క్షేమంగా ఉండగోరితే ఆ రాముడితో మైత్రి చేసుకో. అతను ఉదారుడు గనక నీ తప్పు క్షమించి వదిలిపెడతాడు. నేను కూడా నీ పక్షాన మాట్లాడతాను. చిత్తశుద్ధితో నన్ను రాముడికి తిరిగి ఇచ్చెయ్యి. జనస్థానంలో రాముడు నీ వాళ్లనందరినీ చంపటం చూసి, దొంగతనంగా నన్ను తీసుకు వచ్చిన పిరికివాడివి, అధముడివి! నిన్ను రామలక్ష్మణులు అవలీలగా చంపగలరు."

## 13. త్రిజటకలలు



ఈ మాటలకు రావణుడికి చాలా కోపం వచ్చింది. అతను సీతతో ఇలా అన్నాడు :

"సీతా, నువు అన్న ప్రతి మాటకూ నేను నిన్ను చంపవచ్చు. కాని నీ మీద గల మోహం నా కోపాన్ని అణచిపెట్టుతున్నది. నేను నీ కిచ్చిన గడువులో ఇంకా రెండుమాసాలు మిగిలిఉన్నాయి. ఆ తరవాత నువు నా భార్య వవుతావు. అందుకు ఒప్పుకోకపోతే నిన్ను చంపి, వండించుకుని తినేస్తాను."

రావణుడు ఇలా క్రూరంగా సీతతో మాట్లాడి నందుకు అతని వెంట ఉన్న రాక్షసస్త్రీలు కొందరు నొచ్చుకుని, తమ కళ్ళతో సీత పట్ల సానుభూతి చూపారు. రావణుడు అక్కడవున్న భయంకరాకారాలుగల రాక్షసస్త్రీలతో, "ఈ సీత మనసు నా మీదకు మళ్ళేటట్టు చెయ్యండి. సామదాన భేద దండోపాయాలన్నీ ప్రయోగించి చూడండి," అన్నాడు.

అప్పుడు రావణుడి భార్యలందరిలోకీ చిన్నదైన ధాన్యమాలిని అనే రాక్షసస్త్రీ రావణుణ్ణి కౌగలించుకుని, "నీకు నేనున్నాను గదా? రాక్షసరాజువైన నీకు ఈ మనుష్య స్త్రీ దేనికి? నీకు భార్య అయే గీత ఈవిడకు బ్రహ్మదేవుడు రాసిపెట్టలేదు. అందుకే నిన్ను నిరాకరిస్తున్నది. ఇష్టంలేని మనిషిని కోరి ఏం ప్రయోజనం? నీ కోసం పడిచచ్చేదాన్ని నేనున్నాను గద!" అన్నది.

రావణుడు ధాన్యమాలిని మాటలకు నవ్వుతూ ఆమెను విడిపించుకుని, వెనక్కు తిరిగి, తన యింటికి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళగానే రాక్షస స్త్రీలు సీత చుట్టూ చేరి, ఆమెను నిందించారు. వారిలో ఏకజటా, హరిజటా, ప్రఘసా, వికటా, దుర్ముఖీ అనేవాళ్ళున్నారు. రావణుడు ఎంత గొప్పవాడో, అతనికి భార్యకావటం ఎంత గొప్పవిషయమో, సీత అతన్ని నిరాకరించటం ఎంత బుద్ధి తక్కువో వివరించి చెప్పారు.

సీత వాళ్ళతో, "ఇలా మాట్లాడటం పాపమని మీకు తెలీదా? మీరందరూ కలిసి నన్ను పీక్కుతిన్నా నాకు సమ్మతమే గాని, నేను రావణుడికి భార్యను మాత్రం కాను," అన్నది.

అప్పుడు రాకసస్త్రీలు సీతను భయ పెట్టసాగారు. వాళ్ళు అనే మాటలన్నీ చెట్టు మీద ఉన్న హనుమంతుడు వింటూనే ఉన్నాడు. సీత రాకసస్త్రీలతో సహా వచ్చి, హనుమంతుడు ఎక్కి ఉన్న శింశుపా వృకం కిందనే కూర్చున్నది.

అప్పుడు వినత అన్నే రాకసి సీతతో, "నువు చాలా గుణవంతురాలివి. పతి వ్రతవు. అది ఎంతో మెచ్చుకోదగిన సంగతి. కాని దేనికైనా ఒక మితి ఉండాలి. రావణుడు అందగాడూ, పరాక్రమవంతుడూ, రాకసులకు రాజూనూ. అతనికి భార్యవై చక్కగా అలంకరించుకో, సుఖపడు. రాముడు దుఃఖజీవి. రావణుడితో శత్రుత్వం పెట్టు కుని బతకలేడు. అతనిమీద ఆశ వదులుకో," అన్నది.

"మేమంతా నీ మేలుకోరే చెబు తున్నాం. మా మాటలు ఎందుకు వినవు? నీ యౌవనం శాశ్వతమనుకుంటున్నావా? నిన్ను చంపేసి తినేస్తాం!" అన్నారు రాకసస్త్రీలు.



"ముందు సీతను చంపి తరవాత, రావణుడితో సీత చచ్చిందని చెబుదాం. రావణుడు, అలా అయితే తినెయ్యండి, అంటాడు. ఈవిడ మాంసాన్ని అందరికీ సమానంగా పంచండి. లేకపోతే తరవాత కీచులాడుకోవలిసివస్తుంది," అని రాకస స్త్రీలు తమలో తాము మాట్లాడుకున్నారు.

వాళ్ళ మాటలు వింటూ సీత అమి తంగా దుఃఖించింది; రామలక్ష్మణులనూ, కౌసల్యా, సుమిత్రలనూ తలచుకుని ఏడ్చింది; తనకు చావు రానందుకు విచారించింది.

అంతవరకూ పడుకుని ఉండిన త్రిజట అనే ముసలి రాకసి మిగిలిన రాకస



సముద్ర మధ్యంలో శ్వేతపర్వతం మీద నిలబడి ఉన్నది. ఆమె రాముణ్ణి చేరుకున్నది. తరవాత రాముడు లక్ష్మణుడితో సహా కొండంత ఏనుగు మీద ఎక్కి లంకలో తిరగటం చూశాను. తరవాత సీతా రామ లక్ష్మణులు ఏనుగు మీద లంకకు పైగా కనిపించారు. చివరకు రాముడు సీతనూ, లక్ష్మణుణ్ణీ తీసుకుని పుష్పకవిమానం మీద ఉత్తరంగా వెళ్లటం కనిపించింది. రావణుడు గన్నేరు పూల మాలలు ధరించి, ఒళ్ళంతా నూనె పూసుకుని, నూనె తాగుతూ కైపెక్కి, నేలమీద పడినట్టు చూశాను. ఇంకోసారి రావణుడు పుష్పకం నుంచి కిందపడ్డట్టూ, నెత్తిమీద వెంట్రుకలు లేనట్టూ, నల్ల బట్టలు కట్టుకున్నట్టూ, ఎవరో ఆడది అతన్ని ఈడ్చుకు పోతున్నట్టూ చూశాను. రావణుడు గాడిదనెక్కి దక్షిణంగా పోవటం కూడా చూశాను. ఇంకోసారి అతను భయపడి, గాడిద మీది నుంచి తలకిందులుగా పడడం కనిపించింది. ఒక స్త్రీ ఎర్రనిబట్టలు కట్టుకుని, ఒళ్లంతా బురద పూసుకుని, రావణుడి మెడకు తాడు కట్టి దక్షిణంగా ఈడ్చుకుపోయింది. కుంభకర్ణుడు కూడా ఇలాగే కనిపించాడు. రావణుడి కొడుకులందరూ నూనెతో అభిషేకాలు చేసుకున్నట్టు కనబడ్డారు.

స్త్రీలతో, "మీరంతా ఆ సీతను ఏం తింటారు? నన్ను తినండి. నాకు ఒక భయంకరమైన కల వచ్చింది. రాకసులకు నాశమూ, రాముడికి జయమూ కలుగుతాయట," అన్నది.

"ఏమిటా కల?" అని రాకసస్త్రీలు త్రిజటను అడిగారు.

తూర్పు తెల్లవారుతూండగా త్రిజట తన కలను వాళ్ళకు ఈ విధంగా చెప్పింది: "రాముడు తెల్లని పూలదండలూ, తెల్లని బట్టలూ కట్టుకుని, లక్ష్మణుడితో సహా, ఆకాశమార్గాన ఒక పల్లకీ ఎక్కి లంకకు వచ్చాడు. దాన్ని వెయ్యి హంసలు తెచ్చాయి. ఈ సీత తెల్లని బట్టలు ధరించి,



రావణుడు పందినీ, ఇంద్రజిత్తు మొసలినీ, కుంభకర్ణుడు ఒంటెనూ ఎక్కి దక్షిణంగా పోవటం కనిపించింది. ఒక్క విభీషణుడు మాత్రం తెల్ల పూలమాలలూ, తెల్ల బట్టలూ, ఒంటికి తెల్ల గంధమూ ధరించి, తన నలుగురు మంత్రులతో సహా నాలుగు దంతాలుగల పెద్ద ఏనుగు మీద కూర్చుని కనిపించాడు. లంకానగరం విరిగి సముద్రంలో పడటం కనిపించింది."

ఇలా చాలాసేపు తనకు వచ్చిన కలలో విశేషాలు రాక్షసస్త్రీలకు చెప్పి, త్రిజట, "మీరు దూరంగా ఉండండి. రాముడికి సీత దొరికిందే అనుకోండి. సీతతో చెప్పేదేదో మంచిగానే చెప్పండి. మనం సీత నుంచి అభయం కోరటం మంచిదనుకుంటున్నాను." అన్నది.

చెట్టు మీది నుంచి అంతా చూస్తూ, అంతా వింటున్న హనుమంతుడికి సీతను ఎలా ఓదార్చాలో తెలియలేదు. ఆమెతో మాట్లాడకుండా తిరిగి వెళ్ళటం అర్థం లేనిపని. రాక్షసస్త్రీలకు అనుమానం కలిగించి, రాక్షసవీరులతో యుద్ధం తెచ్చుకోవటం అవివేకం! యుద్ధంలో జయమే కలుగుతుందని చెప్పటానికి లేదు; ఒకవేళ తాను రాక్షసులను చంపినా, తిరిగి సముద్రాన్ని దాటేశక్తి మిగలకపోవచ్చు. సీత తనను మాయారూపంలో ఉన్న రాక్షసుడని భయపడకుండా చూడాలి.

అన్నివిధాలా ఆలోచించి, హనుమంతుడు యిలా ఒక కథ, సీతకు వినిపించేలాగా, చెప్పాడు:

"దశరథుడు అనే గొప్ప రాజుకు రాముడు అనే పెద్దకొడుకు ఉండేవాడు. ఆ రాముడు తండ్రి ఆజ్ఞచేత భార్యనూ, తమ్ముణ్ణీ వెంట బెట్టుకుని అరణ్యానికి వెళ్ళాడు. అరణ్యంలో ఆ రాముడు శూరులైన రాక్షసులను అనేక మందిని చంపాడు. జనస్థానంలో అనేక మంది రాక్షసులు రాముడి చేతిలో చచ్చారని విని, రావణుడు మాయలేడి ద్వారా

మోసంచేసి, సీతను ఎత్తుకు పోయాడు. రాముడు తన భార్యకోసం అరణ్యాలలో వెతుకుతూపోగా, సుగ్రీవుడు అనే వానరుడితో స్నేహం కుదిరింది. రాముడు వాలి అనే వానరరాజును చంపి, సుగ్రీవుడికి వానరరాజ్యం ఇప్పించాడు. సుగ్రీవుడు ఆజ్ఞాపించగా, అనేకవేల వానరులు సీతాదేవిని వెతకటానికి అన్నిదిక్కులకూ బయలుదేరారు. వారిలో ఒకడినైన నేను నూరు యోజనాల సముద్రాన్ని దాటి వచ్చాను. రాముడు వర్ణించినట్టుగానే ఉన్న సీతను చూశాను.''



ఇంతవరకు చెప్పి హనుమంతుడు ఆగాడు. అతని మాటలను పూర్తిగా విన్న సీత నిర్ఘాంతపోయి, తల ఎత్తి చెట్టులోకి చూసింది. ఎంతో శ్రమపడి అంతటా కలయ జూసినమీదట ఆమెకు హనుమంతుడు కనిపించాడు.

తెల్లని బట్ట కట్టుకుని చెట్టు కొమ్మల మధ్య మెరుపులాగా కనిపించిన హనుమంతుణ్ణి చూడగానే సీతకు కాస్తభయం పుట్టింది. ఆపదలో కనిపించే కోతిరూపం తనకు కనిపించిందని ఆమె చాలా దుఃఖించింది. రాకసస్త్రీలు విని పోతారని ఆమె నిశ్శబ్దంగా ఏడ్చింది. లంకలో రాముడి కథ చెప్పేవాళ్ళుండటం అసంభవం కాబట్టి, తాను కలగంటున్నానని ఆమె అనుకున్నది. కలలో కోతి కనిపించటం చాలా చెడ్డది; రాముడికి ఏం ఆపద వస్తుందో అని భయపడింది. అయితే తనకు నిద్రేలేనప్పుడు కల ఎలా వస్తుంది? తాను అస్తమానమూ రాముణ్ణి గురించే ఆలోచించటంవల్ల తనకు రాముడి విషయం విన్నట్టు భ్రమకలిగి ఉంటుందని ఆమె అనుకున్నది. ఏమైనా తాను విన్న మాటలు నిజంకావాలని ఇంద్రుడికీ, బృహస్పతికీ, బ్రహ్మకూ, అగ్నిహోత్రుడికీ మనసులోనే దణ్ణాలు పెట్టుకున్నది.

ఈలోపల హనుమంతుడు చెట్టు మీది నుంచి నేల మీదికి దూకి, సీతను సమీ

పించి, చేతులు జోడించి నమస్కారం చేసి, "అమ్మా, పతివ్రత లాగా కనిపిస్తున్నావు. నువ్వెవరు? ఎందుకు కంటనీరు కార్చుతున్నావు? నిన్ను చూస్తే ఏ దేవ గణానికో చెందిన దానివి అనిపిస్తున్నది. నీ కొడుకూ, తండ్రీ, సోదరుడూ, భర్తా ఎవరు? ఒకవేళ నువు రావణుడి చేత జనస్థానం నుంచి అపహరించి తేబడిన సీతవే అయితే ఆ సంగతి వెంటనే చెప్పు. నీకు అన్నివిధాలా శుభం కలుగుతుంది." అన్నాడు.

దానికి సీత హనుమంతుడితో ఇలా అన్నది:

"నేను దశరథమహారాజు కోడలిని. విదేహరాజైన జనకుడి కూతురిని. నా పేరు సీత. రాముడి ఇంట పన్నెండేళ్ళు సమస్త సుఖాలూ అనుభవించాను. పదమూడో ఏట రాముడికి పట్టాభిషేకప్రయత్నాలు జరుగుతూండగా, దశరథుడి భార్యలలో కైకేయి అనే ఆమె, రామ పట్టాభిషేకం జరిగితే తాను నీరూ, ఆహారమూ విసర్జించి చచ్చిపోతాననీ, రాముణ్ణి అరణ్యానికి పంపమనీ అన్నది. లోగడ కైకేయికి వరాలు వాగ్దానంచేసి ఉన్న దశరథుడు అసత్యానికి పాల్పడలేక, రాముడికి ఇస్తానన్న రాజ్యాన్ని తిరిగి రాముడి నుంచి తీసుకున్నాడు. రాముడు తండ్రి మాటకు మనస్ఫూర్తిగా సమ్మతించి, నారబట్టలు కట్టుకుని బయలుదేరుతూ, నన్ను కౌసల్య దగ్గిర ఉండమన్నాడు. రాముణ్ణి విడిచి స్వర్గంలో కూడా ఉండలేను. అందుచేత నేను అతని కన్నముందే అరణ్యానికి బయలుదేరాను. అలాగే సుమిత్ర కొడుకైన లక్ష్మణుడు కూడా రాముడితో బాటు బయలుదేరాడు. మేం దండకారణ్యంలో ఉంటూండగా, దుర్మార్గుడైన రావణుడు నన్ను ఇక్కడికి తెచ్చాడు. రావణుడు నన్ను ఇంక రెండు మాసాలపాటు ప్రాణాలతో ఉండనిస్తానన్నాడు. తరవాత నేను చచ్చిపోతాను."

ఈ మాటలు విన్న హనుమంతుడు విచారంతో సీతను ఇలా ఓదార్చాడు:





# వీరహనుమాన్

హనుమంతుడు, సీతతో యిలా అన్నాడు: "సీతాదేవీ, నేను రాముడి దూతగా నీ వద్దకు వచ్చాను. రాముడు క్షేమంగా ఉన్నాడు: లక్ష్మణుడు నీకు నమస్కరించినట్టు చెప్పమన్నాడు."

రామ లక్ష్మణుల మాట వినగానే సీతకు ఒళ్ళు పొంగి పోయింది. కాని హనుమంతుడు మెల్లిగా తనను సమీపిస్తూండటం చూసి ఆమె, రావణుడే ఈ కోతి రూపంలో వచ్చాడని భయపడి, తాను పట్టుకుని నిలబడి ఉన్న చెట్టు కొమ్మను వదిలిపెట్టి నేల మీద కూలబడింది.

తనను సీత సంశయించి భయపడు తున్నదని గ్రహించి, హనుమంతుడు ఆమెకు నమస్కరించాడు. కాని సీత అతని కేసి చూడక, నిట్టూర్పులు విడుస్తూ, "నువ్వు రావణుడివే అయితే, ఇలా మాయకోతి రూపంలో వచ్చి నన్ను దుఃఖ పెట్టటం మంచిది కాదు. జనస్థానంలో కూడా ఇలాగే సన్యాసి రూపంలో వచ్చావు. అలాకాక నువ్వు రాముడి దూతవే అయితే రాముడి గుణ గణాలు చెప్పు." అన్నది.

రావణుడే మాయరూపంలో వచ్చా డన్న అనుమానంతోబాటు, తాను కలగం టున్నట్టూ, తనకు మతి చలించినట్టూ కూడా అనుమానాలు కలిగి, సీత మనసు చాలా క్షోభపొందింది.

అది గ్రహించి హనుమంతుడు రాముడి ముద్రికను సీతకు ఇచ్చి, రాముడి గుణ



గుణాలు పొగడుతూ మాట్లాడి, తాను లంకకు ఎలా వచ్చినదీ తెలిపి, సీత మనసుకు ఊరట కలిగించాడు. అతను ఆమె కోరికపై రామలక్ష్మణుల ఆనవాళ్లు వివరంగా చెప్పాడు. తరవాత అతను, రాముడికీ, సుగ్రీవుడికీ మైత్రి కుదిరిన దగ్గిర నుంచీ నడిచిన కథ అంతా చెప్పి, తాను సీతకోసం లంక అంతా గాలించటం గురించి కూడా చెప్పాడు. అంతా విని సీత ఆనంద బాష్పాలు రాల్చింది. ఆమెకు యిప్పుడు హనుమంతుడి పైన విశ్వాసం కుదిరింది.

అంతా చెప్పి హనుమంతుడు సీతతో, "నేనిప్పుడిక ఏం చెయ్యాలి? నీ కేం తోస్తున్నది? నేను రాముడి వద్దకు త్వరగా తిరిగి వెళ్ళాలి. ఆయన నా కోసం ఎదురు చూస్తాంటాడు," అన్నాడు.

సీత హనుమంతుడితో, "సముద్రాన్ని దాటి, రాక్షసులను తప్పించుకుంటూ లంకలో తిరుగుతున్న నీ ప్రజ్ఞ చాలా గొప్పది. నాకు రావణుడు పెట్టిన ఏడాది గడువు తీరే లోపుగా రాముణ్ణి రమ్మని చెప్పు. రావణుడి తమ్ముడు విభీషణుడు నన్ను రాముడికి ఇచ్చెయ్యమని సలహా ఇచ్చినా రావణుడు వినలేదు. విభీషణుడి కూతురు నల అనేది, తన తల్లి పంపగా నా దగ్గిరకు వచ్చి, నాకీ సంగతి చెప్పింది." అన్నది.

హనుమంతుడు ఆమెతో, "నేను వెళ్ళి నీ మాట చెప్పగానే రాముడు వానరులనూ, భల్లూకాలనూ వెంట బెట్టుకుని ఇక్కడికి వచ్చేస్తాడు. అలా కాకపోతే, నా వీపుమీద ఎక్కావంటే, సముద్రాన్ని దాటి, నిన్ను రాముడి వద్దకు తీసుకుపోగలను. నాకు సామర్థ్యం కాదని భయపడ వద్దు. కావాలంటే నేను రావణుడితో సహా ఈ లంకనే తీసుకుపోగలను. అలా చేస్తే అతి శీఘ్రంగా నీకు రాముడు కనిపిస్తాడు," అన్నాడు.

"ఇంత చిన్న శరీరంతో నన్ను అమితమైన దూరం తీసుకు పోదామనుకుం



టున్నావే, హనుమంతుడా!" అందుకే నువ్వు కోతివైనావు," అన్నది సీత.

సీతకు తన శక్తి సామర్థ్యాలు తెలియక ఇలా అన్నదని హనుమంతుడు గ్రహించి తన అసలు రూపం ఆమెకు చూపించా లనుకున్నాడు. అతను కొంచెం దూరం వెళ్ళి, తన దేహాన్ని పెంచనారంభించాడు. పర్వతం లాటి అతని ఆకారమూ, ఎర్రని ముఖమూ, కోరలూ, గోళ్ళూ చూసి సీత, "ఇతను నిశ్చయంగా లంకానగరాన్ని పెల్లగించుకు పోగలడు, సందేహంలేదు," అనుకున్నది.

"సీతాదేవీ, అనుమానాలు మాను. ఆలస్యం చెయ్యకు. రామ లక్ష్మణుల దుఃఖం పోగొట్టు," అన్నాడు హనుమంతుడు.

"హనుమంతుడా, నీ శక్తి సామర్థ్యాలు నాకు బాగా తెలుసు. నన్ను నువ్వు తీసుకుపోతే ఏ రాక్షసులూ నిన్ను అడ్డలేరు. అయితే రాముడి పని పాడు కారాదు. నేను నీ వెంట రావటం పొరపాటు అవుతుంది. నువ్వు వాయువేగంతో పొయ్యేటప్పుడు నేను భయపడి, సముద్రం చూసి, కళ్ళు తిరిగి, అందులో పడిపోగలను. నువ్వు ఎంత మహా వీరుడివైనా నన్ను రక్షించే బాధ్యత నీ పైన ఉండటం చేత అపాయానికి గురి అవుతావు. నీ వెంట రాక్షసులు పడి నీతో యుద్ధం ఆరంభిస్తే నేను పడిపోయి, రాక్షసులకు చిక్కవచ్చు. ఇప్పటిదాకా పడిన నీ శ్రమఅంతా వ్యర్థమవుతుంది. అంతకన్న, నువ్వు వెళ్ళి రాముడితో నా సంగతి చెప్పి, అతన్ని పిలుచుకు రావటం అన్నివిధాలా మేలు. అది అలా ఉంచి, నేను పరపురుషుణ్ణి తాకను. రావణుడు నన్ను బలాత్కారంగా తెచ్చినప్పుడు నేను నిస్సహాయురాలినై ఉండి, ఏమీ చేయులేకపోయాను," అని సీత హనుమంతుడితో అన్నది.

ఆమె చెప్పిన మాటలు యుక్తంగానే ఉన్నాయని హనుమంతుడు ఒప్పుకున్నాడు. అతను సీతను ఏదన్నా గుర్తుగా



ఇయ్యమని, దానిని రాముడికి చూపుతానని అన్నాడు.

దానికి సీత ఇలా అన్నది:

"నేనొక సంఘటన చెబుతాను. దానిని రాముడికి చెప్పు. నేనూ, రాముడూ గంగా తీరాన, చిత్రకూట పర్వతానికి ఈశాన్య దిక్కున ఒక ఆశ్రమంలో ఉండగా ఒక నాడు రాముడు నా తొడమీద తల పెట్టుకుని నిద్ర పోతున్నాడు. అప్పుడొక కాకి వచ్చి నా రొమ్ములో పొడిచి గాయం చేసింది. నా రక్తంతో రాముడు కూడా తడిశాడు. నేను లేపేసరికి, రాముడు నా రక్తం చూసి మండిపడి, ఒక దర్భ తీసి, బ్రహ్మాస్త్రం మంత్రించి కాకి మీద ప్రయోగించాడు. ఆ బ్రహ్మాస్త్రం కాకిని తరుముతూ పోయి, సమస్త లోకాలూ తిప్పింది. ఇంద్రుడి కొడుకైన ఆ కాకి ఎక్కడా రక్షణ దొరకక, తిరిగి వచ్చి రాముడి కాళ్ళపైన పడింది. బ్రహ్మాస్త్రాన్ని వ్యర్థం చెయ్యటానికి లేదు. అందుచేత కాకి తన కుడికన్ను ఆ అస్త్రానికి బలిచేసి, అక్కడి నుంచి వెళ్ళిపోయింది. అలాటి శక్తిగల రాముడు శత్రువులను నాశనం చేసి నా కష్టాలు ఎందుకు తీర్చడు? నేనేం పాపం చేశాను?"

"అమ్మా, రాముడు పుట్టెడు దుఃఖంలో ఉన్నాడు. నేను ఎంతో ప్రయాసపడి వచ్చి నిన్ను చూశాను. ఇప్పుడు నువ్వు ఆనందించాలి గాని, దుఃఖించరాదు. రాముడు త్వరలోనే వచ్చి, రావణుణ్ణి చంపి, నీతోసహా అయోధ్యకు పోతాడు," అన్నాడు హనుమంతుడు.

సీత హనుమంతుడితో, "హనుమంతుడా, నువ్వు రాముణ్ణి చూడగానే నాకు బదులుగా సాష్టాంగ నమస్కారం చెయ్యి: లక్ష్మణుడు ఉత్తముడు. అతను సమస్తమూ విడిచిపెట్టి, రాముడి వెంట అరణ్యాలకు వచ్చాడు. అతన్ని క్షేమం అడిగానని చెప్పు." అంటూ తన కొంగున కట్టుకుని ఉన్న చూడామణి తీసి అతనికి ఇచ్చింది.

హనుమంతుడు చిన్న రూపంలోనే ఉన్నప్పటికీ తల వెంట్రుకలు దూరవలసిన రంధ్రంలో అతని చెయ్యి దూరలేదు. అందుచేత అతను దానిని తన వేలికి తగిలించుకుని, సీతకు ప్రదక్షిణ నమస్కారాలు చేసి నిలబడ్డాడు.

"హనుమంతుడా, రాముడు ఈ చూడామణిని చూడగానే నా తల్లినీ, నన్నూ, దశరథుణ్ణీ గుర్తుకు తెచ్చుకుంటాడు. ఇక జరగవలసినదంతా నీ మీదనే ఆధారపడి ఉన్నది. నా దుఃఖం తీరే మార్గం నువే ఆలోచించి చెయ్యి," అని సీత అన్నది. ఆమె సుగ్రీవుణ్ణీ, అతని మంత్రులనూ, వానర శ్రేష్ఠులనూ అడిగినట్టు చెప్పమన్నది.

ఆమెకు ఇంతచెప్పిన తరవాత ఒక సందేహం పట్టుకున్నది.

"హనుమంతుడా, నువ్వయితే ఈ సముద్రాన్ని దాటి రాగలిగావు గాని, రామలక్ష్మణులూ, ఇతర సేనలూ ఇక్కడికి ఎలా వస్తారు? రావణుడితో ఎలా యుద్ధం చేస్తారు? నువే యుద్ధంచేసి రావణుణ్ణి చంపితే రాముడికి గాని, నాకుగాని ఏమి కీర్తి వస్తుంది?" అని ఆమె అడిగింది.

దానికి హనుమంతుడు, "సీతాదేవీ, వానర, భల్లూక సైన్యాలకు అధిపతి అయిన సుగ్రీవుడు తలుచుకుంటే ఏదైనా చెయ్యగలడు. అతని సేనలో నాతో సమానులూ, నన్ను మించిన వాళ్ళూ ఎందరో





ఉన్నారు. నేనే సముద్రం దాటగా, వాళ్లు దాటటం ఒక లెక్కా? అందుచేత నువ్వు విచారించకు. నీకు క్షేమం కలుగుగాక!" అని సీత వద్ద సెలవు పుచ్చుకుని అక్కడి నుంచి కదిలాడు.

కొంత దూరం వెళ్ళాక అతను తనలో, "సీతను చూశాను. కాని ఇంకొక్క చిన్న పని మిగిలి పోయింది. అది శౌర్య పరాక్రమాలతో గాని జరగదు. కొందరు రాక్షసులను చంపితే గాని మిగిలిన రాక్షసులు మెత్తబడరు. రాక్షసులు ఎలా యుద్ధం చేస్తారో, వారి బలం ఏపాటిదో చూసి మరీ కిష్కింధకు తిరిగి వెళతాను. రాక్షసులను యుద్ధానికి ప్రేరేపించటానికి సులువైన మార్గం ఏమిటి?" అని ఆలోచించాడు.

అశోకవనం చాలా అందంగా, నందన వనాన్ని పోలి ఉన్నది. అది రావణుడికి చాలా ఇష్టం అయి ఉండాలి. దీన్ని తాను ధ్వంసం చేస్తే రావణుడికి తప్పక కోపం వస్తుంది. అప్పుడు రావణుడు తన పైకి రాక్షస సేనలను పంపుతాడు. యుద్ధం జరుగుతుంది. తాను ఆ రాక్షసులందరినీ చంపి, నిశ్చింతగా కిష్కింధకు వెళ్ళిపోవచ్చు.

ఇలా ఆలోచించి హనుమంతుడు అశోకవనంలో ఉన్న చెట్లను పడదోయ సాగాడు. అతను చెట్లను పడగొట్టటంతో బాటు, అందంగా కట్టిన కొలను గట్లు విరిచి, క్రీడాపర్వతాల శిఖరాలను విరిచాడు. కొద్ది సేపట్లోనే అశోకవనం బీభత్సరూపం ధరించింది. చెట్ల మీద ఉండిన పక్షులు అటూ ఇటూ ఎగురుతూ ఆర్తనాదాలు చేశాయి.

విరిగిన చెట్లూ, తెగిన లతలూ వాడు ముఖం పెట్టాయి. అశోకవనమే దుఃఖంలో మునిగిపోయినట్టు కనబడింది.

ఇదంతా చేసిన హనుమంతుడు సరాసరి వెళ్ళి, అశోకవనం తాలూకు బయటి ద్వారం వద్ద నిలబడి, రాక్షసుల కోసం ఎదురు చూడసాగాడు.

చెట్లు విరిగే చప్పుడూ, పక్షుల ఆర్త నాదాలూ లంకలో వాళ్ళకు వినిపించాయి. అంతదాకా నిద్రపోతున్న రాక్షస స్త్రీలు ఈ ధ్వనులకు లేచి, పెంచిన దేహంతో వనాన్ని ధ్వంసం చేస్తున్న హనుమంతుణ్ణి చూశారు. వాళ్ళు తనను చూడటం గమనించి, హనుమంతుడు తన దేహాన్ని మరింతగా పెంచాడు.

అప్పుడా రాక్షసస్త్రీలు సీతను, "ఇతను ఎవరు? ఎవరు పంపారు? ఎందుకు వచ్చాడు? నీతో ఏం మాట్లాడాడు? నువు భయపడకు. మాతో నిజం చెప్పు." అన్నారు.

"రాక్షసులు రకరకాల రూపాలు ధరిస్తారు. నాకు వాళ్ళ సంగతి ఎలా తెలుస్తుంది? పాము కాళ్ళు పాముకే తెలియాలి. మీరూ రాక్షసులే గనక రాక్షస మాయలు మీకే తెలుస్తాయి. ఈ వానరు డెవడో, ఏం చేస్తాడో మీరే తెలుసుకోండి. ఇతన్ని చూస్తే నాకు భయంగానే ఉన్నది. చెప్పండి, ఇతనెవడు?" అన్నది సీత.

సీత ఇలా అనేసరికి రాక్షసస్త్రీలు భయపడ్డారు. కొందరు సీతకు రక్షగా ఉండి పోగా, కొందరు భయంతో ఆర్త నాదాలు చేస్తూ పారిపోగా, మరి కొందరు ఈ సంగతి రావణుడికి చెప్పటానికి వెళ్ళారు.

అలా వెళ్ళిన వాళ్ళు రావణుడితో, "ఎవడో భయంకరాకారుడూ, అమిత బలవంతుడూ అయినవాడు వచ్చి, సీతతో మాట్లాడి, అశోకవనంలో ఉన్నాడు. ఎంత అడిగినా, సీత అతని సంగతి చెప్పకుండా ఉన్నది. ఆ వానరుడు దేవేంద్రుడి దూత అయినదీ, కుబేరుడి దూత అయినదీ, రాముడి దూత అయినదీ తెలియటం లేదు. వాడుమాత్రం అశోకవనమంతా ధ్వంసం చేసేస్తున్నాడు. ఒక్క సీత కూర్చుని ఉన్న చెట్టు తప్పిస్తే మిగిలిన వనమంతా కూలిపోయింది. ఆ వానరుణ్ణి నువు వెంటనే కఠినంగా శిక్షించాలి. సీతతో మాట్లాడినందుకే నువు వాణ్ణి చంప వచ్చు." అన్నారు.






రాక్షస స్త్రీలు చెప్పిన మాటలు విని రావణుడికి కోపం వచ్చింది. అతను బలవంతులూ, శూరులూ అయిన రాక్షసులను పిలిచి, హనుమంతుణ్ణి పట్టుకోమని ఆజ్ఞాపించాడు. ఆ రాక్షసులు ఆయుధాలు తీసుకుని హనుమంతుడి మీదికి బయలుదేరారు. వారికి హనుమంతుడు అశోకవన ద్వారంవద్ద కనిపించాడు. వాళ్లు అతన్ని చుట్టుముట్టారు. అప్పుడు మహాకాయుడైన హనుమంతుడు తోకతో నేలను కొట్టి, గట్టిగా అరిచి, తన భుజం చరుచుకున్నాడు. ఆ ధ్వని లంక అంతటా వినిపించింది.

తరవాత హనుమంతుడు కళ్ళెర్రచేసి, ఇలా అరిచాడు:

"రామలక్ష్మణులకు జయం! రాముడి ప్రాపుగల సుగ్రీవుడికి జయం! కోసల రాజైన రాముడి దాసుణ్ణి! శత్రు నాశకుణ్ణి! వాయు పుత్రుడైన హనుమంతుణ్ణి! చెట్లతోనూ, రాళ్ళతోనూ యుద్ధం చేస్తూ వెయ్యి మంది రావణులను ఎదిరించగలను. రాక్షసులు చూస్తూండగానే లంకా పట్టణం ధ్వంసంచేసి, సీతకు నమస్కరించి, రాముడి వద్దకు పోతాను."

అది విని రాక్షససైనికులు భయపడి కూడా, రాజాజ్ఞ చొప్పున యుద్ధంచేయ నిర్ణయించి, హనుమంతుడి పైన అనేక ఆయుధాలు ప్రయోగించారు. హనుమంతుడు ఆ ద్వారం సమీపంలో ఉన్న ఇనుప పరిఘ తీసుకుని, రాక్షసుల నంద

## 15. రాక్షసులతో యుద్ధం




రినీ చంపి, తిరిగి ద్వారంవద్ద నిలబడ్డాడు. భయపడి పారిపోయిన రాక్షసులు వెళ్ళి రావణుడితో సైనికులు చచ్చిన వార్త చెప్పారు.

రావణుడు మరింత మండిపడి హనుమంతుడి మీదికి మహావీరుడైన ప్రహస్తుడి కొడుకును పంపాడు.

ఈ లోపుగా హనుమంతుడి దృష్టి చైత్యప్రాసాదం మీద పడింది. దాన్ని ఎందుకు ధ్వంసం చెయ్యకూడదనుకుని, అతను దాని పైకి దూకి, దాన్ని నాశనం చేసి, సింహనాదం చేశాడు. ఇంతలో చైత్యప్రాసాద రక్షకులు ఆయుధాలతో అతని పైకి వచ్చారు. హనుమంతుడు ఒక స్తంభాన్ని పెరికి, దాన్ని గిరగిరా తిప్పి, నూరు మంది రాక్షసులను చంపాడు.

ఇంతలోపల ప్రహస్తుడి కొడుకు జంబుమాలి విల్లూ, బాణాలూ తీసుకుని హనుమంతుడి మీదికి గాడిదలు కట్టిన రథం మీద వచ్చాడు. అతన్ని చూడగానే హనుమంతుడు యుద్ధోత్సాహంతో సింహనాదం చేశాడు.

ద్వారం పైన ఉండే దూలం మీద కూర్చుని ఉన్న హనుమంతుడి పైన జంబుమాలి బాణాలు వేశాడు. అవి ముఖానా, నెత్తినా, చేతులకు తగిలి, రక్తం మూలంగా హనుమంతుడు మరింత ఎర్రగా కనిపించాడు. అతను తన పక్కనే ఉన్న పెద్దరాయి ఎత్తి, జంబుమాలి మీద గట్టిగా విసిరాడు. జంబుమాలి ఆ రాతిని బాణాలతో పడగొట్టాడు. అలాగే అతను హనుమంతుడు విసిరిన సాలవృక్షాన్ని కూడా బాణాలతో నరికి, మరి కొన్ని బాణాలతో హనుమంతుణ్ణి కొట్టాడు. హనుమంతుడు అమితమైన కోపంతో పరిఘను తీసుకుని, గిరిగిరా తిప్పి, జంబుమాలి మీదికి విసిరాడు. దాని దెబ్బకు జంబుమాలీ, అతని రథమూ, గాడిదలూ గుర్తించరాకుండా నుగ్గు అయిపోయాయి.

జంబుమాలి చచ్చాడని వినగానే రావణుడికి కోపంతో కణతలు అదిరాయి. అతను తన మంత్రి పుత్రులను ఏడుగురిని అగ్నిహోత్రాల వంటి తేజస్సుగల వారిని, సైన్యంతోసహా పంపాడు. హనుమంతుణ్ణి నేను చంపుతానంటే, నేను చంపుతానని ఒకరిమీద ఒకరు పోటీలు పడుతూ, వాళ్ళు గుర్రాలు పూన్చిన రథాల మీద బయలుదేరారు.

వాళ్ళు అశోకవన ద్వారం చేరుతూనే హనుమంతుడి మీద బాణవర్షం కురిపించారు. హనుమంతుడు ఆ బాణాలు తనకు తగలకుండానూ, వాళ్ళ గురికి అందకుండానూ ఆకాశంలో అటూ, ఇటూ ఎగిరాడు. అతని అరుపులకు రాక్షసులు భయపడ్డారు. హనుమంతుడు వాళ్ళను చేత్తో కొట్టి, కాళ్ళతో తన్ని, పిడికిలితో పొడిచి, గోళ్ళతో చీరాడు. చాలామంది రాక్షసులు ఇలా చచ్చారు. చచ్చినవాళ్ళు చావగా, మిగిలిన వాళ్ళు ఆర్తనాదాలు చేస్తూ పారిపోయారు.

హనుమంతుడు తిరిగి ద్వారం వద్దకు చేరాడు. అతనికి ఇంకా యుద్ధం చెయ్యాలని ఉన్నది.

మంత్రి పుత్రులు కూడా హనుమంతుడి చేతిలో చచ్చారనే సరికి రావణుడికి కొంచెం భయంకలిగింది. కాని అతను దాన్ని పైకి కనబడనియ్యక, తన సేనానాయకులలో అయిదుగురిని, విరూపాక్షుడూ, యూపాక్షుడూ, దుర్ధరుడూ,





ప్రఘసుడూ, భావకర్ణుడూ అనేవాళ్ళను ఉద్దేశించి, "మీరందరూ రథాలతోనూ, ఏనుగులతోనూ వెళ్ళి ఆ వానరుణ్ణి శిక్షించండి. అతని విషయంలో మీరు ఏ మాత్రమూ అలక్ష్యంగా ఉండవద్దు. అతను వానరుడని నాకు అనిపించటం లేదు. అదేదో మహాబలం గల భూతంలా గున్నది. ఏ ఇంద్రుడైనా తపస్సు చేసి మనని చంపటానికి ఈ భూతాన్ని సృష్టించాడేమో; నాకు లోగడ వాలీ, సుగ్రీవుడూ, జాంబవంతుడూ, నీలుడూ, ద్వివిదుడూ మొదలైన వానరవీరులు బాగా తెలుసు. వారెవరికీ ఇంత బలమూ, శక్తీ లేవు. మీరు మీ శక్తినంతా ధారపోసి ఈ వానరుణ్ణి ఎలాగైనా పట్టుకోండి. ఆత్మరక్షణ చేసుకోవటం విషయంలో మీరు అజాగ్రత్తగా ఉండకండి," అని హెచ్చరించాడు.

రాజాజ్ఞ శిరసావహించి అయిదుగురు సేనాపతులూ రథాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ, రకరకాల ఆయుధాలనూ తీసుకుని హనుమంతుడున్న చోటికి వచ్చారు. వాళ్ళు హనుమంతుణ్ణి చుట్టుముట్టి, అతని మీద అనేక ఆయుధాలు ప్రయోగించారు. వాళ్ళ బాణాలు కొన్ని హనుమంతుడి తలకు గుచ్చుకున్నాయి. వెంటనే హనుమంతుడు సింహనాదం చేస్తూ ఆకాశంలోకి ఎగిరాడు. అప్పుడు దుర్ధరుడు ఆకాశంలోకి వందల కొద్దీ బాణాలు వేశాడు. హనుమంతుడు వాటిని తప్పుకుంటూ, శరీరం పెంచి, పిడుగు పడినట్టుగా దుర్ధరుడి రథం మీదికి దూకాడు. ఆ దెబ్బకు దుర్ధరుడి రథపు గుర్రాలు ఎనిమిదితోపాటు దుర్ధరుడు కూడా చచ్చాడు.

తరవాత హనుమంతుడు ఒక మద్ది చెట్టు పెరికి, దానితో విరూపాక్షుణ్ణీ, యూపాక్షుణ్ణీ చంపాడు. తరవాత ప్రఘసుడూ, భావకర్ణుడూ హనుమంతుడితో యుద్ధం చేశారు. ఒక పర్వతశిఖరం పెకలించి, హనుమంతుడు దానితో వారిద్దరినీ, సేననూ చంపాడు.

తరవాత అతను మళ్ళీ ద్వారం వద్ద నిలబడ్డాడు.

అయిదుగురు సేనానాయకులూ చచ్చిన వార్తరాగానే రావణుడు తన కొడుకైన అక్షుడి కేసి చూశాడు. యుద్ధం అంటే అమితమైన ఆసక్తిగల అక్షుడు, తండ్రి చూపే ఆజ్ఞగా భావించి, చప్పున లేచాడు. అతను ఒక బంగారు రథం మీద హనుమంతుడున్న చోటుకు వెళ్ళాడు. ఎనిమిది గుర్రాలుగల అక్షుడి రథం నేలను అంటకుండానే పోగలది. దాని నిండా ఎప్పుడూ ఆయుధాలు ఉంటాయి.




అక్షుడు హనుమంతుణ్ణి చూస్తూనే అతను అసాధారణ వీరుడన్న సంగతి గ్రహించి, పెద్ద ఎత్తున యుద్ధానికి సిద్ధపడ్డాడు. ఇద్దరూ చాలా తీవ్రమైన యుద్ధం ప్రారంభించారు. అక్షుడు వేసిన రకరకాల బాణాలు హనుమంతుడికి తగిలి, అతని యుద్ధోత్సాహాన్ని పెంచాయి. అతను ఆకాశంలోకి ఎగిరాడు. అక్షుడు కూడా తన రథంతోపాటు ఆకాశంలోకి లేచి, హనుమంతుడి మీద బాణాలు వేయసాగాడు. హనుమంతుడు వాటిని తప్పుకుంటూ ఆకాశంలో తిరుగుతూ, అక్షకుమారుణ్ణి చంపే మార్గం ఆలోచించాడు. చిన్నతనంలోనే ఇంత పరాక్రమంగల అక్షుడు, చంపకుండా విడిచిపెడితే, ముందు ముందు ఎంతైనా బాధిస్తాడు. అందుచేత, హనుమంతుడు ఉపాయంగా, తలవని తలంపుగా, అక్షుడి కాళ్ళు పట్టుకుని, గిరగిరా తిప్పి, బలంగా నేలకేసి కొట్టాడు. ఆ దెబ్బకు అక్షుడు చచ్చిపోయాడు.

అక్షుడి చావు వినగానే రావణుడికి దుఃఖమూ, కోపమూ కూడా కలిగాయి. ఆయన దుఃఖాన్ని అణచుకుని, తన కొడుకైన ఇంద్రజిత్తును చూసి, "ఈ వానరుడు ఇప్పటికి జంబుమాలినీ, మంత్రి పుత్రులనూ, అయిదుగురు సేనాపతులనూ, చాలా సేననూ, నీ తమ్ముడైన



ఇంద్రజిత్తు తన పైన బాణాలు వెయ్య నారంభించగానే, హనుమంతుడు ఆకాశం లోకి ఎగిరి, ఆ బాణాలను తప్పుకుంటూ సంచరించసాగాడు. తాను వేసిన ఒక్క బాణమూ హనుమంతుడికి తగలకపోయే సరికి ఇంద్రజిత్తు చిరాకు పడ్డాడు. హను మంతుణ్ణి చంపటం అసాధ్యమని అతనికి తెలిసిపోయింది. కనీసం హనుమంతుణ్ణి పట్టుకునే ఉద్దేశంతో అతను బ్రహ్మాస్త్రం సంధించాడు. దానితో హనుమంతుడు కట్టుపడి, ఆకాశంలో నుంచి కింద పడిపోయి, ఏమీ చెయ్యలేని స్థితిలో ఉండిపోయాడు.

అక్షుణ్ణి చంపాడు. అందుచేత అతని బలం సరిగా అంచనా వేసుకుని యుద్ధం చెయ్యి. నువు యుద్ధంలో నా అంత వాడివి, దేవతలను కూడా జయించ గలవు. నువు సేనలను తీసుకుపోవద్దు; నీ అస్త్రాలను మాత్రమే నమ్ముకో. నిన్ను నువు తేలికగా రక్షించుకోగలవని పంపు తున్నాను," అన్నాడు.

ఇంద్రజిత్తు తండ్రికి ప్రదక్షిణ చేసి, యుద్ధానికి బయలుదేరాడు. అతను రథం మీద వెళ్ళి త్వరలోనే హనుమంతుణ్ణి చేరుకున్నాడు. ఇంద్రజిత్తు రావటం చూసి హనుమంతుడు సంతోషంతో సింహనాదం చేశాడు.

తాను బ్రహ్మాస్త్రంతో పట్టుబడ్డట్టు హను మంతుడు గ్రహించాడు. ఏ అస్త్రంచేతా పట్టుబడకుండా బ్రహ్మదేవుడు తనకు వరం ఇచ్చి ఉన్న సంగతి జ్ఞాపకం తెచ్చు కుని, హనుమంతుడు కొంతసేపు బ్రహ్మ స్త్రానికి కట్టుబడి ఉండ నిశ్చయించాడు. తనను, బ్రహ్మ, దేవేంద్రుడూ, వాయువూ రక్షిస్తారుగనక ప్రమాదం కలగదని కూడా అతను నమ్మాడు. అదీగాక ఇప్పుడు తనకు రావణుడితో మాట్లాడే అవకాశం కూడా కలుగుతుంది.

కదలకుండా పడి ఉన్న హనుమంతుణ్ణి రాక్షసులు సమీపించి, అతన్ని తాళ్ళతో బంధించారు. హనుమంతుడు బంధించ

బడగానే బ్రహ్మాస్త్రం అతన్ని వదిలేసింది. ఇతర బంధాలున్న చోట బ్రహ్మాస్త్రబంధం నిలవదు. ఇంద్రజిత్తు ఈ సంగతి ఎరిగి ఉండంచేత, అజ్ఞానులైన రాక్షసులు హనుమంతుణ్ణి నారతాళ్ళతో బంధించి నందుకు విచారించాడు. అయితే రాక్షసులు తనను తీసుకుపోతున్నప్పుడు కూడా, తనను బ్రహ్మాస్త్రం విడిచిన సంగతి హనుమంతు డెరగడు.

రాక్షసులు హనుమంతుణ్ణి కర్రలతో కొట్టుతూ, పిడికిళ్లతో పొడుస్తూ, విజయోత్సాహంతో కేకలు పెడుతూ రావణుడి వద్దకు తీసుకుపోయారు.

ఇంద్రజిత్తు హనుమంతుణ్ణి రావణుడికీ, సభికులకూ చూపి, "ఇతనే ఆ వానరుడు," అని పరిచయం చేశాడు. మదించిన ఏనుగులాగున్న హనుమంతుణ్ణి చూసి, రావణాసురుడి సభలో వాళ్ళు తమలో తాము, "ఎవడీ వానరుడు? ఎవరి తరఫున వచ్చాడు? ఇక్కడికి ఎందుకు వచ్చాడు? ఏం పని మీద వచ్చాడు? ఈ లంకలో ఎవరితో పని ఉండి వచ్చాడు?" అంటూ ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు.

రావణుడి సభలోకి రాక్షసులు తీసుకు వచ్చిన హనుమంతుడు ఒక్కసారి రావణుడి కేసీ, అతని చుట్టూ ఉన్న రాక్షసుల కేసీ చూశాడు. రావణుడి కళ్ళు కోపంతో ఎర్రబడి ఉన్నాయి. అతను ఆజ్ఞాపించిన మీదట అతని మంత్రులు హనుమంతుణ్ణి ఇలా అడిగారు:

"నువు ఇక్కడికి ఎందుకు వచ్చావు? నిన్ను ఎవరు పంపారు?"

"నేను వానర రాజైన సుగ్రీవుడి దూతను. అతను పంపగా వచ్చాను," అని హనుమంతుడు జవాబిచ్చాడు.

"ఇక్కడికి ఎందుకు వచ్చాడో, అశోకవనాన్ని ఎందుకు ధ్వంసం చేశాడో, రాక్షస స్త్రీలను ఎందుకు భయపెట్టాడో, మన సైనికులతో యుద్ధం ఎందుకు చేశాడో అడుగు," అని రావణుడు ప్రహస్తుడితో అన్నాడు.






ప్రహస్తుడు హనుమంతుణ్ణి రావణుడు కోరినట్టు అడిగితే, హనుమంతుడు ఇలా సమాధానం చెప్పాడు:

"రాక్షసరాజువైన నిన్ను చూడగోరి అశోకవనం విరిచాను. అది నాకు సులభం కాలేదు. అప్పుడు బలవంతులైన రాక్షసులు నా మీద యుద్ధానికి వచ్చారు. నేను ఆత్మరక్షణ కోసం వారితో యుద్ధం చెయ్యవలసి వచ్చింది. నన్ను ఏ అస్త్రం గాని, పాశం కాని బంధించలేవని బ్రహ్మదేవుడి వరం ఉన్నది. నిన్ను చూడటం కోసమే బ్రహ్మాస్త్రానికి కట్టుబడ్డాను. అంతకన్న మరేమీలేదు. నేను మహా పరాక్రమశాలి అయిన రాముడి దూతను. నీతో నా కొక రాజకార్యం ఉన్నది. నీ మేలు కోరి చెప్పే నా మాటలు శ్రద్ధగా ఆలకించు.

"సుగ్రీవుడు నీకు తన క్షేమం తెలిపి, నీ క్షేమం అడగమన్నాడు. వాలి నీకు తెలుసు. ఆ వాలిని రాముడు ఒక్క బాణంతో చంపి, సుగ్రీవుణ్ణి వానర రాజును చేశాడు. సుగ్రీవుడు సీతను వెతికిస్తానని మాట ఇచ్చి, ఆ ప్రకారం అన్ని దిక్కులకూ వానరులను పంపాడు. వారిలో నేను ఒకణ్ణి. నేను వాయుదేవుడి కొడుకును. నా పేరు హనుమంతుడు. నేను నూరు యోజనాల సముద్రాన్ని దాటి సీతను చూడటానికి ఇక్కడికి వచ్చాను. నీ అధీనంలో ఉన్న సీతను చూశాను. ధర్మం తెలిసిన నీ వంటివాడు

**16.** లంకాదహనం



బలాత్కారంగా పరస్త్రీని పట్టిఉంచరాదు. రామలక్ష్మణుల కోపానికి గురి అయి సుఖ పడగలవాడు మూడు లోకాలలోనూ ఉండడు. ఈ మాట సుగ్రీవుడు నీతో చెప్ప మన్నాడు. నేను సీతను చూశాను కనక ఇక కర్తవ్యం రాముడి మీద ఉన్నది. అది ఏమిటో నాకైతే తెలియదు. తలచు కుంటే నేనే నీ లంకను ధ్వంసం చెయ్య గలను, కాని రాముడు అందుకు ఒప్పు కోడు. సీతను అపహరించిన వాళ్లను తానే చంపుతానని వానర, భల్లూక సేనల ముందు అతను ప్రతిజ్ఞ చేసి ఉన్నాడు. సీత నీ పాలిటి మృత్యుదేవత అన్నది గ్రహించి, నీ క్షేమం ఆలోచించుకో. నేను మనిషినీ కాను, రాక్షసుణ్ణీ కాను, అందుచేత పక్షపాతం లేకుండా ఉన్న మాట చెబుతున్నాను. నిన్ను రాముడి బారినుంచి ఎవరూ రక్షించలేరు."

హనుమంతుడు ఇలా నిర్భయంగా చెప్పిన మాటలు విని రావణుడు కోపో ద్రేకంతో, "ఈ హనుమంతుణ్ణి చంపండి!" అని కేక పెట్టాడు.

అప్పుడు బుద్ధిమంతుడైన విభీషణుడు రావణుడితో, "రావణేశ్వరా! హను మంతుణ్ణి చంపటం రాజధర్మానికి విరుద్ధం; లోకాచారానికి వ్యతిరేకం. కోపం విడిచిపెట్టి దూతకు తగి ఉండే శిక్ష ఏదైనా విధించు," అన్నాడు.

రావణుడి కోపం ఏ మాత్రమూ తగ్గ లేదు. అతను విభీషణుడితో, "ఈ వాన రుడు పాపి. పాపులను చంపటంలో పాపం ఏమీ లేదు," అన్నాడు.

దానికి విభీషణుడు, "ఎలాంటి పరి స్థితిలోనూ దూతను చంపరాదని పెద్దలు చెబుతారు. అయినా దూతకు తగిన శిక్షలు అనేకం చెప్పబడి ఉన్నాయి. అంగ వైకల్యం కలిగించవచ్చు; కొరడాతో కొట్ట వచ్చు; తల గొరగవచ్చు; కాల్చి ముద్ర వేయవచ్చు. కాని దూతను చంపట మన్నది ఏ శాస్త్రంలోనూ కనబడదు. నీ వంటి ధైర్యశాలి కోపానికి వశుడుకారాదు.

అది అలా ఉంచి, ఇతన్ని చంపటం వల్ల మనకు లాభం ఏమీ ఉండదు. నువు చంపవలసినది ఇతన్ని ఇక్కడికి పంపిన వాళ్ళను. ఇతను చెప్పిన మాటలు ఇతనివి కావు. సముద్రాన్ని దాటగల వాడు ఇతను తప్ప మరొకడు ఉన్నాడని నాకు తోచదు. అందుచేత, ఇతన్ని చంపితే, రామలక్ష్మణులను ఇక్కడికి రప్పించి, నీతో యుద్ధం చేయటానికి తోడ్పడేవాడు మరొకడు ఉండడు. వాళ్లను పట్టుకున్నట్టయితే నీ కీర్తి హెచ్చుతుంది,'' అన్నాడు.

రావణుడు విభీషణుడు చెప్పిన దానికి తృప్తిపడి అతను చెప్పినట్టు చేయ నిశ్చయించాడు. అతను ఇలా అన్నాడు:

''నువు చెప్పినది నిజం. దూతను చంపటం తప్పే. అందుచేత ఇతనికి మరొక శిక్ష ఇద్దాం! కోతులకు ప్రియమైనది తోక. ఇతన్ని తోక కాల్చి వదిలెయ్యండి.''

హనుమంతుడి తోకకు నిప్పు అంటించి, అతన్ని నగరమంతటా తిప్పి, కూడలి స్థలాలలో ప్రదర్శించమని ఉత్తరువు అయింది.

రాక్షసులు గుడ్డ పేలికలు తెచ్చి హనుమంతుడి తోకకు చుట్టారు; తరవాత తోక మీద నూనె పోసి నిప్పు అంటించారు.

వాళ్ళు ఈ తతంగం చేస్తున్నంతసేపూ హనుమంతుడి కోపం కార్చిచ్చులాగా పెరిగిపోతూ వచ్చింది. చివరకు అతను





మండుతున్న తన తోకతో వాళ్ళను చావబాదాడు.

ఈ లోపుగా హనుమంతుడి తోకను తగలబెట్టుతున్నారన్న వార్త విని లంకలో ఉన్న పిల్లలూ, స్త్రీలూ, ముసలివాళ్ళూ పరమానందంతో చూడటానికి వచ్చారు. అందరు రాక్షసులూ చేరి హనుమంతుణ్ణి మళ్ళీ పట్టుకుని కట్టేసి, తీసుకుపోయారు. తన తోక కాలుతుందన్న భయం లేనందువల్ల హనుమంతుడు వాళ్ళవెంట వెళ్లాడు. అప్పుడు తను చిన్నరూపంలోనే ఉన్నాడు.

రాక్షసులు శంఖాలు ఊదుతూ, భేరీలు మోగిస్తూ, హనుమంతుణ్ణి లంక అంతా తిప్పారు. ఇలా తిరుగుతూ హనుమంతుడు లంకలో ఆయుధాలు ఉండే ప్రదేశాలూ, ఇతర రహస్య స్థావరాలూ చక్కగా చూశాడు. వెళ్లిన చోటనల్లా రాక్షసులు హనుమంతుణ్ణి, "వేగులవాడు" అని చాటారు.

రాక్షసస్త్రీల ద్వారా సీత, హనుమంతుడి తోకకు నిప్పుపెట్టిన వార్త విని, ఎంతో దుఃఖించి, అగ్నిహోత్రుణ్ణి తలుచుకుని, హనుమంతుడికి అపాయం కలగకుండా చూడమని ప్రార్థించింది.

సీత పడేబాధ చూసి సరమ, "అమ్మా, ఆ కోతిని గురించి నువు దిగులుపడకు. అతను మహానుభావుడు. అతను తన వెంట ఉన్న రాక్షసులనందరినీ చావగొట్టి, ఒక ఇంటి మీదినుండి మరొక ఇంటి మీదికి దూకుతూ లంకనంతా తగలబెట్టుతున్నాడు. అదుగో చూడు!" అన్నది.

సరమ చెప్పినది అక్షరాలానిజం. హనుమంతుడు రాక్షసులను శిక్షించ నిశ్చయించుకుని, తన దేహాన్ని అతి చిన్నది చేసి, కట్ల నుండి బయటపడ్డాడు. అతను తిరిగి దేహాన్ని పెంచి, నగర ద్వారం వద్ద ఉన్న ఇనుప పరిఘ తీసుకుని తన వెంట ఉన్న రాక్షసులందరినీ చంపాడు. అప్పుడతనికి లంకను తగలబెట్టాలన్న ఆలోచన వచ్చింది. అతను కాలుతున్న తోకతో ఇళ్ళ మీదుగా తిరగనారంభించాడు.

అతను ముందు ప్రహస్తుడి ఇల్లుకాల్చి, మహాపార్శ్వుడి ఇంటికి వెళ్ళాడు. అందులో చిచ్చుపెట్టి, వరసగా, శుకుడూ, వజ్రదంష్ట్రుడూ, సారణుడూ, ఇంద్రజిత్తూ, జంబుమాలీ, సుమాలీ మొదలైన రాక్షస ప్రముఖుల ఇళ్లన్నీ తగలబెట్టాడు. అతను ఒక్క విభీషనుడి ఇంటిని వదిలిపెట్టాడు. రాక్షసుల ఇళ్ళే కాక, వాళ్లు ఎంతో కాలంగా చేర్చిపెట్టుకున్న సంపదలన్నీ బూడిద అయిపోయాయి. చివరకు అతను రావణుడి ఇల్లు కూడా కాల్చాడు.

అంతవరకూ రావణుడికి భయపడుతూ వచ్చిన అగ్నీ, వాయువూ ఇప్పుడు విజృంభించినట్టు కనపడ్డారు. ఇళ్ళలోని వెండి బంగారాలు కరిగిపోయాయి. మహా భవనాలు మట్టిలో కూలిపోయాయి. ఈ దహనకాండను ఎలా ఆపాలో రాక్షసులకు తెలియలేదు. అగ్నిహోత్రుడే కోతి రూపంలో వచ్చి ఉంటాడని వాళ్ళకు అనుమానం కలిగింది. చాలామంది రాక్షసులు మంటలకు ఆహుతి అయారు. ఎంతో అందమైన లంకానగరం బీభత్స రూపం ధరించింది. రాక్షసుల ఆర్త నాదాలు మిన్నుముట్టాయి.

హనుమంతుడి ఆగ్రహం తీరింది. అతను తృప్తిపడ్డాడు. అతను వచ్చిన పని జయప్రదమయింది. అశోకవనం



ధ్వంసమయింది. అనేకమంది రాక్షసులు చచ్చారు. లంక బూడిద అయింది. అతను వెళ్ళి, తన తోకను సముద్రంలో ముంచి చల్లార్చాడు.

అప్పుడు అతనికి తాను చాలా చెడ్డపని చేశానని పశ్చాత్తాపం కలిగింది. లంక అంతా తగలబడినాక సీత క్షేమంగా ఉంటుందా అని అతనికి భయంకలిగింది. ఆవేశం కొద్దీ లంకను తగల బెట్టుతూ తాను సీతను రక్షించాలన్న మాట మరిచాడు. నిజంగా సీతకు అపద జరిగి ఉంటే అతను అక్కడే చచ్చిపోవటానికి నిశ్చయించుకున్నాడు. అయితే అతనికి ఇంకో ఆలోచన వచ్చింది. తన తోకనే



కాల్చని అగ్నిహోత్రుడు సీతాదేవిని ఎందుకు కాల్చుతాడు? అతను శింశుపా వృక్షం వద్దకుపోయి, దానికింద ఉన్న సీతను చూసి, నమస్కరించి, "అమ్మా, నా అదృష్టం బాగుండి నువు క్షేమంగా ఉన్నావు గద!" అన్నాడు.

సీత అతనితో, "హనుమంతుడా, నీ బలం ఎలాటిదని చెప్పాలి! నువు ఒక్కడివే ఈ రాక్షసులందరినీ చంపి, నన్ను రాముడి దగ్గిరికి తీసుకుపోగలవు. కాని రాముడే వచ్చి, శత్రువులను చంపి నన్ను తీసుకుపోవటం ఉచితంగా ఉంటుంది. అందుచేత, నువే రాముణ్ణి అలా చేయమని ప్రేరేపించు," అన్నది.

"నీకు సందేహం అవసరం లేదు. రాముడు తప్పక వచ్చి నీ దుఃఖం తీర్చుతాడు," అని సీతకు చెప్పి, ఆమె వద్ద సెలవుపుచ్చుకుని, అరిష్టం అనే పర్వతం ఎక్కి, తిరిగి సముద్రాన్ని దాటటానికి సిద్ధపడి, తన దేహాన్ని పెంచాడు. అతను కాళ్ళతో పర్వతాన్ని తన్ని గాలిలోకి లేచేసరికి, అరిష్టపర్వతం అదిరింది.

అతను మబ్బుల మధ్యగా ఎగురుతూ సముద్రాన్ని దాటి, దూరాన మహేంద్ర పర్వతాన్ని చూస్తూనే గట్టిగా సింహనాదం చేశాడు. హనుమంతుడి కోసం ఆత్రంగా ఎదురుచూస్తున్న అంగదుడు మొదలైన వానరులు ఆ సింహనాదం విన్నారు. వారికి ఎక్కడలేని ఉత్సాహమూ పుట్టుకొచ్చింది.

అప్పుడు జాంబవంతుడు మిగిలిన వానరులతో, "హనుమంతుడు వెళ్ళిన పని జయప్రదం అయింది. లేకపోతే అతను ఇంత గట్టిగా సింహనాదం చెయ్యడు," అన్నాడు. ఈ మాటకు వానరులు పరమానందం చెంది, హనుమంతుణ్ణి చూడటానికి చెట్లూ, గట్లూ ఎక్కారు; అతను దూరంగా కనపడగానే చెట్లకొమ్మలు ఆడించారు.

త్వరలోనే హనుమంతుడు మహేంద్ర పర్వతం మీద దిగాడు. వానరులందరూ

అతని చుట్టూ మూగారు. వాళ్ళు అతనికి కందమూలఫలాలు తెచ్చి ఇచ్చారు. హనుమంతుడు జాంబవంతుడికీ, అంగదుడికీ, ఇతర పెద్దలకూ నమస్కారాలు చేశాడు. అతను నోరు తెరుస్తూనే, "చూశాను సీతను!" అని రెండు ముక్కల్లో ముఖ్య విషయం చెప్పాడు. ఆ మాటకు వానరులు అమితంగా సంతోషించారు. కొందరు సింహనాదాలు చేశారు. కొందరు గట్టిగా అరిచారు. కొందరు గర్జించారు. కొందరు మామూలు కోతుల్లాగా కిచకిచలాడారు. కొందరు తమ తోకలను బలంగా నేలకేసి కొట్టారు.

హనుమంతుడు వానరులతో, "సీతను చూశాను." అనేసి ఇంకేమీ చెప్పకుండా ఉండిపోయాడు.

అప్పుడు అంగదుడు హనుమంతుడితో, "హనుమంతుడా, నూరు యోజనాల సముద్రాన్ని ఇటు నుంచి అటూ, అటు నుంచి ఇటూ దాటిన నీ బలపరాక్రమాలు మరొకరికి సాధ్యం కావు. నీకు గల రాజభక్తి కూడా అసాధారణ మైనది. మా అందరి అదృష్టం కొద్దీ నువు రాముడి భార్య అయిన సీతాదేవిని చూశావు. ఇంక రాముడికి సీతా విరహం ఉండదు," అన్నాడు.

మధ్య హనుమంతుడూ, అంగదుడూ, జాంబవంతుడూ మహేంద్ర పర్వతం మీద కూర్చుంటే మిగిలిన వానరులందరూ చుట్టూ ఉన్న శిలల మీద కూర్చున్నారు. లంకలో జరిగినదంతా హనుమంతుడి నోట వినాలని వారికి కుతూహలంగా ఉన్నది.

జాంబవంతుడు హనుమంతుడితో, "నాయనా, నువు సీతాదేవిని ఎలా చూశావు? ఆవిడ ఎలా ఉన్నది? రావణుడు ఆమెను ఎలా చూస్తున్నాడు? అంతా విన్న తరవాత మనం కర్తవ్యం ఆలోచించుదాం. ఉన్నదంతా నువు దాచకుండా చెబితే, రాముడితో మనం ఏ సంగతి చెప్పవచ్చునో, ఏది దాచాలో చూసుకోవచ్చు." అన్నాడు.






హనుమంతుడు సీతను తలుచుకుని ఒక నమస్కారం చేసి, ఇలా చెప్పాడు:

"నేను మహేంద్రపర్వతం మీది నుంచి ఎగరటం మీరందరూ చూశారుగదా. నేను ఆకాశంలో పోతూండగా ఒక అందమైన బంగారు శిఖరం నా దారికి అడ్డంగా పైకి లేచింది. నేను దాన్ని బద్దలు కొట్టుదామనుకున్నాను. కాని అది నన్ను ఎంతో వాత్సల్యంతో పలకరించి, నా తండ్రి వాయుదేవుడు తనను ఇంద్రుడి బారి నుంచి కాపాడాడనీ, తన పేరు మైనాకుడనీ, రామకార్యం మీద పోతున్న నాకు సహాయం చేస్తాననీ అన్నది. నేను తొందరలో ఉన్నానని చెప్పి, మైనాకుడి వద్ద సెలవు పుచ్చుకుని, ముందుకు వెళ్ళాను. తరవాత, సర్పమాత అయిన సురస నన్ను మింగుతానని వచ్చింది. నేను అతి పవిత్రమైన పనిమీద పోతున్నాననీ, పని తీరగానే వచ్చి తనకు ఆహారమవుతాననీ చెప్పినా ఆమె వినిపించుకోలేదు. నేను అంగుళం ప్రమాణం గల దేహంతో సురస నోట దూరి, మరుక్షణం బయటికి వచ్చేశాను. తరవాత సురస నన్ను దీవించి మరీ పంపింది. మరి కొంతదూరం వెళ్ళాక నా నీడను ఏదో పట్టుకున్నది. అది సముద్రంలో ఉన్న ఒక భయంకర రాక్షసి. నేను చేసేదిలేక అతి చిన్న రూపంతో దాని లోపలికి ప్రవేశించి, దాని గుండె చీల్చి, బయటికి వచ్చాను. దాని పేరు సింహిక అని విన్నాను.

**17. మధువన విధ్వంసం**



''తరవాత నేను లంక చేరి, రహస్యంగా లంకా నగరం ప్రవేశించాను. అక్కడ లంక గొప్ప రాకసి రూపంలో నా ముందు నిలబడింది. నేను దాన్ని జయించి, సీత కోసం వెదకసాగాను. రావణుడి ఇంట సీత లేదు. ఆమె నాకు ఒక గొప్ప ఉద్యానంలో కనిపించింది. ఆమె కృశించి, జుట్టంతా జడ కట్టుకుపోయి, శోకదేవత లాగా, భయంకరులైన రాకసస్త్రీల మధ్య కనిపించింది.''

ఈ విధంగా హనుమంతుడు తాను చూచినదీ, చేసినదీ పూసగుచ్చినట్టు వానరులకు చెప్పాడు. చిట్టచివరకు అతను ఇలా అన్నాడు:

''సీత మహాపతివ్రత. ఆమెను చూడగానే నాకు ఆమెపట్ల ఎంతో భక్తికలిగింది. ఆమె వీరపత్ని. తన భర్తే రావణుణ్ణి చంపాలని ఆమె పట్టుదల. నేను ఒక మాట మీతో చెప్పాలని వచ్చాను. రావణుణ్ణి చంపటానికి మనం చాలుతాం. మనం అలాచేసి, సీతతో సహా రామలక్ష్మణుల వద్దకు పోవటం మంచిదని నా ఉద్దేశం. నిజానికి నేనే రావణుణ్ణి చంపగలను. ఇంద్రజిత్తు ప్రయోగించే అస్త్రాలు నన్నేమీ చెయ్యలేవు. మీరు సరేనంటే నేను ఇంద్రజిత్తును కూడా చంపేస్తాను. జాంబవంతుడూ, అంగదుడూ ఒంటరిగా రాకసులనందరినీ హతమార్చగలరు. ఎవరిచేతనూ చావకుండా వరం పొందిన మైందుడూ, ద్వివిదుడూ అనే మహాబలులైన రాకసులున్నారు. మీరు ఏమంటారు?''

అంగదుడు హనుమంతుడు చెప్పిన దానికి వెంటనే ఒప్పుకుని, ''ఔను! మనం సీతాదేవిని చూసినమీదట ఆమెను వెంట తీసుకుపోకుండా రాముడి దగ్గిరికి వెళ్ళటం చాలాతప్పు. 'సీతాదేవిని చూశాం గాని, ఆమెను తీసుకు రాలేదు.' అని రాముడితో ఎలా అనగలం? రాకసముఖ్యులనందరినీ హనుమంతుడు చంపనే చంపాడు. ఇక మనకు మిగిలినది

మాత్రం ఏమిటి? సీతాదేవిని తీసుకు పోదాం," అన్నాడు.

జాంబవంతుడు అంగదుడితో, "నువ్వు చెప్పినదంతా బాగానే ఉన్నది. కాని మనం రాముడి ఆజ్ఞ ప్రకారమే నడుచుకోవలసిన వాళ్ళంకదా. అలా చేద్దాం," అన్నాడు.

రాముడు వానరులతో సీతను చూసి రమ్మన్నాడుగాని, సీతను తీసుకురమ్మన లేదు. సీత వాళ్ళ వెంట రావటానికి సిద్ధంగాలేదని హనుమంతుడు వానరులకు చెప్పాడు కూడా.



అందరూ జాంబవంతుడి ఆలోచనకు సమ్మతించారు. ఇక వాళ్ళు శీఘ్రంగా రాముడివద్దకు తిరిగివెళ్ళి, సీత కనిపించినవార్త చెప్పవలసి ఉన్నది. వానరులందరూ ఆకాశమార్గాన బయలుదేరి, భూలోకానికి నందనవనం అనదగిన మధువనం చేరారు. మధువనాన్ని కాపాడటానికి సుగ్రీవుడు తన మేనమామ అయిన దధిముఖుడు అనేవాణ్ణి నియమించాడు.

మధువనం చేరగానే వానరులు మధువు తాగటానికి అంగదుడి అనుమతి కోరారు. అంగదుడు సరేనన్నాడు. సీత కనిపించిన ఆనందంలో వానరులు తప్ప తాగి, ఒకరినొకరు ఇంకా, ఇంకా తాగమని ప్రోత్సహించుకుంటూ, నృత్యాలు చేశారు: కొందరు వెర్రి నవ్వులు నవ్వారు; మరి కొందరు ఒళ్ళు తెలియకుండా పడిపోయారు; కొందరు పరుగులు తీశారు; కొందరు ఎగిరారు; మరికొందరు కేకలు పెట్టారు; కొందరు చిన్న గుంపుగా భుజాలూ, భుజాలూపట్టుకుని తిరిగారు; కొందరు రహస్యాలు చెప్పుకున్నారు; కొందరు పాడారు; ఒకళ్ళమీద ఒకళ్ళు తూలుతూ, తప్పటడుగులు వేస్తూ పడ్డారు. ఒక్కడికి కూడా ఒంటి మీద సరిఅయిన స్పృహలేదు.

వానరులు వనంలో ఉన్న మధువంతా తాగెయ్యటమేగాక, చెట్లు కూడా పాడు



చెయ్యటం చూసి దధిముఖుడు ఆగ్రహించి, వానరులనందరినీ వనంలో నుంచి పొమ్మన్నాడు. ఎవరూ వినిపించుకోలేదు. అతను నయానా, భయానా వాళ్లను హెచ్చరించయత్నించాడు. వాళ్లు అతని మీదపడి గిల్లి, రక్కి, నానావిధాలుగా పీడించారు.

హనుమంతుడు వానరులతో, ''మీరు తాగండి. ఎవరు అడ్డంవస్తారో చూస్తాను.'' అంటూ ప్రోత్సాహం ఇచ్చాడు.

''హనుమంతుడు చెడ్డపని చెయ్యమన్నా చేస్తాను; మంచిపని చెయ్యమంటే ఎందుకు చెయ్యనూ?'' అన్నాడు అంగదుడు, మైకంలో.

అంగదుడి మాటలకు వానరులు హర్షించారు. వాళ్ళు తమకు అడ్డం వచ్చిన కావలివాళ్ళను కొట్టి, మధువు తాగుతూ చెట్ల మీది పళ్ళన్నీ తిన్నారు. వాళ్ళను అడ్డేవాళ్ళు లేకపోయారు. మొత్తం మీద మధువనం నాశనమయింది.

దధిముఖుడు ఈ దురాగతాన్ని చూస్తూ ఊరుకోలేక, తన బలగాన్ని తీసుకుని భయంకరంగా అరుస్తూ, వానరుల మీదికి యుద్ధానికి వచ్చాడు.

అంగదుడు, దధిముఖుడు తన తాత అన్నది కూడా పాటించకుండా, అతన్ని చావగొట్టాడు. ఇక చేసేదిలేక దధిముఖుడు తన వాళ్ళను వెంటబెట్టుకుని సుగ్రీవుడి వద్దకు వెళ్ళాడు.

దధిముఖుడు వచ్చి తన కాళ్ళమీద పడగానే సుగ్రీవుడు, ఏం కొంప మునిగిందోనని భయపడి, ''అయ్యో, నా కాళ్ళ మీద పడ్డావేమిటి? లే, లే! నీకేమీ భయం లేదు. ఏం జరిగిందో చెప్పు. మధువనంలో అల్లరి ఏమీ లేదు గద?'' అన్నాడు.

''రాజా, నీ తండ్రి ఋక్షరజుడి కాలంలోగాని, నీ కాలంలోగాని ఎవరూ చెయ్యసాహసించని అన్యాయం మధువనానికి ఈ నాడు జరిగింది. అంగదుడు



మొదలైన వానరులు అందులోకి ప్రవేశించి, అడ్డం వచ్చినవాళ్ళను చావగొట్టి, తాగినంత మధువుతాగి, పారబోసినంత పారపోశారు. నీ భయం కూడా వాళ్ళకు లేకుండా పోయింది.'' అన్నాడు దధిముఖుడు.

దధిముఖుడు సుగ్రీవుడి వద్దకు వచ్చినది, అతని వెంట రామలక్ష్మణులున్న చోటికి. దధిముఖుడు దేనికి వేదనపడుతున్నాడో అర్థంకాక లక్ష్మణుడు సుగ్రీవుణ్ణి, ''ఇతను ఏమిటి చెబుతున్నాడు?'' అని అడిగాడు.

సుగ్రీవుడు లక్ష్మణుడితో, ''మనం సీతను వెతకటానికి దక్షిణంగా పంపిన వానరులు మధువనం చేరి అక్కడ తప్ప తాగి, నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తున్నారట. వాళ్లు సీతను చూసి ఉండాలి; లేకపోతే వాళ్ళు మధువనాన్ని చెరిచేటంత సాహసం చెయ్యరు. వారిలో హనుమంతుడు తప్పక సీత జాడను తెలుసుకోగలిగి ఉంటాడు. ఈ పని అతని వల్ల తప్ప మరొకరి వల్ల కాదు. జాంబవంతుడూ, అంగదుడూ, హనుమంతుడూ ఏకమైతే అపజయం ఉండదు. లక్ష్మణా, నువు కూడా ఆలోచించు, వాళ్ళు సీతను చూసి ఉండక పోతే ఇలా ప్రవర్తించరు. మధువనం నా తండ్రికి బ్రహ్మదేవుడు ఇచ్చినది!'' అన్నాడు.

ఈ మాట విని రామలక్ష్మణులు చాలా ఆనందించారు.

సుగ్రీవుడు దధిముఖుడితో, ''వానరులు మధువు తాగితే తాగనీ. పని చేసుకుని వచ్చారు గనుక నేను వారిని క్షమించ గలను. వాళ్ళు వెళ్ళిన పని ఎలా చేసుకు వచ్చారో వినాలని నేనూ, రామలక్ష్మణులూ కుతూహలపడుతున్నాం.'' అన్నాడు.

దధిముఖుడు సుగ్రీవుడికీ, రామ, లక్ష్మణులకూ నమస్కారాలు పెట్టి, దిగులు తీరిపోయి, వచ్చినట్లుగానే తిరిగి మధువనానికి వెళ్లి, ''అంగదుడా, మా

వాళ్ళు నిన్ను అడ్డగించారని కోపం పెట్టుకోకు. నువా యువరాజువు! ఈ మధువనం మీద నీకు ఎంత అధికారమైనా ఉన్నది. మాదే పొరపాటు! క్షమించు. మీరంతా ఇక్కడికి విచ్చేశారని సుగ్రీవుడు ఎంతో సంతోషించాడు. మిమ్మల్నందరినీ వెంటనే పంపమని చెప్పాడు," అన్నాడు.

అంగదుడు వానరులతో, "మనం ఇక్కడికి వచ్చిన వార్త రాముడికి తెలిసినట్టున్నది. మనం ఇక వెళ్ళకపోవటం మంచిదికాదు. అందరూ బాగా తాగి సేద దేరారు గనక, ఇక్కడ మన కింకేం పని?" అన్నాడు.

వానరులు బయలుదేరటానికి సిద్ధంగానే ఉన్నారు. అంగదుడు ఆజ్ఞాపించకపోయినా, అతని మాట వారికి ఆజ్ఞే. అంగదుడు ఆకాశంలోకి లేవగానే వానరులంతా లేచారు. వాళ్లు మేఘాల లాగా గర్జిస్తూ సుగ్రీవుడి వద్దకు బయలుదేరారు.

ఈ సమయంలో సుగ్రీవుడు రాముడితో, "వానరులు సీతను చూసి వచ్చారనటానికి సందేహం ఏమీ లేదు. నేను పెట్టిన గడువు దాటిపోయిన ఇంత కాలానికి వాళ్ళు తిరిగి రానేరారు. అంగదుడు పని పూర్తిచెయ్యకుండా నన్ను చూడ



లేడు; మొదలు, మధువనంలో అలా ప్రవర్తించడు. సీత సమాచారం తెలిసిందే అనుకోవచ్చు. ఇక నీ దుఃఖం తీరినట్టే!" అన్నాడు.

అదే సమయంలో వానరులు ఆకాశంలో ఎగురుతూచేసే సింహనాదాలు వినవచ్చాయి. మరి కొద్దిక్షణాలు గడిచేసరికి వానరులందరూ సుగ్రీవుడి ముందు వాలారు.

హనుమంతుడు రాముడికి సాష్టాంగ నమస్కారం చేసి, "చూశాను సీతను! ఆమె క్షేమంగా ఉన్నది," అన్నాడు. రాముడు అతని కేసి ఎంతో అప్యాయంగా చూశాడు.

అతను వానరులతో, "వానరులారా, సీతాదేవి ఎక్కడ ఉన్నది? నా పట్ల ఆమె భావం ఎలా ఉన్నది? ఏమీ దాచకుండా, అంతా నాకు వివరంగా చెప్పండి," అన్నాడు.

మిగిలిన వానరులు హనుమంతుడితో, "నువు చెప్పు," అన్నారు.

హనుమంతుడు సీత ఉన్న దిక్కుకు తిరిగి దణ్ణం పెట్టి, ఆమె తనకు ఇచ్చిన మణిని రాముడికి ఇచ్చి, తాను సీతాదేవిని ఎలా చూసినదీ చెప్పాడు :

"నేను నూరు యోజనాలు గల సముద్రాన్ని దాటి సీతాదేవిని వెతకటానికి వెళ్ళాను. అక్కడ రావణుడు ఉండే లంకాపట్టణం ఉన్నది. ఆ లంకలో సీతాదేవి రాక్షసస్త్రీల నడుమ కృశించి జీవిస్తున్నది. ఆమె అనుభవిస్తున్న కష్టాలు ఆమెకు రావలసినవి కావు. నేను ఆమెను చూసే సమయానికి ఆమె ఆత్మహత్య చేసుకోవాలని నిశ్చయించుకుని ఉన్నది. నేను ఎలాగో ఆమెకు నమ్మకం కలిగించి, ఆమెతో మాట్లాడాను. మీరు చిత్రకూటపర్వతం మీద ఉండగా జరిగిన ఒక కాకి వృత్తాంతం నీకు గుర్తుగా చెప్పింది. ఆమె నీ చూడామణిని ఎంతో శ్రద్ధగా కాపాడిందట. తాను యింక ఒక్క నెల మాత్రమే జీవించి ఉండగలనని నీకూ, సుగ్రీవుడికీ చెప్పమన్నది. అందుచేత, సముద్రం దాటే ఉపాయం ఏదో ఆలోచించండి."

హమంతుడిచ్చిన చూడామణిని రొమ్ము మీద పెట్టుకుని, రాముడు భోరున ఏడ్చాడు. అతనితో బాటు లక్ష్మణుడు కూడా ఏడ్చాడు. కళ్ళనీళ్ళు కారుతూనే, రాముడు సుగ్రీవుడితో, "ఈ చూడామణిని చూడగానే నా గుండె ద్రవించి పోతున్నది. దీన్ని జనకుడు సీతకు ఇచ్చాడు. పెళ్ళిసమయంలో సీత దాన్ని తలలో పెట్టుకున్నది. దీన్ని చూస్తే నాకు దశరథుణ్ణీ, జనకుణ్ణీ చూసినట్టుగా ఉన్నది; సీతను చూసినట్టు కూడా ఉన్నది," అన్నాడు.





# వీరహనుమాన్

సీత జాడ తెలిసిన తరవాత రాముడికి ఒక్క క్షణం కూడా అక్కడ ఉండబుద్ధి పుట్టక, సీత ముందు వాలాలనిపించింది. ఆమె భయంకరమైన రాక్షస స్త్రీల మధ్య ఉన్నదంటేనే అతను భరించలేక పోయాడు. సీత హనుమంతుడితో ఏమేమి చెప్పిందో అది వింటూంటే రాముడికి ఎంతో ఆనందం కలిగింది. అందుచేత అతను హనుమంతుణ్ణి, "సీత ఇంకా ఏమి చెప్పింది?" అని అడిగాడు. హనుమంతుడు రాముడికి కాకికథ గురించి సీత చెప్పినదంతా వివరంగా చెప్పాడు.

"సీత ఈ వృత్తాంతం చెప్పి, 'అంత శక్తిగల రాముడు వచ్చి, ఈ రాక్షసుల మీద అస్త్రాలు ఎందుకు ప్రయోగించడు? రాముడికి నా మీద ఏ కొంచెం అనురాగం ఉన్నా, వెంటనే వచ్చి రావణుణ్ణి చంపమను. కనీసం నన్ను రక్షించటానికి రాముడు లక్ష్మణుణ్ణి అయినా పంపరాదా? దేవతలనైనా జయించగల ఆ ఇద్దరూ నన్నెందుకు ఇలా ఉపేక్షించి ఊరుకున్నారు? నేనేదో పాపం చేసుకుని ఉండాలి; అందుకే రామలక్ష్మణులు వచ్చి నన్ను చూడకుండా ఉన్నారు,' అన్నది. రామలక్ష్మణు లిద్దరూ ఆమె కోసం పుట్టెడు దుఃఖంలో ఉన్నారని నేను ఆమెకు చెప్పాను. ఇంక ఆమె కష్టాలు తీరిపోతాయనీ, ఆమె దుఃఖించనవసరం లేదనీ కూడా ఆమెతో అన్నాను. ఆమె బెదిరి అన్ని దిక్కులూ చూసి, తన



జడలో ఉన్న చూడామణి తీసి నా చేతికి ఇచ్చింది; మీ అందరి క్షేమమూ అడిగి నట్టు చెప్పమన్నది. రామలక్ష్మణులూ, సుగ్రీవుడి బలాలూ వచ్చి, రావణుణ్ణి చంపేస్తారని ఆమెకు ధైర్యం చెప్పి, వచ్చేశాను,'' అన్నాడు హనుమంతుడు.

హనుమంతుడు చెప్పిన మాటలకు రాముడు పరమానందంచెంది,''ఈ హను మంతుడు చాలా గొప్పపని చేశాడు. ఇలాంటి పని మరొకరికి సాధ్యం కాదు. సముద్రాన్ని దాటగలవాళ్ళు ఈ హను మంతుడి తరవాత గరుత్మంతుడూ, వాయుదేవుడూ మాత్రమే ననుకుంటాను. లంకలో ప్రవేశించి ప్రాణాలతో బయట పడటం మాత్రం మాటలా? మొదట ప్రవేశించటమే మరొకడికి సాధ్యంకాదు! హనుమంతుడు సుగ్రీవుడి ఆజ్ఞలను మాత్రమే నిర్వర్తించక, స్వతంత్రించి, అశోకవనం ధ్వంసం చెయ్యటమూ, రాక్షసులను చంపటమూ, లంకను తగలబెట్ట టమూ మొదలైన సాహసకార్యాలు కూడా చేశాడు. ఇలాచేసి అతను సుగ్రీవుడికి అధికమైన సంతోషం కలిగించాడు. ఇతను చేసిన పని మా రఘువంశాని కంతటికీ మేలు కలిగించింది. కాకపోతే, ఈ హనుమంతుడికి తగిన సత్కారం చేయలేని స్థితిలో ఉన్నానే అని నేను బాధపడుతున్నాను. నా ప్రాణాలూ, సీత ప్రాణాలూ కాపాడిన హనుమంతుడి ఋణం ఏమిస్తే తీరుతుంది? ఒక్కసారి అతన్ని ఆలింగనం చేసుకుంటాను,'' అంటూ హనుమంతుణ్ణి గాఢాలింగనం చేసుకున్నాడు.

తరవాత రాముడు కొంచెం ఆలోచించి, ''వానరసేనలు సముద్రాన్ని దాటి, అవ తలి గట్టు చేరేది ఎలా? ఆ మాట తలుచుకుంటేనే నాకు భయంగా ఉన్నది. సీతాదేవికి ధైర్యం చెప్పినట్టు కాదు; సముద్రాన్ని దాటే ఉపాయమేమిటి?'' అంటూ హనుమంతుణ్ణి చూసి విచారంలో పడ్డాడు.

అప్పుడు సుగ్రీవుడు ఇలా అన్నాడు:
"రాముడా, ఎందుకు విచారిస్తావు? సీతాదేవి ఉన్నచోటూ, శత్రువు ఉన్న చోటూ తెలిసినమీదట మిగిలిన సమస్యలు ఏవీ శత్రువును చంపటానికి అడ్డంరావు. మనం సముద్రానికి సేతువు కట్టుదాం; రావణుణ్ణి చంపి, సీతాదేవిని తీసుకు వద్దాం. సేతువు కట్టి, లంకానగరం మన కంటపడగానే రావణుడు చచ్చినవాడి కింద జమ! ఇప్పుడు నీకు కలగదగినది విచారం కాదు, క్రోధం. సముద్రం ఎలా దాటాలన్నది మాతోబాటు నువు కూడా ఆలోచించు. సేతువు కాకపోతే మరో మార్గంగానయినా సముద్రాన్ని దాటి తీరుతాం. రావణుడు చచ్చితీరుతాడు. నీకు జయం కలిగి తీరుతుంది."

రాముడు హనుమంతుడి కేసి తిరిగి, "సముద్రాన్ని సేతువు కట్టిగాని, సముద్రాన్ని ఎండగట్టిగాని, తపస్సు చేసిగాని ఏదోవిధంగా సముద్రాన్ని దాటవచ్చునని అనుకుందాం. పోతే, లంకానగరానికి ఎన్ని దుర్గాలున్నాయి? సైన్యం ఏపాటి ఉన్నది? ద్వారరక్షణ ఏ విధమైనది? ప్రాకారాలూ మొదలైనవి ఎలా ఏర్పాటు అయి ఉన్నాయి? ప్రత్యక్షంగా చూసి ఉన్నావు గనక నాకు వివరించి చెప్పు!" అని అడిగాడు.



హనుమంతుడు రాముడికి ఇలా చెప్పాడు:

"లంకా నగరం మహా విశాలమైనది. అక్కడ అసంఖ్యాకులైన రాక్షసులు సుఖసంతోషాలతో ఉన్నారు. ఎక్కడ చూసినా రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ కనిపిస్తాయి. లంకలోకి శత్రువు ప్రవేశించటం అసాధ్యం. నగరానికి నాలుగు ద్వారాలున్నాయి; వాటికి పెద్దవీ, దృఢమైనవీ అయిన తలుపులు ఉన్నాయి. ద్వారాల వద్ద పెద్ద పెద్ద యంత్రాలు, బాణాలనూ, శిలలనూ ప్రయోగించేవి ఉన్నాయి; శత్రుసైన్యం అటుగా వస్తే ఆ యంత్రాలు దాన్ని నాశనం చెయ్యగలవు. ద్వారాల



వద్ద మహాశూరులైన రాక్షసులు ఉంటారు. వారి వద్ద ఉండే ఇనుప పరిఘలు ఒక్క దెబ్బన నూరుమందిని చంపగలవు. నగరం చుట్టూ బంగారపు ప్రాకారం ఉన్నది; దాని మీద అక్కడక్కడా రత్నాలు పొదిగి, అందంగా ఉన్న భాగాలున్నాయి. ఆ ప్రాకారాన్ని దాటటం సాధ్యంకాదు. ప్రాకారంచుట్టూ లోతయిన అగడ్త లున్నాయి; వాటిలో భయంకరమైన మొసళ్ళూ, చేపలూ ఉన్నాయి. ప్రతి ద్వారం వద్దా అగడ్తకు వంతెనలు ఉన్నాయి; వాటిని ఎత్తవచ్చు, దించవచ్చు; వాటిని అవసరాన్నిబట్టి ఎత్తటానికీ, దించటానికీ పెద్ద యంత్రాలున్నాయి. రావణుడు చాలా జాగ్రత్త గలవాడు; యుద్ధం లేనప్పుడు కూడా తన సేనలను మంచి శిక్షణలో ఉంచుతాడు. అదీగాక, లంకానగరం త్రికూట పర్వతం మీద ఉన్నది. కిందినుంచి పైకి వెళ్ళేటందుకు మార్గం లేదు. లంకకు పోవటానికి ఓడ మార్గంలేదు. అందుచేత అక్కడి వార్తలు బయటి ప్రపంచానికి అందవు. లంకా నగర ద్వారాల వద్ద లక్షల సంఖ్యలో సాయుధులైన రాక్షసులు ఉంటారు. నగర మధ్యంలో లెక్కకు మించిన రాక్షస సేన ఉన్నది. అయితే నేను అగడ్తల మీది వంతెనలను పగలగొట్టాను; లంకానగరం తగలబెట్టాను; కొందరు రాక్షస వీరులను చంపాను. అందుచేత లంకకు ఇప్పుడు అంత బలం లేదు. సముద్రాన్ని ఎలా దాటినా దాటవచ్చు. లంకను జయించటానికి మన అంగదుడూ, ద్వివిదుడూ, మైందుడూ, జాంబవంతుడూ, బనసుడూ, మన సేనానాయకుడైన నీలుడూ చాలు. వెంటనే మంచి ముహూర్తం నిశ్చయించి బయలు దేరవచ్చు.''

రాముడు సుగ్రీవుడితో, ''మనం ఇప్పుడే ప్రయాణమవుదాం. సూర్యుడు నడి నెత్తిన ఉన్నాడు. ఈ అభిజిత్తు అనే ముహూర్తం చాలా మంచిది,'' అన్నాడు.

సేనల గమనం ఎలా ఉండవలసిందీ అతను వివరంగా చెప్పాడు. సేనానాయకుడైన నీలుడు తన బలగంతో ఫలసమృద్ధి గల మార్గాలకుండా సేనను నడిపించాలి. శత్రువులు ముందుగా ఆ ప్రదేశాలను ధ్వంసం చెయ్యకుండానూ, వాళ్లు పల్లపు ప్రదేశాలలో మాటువేసి ఉండి అకస్మాత్తుగా మీదపడకుండానూ జాగ్రత్త పడాలి. సేనలు నడవబోయే మార్గాలను ఆకాశమార్గాన ముందుగా వెళ్ళి, తెలుసుకోవాలి. తక్కువ పరాక్రమవంతులు దిగబడిపోయి, మంచియోధులు మాత్రమే బయలుదేరాలి.



రాముడి వెంట వానరసేన బయలుదేరింది. మహాకాయుడైన గజుడూ, మహాబలులైన గవయుడూ, గవాక్షుడూ సేనకు ముందుండి నడిచారు. ఎగరటంలో గొప్పవాడైన ఋషభుడు సేనయొక్క కుడి పార్శ్వాన్ని రక్షించాడు; గంధమాదనుడు ఎడమ పార్శ్వాన్ని రక్షించాడు. సైన్యం మధ్యలో రాముడు హనుమంతుడి భుజాల మీద ఎక్కి కదిలాడు. అలాగే లక్ష్మణుడు అంగదుడి భుజాల మీద ఎక్కాడు. సైన్యం దక్షిణంగా బయలుదేరింది. వానరులు ఎగురుతూ, గెంతుతూ, సింహనాదాలు చేస్తూ, దారిలో కనిపించిన ఫలాలు కోసి తింటూ నడిచారు.

మహాసముద్రం లాగా కనిపించే ఆ వానరసేన కొండలూ, సరస్సులూ దాటుతూ, అరణ్యాలలో పళ్ళుతింటూ, తేనెలుతాగుతూ, కాలక్రమాన మహేంద్ర పర్వతాన్ని చేరింది.

రాముడు పర్వత శిఖరం మీద ఎక్కి సముద్రాన్ని చూశాడు. తరవాత అతను సుగ్రీవుడితోనూ, లక్ష్మణుడితోనూ కిందికి దిగివచ్చి, సముద్రతీరానికి చేరిన వానర సేనల వద్దకు వచ్చాడు. అతను సుగ్రీవుడితో, "మనం ఇక్కడ మజిలీ చేసి, ఈ సముద్రాన్ని దాటే ఆలోచన చెయ్యాలి. ఇందుకు కాలం పడుతుంది. ఎవరినీ సేనను విడిచి పోనియ్యకు. శత్రుభయం



లేకుండా సేనకంతకూ గట్టికాపలా ఏర్పాటు చెయ్యి.'' అన్నాడు.

వానరసేన మూడు భాగాలుగా చీలి సముద్రతీరాన విడిసింది.

అవతలి తీరం కానరాని ఆ మహా సముద్రాన్నీ, అందులో లేచే భయంకరమైన కెరటాలనూ, అందులో ఉండే భయంకరమైన ప్రాణులనూ తలచుకుని, వానరవీరులు, ''దీన్ని ఎలా దాటటం?'' అని తమలోతాము దిగులుపడ్డారు.

అక్కడ లంకలో హనుమంతుడి మూలంగా రావణుడికి తీరని పరాభవం జరిగింది. శత్రువులు ప్రవేశించరాని లంకలోకి ఒక కోతి సునాయాసంగా ప్రవేశించి, సీతను చూసింది; చైత్య ప్రాసాదాలు పగలగొట్టింది; అనేక మంది రాక్షసయోధులను చంపింది.

రావణుడు సభలో ఈ మాట చెప్పి, ''ఇప్పుడు మనం ఏం చెయ్యాలి? మనకు మేలు కలిగే ఉపాయం ఏమిటి?'' అని అడిగాడు.

రాముడు పెద్ద వానరసేనతో లంక మీదికి వస్తున్నాడని లంకలో తెలిసింది. రాముడి సేనలు సముద్రాన్ని దాటుతాయన్నది కూడా రావణుడు నమ్మాడు. తన సేనకూ, వానరసేనకూ మధ్య యుద్ధం జరిగితే తన పట్టణానికీ, సేనకూ అపాయం కలగకుండా ఉండే మార్గం అతను తెలుసుకోగోరాడు.

ఆలోచనలేని రాక్షసులు, ''రాజా, మనకు అంతులేని సేన ఉన్నది. అద్భుతమైన ఆయుధాలు ఉన్నాయి. ఎందుకు విచారం?'' అన్నారు; అతను లోగడ సాధించిన ఘనవిజయాలను గురించి మాట్లాడారు. శివుడి స్నేహంగల కుబేరుణ్ణే రావణుడు జయించాడు; పాతాళంలో మహా సర్పాలు అతనికి ఓడారు. అతనికి ఓడని రాజు లేడు. ఈ రాముడు ఏపాటి? వానరుల మాటకు వస్తే ఇంద్రజిత్తు ఒక్కడే వానరుల నందరినీ నాశనం చెయ్యగలడు.

ప్రహస్తుడు రావణుడితో, "రాజా, నీకు దేవ, దానవ, గంధర్వులూ, పిశాచాలూ ఎదురు నిలవలేవు; కోతులనగా ఎంత? మనం అజాగ్రత్తగా ఉన్న సమయంలో హనుమంతుడు వచ్చి ఇంత చెయ్యగలిగాడు గాని, లేకపోతే వాడు ప్రాణాలతో ఇక్కడినుంచి పోగలిగి ఉండునా? నీ అజ్ఞ అయితే నేను వెళ్ళి భూప్రపంచంలో ఉన్న వానరుల నందరినీ చంపి, సృష్టిలో వానరుడనేవాడు లేకుండా చేస్తాను," అన్నాడు.

దుర్ముఖుడనే రాకసుడు కూడా తాను వెంటనే వెళ్ళి వానరుల నందరినీ చంపుతాననీ, హనుమంతుడు చేసిన పని రాకసులకూ, ప్రత్యేకించి రావణుడికీ ఎంతో అవమానమనీ అన్నాడు. వజ్రదంష్ట్రుడనే రాకసుడు కూడా తాను ఒక్కడే వెళ్ళి, వానరులతోబాటు రామ, లక్ష్మణ, సుగ్రీవులను కూడా చంపేస్తానన్నాడు. చంపటానికి వాడి చేతిలో పరిఘ ఒకటి సిద్ధంగానే ఉన్నది.

వాడు ఇంకో ఉపాయం కూడా చెప్పాడు. అదేమిటంటే, కామరూపులైన రాకసులు మనుష్య రూపాలు ధరించి, అనేక వేల సంఖ్యలో రాముడి వద్దకు వెళ్ళి, తమను భరతుడు పంపించాడనీ, తమ వెనకగా భరతుడు పంపిన సేన వస్తున్నదనీ చెప్పాలి. అప్పుడు లంకలో నుంచి రాకససేన వెళ్ళి, ఆకాశం నుంచి రాళ్ళూ, రప్పలూ కురిపించి, వానర సేనను చంపెయ్యాలి! తరవాత రామలక్ష్మణులు గుండెలు పగిలి చస్తారు!

"నేను ఒక్కణ్ణేపోయి రామ, లక్ష్మణ, సుగ్రీవ, హనుమంతులను చంపేసి, చక్కావస్తాను," అన్నాడు నికుంభుడు. వాడు కుంభకర్ణుడి కొడుకు. వజ్రహనుడనేవాడు తాను వెళ్ళి వానరులనందరినీ తినేస్తా నన్నాడు. ఆ మాట తలుచుకుంటేనే వాడికి నోరు ఊరింది.

మొత్తం మీద రాకస వీరులందరూ లేచి, రకరకాల ఆయుధాలు ఎత్తిపట్టుకుని యుద్ధానికి సిద్ధమయ్యారు.





# వీర హనుమాన్

హనుమంతుణ్ణి చంపేస్తామని అయుధాలు పట్టి లేచి నిలబడిన విశుంభుడు మొదలైన రాక్షసులను కూర్చోమని చెప్పి, విభీషణుడు రావణుడికి నమస్కరించి ఇలా అన్నాడు :

"సామదాన భేదోపాయాలతో సాధ్యం కాని సమయంలోనే దండోపాయాన్ని అవలంబించాలని పెద్దలు చెబుతారు. రాముడి బలాన్ని తక్కువ చేసి చూడ వద్దు. హనుమంతుడు సముద్రం దాటి వచ్చి ఇంత అల్లకల్లోలం చేశాడంటే, దైవం వాళ్ళకు అనుకూలంగా ఉన్నట్టు స్పష్టమవుతున్నది. రాముడు ఖరుడు మొదలైన రాక్షసులను చంపినందుకు ప్రతిక్రియగా రావణుడు సీతను తెచ్చాడని అంటున్నారు. అది సరికాదు. తనను చంపటానికి వచ్చినప్పుడే రాముడు ఆ రాక్షసులను చంపాడు. ఆత్మరక్షణ తప్పుకాదు గదా! మనం సీతను తీసుకు వచ్చి ప్రమాదాన్ని తెచ్చుకున్నాము. వైరం కలిగించేది ఎంత మంచిదైతే ఏం లాభం? మనం సీతను రాముడికి ఇచ్చెయ్యాలి. మహాపరాక్రమశాలి అయిన రాముడితో అనవసరంగా వైరం తెచ్చుకోవటం దేనికి? రాముడు లంకానగరాన్ని ముట్టడించక ముందే సీతను ఇయ్యటం మేలు. లేని పక్షంలో లంకకూ, రాక్షసులకూ కూడా చేటు! నేను చెప్పినది నిజమూ, యదార్థమూ కూడానూ. కోపం వల్ల సుఖమూ, ధర్మమూ కూడా



చెడతాయి. నేను చెప్పినట్టు చేస్తే అందరమూ సుఖంగా ఉంటాం.''

విభీషణుడి మాటలు రావణుడికి నచ్చలేదు. అతను కోపంగా, ''నాకు ఎవరి భయమూలేదు. రాముడు సీతను నా వద్ద నుంచి తీసుకుపోలేడు. దేవేంద్రుణ్ణి తోడు తెచ్చుకున్నా రాముడు యుద్ధంలో నా ముందు నిలవలేడు,'' అన్నాడు.

మర్నాడు రావణుడు యుద్ధతంత్రం గురించి మంత్రులతో ఆలోచించటానికి, రత్నాలంకారాలు గల బంగారు రథం మీద ఆలోచనా మందిరానికి బయలుదేరాడు. అతని వెంట ఆయుధాలు ధరించిన రాక్షసులు నడిచారు. అతను సభకు చేరుతూనే దూతలను పంపి రాక్షసులను పిలిపించాడు. రాక్షసులు వచ్చి ఆసనాల మీదా, దర్భాసనాల మీదా కూర్చున్నారు.

సభ నిశ్శబ్దంగా ఉన్నది. రావణుడు ఏమి చెప్పుతాడోనని అందరూ ఆత్రంగా చూస్తున్నారు. రావణుడు ప్రహస్తుడి కేసి తిరిగి, ''సేనానాయకా, పట్టణాన్ని మరింత శ్రద్ధగా కాపాడటానికి మంచి యోధులను నియమించు,'' అన్నాడు.

ప్రహస్తుడు అప్పటి కప్పుడే పట్టణ రక్షణకు సైన్యాన్ని నియోగించి, ''ఇంకా ఏం చెయ్యమంటారు?'' అని అడిగాడు.

రావణుడు సభను ఉద్దేశించి ఇలా అన్నాడు:

''ధర్మార్థ కామాల విషయంలో సంకటం కలిగినప్పుడు మంచి చెడ్డలు గ్రహించడంలో మీరు సమర్థులు. మీరు చేసిన నిర్ణయాలు ఎప్పుడూ మంచి ఫలితాలనే ఇచ్చాయి. నేను చెప్పే విషయం కుంభకర్ణుడికి తప్ప మీకందరికీ తెలిసినదే. అతను గడిచిన ఆరుమాసాలూ నిద్రపోతూ ఉండి, ఇప్పుడు ఇక్కడికి వచ్చి ఉన్నాడు. నేను దండకారణ్యం నుంచి, రాముడి భార్య అయిన సీతను తెచ్చాను. సీత వంటి సౌందర్యవతి మూడు లోకాల లోనూ లేదు. నేను ఆమెను మోహిం

చాను. కాని ఆమె నాకు లోబడక నన్ను ఒక సంవత్సరం గడువు అడిగింది. అందుకు నేను సరేనన్నాను. ఈలోగా రాముడు వస్తాడని ఆమె ఆశకావచ్చు. కాని సముద్రాన్నిదాటి రాముడు ఇక్కడికి ఎలా వస్తాడు? అయితే, ఒకవేళ రామలక్ష్మణులు దాటి వస్తే ఏం చెయ్యాలి? ఒక్క కోతి వచ్చి ఇంత భీభత్సం చేసి పోయింది గదా! అందుచేత కర్తవ్యం చక్కగా ఆలోచించండి! సముద్రం అవతలి ఒడ్డున రామలక్ష్మణులూ, సుగ్రీవుడు వానరసేనతోనూ ఉన్నారు. సీతను ఇచ్చెయ్యకపోతే మీరు రామలక్ష్మణులను చంపగలరు కదా! వానరసేన సముద్రాన్ని దాటి రాగలదా? అన్నీ ఆలోచించండి.''



రావణు డీ మాటలు అంటే కుంభకర్ణుడికి చాలా కోపం వచ్చింది. అతను రావణుడితో, ''నువు బలాత్కారంగా రాముడి భార్యను తెచ్చేటప్పుడు ఎవరితోనూ ఆలోచించావు కావు. ఇప్పుడు మాతో ఆలోచించే దేమిటి? ఇది చేతులు కాలినాక ఆకులు పట్టుకున్నట్టున్నది. సీతను ఎత్తుకు రావటం ఎంత అపాయకరమో నువు తెలుసుకోలేదు. కాని అదృష్టవశాన రాముడు ఇప్పటి దాకా నిన్ను చంపలేదు. ఇప్పుడు నీ కేమీ భయం లేదు. నీ శత్రువులందరినీ నేను చంపుతాను. నేను ఇనుపగద తీసుకుని యుద్ధానికి పోతే ఇంద్రుడు కూడా పారిపోవలసిందే! నేను రామలక్ష్మణులను చంపి, వానరులను తినేస్తాను. నువు నిశ్చింతగా ఉండు,'' అన్నాడు.

ఈ మాటలకు రావణుడు అలిగినట్టు మహాపార్శ్వుడికి తోచింది. రావణుడి అలక పోగొట్టటానికి అతను ఇలా అన్నాడు:

''నువు సీతను అనుభవించాలనుకుని శ్రమపడి ఆమెను తెచ్చుకున్నాక, ఊరుకోవటం దేనికి? బలాత్కారంగా నైనా ఆమెను అనుభవించు. నువే అందరినీ ఆజ్ఞాపించగల వాడివి, నిన్ను అడ్డేదెవరు?



అందువల్ల ఏం ప్రమాదం వస్తుందోనని నువు భయపడనవసరం లేదు. ఈ కుంభకర్ణుడూ, ఇంద్రజిత్తూ ఉండగా ఎవరు యుద్ధానికి వచ్చినా భయం లేదు.''

ఈ మాటకు రావణుడు సంతోషించి, మహాపార్శ్వుడితో, ''ఒక రహస్యం ఉన్నది. వెనక నేనొక పని చేశాను. బ్రహ్మదేవుడి ఇంటికి పోతున్న పుంజికస్థల అనే అప్సరసను చూసి, బలాత్కారంగా ఆమెను అనుభవించాను. పుంజికస్థల ఈ విషయం బ్రహ్మతో చెప్పింది కాబోలు. ఆయన నన్ను హెచ్చరిస్తూ, పరస్త్రీని బలాత్కరిస్తే నా తల నూరు చెక్కలై పోతుందన్నాడు. అందుకే నేను సీతను బలాత్కరించటానికి భయపడుతున్నాను. నాకున్న వేగమూ, గమనమూ తెలియక రాముడు నా మీదికి వస్తున్నాడు. అతను అజ్ఞాని కావటం చేత మృత్యువుతో చెలగాటాలాడుతున్నాడు,'' అన్నాడు.

కుంభకర్ణుడి మాటలూ, రావణుడి మాటలూ విన్న మీదట విభీషణుడు, ''రాక్షసరాజా, నువు ఈ సీతను ఎందుకు కోరావు? ఆమె మహాసర్పం. ఆమె రొమ్ములో పడగ ఉన్నది, చింత అనే విషం ఉన్నది, చిరునవ్వులో కోరలున్నాయి, ఆమె చేతి వేళ్ళు పాముతలలు. వానరయోధులు లంకలో అడుగు పెట్టక ముందే సీతను రాముడికి ఇచ్చెయ్యి. ఈ కుంభకర్ణుడుగాని, ఇంద్రజిత్తుగాని, మహాపార్శ్వుడుగాని, యుద్ధంలో రాముడి ముందు నిలవరు. రాముడు నిన్ను ప్రాణాలతో విడవడు," అన్నాడు.

ప్రహస్తుడు విభీషణుడి మాటలను కొట్టేసి, రావణుడికి ఎవరూ అడ్డులేరన్నాడు. ఇంద్రజిత్తు విభీషణుడికి భయం పట్టుకున్నదని ఆక్షేపించాడు! ''పులస్త్యవంశంలో నీ వంటి పరాక్రమశూన్యుడు మరొకడు లేడు. రామలక్ష్మణులను చంపటానికి రాక్షస వీరులలో ఏ ఒక్కడైనా చాలునే! నువెందుకు భయపడుతున్నావు? ఇంద్రుణ్ణి ఓడించి,

దేవతలను పీడించిన నేను మనుషులను జయించలేనా ?'' అని విభీషణుణ్ణి అడిగాడు.

''నాయనా, నువు చెప్పే మాటలు రాక్షసవంశానికి చేటు తెస్తాయి. రాముడి బాణాల ముందు ఎవరూ నిలవలేరు. అతనికి సీతను ఇచ్చెయ్యటం అన్ని విధాలా మంచిది,'' అన్నాడు విభీషణుడు.

రావణుడు ఇక సహించలేక, విభీష ణుణ్ణి నానామాటలూ అని, ''నువు తమ్ముడివి గనక బతికిపోయావు. ఈ మాటలే ఇంకొకడు అన్నట్టుంటే ఆక్షణమే ప్రాణాలు తీసి ఉందును!'' అన్నాడు.



విభీషణుడికి కోపం వచ్చింది. అతను రావణుడితో, "నువు నాకు అన్నవు, తండ్రివంటి వాడివి. నీక్షేమం కోరి చెప్పిన మాటలు నీకు రుచించలేదు. నీకు రుచించే మాటలు చెప్పేవాళ్ళు చాలా మంది ఉంటారు. నేను నీకు కోపం తెప్పించినందుకు క్షమించు. నేను వెళ్ళి పోతున్నాను కనక నువు సుఖంగా ఉండు. నిన్ను నువు రక్షించుకో, ఈ రాక్షసులనూ, లంకాపట్టణాన్నీ రక్షించుకో,'' అన్నాడు.

విభీషణుడు తన గద తీసుకుని మరి నలుగురు రాక్షసులతో సహా ఆకాశంలోకి లేచి, రామలక్ష్మణులున్న చోటికి వచ్చే శాడు. ఆ అయిదుగురూ ఆకాశమార్గాన తమ కేసి వస్తూండటం వానరులకు కని పించింది. ఆ వచ్చేవాళ్ళు తమ రహ స్యాలను తెలుసుకోవటానికో, తమను చంపటానికో వస్తున్నారని సుగ్రీవుడికి అను మానం కలిగింది. అతను ఆ మాట హనుమంతుడు మొదలైన వాళ్ళతో అనే సరికి, వాళ్ళు చెట్లూ, రాళ్ళూ తీసుకుని, ఆ వచ్చేవాళ్ళను చంపటానికి సుగ్రీవుడి అనుమతి కోరారు.

విభీషణుడూ, అతని వెంట ఉన్న అనలుడూ, శరభుడూ, సంపాతీ, ప్రఘ సుడూ అనే రాక్షసులూ, ఆకాశంలోనే నిలిచారు. విభీషణుడు సుగ్రీవుడితోనూ, వానరులతోనూ గట్టిగా ఇలా అన్నాడు :



"దుర్మార్గుడూ, రాక్షసరాజూ అయిన రావణుడికి నేను తమ్ముణ్ణి. నా పేరు విభీషణుడు. రావణుడు జటాయువును చంపి, జనస్థానం నుంచి సీతను తెచ్చాడు. ఆ సీత ఎంతో దుఃఖిస్తూ, రాక్షసస్త్రీల రక్షణలో ఉన్నది. సీతను రాముడికి ఇచ్చెయ్యమని నేను అతనితో మంచిగా ఎన్నోసార్లు చెప్పాను. విధి తరుముతూ ఉండటం చేత, ఔషధంలాటి నా హితం అతనికి రుచించలేదు. పైపెచ్చు, నన్ను నానామాటలూ అని, సేవకుణ్ణిలాగా అవమానించాడు. అందుచేత నేను భార్యాపుత్రులను విడిచిపెట్టి రాముడి శరణు కోరి వచ్చాను."

ఈ మాటవిని సుగ్రీవుడు రాముడితో, "రావణుడి తమ్ముడు, విభీషణు డనే వాడు నలుగురు రాక్షసులను వెంటబెట్టుకుని నీ శరణుకోరి వచ్చాడు. జాగ్రత్త! ఈ రాక్షసులు మాయం కాగలరు; కామరూపులు; శూరులు; జిత్తులలో ఆరితేరిన వాళ్ళు. వాళ్ళను నమ్మరాదు. ఈ విభీషణుడు రావణుడు పంపిన చారుడు కావచ్చు. అతను మనలో వాడుగానే ఉంటూ మన మధ్య విభేదాలు కలిగించవచ్చు; లేదా అవకాశం చూసుకుని మనని చంపవచ్చు. సాక్షాత్తూ రావణుడి తమ్ముడు, శత్రుపక్షం నుంచి వచ్చాడు! ఇతన్ని ఎలా నమ్మటం? ఇతన్నీ, ఇతని నలుగురు అనుచరులనూ చంపెయ్యటమే మంచిది!" అన్నాడు.

సుగ్రీవుడు చెప్పిన మాటలను విని రాముడు తన సమీపంలో ఉన్న హనుమంతుడు మొదలైన వాళ్ళతో, "సుగ్రీవుడు బాగా ఆలోచించి చెప్పిన మాటలు విన్నారు కదా. మీకు ఏం తోస్తున్నదో మీరు కూడా చెప్పండి," అన్నాడు.

మొదట అంగదుడు ఇలా అన్నాడు: "ఏమైనా శత్రు పక్షం వాణ్ణి గుడ్డిగా నమ్మరాదు. అందువల్ల చాలా నష్టం ఉంటుంది. ముందు ఈ విభీషణుడి తత్వం తెలుసుకోవాలి."

"ఇతని దగ్గిరికి వెంటనే ఒక చారుణ్ణి పంపటం, సరిఅయినమార్గంగా తోస్తుంది," అన్నాడు శరభుడు.

జాంబవంతుడు, "నీ శత్రువైన రావణుడి వద్దనుంచి ఈ విభీషణుడు ఇలా వచ్చెయ్యటానికి ఎలాటి కారణమూ కనిపించదు. అతన్ని శంకించక తప్పదు," అన్నాడు.

"మన మనిషి వెళ్ళి విభీషణుణ్ణి రావణాసురుడి వృత్తాంతం ఏమిటని అడిగితే బాగుంటుంది. అతను ఎలాంటి వాడో వెంటనే తెలిసిపోతుంది," అన్నాడు మైందుడు.

హనుమంతుడు ఇలా అన్నాడు:

"విభీషణుణ్ణి పరీక్షించి చేరదీయాలని ఇంతమందీ చెప్పిన మాట నాకు సరిగా కనబడలేదు. అతన్ని చేరదీస్తేనే గాని అతని మంచి చెడ్డలు తెలియవు; మంచి చెడ్డలు తెలుసుకునిగాని మనం అతన్ని చేరదీయరాదు—ఇది ఎలా పరిష్కారం అవుతుంది? ఇక చారుణ్ణి ఎదురుగా ఉన్న వాడి వద్దకు పంపటం అర్థం లేని పని; దూరాన ఉన్నవాడి వద్దకైతే పంపవచ్చు. జాంబవంతుడి మాట కూడా నిజం కాదు. కాలమూ, దేశమూ కలిసి రావటం చేతనే విభీషణుడు వచ్చాడు. నిన్నూ, రావణుణ్ణీ పోల్చి చూచి, రావణుడికి హితం చెప్పి, అతని చేత అవమానం పొంది, అతన్ని విడిచి నీ వద్దకు వచ్చాడు. అతని రాక అకారణం కాదు. మైందుడు చెప్పినట్లు ఎవరైనా వెళ్ళి, రావణుడి సంగతి అడగగానే విభీషణుడు తడుముకోకుండా చెప్పేస్తాడా? విభీషణుడు తాను ఎందుకొచ్చాడో చెప్పాడు. అందులో నాకు తప్పు ఏమీ కనబడలేదు. అతను దొంగలాగా లేడు, నిర్భయంగా ఉన్నాడు. వాలిని చంపి సుగ్రీవుడికి వానరరాజ్యం ఇచ్చినట్టుగానే, రావణుణ్ణి చంపి తనకు లంకారాజ్యం ఇస్తావని ఇతను నీ వద్దకు వచ్చాడని నాకు తోస్తుంది. విభీషణుణ్ణి చేరదీయవచ్చునని నా ఉద్దేశం. తరువాత నీ యిష్టం!"






విభీషణుడి విషయంలో హనుమంతు డిచ్చిన సలహా విన్న మీదట రాముడు అందరూ వినేటట్టుగా ఇలా అన్నాడు:

"విభీషణుడు చెడ్డవాడే అయినప్పటికీ శరణాగతి కోరిన వాడిని విడిచి పుచ్చటం అధర్మం."

"ఇతను చెడ్డవాడైనా, మంచివాడే అయినా అతనితో మనకు ఏం పని?" అని సుగ్రీవుడు అడిగాడు. చిక్కులలో ఉన్న అన్నను విడిచివచ్చిన వాడు కృతఘ్నుడనీ, ఎవరినైనా విడవగలడనీ సుగ్రీవుడి అభిప్రాయం.

రాముడు లక్ష్మణుడితో సుగ్రీవుడి అభిప్రాయాన్ని ఖండిస్తూ మాట్లాడాడు. జ్ఞాతుల మధ్య వైరం ఉంటుంది. అన్నకు భయపడి విభీషణుడు వచ్చాడు. అతనికి అన్న రాజ్యం కావాలి. అందు చేత అతను రాముణ్ణీ, వానరులనూ విడిచి పుచ్చడు.

"మనని చంపటానికి రావణుడే ఇతన్ని పంపి ఉంటాడు. ఇతన్ని చేరదీయటం అపాయకరం," అన్నాడు లక్ష్మణుడు. రావణుడి తమ్ముణ్ణి ఎలా నమ్మటమని సుగ్రీవుడు అడిగాడు.

కాని రాముడు శరణాగతుడికి ఆశ్రయమివ్వటం పరమ ధర్మమనీ, అతణ్ణి నిరాకరించటం మహా పాపమనీ, అతను విభీషణుడి వేషంలో వచ్చిన రావణుడే అయినా చేరదీస్తాననీ చెప్పి, అతన్ని తీసుకురమ్మని సుగ్రీవుడితో అన్నాడు.

20. శుకుడి రాయబారం

సుగ్రీవుడు వెళ్ళి, వెంటనే విభీషణు డితో తిరిగి వచ్చాడు. విభీషణుడు, తన వెంట ఉన్న నలుగురు రాక్షసులతో సహా రాముడి పాదాలకు వందనం చేసి, "నేను రావణుడి తమ్ముణ్ణి. అతను నన్ను అవ మానించాడు. అందుచేత నిన్ను శరణు జొచ్చాను. అందుకోసం నేను లంకలోని నా వాళ్ళందరినీ, బంధుమిత్రులనూ, భార్యాబిడ్డలనూ, నా సంపద అంతటినీ వదిలి పెట్టాను. ఇక నా రాజ్యమూ, జీవితమూ, సుఖమూ నీ అధీనంలో ఉన్నాయి," అన్నాడు.

రాముడి చెవులకు ఈ మాటలు ఎంతో మధురంగా సోకాయి. అతను విభీషణుణ్ణి రాక్షసుల బలాబలాలు వివరించి చెప్ప మని అడిగాడు. విభీషణుడు ఇలా చెప్పాడు :

బ్రహ్మదేవుడి వరం వల్ల రావణుడు గంధర్వులకుగాని, నాగులకుగాని, రాక్షసులకుగాని, ఏ భూతాలకుగాని ఓడడు. అతని తమ్ముడూ, విభీషణుడికి అన్నా అయిన కుంభకర్ణుడు పరాక్రమంలో ఇంద్రుడికి తీసిపోడు. రావణుడి కొడుకు ఇంద్రజిత్తు తన వేళ్ళకూ, శరీరానికీ అభేద్యమైన కవచాలు ధరించి, యుద్ధం చేస్తూనే అదృశ్యం కాగలడు; అందుకోసం అతను యుద్ధం మధ్యలోనే అగ్నిని అర్చిస్తాడు. రావణుడి సేనాపతులు దిక్పాలకులకు సమమైన పరాక్రమం కలిగిన వాళ్ళు. ఇష్టంవచ్చిన రూపం



ధరించగల రాక్షసులు లంకలో అసంఖ్యాకులున్నారు. అలాటి రాక్షసుల సహాయంతో రావణుడు దిక్పాలకులను జయించాడు.

అంతావిని రాముడు, ''నేను రావణుణ్ణీ అతని రాక్షస వీరులనూ చంపి, నిన్ను లంకకు రాజుగా చేస్తాను, ఇది నా ప్రతిజ్ఞ. రావణుణ్ణి అతని బంధువులతో సహా చంపక నేను అయోధ్యకు తిరిగి వెళ్ళను. నా తమ్ముల మీద ప్రమాణం చేసి చెబుతున్నాను,'' అని విభీషణుడితో అన్నాడు.

ఈ మాటవిని విభీషణుడు రాముడికి సాష్టాంగ నమస్కారం చేసి, ''నేను కూడా నా శక్తికొద్దీ రాక్షసులను చంపటానికీ, లంకానగరాన్ని జయించటానికీ సహాయపడతాను; శత్రువులతో యుద్ధం చేస్తాను,'' అన్నాడు.

రాముడు సంతోషంతో విభీషణుణ్ణి కౌగలించుకుని, లక్ష్మణుడితో, ''లక్ష్మణా, సముద్రజలం తెచ్చి, విభీషణుణ్ణి రాక్షస రాజుగా అభిషేకించు,'' అన్నాడు.

వానరుల మధ్య విభీషణుడికి రాక్షస రాజ్యాభిషేకం జరిగింది. వానరులు సింహనాదాలు చేసి, రాముణ్ణి పొగడారు.

తరవాత సుగ్రీవుడూ, హనుమంతుడూ ఏకాంతంగా విభీషణుడితో, ''మనమంతా ఈ వానరులతో సహా ఈ మహాసముద్రాన్ని ఎలా దాటటం?'' అన్నారు.

దానికి విభీషణుడు, ''రాముడు సముద్రుడి శరణుపొందాలి. రాముడి





పూర్వుడైన సగరుడు సముద్రానికి ఎంతో మేలు చేశాడు కనక, సముద్రుడు రామ కార్యానికి అన్నివిధాలా సహాయ పడతాడు," అన్నాడు.

సుగ్రీవుడు రామలక్ష్మణులున్న చోటికి వచ్చి, విభీషణుడు చెప్పిన మాట చెప్పాడు. రాముడు విభీషణుడి సలహాతో తృప్తిపడి, సుగ్రీవుణ్ణీ, లక్ష్మణుణ్ణీ వాళ్ళ అభిప్రాయం అడిగాడు. వాళ్ళు కూడా విభీషణుడి అభిప్రాయాన్ని బలపరిచారు.

అప్పుడు రాముడు సముద్రతీరాన దర్భలు పరిచి, వాటి పైన పడుకున్నాడు.

ఇదే సమయంలో రావణుడి చారుడైన శార్దూలుడు అనే రాక్షసుడు వచ్చి, వానర సేన అంతా కలయజూసి వెళ్ళి, రావణుడితో ఇలా చెప్పాడు:

"వానర భల్లూకసేన మరో సముద్రం లాగున్నది. రామలక్ష్మణులు ఉత్తమాయుధాలు ధరించి, సీత కోసం రావటానికి సిద్ధంగా ఉన్నారు. వాళ్ళు సముద్రం దగ్గిర విడిసి ఉన్నారు. నేను పైపైన చూసి వచ్చాను. వివరంగా చూసి రావటానికి ఎవరినైనా పంపు."

రావణుడు శుకుడు అనే రాక్షసుడితో, సుగ్రీవుడితో ఇలా చెప్పమన్నాడు:

సుగ్రీవుడా, నేను రాముడి భార్యను తీసుకురావటానికీ, వానరరాజువైన నీకూ ఏమిటి సంబంధం? ఏమీ లేదు! నువు బుద్ధిమంతుడివి. బాగా ఆలోచించుకుని, కిష్కింధకు తిరిగి వెళ్ళు. దేవతలూ, గంధర్వులూ ప్రవేశించలేని లంకానగరాన్ని వానరులు ప్రవేశిస్తారన్నది వట్టి మాట."

శుకుడు రావణుడి సందేశాన్ని విని, పక్షి రూపం ధరించి, వానరసేనలున్న ఉత్తర తీరానికి చేరాడు: వాడు సుగ్రీవుడికి ఎగువగా ఆకాశంలోనే ఉండి, రావణుడు చెప్పమన్న మాటలు చెప్పాడు.

అలా మాట్లాడే శుకుణ్ణి చంపేద్దామని వేగంగా కొందరు వానరులు ఆకాశంలోకి లేచి, శుకుణ్ణి పట్టుకుని నేలకేసి కొట్టారు,



వాడు రాముడితో, ''రాముడా, దూతను చంపవచ్చునా ? ఈ వానరులు నన్ను చంపేస్తున్నారు. వద్దని చెప్పు,'' అన్నాడు.

రాముడు వానరులను వారించాడు. శుకుడు రెక్కలు విదిల్చి, ఆకాశంలోకి ఎగిరి, ''సుగ్రీవా, రావణుడితో ఏం చెప్ప మంటావు ?'' అని అడిగాడు.

సుగ్రీవుడు రావణుడితో తన మాటగా ఇలా చెప్పమని శుకుడితో అన్నాడు :

''నువు నాకు స్నేహితుడివి కావు. నువు నాకు ఎలాటి ఉపకారమూ చేసి ఉండలేదు. పై పెచ్చు నా స్నేహితుడైన రాముడికి శత్రువువు. నా శత్రువైన వాలికి మిత్రుడివి. ఈ రెండు విధాలా నాకు శత్రువువు. వాలి చచ్చినట్టు నువూ చస్తావు. నేను నిన్నూ, నీ కొడుకులనూ, బంధువులనూ, దాయాదులనూ చంపే స్తాను. త్వరలోనే మహాసేనతో లంకకు వచ్చి, దాన్ని నిర్మూలిస్తాను. రాముడి బారినుంచి నిన్ను దేవేంద్రాదులు కూడా రక్షించలేరు. సీతను అపహరించటం గొప్ప కాదు. రామలక్ష్మణులకు భయపడి, వాళ్ళు లేని సమయంలో ఆ పనిచేశావు. వాళ్ళ చేతిలో నీకు చావు మూడింది.''

ఈ సందేశంతో శుకుడు వెళ్ళిపోకుండా అంగదుడు అడ్డుతగిలి, సుగ్రీవుడితో, ''వీడు దూత కాడు, రావణుడి వేగుల వాడులాగున్నాడు. మన సేనలను పరిశీ లిస్తున్నాడు,'' అన్నాడు.

వెంటనే సుగ్రీవుడు శుకుణ్ణి పట్టుకో మని వానరులను ఆజ్ఞాపించాడు. శుకుడు మళ్ళీ వానరులకు చిక్కి, ''అయ్యో, నా రెక్కలు విరిచారు. కళ్ళు పీకు తున్నారు,'' అని ఆక్రోశించేసరికి, రాముడు అడ్డుపడి, వాణ్ణి వానరుల బారినుంచి విడిపించాడు.

తరవాత రాముడు సముద్రతీరాన దర్భలు పరిచి, సముద్రానికి నమస్కారం చేసి, చెయ్యి తల కింద పెట్టుకుని దర్భల మీద పడుకున్నాడు. అతని ముఖం సముద్రం కేసి ఉన్నది. అతను అలా

పడుకుని, సముద్రుణ్ణి ధ్యానిస్తూ మూడు రాత్రులు గడిపాడు. కాని సముద్రుడు ప్రత్యక్షం కాలేదు.

రాముడికి కోపం వచ్చింది. కళ్ళు ఎర్రబడ్డాయి. అతను లక్ష్మణుడితో, "ఈ సముద్రుడు ఎందుకు రాడు? అతడికి ఎంత గర్వం! నా బాణాలతో ఈ సముద్రంలోని ప్రాణులన్నిటినీ చంపి, సముద్రాన్ని అల్లకల్లోలం చేస్తాను. నా విల్లూ, బాణాలూ తీసుకురా," అన్నాడు.

లక్ష్మణుడు వాటిని తెచ్చి ఇచ్చాడు. రాముడు విల్లు ఎక్కుపెట్టి, వజ్రాయుధాలలాటి బాణాలను సముద్రం మీద ప్రయోగించాడు. అవి సముద్రజలంలో ప్రవేశించి, తరంగాలూ, పొగలూ భయంకరంగా లేపాయి.

రాముడు ఇంకా బాణాలు వేయబోవటం చూసి, ఇలా అయితే మూడు లోకాలూ మండిపోతాయనుకుని, "వద్దు, వద్దు. మరి బాణాలు వేయకు," అంటూ రాముడి విల్లు పట్టుకున్నాడు లక్ష్మణుడు.

అయితే ఇంకా సముద్రుడు కనిపించలేదు. అందుచేత రాముడు సముద్రుడితో, "ఓ సముద్రుడా, నిన్ను నా బాణాలతో ఎండగట్టేసి, ఎడారి చేసేస్తాను. నా బలపరాక్రమాలను నువు ఊహించను కూడా



లేవు. నీ అజ్ఞానానికి కారణం నీలో ఉన్న దానవులతో నువు చేసిన స్నేహం అయిఉంటుంది," అన్నాడు.

ఇలా అని రాముడు తన వింటికి బ్రహ్మాస్త్రం సంధించి, చెవిదాకా లాగి, విడవటానికి సిద్ధంగా ఉండగా, ఆకాశమూ, భూమీ దద్దరిల్లాయి. కొండలు గజగజలాడాయి. ఒక్కసారిగా చీకటి కమ్మినట్టయింది. ఆకాశంలో ప్రచండమైన వాయువులు వీచాయ. ప్రాణులు ఆర్తనాదాలు చేశాయి. సముద్రం ఒక యోజనం వెనక్కు తీసింది. అది చూసి రాముడు తన అస్త్రాన్ని వదలడం మానుకున్నాడు.

అంతలో సముద్ర మధ్యంలో సముద్రుడు కనిపించాడు. అతడి శరీరం వైడూర్యకాంతి కలిగి ఉన్నది. అతను దివ్యపుష్పమాలికలు ధరించి, బంగారు ఆభరణాలు అలంకరించుకుని, గంగా, సింధు మొదలైన నదులను వెంటబెట్టుకుని సాక్షాత్కరించాడు.

సముద్రుడు రాముడి వద్దకు వచ్చి, చేతులు జోడించి, "రామా! లోతూ, గాంభీర్యమూ నా సహజ గుణాలు. నా జలాన్ని స్తంభించటం నాకు శక్యం కాదు. నా చేతిలో ఉన్నదేమంటే, నీ సేన నన్ను దాటేదాకా సముద్రప్రాణుల వల్ల మీకు ఎలాటి భయమూ లేకుండా నేను చూడగలను," అన్నాడు.

"అలా అయితే ఈ ఎక్కుపెట్టిన బాణాన్ని ఎక్కడ ప్రయోగించను?" అని రాముడు సముద్రుణ్ణి అడిగాడు.

"ఇటు ఉత్తరంగా ఒక ప్రదేశం ఉన్నది. అక్కడ ఆభీరులనే పాపాత్ములు ఉండి, పాపకార్యాలు చేస్తున్నారు. నీ బాణాన్ని వారిపైన ప్రయోగించి, సర్వనాశనం చెయ్యి," అన్నాడు సముద్రుడు రాముడితో.

రాముడు సముద్రుడు చెప్పినట్టే చేశాడు. అది పడినచోటు సర్వనాశనమయిపోయింది. బాణం పడినచోట పాతాళజలం పైకి వచ్చింది. దానికి వ్రణకూపమని పేరు.

తరవాత సముద్రుడు రాముడితో, "నలుడు అనే వానరుడు విశ్వకర్మ కొడుకు. ఇతను సముద్రం మీద సేతువు కట్టుతాడు. ఆ సేతువు నీటిలో మునిగిపోకుండా నేను చూస్తాను," అని చెప్పి అంతర్ధానమయాడు.

నలుడు రాముడితో తాను విశ్వకర్మ కొడుకునేననీ, విశ్వకర్మ నుంచి వరాలు పొందాననీ, సేతువు కట్టటం తనకు సాధ్యమేననీ, కావాలంటే వానరులు అప్పటికప్పుడే సేతువును కట్టటం కాలయాపన చెయ్యకుండా ప్రారంభించవచ్చుననీ అన్నాడు.





# వీర హనుమాన్

తరవాత రాముడు ఆజ్ఞాపించగా, వానరులు గుంపులు గుంపులుగా అరణ్యంలోకి వెళ్ళి, రకరకాల చెట్లను పెల్లగించుకుని వచ్చి సముద్రంలో వేయనారంభించారు. ఇంకా బలవంతులు ఏనుగులంతేసి రాళ్ళను తెచ్చి సముద్రంలో వేస్తూంటె సముద్రపు నీరు ఆకాశమంత ఎత్తు ఎగిరింది. సముద్రమంతా కెలకబారింది.

ఈ విధంగా తయారవుతున్న సేతువు ఎగుడు దిగుడు కాకుండా కొందరు తాళ్ళు పట్టుకున్నారు; కొందరు కొలత బద్దలు ఉపయోగించారు. నలుడు తలపెట్టిన సేతువు పదియోజనాల వెడల్పూ, నూరు యోజనాల నిడివీగలది. రోజుకు సుమారు ఇరవైయోజనాల చొప్పున, అయిదు రోజులలో సేతువు నిర్మాణం పూర్తి అయింది. నలుడి సామర్థ్యం వల్లనే ఆ పని విజయవంతంగా జరిగింది. వానరులు పరమానందంతో ఆటూ ఇటూ ఎగిరారు.

చక్కని రాజమార్గంలాగా తయారైన ఆ సేతువు మీద వానరసేనలు సముద్రాన్ని దాటి అవతలి ఒడ్డు చేరాయి. శత్రువులు వస్తే చంపటానికి విభీషణుడు గదతీసుకుని, తన నలుగురు అనుచరులతో సహా సేతువు అవతలి చివర నిలబడ్డాడు.

సేతువును దాటేటప్పుడు హనుమంతుడి మీద రాముడూ, అంగదుడి మీద లక్ష్మణుడూ ఎక్కి కూర్చున్నారు. వాళ్ళు కాలినడకన సేతువును దాట

## 21. వానరసేనల లంకా ప్రవేశం



టానికి సుగ్రీవుడు ఒప్పుకోలేదు. హనుమంతుడూ, అంగదుడూ కూడా ఆకాశగమనంతోనె రామ, లక్ష్మణులను చేరవేశారు. మరికొందరు వానరులు కూడా గాలిలో ఎగురుతూపోయారు. వానరులు అధిక సంఖ్యలో ఉండటం చేత రద్దీ ఎక్కువై, కొందరు సముద్రంలో పడి, పైకి వచ్చారు. సేతువు దాటేటప్పుడు వానరులు చేసిన కోలాహలంలో సముద్ర ఘోషకూడా వినిపించలేదు.

సముద్రం అవతలి ఒడ్డున ఫలసమృద్ధిగల అరణ్యాలూ, వానరసేన విడియటానికి తగిన ప్రదేశాలూ ఉన్నాయి. కాని రాముడు వెంటనే లంకానగరం కేసి వానరసేనను నడిపించ నిర్ణయించాడు. రాముడు ముందు నడవగా వానరులు సింహనాదాలు చేస్తూ లంకానగరానికి బయలుదేరారు. వానరుల ఉత్సాహం చూసి రాముడు సంతోషించాడు.

వానరసేన లంకానగరం బయట విడియగానె నగరంలో నుంచి భేరుల ధ్వనులూ, మృదంగాల ధ్వనులూ, రాక్షసుల ఆర్భాటాలూ వినవచ్చాయి. వానరులకు కోపం వచ్చి, అంతకంటె గట్టిగా సింహనాదాలు చేశారు. లంకలో ధ్వజాల మీద ఎత్తిన రకరకాల పతాకలను చూస్తూ, రాముడు సీతను తలచుకుని దుఃఖించాడు.

అతను లక్ష్మణుడితో, "త్రికూట పర్వతం మీద ఆకాశాన్ని అంటుతున్నట్టుగా విశ్వకర్మ నిర్మించిన ఆ లంకా నగరాన్ని చూడు." అన్నాడు.

తరవాత అతను వానరసేనను వ్యూహంగా ఎలా అమర్చాలో చెప్పాడు. అంగదుడు నీలుడితో సహా తన సేనను వ్యూహం మధ్య ఉంచాలి. ఋషభుడూ, అతని సేనా కుడిపార్శ్వంలో ఉంటారు. గంధమాదనుడు తన సేనతోసహా ఎడమ పార్శ్వంలో ఉంటాడు. రామ, లక్ష్మణులు వ్యూహం ముందు ఉంటారు. సుగ్రీవుడు సేనల వెనకపక్క ఉంటాడు. మొత్తం

వానరసేన గరుడ వ్యూహంలో అమర్చబడింది. లంకను పిండి కొట్టాలని వానరులకు మహా ఆత్రంగా ఉన్నది.

రాముడు సుగ్రీవుడితో, "రావణుడి దూత అయిన శుకుణ్ణి ఇప్పుడు వదిలిపెట్టు," అన్నాడు.

వానరుల చేత నానాబాధలూ పడి, ప్రాణభయంతో కొట్టుకుంటున్న శుకుడు, తనను సుగ్రీవుడు విడిచిపెట్టగానే వేగంగా రావణుడి వద్దకు వెళ్ళాడు. రావణుడు శుకుణ్ణి చూసి నవ్వుతూ, "రెక్కలు తెగినట్టుగా కనబడుతున్నాయి. వానరులకు వెరికిపోలేదు కద?" అని అడిగాడు. శుకుడు రావణుడితో ఇలా అన్నాడు:

"నేను సముద్రం అవతలి గట్టుకు ఎగిరి వెళ్ళి, సుగ్రీవుడితో నువు చెప్పమన్నమాటలే పొల్లుపోకుండా చెప్పాను. వానరులకు కోపం వచ్చి, ఎగిరి నన్ను పట్టుకుని, చిత్రహింసలు పెట్టారు. ఆ వానరులు మాట్లాడరు, మాట్లాడితే వినరు. వాళ్ళ నుంచి జవాబు సంపాదించటం ఎలా? వాళ్ళు ముక్కోపులూ, క్రూరులూనూ. సముద్రానికి సేతువు కట్టి, సముద్రం దాటి రాముడు లంకాద్వారాన్ని చేరాడు. ఎలుగుబంట్లూ, వానరులూ నేల ఈనినట్టుగా భూమినంతా ఆక్రమించి ఉన్నారు. వానరులకూ, రాక్షసులకూ యుద్ధం తప్పదు. వానరులు ఏ క్షణాన అయినా లంకా ప్రాకారాలను ఎక్కవచ్చు.





ఇస్తే సీతను రాముడికి ఇయ్యి, లేదా యుద్ధం చెయ్యి.''

ఈ మాట వినగానే రావణుడికి కోపంతో కళ్ళు ఎర్రబడ్డాయి.

''లోకాలన్నీ నా మీదికి వచ్చినా నేను సీతను ఇయ్యను. చాలాకాలంగా యుద్ధం లేక నా భుజాలు తీటగా ఉన్నాయి. నా సంగతి తెలియక రాముడు నా మీదికి యుద్ధానికి వచ్చాడు. నా బాణాలదెబ్బ అతను ఓరగడు.'' అన్నాడు రావణుడు.

అతను తన మంత్రులైన శుక, సారణులతో, ''సముద్రానికి సేతువు కట్టటమనేది అపూర్వం. నేను నమ్మను! మీరు రహస్యంగా వెళ్ళి, నిజంగా సేతువు నిర్మాణం జరిగిందో లేదో, వానరసేన ఏపాటి ఉన్నదో, రాముడి అస్త్రశస్త్రాలు ఏవో తెలుసుకుని రండి,'' అన్నాడు.

వాళ్ళిద్దరూ వానరరూపాలు ధరించి, వానరసేనలో ప్రవేశించారు. అంతులేని వానరసేనను లెక్కించటం వారికి సాధ్యం కాలేదు. వానరసేన సమస్త ప్రదేశాలనూ ఆక్రమించటమే గాక, ఇంకా కొంతసేన సేతువును దాటి వస్తూనే ఉన్నది.

ఇంతలో విభీషణుడు వాళ్ళిద్దరినీ పోల్చి పట్టుకుని, రాముడితో, ''వీళ్లు శుక, సారణులు అనే రాక్షసులు. రావణుడి మంత్రులు. వానరరూపాలతో, మన రహస్యాలు తెలుసుకునేటందుకు లంక నుంచి వచ్చారు,'' అని చెప్పాడు.

అప్పుడు వాళ్ళిద్దరూ రాముడికి దణ్ణం పెట్టి, విభీషణుడు చెప్పినది నిజమేనని ఒప్పుకున్నారు. రాముడు నవ్వి, ''మా సైన్యమంతా చూడండి. మమ్మల్ని చక్కగా పరీక్షించండి. తరవాత లంకకు తిరిగి పోండి. మీరు చూడటం పూర్తి కాకపోతే విభీషణుడు మీకు సేన అంతా చూపుతాడు. మీరు నిరాయుధులు గనక మిమ్మల్ని చంపరాదు,'' అంటూ, వాళ్లను పోనియ్యమని విభీషణుడితో చెప్పాడు.

రాముడు వాళ్ళద్వారా రావణుడికి ఒక సందేశం కూడా పంపాడు. అదేమి

టంటే: "రావణుడా. రేపు తెల్లవారుతూనే నా కోపాన్ని నీపై వజ్రాయుధంలాగా ప్రయోగించబోతున్నాను.''

శుక, సారణులు రాముడికి జయం పలికి, రావణుడి వద్దకు వెళ్ళి, ''రాజా. వానరసేనలో ప్రవేశించిన మమ్మల్ని విభీషణుడు పోల్చిపట్టుకుని, రాముడికి అప్పగించాడు. రాముడు మమ్మల్ని దయదలచి విడిచిపుచ్చాడు. ఆమాట అటుంచి, ఆ వానరసేనకు రామ, లక్ష్మణ, విభీషణ, సుగ్రీవులున్నారు, ఇంకేం కావాలి. రాముడి బాణాలు చూస్తే, అతనికి ఎవరి సహాయమూ అవసరం లేదనే అనిపిస్తుంది. వానరసేన సముద్రం దాటి వచ్చింది. దాని మేర తెలియరావటం లేదు. వానరులు మంచి యుద్ధోత్సాహంలో ఉన్నారు. యుద్ధం మాని, సీతను రాముడికి ఇచ్చెయ్యి,'' అన్నారు.

రావణుడు సారణుడితో, ''సీతను ఇయ్యను. నువు సౌమ్యుడివి. శూరుడివి కావు. వానరసేనను చూసి దడుచుకున్నావు. నన్ను యుద్ధంలో ఎవడు జయించగలడు?'' అన్నాడు.

అతనికి వానరసేనను చూడాలనిపించింది. అతను తన మేడపై భాగానికి ఎక్కి, లంకానగరం చుట్టూ గల పర్వతాలూ, అరణ్యాలూ వానరమయంగా ఉండటం గమనించాడు. అతను తన సమీపంలో ఉన్న సారణుడితో, ''ఈ సేనలో బలవంతులూ, శూరులూ,





యుద్ధంలో ప్రముఖంగా పోరాడగలవారూ ఎవరు? ముఖ్యసేనా నాయకులెవరు? సుగ్రీవుడి సలహాదార్లు ఎవరు?'' అన్నాడు.

దానికి సారణుడు ఇలా చెప్పాడు:

''నీలుడు వానరసేనా నాయకుడు. అంగదుడు వానర రాజ్యానికి యువరాజు. అతను వాలి కొడుకూ, వాలి అంతటి వాడూనూ. హనుమంతుడు మనకు ముందు తెలిసినవాడే. సేతువు నిర్మించిన నలుడు మహాపరాక్రమశాలి. అతని వెంట ఉన్న వానర సేన జయించరానిది. ఆ తెల్లని వానరుడు శ్వేతుడు, యుద్ధంలో మహాభయంకరుడు. ఎరుపు, పసుపు వెంట్రుకలు తోకలోగలవాడు కుముదుడు. ఇతనికి దయాదాక్షిణ్యాలు లేవు. యుద్ధం కోసం తహతహలాడుతున్నాడు.''

ఈ విధంగా చెబుతూ సారణుడు రావణుడికి రంభుడూ, శరభుడూ, పనసుడూ అనే వానర వీరులను గురించీ, ఇతర వానర సేనాపతులను గురించీ చెప్పాడు. తరవాత అతను భల్లూక ప్రముఖులను గురించి కూడా చెప్పాడు. భల్లూకాలలో ప్రముఖుడు జాంబవంతుడు.

సారణుడు వదిలేసిన వివరాలను శుకుడు రావణుడికి చెప్పాడు. హనుమంతుడి సమీపంలో ఉన్న రామలక్ష్మణులను ఇతనే రావణుడికి చూపాడు. రావణుడు రాముడి సమీపంలో తన తమ్ముడైన విభీషణుణ్ణి కూడా చూశాడు. అతనికి ఒక్క క్షణంపాటు భయంకలిగి, వెంటనే కోపంగామారింది. శుకసారణులు శత్రువుల శౌర్య పరాక్రమాలను గొప్పగా చెప్పినందుకు అతను వారిని మందలించి, ''మీవంటి మంత్రులను పెట్టుకున్న నేను ఎప్పుడో చచ్చి ఉండవలసింది. మీరు లోగడ చేసిన మేలుతలచి, మిమ్మల్ని చంపకుండా వదులుతున్నాను. వెళ్ళిపొండి.'' అన్నాడు. రావణుడికి జయం పలికి వాళ్ళు వెళ్ళిపోయారు.

తరవాత రావణుడు మహోదరుడితో చెప్పి, కొందరు వేగులవాళ్ళను పిలిపించి,

''రాముణ్ణి గురించి సమస్తమూ తెలుసుకు రండి," అన్నాడు.

ఆ చారులు మారు రూపాలు ధరించి, సువేలపర్వతం దగ్గిరలో ఉన్న రామ, లక్ష్మణు, విభీషణు, సుగ్రీవులున్న చోటికి వెళ్ళారు. రామ, లక్ష్మణులనూ, వానర సేననూ చూస్తూనే వారికి దడపట్టు కున్నది. దానికితోడు విభీషణుడు వాళ్ళను కనిపెట్టి, పట్టుకున్నాడు. ఆ చారులలో శార్దూలుడనేవాడు చాలా దుష్టుడు. వానరులు వాణ్ణి చంపే లోపున రాముడు అడ్డపడి, శార్దూలుడితో బాటు మిగిలిన చారులను కూడా విడిపించాడు. వాళ్ళు కొద్ది దెబ్బలతో తప్పించుకుని లంకకు తిరిగి వెళ్ళారు.

శార్దూలుణ్ణి చూసి రావణుడు ఏదో జరిగిందని గ్రహించాడు. వాడు రావణుడితో, ''వానరులను గురించి తెలుసు కోవటం ఎంత మాత్రమూ సాధ్యం కాదు. నేను విభీషణుడి అనుచరులకు దొరికి పోయాను, తరవాత వానరులు నన్ను నానాహింసలూ పెట్టారు. రాముడు నన్ను వానరుల బారినుంచి రక్షించాడు. అదృష్టం బాగుండి, బతికి బయట పడ్డాను. రాముడు లంకను ముట్టడించటానికి సిద్ధంగా ఉన్నాడు. సీతను రాముడికి ఇయ్యటమో, యుద్ధానికి సిద్ధంకావటమో చెయ్యటం మంచిది.'' అన్నాడు.

రావణుడు సీతనియ్యనని మళ్ళీ చెప్పి, వానర ప్రముఖులను గురించి శార్దూలుడి ద్వారా కూడా తెలుసుకున్నాడు.

తరవాత అతను విద్యుజ్జిహ్వుడనే రాక్షసుణ్ణి వెంట బెట్టుకుని సీత ఉండే చోటికి బయలుదేరాడు. అతను విద్యుజ్జిహ్వుడితో, ''నువ్వు నీ మాయ చేత రాముడి తల ఒకటి కల్పించు. దానితో బాటు ఒక గొప్ప ధనుస్సూ, బాణాలూ తయారు చెయ్యి. వాటితో మనం సీతను మోసం చేద్దాం.'' అన్నాడు.

విద్యుజ్జిహ్వుడు సరేనన్నాడు. రావణుడు వాడికి తన ఆభరణం ఒకటి తీసి, బహుమానంగా ఇచ్చాడు.





# వీర హనుమాన్

రావణుడు అశోకవనంలో ఉన్న సీతను చూడబోయేసరికి, ఆమె భయంకర రాక్షస స్త్రీల నడుమ, తల వంచి కన్నీరు కార్చుతూ, రాముణ్ణి గురించే ఆలోచిస్తూ కూర్చుని ఉన్నది.

ఎంతో మంచి శుభవార్త తెచ్చిన వాడిలాగా అభినయిస్తూ, రావణుడు ఉత్సాహంగా సీతతో, "అయిపోయిందే! నీ రాముడు యుద్ధంలో చచ్చిపోయాడు. ఇక నువు నా భార్యవు కావటానికి ఎలాటి అడ్డంకి లేదు. నా భార్య లందరి మీదా నిన్ను పెద్ద భార్యను చేస్తాను. రాముడు ఎలా చచ్చాడో చెబుతాను విను. రాముడు వానర సేనతో సముద్రాన్ని దాటి, విడిశాడు. ప్రయాణపు బడలిక చేత అందరూ గాఢ నిద్రలో ఉండగా, ప్రహస్తుడు పెద్ద రాక్షస సేనతో వెళ్ళి వానర సేనను నాశనం చేశాడు. రాముడు నిద్రపోతూండగా ప్రహస్తుడే అతని తలను నరికాడు. పారిపోదామని ఆకాశంలోకి ఎగిరిన విభీషణుణ్ణి రాక్షసులు పట్టుకున్నారు. లక్ష్మణుడూ, కొందరు వానరులూ పరిగెత్తారు. సుగ్రీవుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ, మిగిలిన వానర వీరులూ తలలు తెగి చచ్చిపడి ఉన్నారు. వానరుల శవాలు అంతటా కుప్పలు కుప్పలుగా పడి ఉన్నాయి," అన్నాడు.

తరవాత అతను ఒక రాక్షసితో, "రాముడి తల తీసుకు వచ్చిన

22. లంకానగర ముట్టడి



విద్యుజ్జిహ్వుణ్ణి పిలుచుకురా!'' అని సీత వినేలాగా అన్నాడు.

విద్యుజ్జిహ్వుడు రాముడి తలనూ, విల్లునూ తీసుకు వచ్చి, రావణుడికి నమస్కరించి నిలబడ్డాడు. రావణుడు వాడితో, '' ఆ రాముడి తల సీత ముందు ఉంచు. ఈ నిర్భాగ్యురాలు తన భర్త గతి చివరకు ఎలాగయిందో చూసుకోనీ,'' అన్నాడు.

విద్యుజ్జిహ్వుడు రాముడి తలను సీత ముందు పెట్టి అవతలికి వెళ్ళాడు. వాడి చేతి నుంచి రావణుడు విల్లు తీసుకుని, సీతతో '' ప్రహస్తుడు నిద్రపోతున్న రాముడి తల నరికిన అనంతరం ఈ విల్లు ఇక్కడికి తెచ్చాడు. ఇక నీకు నేను తప్ప గతి లేదు,'' అన్నాడు.

సీత ఆ రాముడి తలను పరీక్షగా చూసి, కళ్ళూ, తల వెంట్రుకలూ, తల మీది చూడామణీ గుర్తుపట్టి గట్టిగా ఏడుస్తూ, కైకను తిట్టిపోసింది. తరవాత ఆమె స్పృహతప్పి పడిపోయింది. తిరిగి స్పృహరాగానే ఆమె రాముడి తల దగ్గిరికి తీసుకుని, అతని కోసం చాలాసేపు ఏడ్చింది. రాముడి చావు గురించి కౌసల్య లక్ష్మణుడి ద్వారా విని, గుండె పగిలి చచ్చిపోతుంది. రాముడి వంశమంతా నాశనమైపోతుంది. ఇదంతా తన మూలాన జరుగుతుందని తెలియక రాముడు తనని పెళ్ళాడాడు.

ఆమె రావణుడితో, '' నన్ను తీసుకుపోయి ఆ రాముడి మీద పడవేసి, భార్యాభర్తలను ఏకం చేసిన పుణ్యం కట్టుకో. నేను రాముడితో సహగమనం చేస్తాను,'' అంటూ ఏడ్చింది.

ఆమె అలా ఏడుస్తూండగా ఒక రాక్షసుడు వచ్చి, రావణుడికి నమస్కరించి, సేనాపతి అయిన ప్రహస్తుడు వచ్చి ఉన్నాడని చెప్పాడు. అతని వెంట మంత్రులందరూ ఉన్నారట. ఆ మాట వింటూనే రావణుడు బయలుదేరి తన మంత్రులను చూడబోయాడు. అతను

అశోకవనం చాటగానే రాముడి తలా, విల్లూ అంతర్థానమయాయి.

ఇంతలో విభీషణుడి భార్య అయిన సరమ సీత వద్దకు వచ్చింది. సరమ చాలా మంచిది. ఆమె సీత పట్ల చాలా స్నేహంగా ఉండేది. ఆమె సీతను ఊరడిస్తూ. "రావణుడి భయాన్ని కూడా లక్ష్యపెట్టకుండా చాటున ఉండి, నీకూ, రావణుడికీ జరిగిన సంభాషణ అంతా విన్నాను. రావణుడు అకస్మాత్తుగా ఎందుకు వెళ్ళాడో తెలుసా? ఆ భేరీల మోత విన్నావా? సైనికులను సన్నద్ధం చేస్తున్నారు. యుద్ధానికి ఏనుగులనూ, గుర్రాలనూ సిద్ధం చేస్తున్నారు. రావణుడు రాముడితో యుద్ధానికి తయారవుతున్నాడు. రామలక్ష్మణులు రాక్షసుల నందరిని చంపి, నీ కష్టాలు గట్టెక్కిస్తారు." అన్నది.



ఈ మాటలకు సీత ఆవేదన కొంత చల్లబడింది.

సరమ సీతతో ఇంకా ఇలా చెప్పింది:

"నేను ఆకాశమార్గాన రాముడి వద్దకు వెళ్ళి, నువు క్షేమంగా ఉన్నావని చెప్పి రావాలనుకుంటున్నాను. నేను ఆకాశంలో గరుత్మంతుడి కన్న వేగంగా పోగలను, తెలుసా?"

"నువు ఆకాశంలో పోగలవన్నా, పాతాళానికిపోగలవన్నా నేను నమ్మగలను. నా కోరిక తీర్చదలుచుకుంటే ఇప్పుడు రావణుడు ఏంచేస్తున్నాడో తెలుసుకునిరా. నాకు రావణుడి భయమే హెచ్చుగా ఉన్నది. రావణుడు ఏంచెయ్యబోతున్నాడో చెబితే నేను నీకు కృతజ్ఞురాలుగా ఉంటాను." అని సీత అన్నది.

సరమ సీత ముఖాన కన్నీరు తుడిచి, వెంటనే వెళ్ళి, రావణుడు తన మంత్రులతో మాట్లాడేదంతా విని, తిరిగి వచ్చి, సీతతో ఇలా చెప్పింది:

"నిన్ను విడిచెయ్యమని రావణుడికి అతని తల్లి, అవిద్ధు అనే ముసలి మంత్రి ఎంతో దూరం బోధించారు. లేకపోతే అపాయం ఉన్నదని కూడా వాళ్ళు



హెచ్చరించారు. కాని వాళ్లు ఎంత చెప్పినా రావణుడు వినలేదు. యుద్ధంలో చచ్చేదాకా రావణుడు నిన్ను విడవడు. అతని మంత్రులు కూడా అతన్ని బలపరుస్తున్నారు."

సరమ మాట్లాడుతూండగానే వానర సైన్యాలు చేసే భేరీనాదాలూ, శంఖనాదాలూ, సింహనాదాలూ భూమి దద్దరిల్లేలాగా వినిపించాయి. రాముడు లంకా నగరం మీదికి బయలుదేరాడు.

రావణుడు వానరసేనల కోలాహలం విని, సభలో తన మంత్రులతో, "మీరు లోగడ హనుమంతుడు సముద్రాన్ని దాటటం గురించి, రాముడి సేనను గురించి గొప్పగా చెప్పారు. విన్నాను. ఇప్పుడు రాముడి పరాక్రమం తలచుకుని, నిరుత్సాహపడి, ఒకరి మొహాలు ఒకరు చూడటం కూడా కనిపిస్తూనే ఉన్నది." అన్నాడు.

ఈమాట విని మాల్యవంతు డనే రాక్షసుడు, "రాజా, రాముడు మన కన్న బలవంతుడైనప్పుడు అతనితో సంధి చేసుకోవటం తప్పుకాదు. రాముడికీ, మనకూ వైరకారణం సీత. ఆమెను రాముడికి ఇచ్చేస్తే వైరంలేదు," అన్నాడు. రావణుడికి కోతుల వల్లా, కొండముచ్చులవల్లా, భల్లూకాల వల్లా చావులేకుండా వరం లేదన్న సంగతి కూడా మాల్యవంతుడు జ్ఞాపకం చేశాడు.

మాల్యవంతుడి మాట రావణుడికి కొంచెం కూడా రుచించ లేదు. అతను మాల్యవంతుడి కేసి తీక్ష్ణంగా చూసి, "హితం చెప్పుతున్నట్టు నటిస్తూ, కటువైన మోసపు మాటలు ఎందుకు చెప్పావు? రాముడు మామూలు మనిషి; ఒంటరిగాడు; తండ్రి చేత విడవబడిన వాడు; కోతులు సహాయంగా గలవాడు; అడవులు పట్టి తిరుగుతున్నవాడు. అలాటివాడు సమర్థుడని ఎలా చెప్పావు? సమస్త రాకసులకూ ప్రభువును; సమస్త దేవతలనూ హడలగొట్టిన పరాక్రమశాలిని.

నేను అతనికి ఎందుకు తీసిపోయాను? నీ జాతిలోనే మహావీరుడు ఉండటం సహించలేకనో, లేక శత్రుపక్షపాతంతోనో నువు అలా మాట్లాడి ఉంటావు గాని, మరో కారణం లేదు. నేను సీతను అరణ్యం నుంచి తెచ్చింది తిరిగి ఇచ్చెయ్యటానికా? నే రాముడితో యుద్ధానికి భయపడటమా? రాముడు అంత బలవంతుడైతే నా తల తీయనీ, కాని తల వంచటం నా స్వభావం కాదు," అన్నాడు.



రావణుడికి కోపం వచ్చిందని గ్రహించి మాల్యవంతుడు మౌనం వహించాడు. అతను విజయం కలగాలని రావణుణ్ణి దీవించి వెళ్ళిపోయాక, రావణుడు మంత్రులతో రక్షణచర్యలు చర్చించాడు.

లంకా నగరపు పడమటి ద్వారాన ఇంద్రజిత్తూ, ఉత్తర ద్వారాన శుకసారణులూ, మధ్యలో విరూపాక్షుడూ రాక్షససైనికులతో సహా ఉండేటట్టు నిర్ణయించి, మంత్రుల చేత "జయ, జయ!" అనిపించుకుని రావణుడు అంతఃపురానికి వెళ్ళాడు.

రాముడు వానర ప్రముఖులందరితో లంకానగరం చేరాక, వారిలో వారు ఇలా అనుకున్నారు:

"ఇదుగో, లంకానగరం. దీన్ని జయించటం దేవతలకు కూడా సాధ్యం కాదు. అందుచేత మనం ఇప్పుడు ఏం చెయ్యాలి?"

విభీషణుడు వారితో, "నా మంత్రులు లంకకు పక్షుల రూపంలో వెళ్ళి అక్కడి ఏర్పాట్లన్నీ చూసి వచ్చారు. ప్రహస్తుడు సేనతో తూర్పు ద్వారాన్నీ, మహోదర, మహాపార్శ్వులు దక్షిణ ద్వారాన్నీ కాస్తున్నారు. ఇంద్రజిత్తు పశ్చిమ ద్వారాన్నీ, విరూపాక్షుడు నగర మధ్యాన్నీ కాస్తున్నారు," అని చెప్పాడు.

అతని మంత్రులు కూడా రాముడికి తాము చూసి వచ్చిన వివరాలు చెప్పారు.

తరవాత రాముడికి హెచ్చరికగా ఉండగలందులకు విభీషణుడు, రావణుడి



వెంట అతనితో సమాన బలపరాక్రమాలు గల రాక్షసులు అరవై లక్షల మంది ఉన్నారని చెప్పాడు. తన వీరులు ఎవరు ఎవరితో యుద్ధం చెయ్యాలో రాముడు చెప్పాడు.

నలుడు తూర్పుద్వారం వద్ద ఉన్న ప్రహస్తుడితోనూ, అంగదుడు దక్షిణద్వారం వద్ద ఉన్న మహాపార్శ్వ, మహోదరులతోనూ, హనుమంతుడు పడమటి ద్వారం దగ్గిరా, ఉత్తరద్వారం వద్ద ఉన్న రావణుడితో రాముడూ యుద్ధం చెయ్యాలి. అతని వెంట లక్ష్మణుడు కూడా ఉంటాడు. సుగ్రీవుడూ, జాంబవంతుడూ, విభీషణుడూ మధ్యసేనతో యుద్ధం చేస్తారు. యుద్ధ మప్పుడు వానరులు మనుష్య రూపాలు ధరించరాదు. అలా అయితే గాని ఎవరు "మన" వాళ్ళో తెలియదు. రామ, లక్ష్మణులూ, హనుమంతుడూ, సుగ్రీవుడూ, నీలుడూ, అంగదుడూ, విభీషణుడూ మాత్రమే మనుష్యరూపాలతో యుద్ధం చేస్తారు.

ఇలా నిర్ణయించిన అనంతరం రాముడు లక్ష్మణుడితో సహా, మహా అందమైన సువేలపర్వతం ఎక్కాడు. అతని వెంట విభీషణుడు మొదలైన వాళ్ళు కూడా ఎక్కి, ఆ రాత్రి అక్కడ గడప నిశ్చయించారు. సువేలపర్వత శిఖరం మీది నుంచి చూస్తే, త్రికూట పర్వతం మీద నిర్మించిన లంకానగరం కనబడుతుంది. రాముడు మొదలైన వాళ్ళు లంకానగరాన్నేగాక, అందులో ఉన్న రాక్షసులను కూడా చూశారు. వానరులు సింహనాదాలు చేశారు.

ఇంతలో సూర్యుడు అస్తమించాడు. అందరూ ఆ రాత్రి సువేలపర్వత శిఖరం మీదనే గడిపారు. మర్నాడు తెల్లవారగానే వారికి లంకలోని వనాలూ, ఉపవనాలూ ఎంతో అందంగా కనిపించాయి. లంకకు అంతటికీ ఎత్తయినది రావణుడి ఇల్లు. దాని చుట్టూ ఎత్తయిన చైత్యప్రాసాదం ఉన్నది.

అంతలో సుగ్రీవుడికి రావణుడు కని పించాడు. సుగ్రీవుడు అతనితో, "రావ ణుడా, నేను రాముడి స్నేహితుణ్ణి; బంటును. నేను నిన్ను విడిచిపెట్టను," అన్నాడు.

"నీ పేరు మంచి కంఠంగలవాడు. కాని నీకు అసలు కంఠమే లేకుండా చేస్తాను," అంటూ రావణుడు సుగ్రీవుడి మీదికి లంఘించాడు. ఇద్దరూ భయం కరంగా పోట్లాడుకున్నారు.

చాలా సేపు ఇద్దరూ సమంగానే పోరాడారుగాని, క్రమంగా రావణుడికి ఆయాసం వచ్చి, అతను మాయలకు దిగాడు. అది గ్రహించి సుగ్రీవుడు చప్పున ఆకాశంలోకి ఎగిరాడు. అతను తిరిగి వస్తాడని రావణుడు అనుకున్నాడు గాని, సుగ్రీవుడు వెళ్లి, రాముడి పక్కన వాలాడు.

రాముడు సుగ్రీవుణ్ణి మందలిస్తూ, "నాతో చెప్పకుండా ఎందుకిలా చేశావు? రాజులు సాహసాలు చెయ్యరాదు. నీకు ఏమయిపోతుందోనని మేమంతా భయ పడ్డాం. నీకు అపాయం కలిగి ఉంటే మా గతి ఏమై ఉండేది? రావణుణ్ణి బంధువులతో సహా చంపి, విభీషణుడికి పట్టంగట్టి అయోధ్యకు తిరిగి పోవాలన్నది నా సంకల్పం," అన్నాడు.

"రాముడా, సీతను ఎత్తుకు పోయిన ఆ దుర్మార్గుడు కనబడితే ఎలా సహిం ఊరుకోను?" అన్నాడు సుగ్రీవుడు.

అందరూ పర్వతం దిగి వచ్చారు. రాముడు లంక మీదికి యుద్ధానికి పోవ టానికి తొందరపడ్డాడు. అతని వెనకగా విభీషణుడూ, సుగ్రీవుడూ, హనుమం తుడూ, జాంబవంతుడూ, నలుడూ, సుషేణుడూ, నీలుడూ, లక్ష్మణుడూ నడి చారు. వారి వెనక మహాసముద్రం లాటి వానరసేన కదిలింది.

రామలక్ష్మణులు లంకానగరపు ఉత్తర ద్వారాన్ని ముట్టడించారు. దాన్ని రావ ణుడు స్వయంగా రక్షిస్తున్నాడు. అక్కడ అంతులేని రాక్షసఆయుధాలూ, కవచాలూ ఉన్నాయి.





# వీర హనుమాన్

అదేవిధంగా మిగిలిన ద్వారాల ముట్టడి కూడా అనుకున్న ప్రకారం జరిగింది. సుగ్రీవుడు అవసరాన్నిబట్టి సహాయపడ టానికి ఉత్తర, పశ్చిమద్వారాల మధ్య పెద్ద సేనతో ఉన్నాడు. వానరులు యుద్ధం చెయ్యటానికి చెట్లూ, రాళ్ళూ, పట్టు కున్నారు. మొత్తం వానరసేన లంకను చుట్టుముట్టుతున్నది. వాళ్ళ మూలాన త్రికూటపర్వతం కనబడటం లేదు. ఇక వాళ్ళ కోలాహలం మాట చెప్పనే అవసరం లేదు.

ఆ తరుణంలో విభీషణుడితో చెప్పి, రాముడు అంగదుణ్ణి రావణుడి వద్దకు రాయబారిగా పంప నిశ్చయించి, అంగదుణ్ణి పిలిపించాడు. అతడు రాగానే రావణుడితో తన మాటగా యిలా చెప్ప మన్నాడు:

"రావణుడా, బ్రహ్మ వల్ల పొందిన వరాల గర్వంతో నువు అనేక పాపాలు చేశావు. నీ గర్వం నశించింది. నా భార్యను ఎత్తుకు పోయావన్న ఆగ్రహంతో నేను యమధర్మరాజు లాగా వచ్చాను. నిన్ను చంపటానికి లంకాద్వారం వద్ద ఉన్నాను. నువు ఏ బలం చూసుకుని సీతను ఎత్తుకు పోయావో, ఆ బలాన్ని ఇప్పుడు చూపు. సీతను తెచ్చి నా కిచ్చి, నన్ను శరణువేడక పోతే నా క్రూరమైన బాణాలు ఈ లోకంలో రాక్షసులు లేకుండా చేస్తాయి. ధర్మాత్ముడూ, నన్ను శరణుచొచ్చిన వాడూ అయిన విభీషణుణ్ణి లంకకు రాజు చేస్తాను.

## 23. వానర-రాక్షసుల ద్వంద్వయుద్ధం



నువు ధైర్యంగా యుద్ధం చేస్తే చెయ్యి. అంతేగాని పక్షివై ఎక్కడికన్నా పారిపోదామన్నా అది నేను సాగనియ్యను. నీకు నే నొక మంచి సలహా ఇస్తాను. ఇక నువు లంకను చూడవు, ఇప్పుడే చక్కగా చూసుకో. ఇప్పుడే నీకు నువు ఉత్తరక్రియలు చేసుకో. నీ ప్రాణాలు నా చేతిలో ఉన్నాయి."

తార కొడుకైన అంగదుడు రాముడిచ్చిన ఈ సందేశం తీసుకుని ఆకాశమార్గాన అతి శీఘ్రంగా రావణుడి ఇంటికి వెళ్ళి, మంత్రులతో కూర్చుని ఉన్న రావణుణ్ణి చూశాడు. రావణుడూ, అతడి చుట్టూవున్న మంత్రులూ, ప్రశ్నించకముందే అతను రావణుడికి తన పేరు చెప్పుకుని రాముడి సందేశం వినిపించాడు.

అతి పరుషమైన ఆ సందేశం విని రావణుడికి కోపం వచ్చింది. ఆ కోపంలో అతను కళ్ళెర్రచేసి, "ఈ దుర్మార్గుణ్ణి వెంటనే పట్టి చంపండి," అని మళ్ళీ మళ్ళీ అన్నాడు.

నలుగురు రాక్షసులు ముందుకు వచ్చి అంగదుణ్ణి పట్టుకున్నారు. అంగదుడు కావాలనే వాళ్ళకు పట్టుబడ్డాడు. వాళ్ళు తనను పట్టుకున్న మరుక్షణం అతను వాళ్ళను తన రెండు చేతుల సందున ఇరికించుకుని, ఆకాశంలోకి లేచాడు. అతను ఇంటి శిఖరంమీద వాలి, రావణుడు చూస్తూండగానే రాక్షసులను కిందపడేసి, ఇంటి శిఖరాన్నివిరిచాడు. తరవాత అతను తన పేరు చెప్పుకుని సింహనాదం చేసి, రాముడి వద్దకు తిరిగి వచ్చాడు.

అంగదుడు చేసిన పని రావణుడికి అపశకునం అనిపించింది. అతను ధైర్యాన్నికోల్పోయి, దిక్కులు చూస్తూ, నిట్టూర్పులుపుచ్చాడు.

వానరులు యుద్ధం కోసం ఆత్రంగా కాచుకుని ఉన్నారు. పర్వతాకారుడైన సుషేణుడు, సుగ్రీవుడి ఆజ్ఞ చొప్పున, కొందరు వానర వీరులను వెంటబెట్టుకుని

లంక ద్వారాలు నాలుగూ కలయతిరుగుతున్నాడు. నగరం లోపల రాక్షసులు కూడా ఆయుధాలు ధరించి కోలాహలంగా తిరుగుతున్నారు.

కొందరు రాక్షసులు రావణుడి వద్దకు వెళ్ళి, వానరులు లంకను ముట్టడించారని చెప్పారు.

రావణుడు వెంటనే సింహాసనం మీది నుంచి లేచి తన ఇంటి పైకి వెళ్లి, లంక చుట్టూ వానరసేనలు ఉండటం చూశాడు. త్రికూటపర్వతం అంతా వానరసేనలతో నిండివున్నది. అంత మంది వానరులను ఎలా చంపాలో అతనికి అంతు బట్టలేదు.

రాముడు కూడా లంకానగర ప్రాకారం వద్దకు వెళ్ళి, నగరాన్ని రాక్షసులు ఎంత బాగా రక్షిస్తున్నదీ చూశాడు. ఆ లంకలోనే కదా సీత చిక్కి ఉన్నదన్న ఆలోచన రాగానే అతనికి దుఃఖమూ, కోపమూ కలిగాయి. అతను వానరులతో, "వెంటనే బయలుదేరి శత్రుసంహారం సాగించండి," అన్నాడు.

వానర శ్రేష్ఠులు చెట్లూ, శిలలూ తీసుకుని అందుకు సిద్ధంగానే ఉన్నారు. రాముడు ఇలా అనగానే వానరులు అక్కడక్కడా ప్రాకారం మీదికి ఎగబాకారు. ద్వారాల పైన వానరుల దాడి ఆరంభమయింది.



విభీషణుడు కవచం ధరించి, తన మంత్రులతో సహా రాముడి సమీపంలోనే ఉన్నాడు. గజుడూ, గవయుడూ, గవాక్షుడూ, శరభుడూ, గంధమాదనుడూ అన్ని చోట్లా తిరుగుతూ వానరసేనను రక్షిస్తున్నారు.

ఈ స్థితిలో రావణుడు తన రాక్షససేనలను యుద్ధానికి పొమ్మని ఆజ్ఞాపించాడు. వెంటనే రాక్షసులు సింహనాదాలు చేశారు. భేరీలు మోగాయి. శంఖాలు ఊదారు. ఆవేశపరులై యుద్ధోత్సాహంతో, లంక లోపల రాక్షసులూ, బయట వానరులూ చేసే కోలాహలం మిన్నుముట్టింది.



ఉభయపక్షాలకూ యుద్ధం ఆరంభమయింది. రాక్షసులు గదలతోనూ, శక్తులతోనూ, శూలాలతోనూ, గొడ్డళ్ళతోనూ వానరుల పైకి ఉరికి కొట్టసాగారు. వానరులు రాక్షసుల మీద చెట్లూ, పెద్ద పెద్ద రాళ్ళూ, తమ గోళ్ళూ, కోరలూ ఉపయోగించారు.

కొందరు రాక్షసులు ప్రాకారాల మీది నుంచి వానరుల మీద ఆయుధాలు ప్రయోగించారు.

వానరులు ప్రాకారాల మీదికి ఎగిరి రాక్షసులను కిందపడదోశారు. రాక్షస వానరుల మధ్య అతిభయంకరమైన దొమ్మియుద్ధం జరిగింది.

దొమ్మి యుద్ధంతో బాటు ద్వంద్వ యుద్ధాలు కూడా జరిగాయి. ఇంద్రజిత్తు అంగదుడితోనూ, విభీషణుడి మంత్రులలో ఒకడైన సంపాతి అనేవాడు ప్రజంఘుడనే రాక్షసుడితోనూ, హనుమంతుడు జంబుమాలి తోనూ యుద్ధం చేశారు. అలాగే గజుడికి తపను డనే రాక్షసుడి తోనూ, నీలుడికి నికుంభు డనే రాక్షస వీరుడి తోనూ యుద్ధం జరిగింది. సుగ్రీవుడు ప్రఘసు డనే రాక్షసుడితోనూ, లక్ష్మణుడు విరూపాక్షుడితోనూ యుద్ధం చేశారు. ఇలా అనేకమంది వానరవీరులు, రాక్షస వీరులతో భయంకరమైన ద్వంద్వ యుద్ధాలు చేశారు.

ఈ ద్వంద్వ యుద్ధాలలో అంగదుడు ఇంద్రజిత్తు రథాన్నీ, సారథినీ, గుర్రాలనూ నాశనం చేశాడు; సంపాతి ప్రజంఘుణ్ణి చంపాడు; హనుమంతుడు జంబుమాలిని కొట్టాడు; ప్రతపనుడు అనే రాక్షసుడి కళ్ళు నలుడు పీకేశాడు; ప్రఘసుడు సుగ్రీవుడి చేతిలో చచ్చాడు.

నలుగురు రాక్షసులు రాముడి మీద బాణాలు ప్రయోగించారు. రాముడు తన బాణాలతో ఆ నలుగురి తలలూ తెగవేశాడు. మైందుడు వజ్రముష్టి అనేవాణ్ణి పిడికిలితో పొడిచి చంపాడు. సుషేణుడి చేతిలో విద్యున్మాలి చచ్చాడు. మొత్తం

మీద యిలా జరిగిన ద్వంద్వ యుద్ధాలలో చాలా మంది రాక్షసులు వానరుల చేతిలో చచ్చారు.

ఇంతలో సూర్యాస్తమయమై, చీకటి పడింది. కాని యుద్ధం ఆగలేదు. రాక్షసులు యుద్ధభూమి అంతటా తిరుగుతూ, వానరులను భక్షించసాగారు. వానరులు బంగారు నగలనూ, తెల్లగా మెరిసే దంతాలనూబట్టి రాక్షసులను పోల్చి, పట్టి చీల్చారు. ఆ కటిక చీకటిలోనే రామలక్ష్మణులు తమ బాణాలతో అనేకమంది రాక్షసులను చంపారు.



అంగదుడు తన రథాన్నీ, సారథినీ, గుర్రాలనూ నాశనం చేసిన తరవాత ఇంద్రజిత్తు తన మాయ చేత అదృశ్యుడై పోయి, ఇప్పుడు రామలక్ష్మణుల మీద నాగాస్త్రాలు ప్రయోగించి, ఆ ఇద్దరినీ బంధించాడు. అతను వాళ్ళతో, "నేను అదృశ్యంగా యుద్ధం చేసేటప్పుడు నన్ను ఇంద్రుడు అయినా ఏమీ చెయ్యలేడు. అల్పులైన మీ రెంత? ఇప్పుడే మీ ప్రాణాలు తీస్తాను," అంటూ సింహనాదం చేశాడు.

బాణాలతో శరీరాలు పూర్తిగా కట్టుబడి పోయిన రామలక్ష్మణులకు ఏమీ కనిపించ లేదు. ఇంద్రజిత్తు వేసే బాణాలు వారి మర్మస్థానాలలో తగిలాయి. ఇద్దరూ నేల మీద పడిపోయారు. వారి రక్తం ఏర్లు కట్టి పారింది. రాముడి స్థితి చూసి లక్ష్మణుడికి జీవితం మీద ఆశ పోయింది.

హనుమంతుడు మొదలైన వానర ప్రముఖులు రామలక్ష్మణుల చుట్టూ చేరి దుఃఖించారు. ఇంద్రజిత్తు కోసం వానరులు అనేకులు అన్ని దిక్కులా వెతికారు, కాని లాభం లేకపోయింది. ఒక్క విభీషణుడే తన మాయతో ఇంద్రజిత్తును చూడగలిగాడు.

ఈ లోపల ఇంద్రజిత్తు రాక్షసులతో ఇలా చెబుతున్నాడు: "చూడండి, రామలక్ష్మణుల పరాక్రమం నా ముందు ఎందుకూ పనికిరాలేదు. వాళ్ళను



55



నా బాణాలతో బంధించాను. ఈ బంధాల నుంచి వారిని ఎవరూ విడిపించలేరు. వీళ్ళు నా చేతిలో చచ్చారు.''

ఇలా అని, ఇంద్రజిత్తు వానర వీరులను తన బాణాలతో నొప్పించసాగాడు. రాక్షసులు ఇంద్రజిత్తును కొనియాడారు. కదలకుండా పడి ఉన్న రామలక్ష్మణులను చూసి, వాళ్ళు చచ్చిపోయారనుకుని, ఇంద్రజిత్తు లంకానగరంలోకి వెళ్ళిపోయాడు.

సుగ్రీవుడు కూడా రామలక్ష్మణుల శరీరాలను పూర్తిగా కప్పిన బాణాలను చూసి భయపడ్డాడు. అతను ఏడుస్తూండటం చూసి విభీషణుడు, ''సుగ్రీవుడా, భయపడకు. ఏడవకు. యుద్ధం అంటే ఇలాగే ఉంటుంది. అన్నప్పుడల్లా విజయమే కలగదు. రామలక్ష్మణులు మూర్ఛపోయారు. తిరిగి వాళ్ళు స్పృహ తెచ్చుకోవచ్చు.'' అని సుగ్రీవుడి కన్నీరు తుడిచాడు.

లంకకు తిరిగి వెళ్ళిన ఇంద్రజిత్తు తన తండ్రిని కలుసుకుని, ''రామలక్ష్మణులను చంపాను.'' అని చెప్పాడు.

రావణుడు పరమానందంతో ఆసనం నుంచి లేచి తన కొడుకును కౌగలించుకున్నాడు. అతను రామలక్ష్మణుల వధ ఎలా జరిగినదీ కొడుకును అడిగి చెప్పించుకున్నాడు.

తరవాత అతను ఇంద్రజిత్తును పంపేసి సీతకు కావలి ఉన్న రాక్షస స్త్రీలను పిలిపించాడు. త్రిజట మొదలుగా గల రాక్షస స్త్రీలు వచ్చారు. రావణుడు వాళ్ళతో, ''ఇంద్రజిత్తు రామలక్ష్మణులను చంపాడని సీతతో చెప్పండి. ఆమెను పుష్పక విమానంలో తీసుకుపోయి, చచ్చి పడి ఉన్న రామలక్ష్మణులను చూపండి. ఇక సీత రాముడి మీది ఆశ వదులుకుని, చక్కగా అలంకరించుకుని నన్ను చేరవచ్చు.'' అన్నాడు.

రాక్షస స్త్రీలు పుష్పకవిమానాన్ని తీసుకుని అశోకవనంలో ఉన్న సీత వద్దకు

వెళ్ళి, సీతను త్రిజటతో బాటు అందులో ఎక్కించి, రామలక్ష్మణులను చూపించటానికి తీసుకుపోయారు.

రావణుడు లంకలో జెండా ఎగరవేయించి, అలంకరించటానికి ఉత్తరువిచ్చాడు; ఇంద్రజిత్తు రామలక్ష్మణులను చంపినట్టు చాటింపు వేయించాడు.

సీత రాక్షసులను చూసింది; వాళ్ళు మహా ఆనందంలో ఉన్నారు. వానరులు దుఃఖంలో ఉండటం కూడా ఆమె చూసింది. బాణాలు శరీరమంతా కప్పి, నేల మీద పడి ఉన్న రామలక్ష్మణులను కూడా ఆమె చూసింది. ఆమెకు దుఃఖం ఆగలేదు.

రామలక్ష్మణులు చచ్చిపోయారనుకుని సీత చాలా దుఃఖించింది. ఆమెకు లోగడ జ్యోతిష్కులు తాను పుత్రవతి అవుతుందనీ, తనకు వైధవ్యం లేదనీ, తన భర్త అశ్వమేధ యాగం చేస్తాడనీ, తాను సామ్రాజ్యానికి పట్టమహిషి అవుతుందనీ, ఎందుకంటె ఆమె పాదాలలో పద్మరేఖలున్నాయనీ, ఏమేమో చెప్పారు; అవన్నీ ఇప్పుడు అబద్ధమయాయి!

ఈ విధంగా దుఃఖించే సీతను ఊరడిస్తూ త్రిజట, రామలక్ష్మణులు చావలేదనీ, మూర్ఛలో ఉన్నారనీ చెప్పింది. రాక్షస స్త్రీలు సీతను పుష్పకవిమానంలో అశోకవనానికి తిరిగి తీసుకుపోయారు.

తరవాత రామలక్ష్మణులలో రాముడు ముందు మూర్ఛ నుంచి బయటపడ్డాడు. అయితే అతను ఇంకా బాణ పాశాలకు కట్టుబడే ఉన్నాడు. చచ్చినట్టు పడి ఉన్న లక్ష్మణుణ్ణి చూసి అతను చాలా శోకించాడు. లక్ష్మణుడు చచ్చిపోతే తాను బతికి ఉండటం అసాధ్యమనీ, విభీషణుణ్ణి రాక్షసరాజు చేస్తానన్న మాట నిలబెట్టుకునే అవకాశం తనకు లేకుండా పోయిందనీ, సుగ్రీవుడు మొదలైనవారు వానర సేనలతో కిష్కింధకు వెళ్ళిపోవటం మంచిదనీ రాముడు అన్నాడు. అతను శోకిస్తుంటే, వానర ప్రముఖులంతా అతనితో బాటు శోకించారు.





# వీర హనుమాన్

ఇంతలో విభీషణుడు అక్కడికి వచ్చాడు. అతన్ని చూసి ఇంద్రజిత్తు అనుకుని వానరులు చెల్లా చెదరై పరిగెత్త సాగారు. సుగ్రీవుడు అజ్ఞాపించగా జాంబవంతుడు వానరులతో, ''వచ్చినది విభీషణుడు, ఇంద్రజిత్తు కాడు,'' అని చెప్పాడు.

రామలక్ష్మణుల స్థితి చూసి విభీషణుడు చాలా బాధ పడ్డాడు. అతనికి తాను లంకకు రాజవుతానన్న ఆశ కాస్తా పోయింది.

సుగ్రీవుడు విభీషణుణ్ణి కౌగలించుకుని, ''విభీషణా, అప్పుడే రావణుడూ, ఇంద్రజిత్తూ నెగ్గారనుకోను. నువు లంకకు రాజు కాగలవు. రామలక్ష్మణులకు ప్రాణాపాయంలేదు. ఈ మూర్ఛ నుంచి తేరుకోగానే వాళ్ళు శత్రునాశనం చెయ్యగలరు," అన్నాడు.

తరవాత సుగ్రీవుడు తన మామ అయిన సుషేణుడితో, ''రామలక్ష్మణులు మూర్ఛ తేరగానే వీళ్ళనూ, కొందరు వానర వీరులనూ తీసుకుని కిష్కింధకు వెళ్ళిపో. నేను రావణుణ్ణి సకుటుంబంగా చంపి, సీతను తీసుకుని వస్తాను,'' అన్నాడు.

సుషేణుడు సుగ్రీవుడితో, ''పూర్వం దేవదానవ యుద్ధాలు జరగటం నాకు తెలుసు. అప్పుడు కూడా రాక్షసులు మాయా యుద్ధాలు చేసి దేవతలను చాలా మందిని పడగొట్టారు. కొందరు దేవతలు మూర్ఛపోయారు, కొందరు చచ్చి

**24. గరుత్మంతుడి సహాయం**



పోయారు. అప్పుడు దేవతల గురువైన బృహస్పతి మృతసంజీవనీ విద్యతోనూ, మూలికలతోనూ వారికి చికిత్స చేశాడు. సంజీవకరణీ, విశల్యకరణీ అనే ఓషధులు పాలసముద్రం వద్ద కొండలలో ఉంటాయి. పూర్వం క్షీరసాగరమథనం జరిగిన చోట చంద్రపర్వతమూ, ద్రోణ పర్వతమూ ఉన్నాయి. వాటి మీదనే ఈ ఓషధులు ఉంటాయి. అక్కడికి హనుమంతుణ్ణి పంపించు,'' అన్నాడు.

ఇంతలో ప్రళయంగా గాలి వీచింది. వానరులకు గరుత్మంతుడు వస్తూ కనిపించాడు. గరుత్మంతుడు రావటం చూసి, రామలక్ష్మణులను బాణాల రూపంలో బంధించి ఉండిన సర్పాలు భయపడి పారిపోయాయి.

గరుత్మంతుడు రామలక్ష్మణుల వద్ద దిగి, వారి ముఖాలూ, శరీరాలూ నిమిరాడు. వెంటనే వాళ్ళగాయాలు నయమయాయి.

రాముడు అతనితో, '' మీ దయవల్ల మేం తిరిగి ఎప్పటిలాగా బలవంతులమయాం. మిమ్మల్ని చూస్తుంటే మా తండ్రి దశరథమహారాజునూ, మా తాత అజమహారాజునూ చూసినంత ఆనందం కలుగుతున్నది. మీ దివ్యవస్త్రాలూ, ఆభరణాలూ చూడగా ఆశ్చర్యం కలుగుతున్నది. మీ రెవరు? '' అన్నాడు.

గరుత్మంతుడు ఆనంద బాష్పాలు రాల్చుతూ, '' రామా, నేను నీకు స్నేహితుణ్ణి; ఇష్టుణ్ణి; నీ ప్రాణంలాటి వాణ్ణి; నా పేరు గరుత్మంతుడు. మీ ఇద్దరికీ సహాయం చెయ్యటానికే వచ్చాను. ఈ బాణపాశాలు నిజానికి సర్పాలు. వీటిని వదిలించటం అందరికీ సాధ్యం కాదు. అందుకే మీస్థితిగురించి వినగానే పరిగెత్తుకుంటూ వచ్చాను! మిమ్మల్ని విడిపించాను. ఈ యుద్ధంలో మీరు ఏ మాత్రమూ ఏమరుపాటుగా ఉండరాదు. రాక్షసులను నమ్మరాదని ఇప్పుడు మీకే తెలిసివచ్చింది గదా! '' అన్నాడు.

తరవాత గరుత్మంతుడు వెళ్ళిపోవటానికి రాముడి వద్ద సెలవు పుచ్చుకుంటూ, "నేను నీకు ఎలా స్నేహితుణ్ణని ఇప్పుడు అడగకు. ఈ యుద్ధంలో గెలిచిన అనంతరం ఆ సంగతి నీకే తెలుస్తుంది. యుద్ధం అయిపోయాక లంకలో పసివాళ్ళూ, ముసలివాళ్లూ మాత్రమే మిగులుతారు. రావణుడు చస్తాడు. సీత నీకు దక్కుతుంది," అని చెప్పి, ఆకాశమార్గాన ఎగిరి వెళ్లిపోయాడు.



రామలక్ష్మణులు మామూలు మనుషులుకాగానే వానరులు తోకలు ఎగరేస్తూ సింహనాదాలు చేశారు. భేరీలూ, మృదంగాలూ మోగాయి. వానరులు చెట్లు పీకి, లంకాద్వారాలను ముట్టడించారు. అప్పటికి అర్థరాత్రి అయింది.

ఆ నిశిరాత్రివేళ వానరులు సింహనాదాలు చెయ్యటం రావణుడూ, రాక్షసులూ విన్నారు. రావణుడు తన మంత్రులతో, "వానరులు మహా ఆనందంలో ఉన్నట్టున్నారు. రామలక్ష్మణుల కోసం ఏడుస్తూ ఉండవలసిన వాళ్లు సంతోషంగా ఎందుకున్నారు?" అని వానరుల ఉత్సాహానికి కారణం తెలుసుకు రావటానికి రాక్షసులను పంపాడు.

వాళ్ళు వెళ్ళి ప్రాకారాల మీదికిఎక్కి, వానరసేననూ, బాణపాశాలు వదిలి సుఖంగా ఉన్న రామలక్ష్మణులనూ చూసి రావణుడి వద్దకు తిరిగి వెళ్ళి, తాము చూసినది చెప్పారు.

రామలక్ష్మణులు ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణబంధాల నుంచి బయటపడ్డారని విని రావణుడు వెలవెలపోయాడు. వాసుకి లాటి బాణాలు నిష్ప్రయోజనమయాయి. అతను ధూమ్రాక్షుడనే వాడితో, "నువు పెద్దసేనతో వెళ్ళి, వానరులనూ, రాముణ్ణీ చంపిరా!" అన్నాడు.

ధూమ్రాక్షుడు వెంటనే బయలుదేరి వెళ్ళి, సేనాధ్యక్షుడితో, తాను యుద్ధానికి పోతున్నాననీ, తన కోసం సేనను సిద్ధం



55



చెయ్యమనీ చెప్పాడు. ధూమ్రాక్షుడికి సేన సిద్ధమయింది. రకరకాల ఆయుధాలు ధరించిన రాక్షసులు ఆ సేనలో ఉన్నారు. వారిని వెంట బెట్టుకుని, ఉత్తమమైన రథం ఎక్కి ధూమ్రాక్షుడు పడమటి ద్వారం వద్దకు వెళ్ళాడు.

ధూమ్రాక్షుడు రావటం చూస్తూనే వానరులు సింహనాదాలు చేశారు. ఉభయ పక్షాలకూ పోరు ప్రారంభమయింది. రాక్షసుల ఆయుధాల చేత దెబ్బలు తింటూ వానరులు రాక్షసులను చెట్లతోనూ, గండ రాళ్ళతోనూ కొట్టారు. మొత్తం మీద రాక్షసులే ఎక్కువ నష్టపడి, పారిపో సాగారు. అది చూసి ధూమ్రాక్షుడు వానరులను హింసించ నారంభించాడు. వానరులు కూడా అధిక సంఖ్యలో చచ్చారు.

ధూమ్రాక్షుడు వానరసేనలను నష్టపరచటమే గాక, తరమటం చూసి హనుమంతుడికి చాలా కోపం వచ్చింది. అతను పెద్ద శిలను తీసుకుని ధూమ్రాక్షుడి మీదికి పోయి, అతని రథంమీద విసిరి కొట్టాడు. రథం ధ్వంసమయింది. రథం మీద పడే ఆ శిలను చూస్తూనే ధూమ్రాక్షుడు గద తీసుకుని, నేలమీదికి దూకి నిలబడ్డాడు.

తరవాత హనుమంతుడు చెట్ల బోదెలూ కొమ్మలూ తీసుకుని, రాక్షసులను ఎడా పెడా చదును చెయ్యసాగాడు. రాక్షసులు పారిపోయారు. తరవాత హనుమంతుడు ధూమ్రాక్షుడి పైకి వచ్చాడు.

ధూమ్రాక్షుడు గదతో హనుమంతుణ్ణి ఎదుర్కొని, దానితో హనుమంతుడి తల మీద కొట్టాడు. హనుమంతుడు ఆ దెబ్బను లక్ష్యపెట్టక, ధూమ్రాక్షుడి మీద ఒక పర్వత శిఖరాన్ని వేశాడు. ఆ దెబ్బకు ధూమ్రాక్షుడు చచ్చాడు. అది చూసి వానరులు మరింత ఉత్సాహంగా రాక్షసుల మీద పడ్డారు. రాక్షసులు భయపడి లంకలోకి పారిపోయారు.

ధూమ్రాక్షుడు చచ్చినట్టు విని రావణుడికి అమిత కోపం వచ్చింది. అతను వజ్రదంష్ట్రు డనే వాణ్ణి చూసి, ''నువు

వెంటనే వెళ్ళి, రాముణ్ణీ, సుగ్రీవుణ్ణీ, అందరు వానరులనూ చంపిరా!'' అన్నాడు.

వజ్రదంష్ట్రుడు మాయలు నేర్చినవాడు. అతను సైన్యాన్ని తీసుకుని, కవచం ధరించి, ధనుర్బాణాలు తీసుకుని, రథం మీద యుద్ధానికి బయలుదేరాడు. అతని వెంట మంచి మంచి అస్త్రాలు ధరించిన రాక్షసవీరులు బయలుదేరారు.

వజ్రదంష్ట్రుడి రాక్షససేనలు లంకా నగరపు దక్షిణద్వారం కుండా బయటికి వచ్చాయి. ఆ ద్వారాన్ని ముట్టడించినది అంగదుడు. వానరరాక్షసుల మధ్య భయంకరమైన యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో రాక్షసులు అనేకమంది వానరులను చంపటం చూసి అంగదుడు మండిపడి, దారుణంగా రాక్షసవధ సాగించాడు. అతని దెబ్బలకు అందుబాటులోకి వచ్చిన రాక్షసుల తలలు ఒక్కొక్క దెబ్బకే పగిలిపోయాయి.

అంగదుడి దెబ్బకు తట్టుకోలేక రాక్షస బలాలు చిందర వందర కావటం చూసి వజ్రదంష్ట్రుడికి కోపం వచ్చింది. అతను వానరసేన మీద బాణవర్షం కురిపించాడు. చివరకు అంగదుడూ, వజ్ర దంష్ట్రుడూ ఒకరి నొకరు ఎదుర్కొనటం జరిగింది. వారి మధ్య జరిగిన ద్వంద్వ



యుద్ధంలో అంగదుడు వజ్రదంష్ట్రుడి రథాన్ని ఒక శిలతో ధ్వంసం చేశాడు. వజ్రదంష్ట్రుడు గద తీసుకుని నేల పైకి దూకి, వెంటనే కొంత సేపు మూర్ఛ పోయాడు.

మూర్ఛ నుంచి బయటపడుతూనే వజ్ర దంష్ట్రుడు తన ఎదురుగా నిలిచి ఉన్న అంగదుడి రొమ్ము కేసి గద విసిరాడు. అటు తరువాత ఇద్దరూ ముష్టియుద్ధానికి దిగారు. ఇద్దరూ చాలాసేపు పోరాడి, అలసిపోయి మోకాళ్ళ మీద కూర్చుని ఉన్న సమయంలో అంగదుడు అకస్మాత్తుగా లేచి, వజ్రదంష్ట్రుడి తలను ఖడ్గంతో ఖండించాడు. వానరులు సంతోషించారు.



57



వజ్రదంష్ట్రుడుచచ్చినట్టువిని రావణుడు అకంపనుణ్ణి సేనతోసహా యుద్ధానికి పంపాడు. ఆ ప్రకారమే అకంపనుడు మంచి రథం మీద, సేనను వెంటబెట్టు కుని బయలుదేరాడు.

మళ్ళీ రాక్షసులకూ, వానరులకూ తీవ్ర మైన యుద్ధం జరిగింది. రెండు పక్షాలా అనేకమంది చచ్చారు. కుముదుడూ, నలుడూ, మైందుడూ, ద్వివిదుడూ అనే వానరవీరులు విజృంభించి రాక్షసులను చంపసాగారు.

అకంపనుడు ఆ వానర వీరులను గమనించి, తన రథాన్ని వారివైపు తోలిం చాడు. అకంపనుడి ముందు వానరులు నిలవలేక పోవటం చూసి, హనుమంతుడు ముందుకు వచ్చాడు. అకంపనుడు హను మంతుడి పైన బాణవర్షం కురిపించాడు. హనుమంతుడు ఆ బాణాలను లక్ష్యపెట్టక గట్టిగా సింహనాదం చేసి, భూమి అదిరే లాగ కాలుతాటిస్తూ, ఒక పెద్ద శిల తీసు కుని, అకంపనుడి మీదికి వెళ్ళాడు.

కాని అకంపనుడు తన బాణాలతో హనుమంతుడి చేతిలోని శిలను తుంపులు తుంపులు చేశాడు. హనుమంతుడు ఒక మద్దిచెట్టును పెకలించి, దానితో అకంప నుడి నెత్తి మీద కొట్టాడు. ఆ దెబ్బతో అకంపనుడు చచ్చిపడిపోయాడు.

రాక్షసులు ఇది చూసి భయపడి, తమ చేతుల్లోని ఆయుధాలు అక్కడే పారేసి, లంకలోకి పారిపోయారు.

అకంపనుణ్ణి చంపినందుకు హను మంతుణ్ణి వానరవీరులు ఎంతగానో ప్రశం సించారు. హనుమంతుడు వాళ్ళను అభినందించాడు. వానరులు రాక్షసుల గుండెలు అదిరేటట్టు సింహనాదాలు చేశారు.

అకంపనుడు చచ్చాడని విని రావణుడు కొంచెంసేపు విచారించి, మంత్రులతో సంప్రతించి, తన సేనావ్యూహాలను పరీ క్షించటానికి లంక అంతా తిరిగాడు. లంక అంతటా రాక్షసుల జెండాలు ఎగురు

తున్నాయి. నగరం చుట్టూ వానరసేనలు ముట్టడివేసి ఉన్నాయి.

రావణుడు సభా భవనానికి తిరిగి వచ్చి, ప్రహస్తుణ్ణి చూసి, ''శత్రుసైన్యాలు వచ్చి మన నగరాన్ని ముట్టడిస్తే, దాన్ని విడిపించటానికి ఇతరులు చేసే ప్రయత్నం నిరర్థకమని తోస్తుంది. ఆ పని చెయ్యగల వాళ్ళం నేనూ, కుంభకర్ణుడూ, నువ్వూ, ఇంద్రజిత్తూ, నికుంభుడూ మాత్రమే. నువు తగిన సేనను వెంట తీసుకుపోయి, వానరసేనను జయించిరా.'' అన్నాడు.

అందుకు ప్రహస్తుడు ఇలా అన్నాడు:

''ఇది ముందు చర్చించిన సంగతే గద! దీన్ని గురించి మనకు మనస్పర్థ కూడా వచ్చింది. సీతను రాముడుకి ఇచ్చెయ్యటం క్షేమమని నాకు తెలిసినదే, లేకపోతే యుద్ధం తప్పదన్న సంగతి కూడా ముందే తెలుసు. అయితే నీకు ఇష్టమైన పని చేయటానికి నేను ఎప్పుడూ సిద్ధమే. నీ కోసం యుద్ధంలో ప్రాణాలు కూడా విడుస్తాను.''

ఇలా అని, సేనానాయకుడైన ప్రహస్తుడు పెద్ద సేనను బయలుదేర తీయమని సేనాధ్యక్షులకు ఉత్తరువు ఇచ్చాడు. రాక్షస వీరులు విజయం కోరి హోమాలు చేసి, బ్రాహ్మణులను అర్చించి, యుద్ధానికి కదిలారు. ప్రహస్తుడు భేరీమోగించి, గుర్రాలు పూన్చిన రథం మీద బయలుదేరాడు. అతని వెంట అతని నలుగురు మంత్రులూ, నరాంతకుడూ, కుంభహనుడూ, మహానాదుడూ, సమున్నతుడూ అనేవాళ్ళు బయలుదేరారు.

రాముడు ప్రహస్తుడు రావటం చూసి విభీషణుడితో, ''ఆ వచ్చేరాక్షసుడు చాలా పరాక్రమవంతుడు లాగా కనబడతాడు. ఎవరతను?'' అన్నాడు.

''అతను రావణుడి సేనానాయకుడు; ప్రహస్తుడు. రావణుడి సేనలో మూడో వంతు ఇతని కింద ఉంటుంది. ఇతను అస్త్రాలు తెలిసినవాడు. పరాక్రమవంతుడుగా ప్రసిద్ధి కలవాడు,'' అని విభీషణుడు రాముడికి చెప్పాడు.





# వీర హనుమాన్

ఈ లోపల వానరవీరులు ప్రహస్తుణ్ణి ఎదుర్కొన్నారు. మరొకసారి వానరులూ, రాక్షసులూ అధికసంఖ్యలో పరస్పరం చంపుకున్నారు. ప్రహస్తుడి నలుగురు మంత్రులూ విజృంభించి వానరులను చంపసాగారు. అది చూసి ద్వివిదుడు అనే వానరవీరుడు పెద్ద కొండరాయి విసిరి, నరాంతకుణ్ణి చంపాడు. అలాగే దుర్ముఖుడు అనే వానరవీరుడు సమున్నతుణ్ణీ, జాంబవంతుడు మహానాదుణ్ణీ, తారుడు కుంభహనుణ్ణీ చంపారు. ప్రహస్తుడి మంత్రులు నలుగురూ చచ్చారు.

ఈ సంగతి కళ్ళారాచూసిన ప్రహస్తుడు అమితమైన క్రోధంతో వానరసేనను భయంకరంగా చెండాడసాగాడు. అప్పుడు ప్రహస్తుణ్ణి నీలుడు ఎదిరించాడు. ప్రహస్తుడు బాణాలతోనూ, నీలుడు చెట్లతోనూ యుద్ధం చేశారు. బాణాలు తన శరీరాన్ని ఎంత దారుణంగా హింసిస్తున్నా లెక్కచేయక, నీలుడు ప్రహస్తుడి రథపు గుర్రాలను చంపి, ప్రహస్తుడి ధనుస్సు పట్టుకుని విరిచేశాడు. చివరకు ప్రహస్తుడూ, నీలుడూ మల్లయుద్ధానికి దిగారు. ఆ యుద్ధంలో నీలుడు ప్రహస్తుడి తలను శిలతో పగలగొట్టాడు. రాక్షసులు ఏడుస్తూ లంకకు పోయారు.

వాళ్ళు వెళ్ళి రావణుడితో ప్రహస్తుడు చచ్చినట్టు చెప్పేసరికి రావణుడికి కోపం వచ్చింది. అతను తానే స్వయంగా

## 25. కుంభకర్ణుడి మేలుకొల్పు



49



యుద్ధానికి పోవటానికి నిశ్చయించుకున్నాడు. అతను ఉత్తమాశ్వాలు పూన్చిన తన రథం ఎక్కి బయలుదేరాడు.

అతను నగరం దాటి వచ్చేసరికి, రాళ్ళూ, చెట్లూ చేతపట్టిన వానరులసేన కనిపించింది. రావణుడు యుద్ధానికి వస్తూండటం చూసి రాముడు విభీషణుడితో, ''ఆ మహాసేనలో రకరకాల ధ్వజాలతో వచ్చేవారు ఎవరు?'' అన్నాడు.

విభీషణుడు రాముడికి ఒక్కొక్కరినీ విడివిడిగా చెప్పాడు. వారిలో రావణుడి కొడుకు అకంపనుడు అనేవాడు ఒకడు ఉన్నాడు, ఇంద్రజిత్తు ఉన్నాడు; అతికాయుడూ, మహోదరుడూ అనేవాళ్ళున్నారు. ఇంకా రావణుడివెంట పిశాచుడూ, త్రిశిరుడూ, కుంభుడూ, నికుంభుడూ మొదలైనవారున్నారు.

రాముడు రావణుడి తేజస్సు చూసి ఆశ్చర్యపోయాడు. అలాటి తేజస్సు దేవదానవులలో ఎవరికీ ఉండదనిపించింది. అయినా ఈ రావణుడు ఇప్పుడు తన ఎదట పడినందుకు రాముడు సంతోషించాడు; సీతను ఎత్తుకుపోయినందుకు ఇప్పుడు పగ తీర్చుకోవచ్చు! అందుకని రాముడు లక్ష్మణుడితో సహా యుద్ధం చెయ్యటానికి సిద్ధంగా నిలబడ్డాడు.

వానరసేనను కలతపెడుతూ వచ్చే రావణుణ్ణి సుగ్రీవుడు ఎదిరించాడు. రావణుడు సుగ్రీవుణ్ణి ఒక్క బాణంతో మూర్ఛపోగొట్టాడు. రాక్షసులు సింహనాదాలు చేశారు.

అది చూసి గవాక్షుడూ, గవయుడూ, ఋషభుడూ, జ్యోతిర్ముఖుడూ, నభుడూ అనే వానరవీరులు శరీరాలు పెంచి, కొండరాళ్ళతో రావణుడి మీదికి వచ్చారు. రావణుడు అందరినీ బాణాలతో కొట్టాడు. వానరవీరులు బెదిరి, రాముణ్ణి శరణుజొచ్చారు.

రావణుడు వానరసేనను నిర్మూలిస్తూండటం చూసి, రాముడు వానరరక్షణకు బయలుదేరాడు. అది చూసి

లక్ష్మణుడు, రావణుణ్ణి చంపే అవకాశం తనకు ఇయ్యమని రాముణ్ణి ప్రార్థించాడు. లక్ష్మణుణ్ణి మెలకువగా ఉండమని హెచ్చరించి, రాముడు అతనికి అనుమతి ఇచ్చాడు.

లక్ష్మణుడు రావణుణ్ణి ఎదుర్కొన్నాడు. అది చూసి హనుమంతుడు ముందుగా తానే రావణుడి ముందుకు వెళ్ళి, కుడి చెయ్యి ఎత్తి, ''నువు దేవ, దానవ, గంధర్వ, యక్ష, రాక్షసులను జయించావు నిజమే గాని, నీకు వానరుల మూలాన అపాయం ఉన్నది. ఈ నా చేత్తో నిన్ను చంపబోతున్నాను,'' అన్నాడు.

ఈ మాటకు రావణుడు మండిపడి, ''హనుమంతుడా, నిర్భయంగా నన్ను కొట్టు. ఒక కోతి రావణుణ్ణి కొట్టిందన్న శాశ్వతకీర్తి నీకు దక్కుతుంది. ఆ తరవాత నేను నిన్ను చంపిపారేస్తాను,'' అన్నాడు.

''జ్ఞాపకంతెచ్చుకో, నీ కొడుకు అక్షుడు నా దెబ్బకే చచ్చాడు,'' అన్నాడు హనుమంతుడు.

రావణుడు హనుమంతుణ్ణి రొమ్ము మీద తన చేత్తో చరచాడు. ఆ దెబ్బకు చలించిన హనుమంతుడు కోపంతో రావణుడి రొమ్ము మీద బలంగా అరచేత్తో కొట్టాడు. ఆ దెబ్బకు రావణుడు, భూకంపానికి పర్వతంలాగా, ఊగి



పోయాడు. అదిచూసి వానరులు కోలాహలంగా హర్షధ్వానాలు చేశారు.

రావణుడు హనుమంతుడి పరాక్రమాన్ని ప్రశంసించాడు. కాని హనుమంతుడు, ''రావణా, నా పరాక్రమం కాల్చనా ? నా దెబ్బతిని కూడా నువ్వింకా బతికే ఉన్నావే! ఇంకొక్కసారి నువు నన్ను కొట్టు, ఆ తరవాత నేను నిన్ను పిడికిటిపోటుతో యమలోకానికి పంపేస్తాను,'' అన్నాడు.

కోపం వచ్చి రావణుడు తన పిడికిలితో హనుమంతుడి రొమ్ములో పొడిచాడు. హనుమంతుడు ఆ దెబ్బకు దిమ్మరపోయాడు. హనుమంతుడు తెప్పరిల్లి,



తనను మళ్ళీ పొడిచేలోగా రావణుడు నీలుడి పైకి యుద్ధానికి వెళ్ళాడు.

వానర సేనానాయకుడైన నీలుడు రావణుడి బాణాల తాకిడికి బాగా నొచ్చి, రావణుడిపైన ఒక కొండశిఖరం విసిరాడు. ఈ లోపల తెప్పరిల్లిన హనుమంతుడు రావణుడి వద్దకు వచ్చి, ''ఇంకోడితో యుద్ధంచేస్తున్నావు గనక బతికిపోయావు!" అన్నాడు.

రావణుడు తన మీదికి వచ్చే కొండ శిఖరాన్ని బాణాలతో ముక్కలు ముక్కలు చేసేశాడు. తరవాత అతను నీలుణ్ణి ఆగ్నేయాస్త్రంతో మూర్ఛపోగొట్టి, లక్ష్మణుడి మీదికి వెళ్ళాడు.

"రాక్షసరాజా, ఈ వానరులతో ఎందుకు యుద్ధంచేస్తున్నావు? నాతో చెయ్యి." అన్నాడు లక్ష్మణుడు.

''లక్ష్మణా, నీకు ఆయువుమూడి నా ఎదటపడ్డావు. ఇప్పుడే నిన్ను యమపురానికి పంపుతాను,'' అన్నాడు రావణుడు.

''పాపాత్ముడా, ఆత్మస్తుతి చేసుకోకు. నీ శక్తీ, బలమూ, పరాక్రమమూ నాకు బాగా తెలుసు. నేను యుద్ధానికి సిద్ధంగానే ఉన్నాను,'' అన్నాడు లక్ష్మణుడు.

రావణుడు ఆగ్రహించి లక్ష్మణుడిపైన బాణాలు వేశాడు. లక్ష్మణుడు వాటిని దారిలోనే ఖండించాడు. ఇద్దరూ ఒకరినొకరు బాణాలతో కొట్టుకున్నారు. మధ్యలో లక్ష్మణుడు మూర్ఛపోయాడు. అదిచూసి రావణుడు ముందుకు వచ్చి లక్ష్మణుణ్ణి పట్టుకుని ఎత్తబోయాడు. అంతలో హనుమంతుడు వచ్చి రావణుడి రొమ్ములో తన పిడికిలితో బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు రావణుడు బోర్లపడిపోయి, నోటా, కళ్ళా, చెవులా రక్తం కక్కాడు.

అదిచూసి హనుమంతుడు, మూర్ఛలో ఉన్న లక్ష్మణుణ్ణి తన చేతులలో ఎత్తుకుని, రాముడి వద్దకు తీసుకుపోయాడు.

కొద్దిసేపటికి లక్ష్మణుడికీ, రావణుడికీ కూడా స్పృహ తెలిసింది. రావణుడు మళ్ళా యుద్ధానికి సిద్ధపడ్డాడు.

అప్పుడు రాముడు రావణుడి మీదికి యుద్ధానికి వచ్చాడు. అదిచూసి హనుమంతుడు రాముడితో, "రావణుడితో యుద్ధం చెయ్యటానికి నువు నా మీద ఎక్కి కూర్చో," అన్నాడు.

రాముడు అలాగే చేశాడు. అతను హనుమంతుడి భుజం మీద ఎక్కి, రథం మీద ఉన్న రావణుడితో యుద్ధానికి వెళ్ళాడు.

రావణుడు తీవ్రమైన బాణాలను రాముడికి వాహనమైన హనుమంతుడిపై ప్రయోగించాడు. ఆ బాణాల మూలంగా హనుమంతుడి తేజస్సు మరింత హెచ్చింది. అయితే రాముడికి చాలా రోషం వచ్చింది; అతను రావణుడి రథచక్రాలనూ, గుర్రాలనూ, ధ్వజాన్నీ, గొడుగునూ, సారథినీ, ఆయుధాలనూ తన బాణాలతో కొట్టి రావణుడి రొమ్ములో నాటుకునేటట్టు బాణం వేశాడు. ఆ దెబ్బకు తట్టుకోలేక రావణుడు చేతిలో ధనుస్సును జారవిడిచి, మూర్ఛపోయాడు.

రాముడు ఒక అర్ధచంద్రాకారం గల బాణంతో రావణుడి కిరీటం ఖండించి, రావణుడితో, "చాలామంది వీరులను చంపి, అలసిపోయి ఉన్నావు. ఇప్పుడు నిన్ను చంపను. నువు వెళ్ళి, విశ్రాంతి తీసుకుని, మళ్ళీ యుద్ధసన్నద్ధుడవై



రావటానికి అనుమతి ఇస్తున్నాను, వెళ్లు," అన్నాడు.

ఈ మాటలు అనిపించుకున్నందుకు సిగ్గుపడుతూ రావణుడు, చేసేదిలేక, లంకలోకి వెళ్ళిపోయాడు. తరవాత రామలక్ష్మణులు యుద్ధంలో గాయపడిన వానరులకు సేవలుచేశారు.

లంకకు తిరిగి పోయిన రావణుడు రాముడి బాణాలను తలుచుకుని భయపడి, తన అనుచరులతో, "ఇంద్రుడికి తీసిపోని నేను మనిషి చేతిలో ఓడాను! నేను చేసిన గొప్ప తపస్సంతా బూడిదలో పోసిన పన్నీరే అయిందిగదా! నాకు మనిషి వల్ల భయం ఉంటుందని పూర్వం



బ్రహ్మ చెప్పిన మాట ఇప్పుడు నిజమయింది. మనిషి వల్ల చావురాకుండా నేను బ్రహ్మను వరం కోరలేదు. రాక్షసులారా, ఈ కారణం వల్ల మీరు మరింత శ్రద్ధగా శత్రుసంహారం చెయ్యాలి. నగరాన్ని మరింత బాగా కాపాడాలి. మీలో కొందరు పోయి కుంభకర్ణుణ్ణి నిద్ర లేపండి,'' అన్నాడు.

కుంభకర్ణుడు యుద్ధం ప్రారంభంకావటానికి తొమ్మిది రోజులు ముందుగా నిద్ర పోయాడు. అతను నిద్ర లేచి, యుద్ధానికి వెళ్ళి, రామలక్ష్మణులను చంపేస్తాడని రావణుడి నమ్మకం. ఎందుకంటే కుంభకర్ణుడికి ఎవరూ శాపాలు ఇయ్యలేదు.

రావణుడి ఆజ్ఞ పొంది రాక్షసులు గంధమూ, పూలమాలలూ, ఆహార పదార్థాలూ తీసుకుని కుంభకర్ణుడి ఇంటికి వెళ్ళారు. ఆ ఇల్లు చాలా పెద్దది. రాక్షసులు లోపలికి వెళ్ళటం చాలా కష్టమయింది. ఎందుకంటే, కుంభకర్ణుడు ఊపిరి విడిచినప్పుడల్లా ఆ గాలి రాక్షసులను వెనక్కు తోసేసింది.

అడ్డంగా పడిపోయిన పర్వతంలాగా కుంభకర్ణుడు పడుకుని గాఢమైన నిద్రలో ఉన్నాడు. అతన్ని లేపటం అసాధ్యం. అలాటి అసాధ్యమైన పనికి రాక్షసులు పూనుకుని, మొట్టమొదట అతని ముందు మాంసం రాశిగా పోశారు, మద్యపు బానలుంచారు, అతని శరీరమంతా చందనం పూశారు, అతని శరీరాన్ని పూలమాలలతో కప్పారు. తరవాత వాళ్ళు శంఖాలు ఊదారు, దొమ్మీగా అరిచారు, కుంభకర్ణుణ్ణి కొట్టారు, అటూ ఇటూ కదిలించారు, భేరీలు మోగించారు. కుంభకర్ణుడు లేవలేదు.

రాక్షసులు గదలూ, రోకళ్ళూ, గుదియలూ తీసుకుని కుంభకర్ణుణ్ణి చచ్చేట్టు కొట్టారు. అందువల్ల కూడా ప్రయోజనం లేకపోయింది. రాక్షసులు కుంభకర్ణుడి మీదికి గుర్రాలనూ, ఒంటెలనూ, గాడిదలనూ, ఏనుగులనూ తోలారు.

చిట్టచివరకు ఎలాగైతేనేం కుంభకర్ణుడు మేలుకున్నాడు. లేస్తూనే అతనికి ఆకలివేసింది. అతను తన ఎదట ఉన్న ఆహారపు రాసులను తిని, బానల కొద్దీ మద్యం తాగి, రాక్షసులను కలయజూసి, "మీరు నన్నెందుకు లేపారు? రావణుడికి క్షేమమేగదా? ఇతర భయాలేమీ లేవు గదా?" అని అడిగాడు.

కాని ఏదో ముంచుకురావటం చేతనే రాక్షసులు తనను నిద్రలేపారని కుంభకర్ణుడు గ్రహించాడు.

రావణుడి మంత్రి యూపాక్షుడు కుంభకర్ణుడి ప్రశ్నకు ఇలా సమాధానం చెప్పాడు:

"కుంభకర్ణుడా, మనకు పూర్వం ఏ దేవతలవల్లా, దైత్యులవల్లా, దానవుల వల్లా కలగని భయం ఇప్పుడు మానవుల వల్ల కలుగుతున్నది. కొండలంతేసి వానరులు లంకను ముట్టడించారు. సీతను ఎత్తుకొచ్చినందుకు అలిగి, రాముడు పెద్ద భయం కలిగిస్తున్నాడు. ముందు ఒక్క వానరుడు లంక అంతా కాల్చి, అక్షకుమారుణ్ణి సేనతో సహా చంపేశాడు. ఇప్పుడు రాముడు రావణుణ్ణి యుద్ధంలో కొట్టి, చచ్చాడనుకుని వదిలిపెట్టాడు. రావణుణ్ణి దేవతలూ, దైత్య, దానవులూ చెయ్యలేకపోయిన పనిని ఈ రాముడు చేశాడు."

తన అన్న యుద్ధంలో ఓడాడన్నమాట వినగానే కుంభకర్ణుడు కోపంతో యూపాక్షుడితో ఇలా అన్నాడు:

"నే నిప్పుడే వెళ్ళి వానరసేననూ, రామలక్ష్మణులనూ చంపేసి, తరవాత రావణుణ్ణి చూస్తాను. వానరుల రక్తమాంసాలు రాక్షసుల చేత తినిపించి, రామలక్ష్మణుల రక్తాన్ని నేనే తాగుతాను."

కోపంతో ఒళ్ళు తెలియకుండా గర్వం కొద్దీ కుంభకర్ణుడు ఆడిన ఈ మాటలు విని, మహోదరుడు చేతులు జోడించి, కుంభకర్ణుడితో, "నువు ముందు రావణుడి వద్దకు వచ్చి, ఆయన చెప్పినది విని, మంచి చెడ్డలు ఆలోచించి, తరవాత శత్రువులను జయించు," అన్నాడు.






మహోదరుడు అలా అన్నమీదట కుంభకర్ణుడు రాక్షసుల వెంట రావణుడి ఇంటికి వెళ్ళాడు. రాక్షసులు ముందుగా రావణుడి వద్దకు వెళ్ళి, "కుంభకర్ణుడు నిద్ర లేచాడు. అతనికి ఏం ఆజ్ఞ ఇస్తావు? అలాగే యుద్ధానికి పొమ్మన్నావా? ఇక్కడికి వచ్చి నిన్ను చూడమన్నావా?" అని అడిగారు.

"నేను కుంభకర్ణుణ్ణి చూడాలి. అతన్ని మర్యాదగా ఇక్కడికి తీసుకురండి," అన్నాడు రావణుడు.

రాక్షసులు వెళ్ళి ఈ మాట చెప్పగానే కుంభకర్ణుడు రావణుడి వద్దకు వచ్చాడు.

కుంభకర్ణుణ్ణి ప్రాకారాల వెలపల ఉన్న వానరులు చూసి భయపడి, అటూ ఇటూ పరిగెత్తారు. కుంభకర్ణుణ్ణి రాముడు కూడా చూశాడు, వానరసేన పరిగెత్తటమూ చూశాడు. అతను విభీషణుడితో, "పెద్ద మేఘంలాగున్నాడు, ఎవరితడు?" అన్నాడు.

విభీషణుడు రాముడితో ఇలా అన్నాడు:

"ఇతను విశ్రవసుడి కొడుకు కుంభకర్ణుడు. యుద్ధంలో యముణ్ణీ, ఇంద్రుణ్ణీ కూడా జయించినవాడు. ఇతని దేహమంత పెద్ద దేహం మరే రాక్షసుడికీ లేదు. ఇతర రాక్షసులు వరాలు పొంది బలవంతులయారు కాని, కుంభకర్ణుడు పుట్టుకతోనే మహా పరాక్రమశాలి. ఇతను పుట్టుతూనే ఆకలికొద్దీ అనేకవేల ప్రాణులను భక్షించాడు. ఇది చూసి ప్రజలు బెదిరిపోయి

26. కుంభకర్ణుడి యుద్ధం



ఇంద్రుడితో చెప్పి, అతని శరణు జొచ్చారు. ఇంద్రుడు కోపించి, కుంభకర్ణుణ్ణి వజ్రాయుధంతో కొట్టాడు. కుంభకర్ణుడు సింహనాదం చేశాడు. ఆ ధ్వనికి ప్రజలు మరింత హడలిపోయారు. కుంభకర్ణుడు ఐరావతం దంతం ఒకటి పీకి, దానితో ఇంద్రుణ్ణి రొమ్ములో పొడిచాడు. తరవాత ఇంద్రుడు ప్రజలను వెంటబెట్టుకుని బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి సంగతి చెప్పుకున్నాడు. బ్రహ్మదేవుడు రాక్షసులనందరినీ పిలిపించాడు. వారిలో కుంభకర్ణుడు కనిపించేసరికి బ్రహ్మకే భయం పుట్టింది. బ్రహ్మ కుంభకర్ణుడితో, 'లోకాలు నాశనం చెయ్యటానికి విశ్రవసుడు నిన్ను కన్నాడురా! నువ్వు సర్వకాల సర్వావస్థలయందూ ఒళ్ళు తెలియకుండా పడి ఉండి నిద్రపో!' అన్నాడు. ఆ శాపం తగిలి కుంభకర్ణుడు బ్రహ్మ ఎదటనే పడిపోయాడు. అది చూసి రావణుడు బ్రహ్మతో, 'నీ మునిమనమడయిన ఈ కుంభకర్ణుణ్ణి ఇలా శపించటం భావ్యం కాదు. నీ మాట అబద్ధం కావటానికి లేదు. వాడు నిద్రపోవటానికీ, మేలుకుని ఉండటానికీ కాల నియమం ఏర్పాటు చెయ్యి.' అన్నాడు. అప్పుడు బ్రహ్మ కుంభకర్ణుడు ఆరు మాసాలు నిద్రపోయేటట్టూ, ఒక్క రోజు మేలుకుని ఉండేటట్టూ, నిద్ర లేచినప్పుడు ఆకలితో ఎదట కనిపించినదంతా అగ్నిహోత్రుడి లాగా తినేటట్టూ నియమం పెట్టాడు.

"నీ పరాక్రమానికి బెదిరిపోయి రావణుడు కుంభకర్ణుణ్ణి నిద్ర లేపించాడు. మహా భయంకర పరాక్రముడైన కుంభకర్ణుడు వానరులను తినటానికి వస్తాడు. వానరులు అతన్ని ఎలా ఎదిరించగలరు? అది ఒక కదిలే యంత్రమని వానరులకు చెప్పాలి. అప్పుడుగాని వారి భయం పోదు."

రాముడు విభీషణుడు చెప్పినది విని తృప్తిపడి, నీలుడితో లంకా ద్వారాలన్నిటి పైనా దాడి సాగించమన్నాడు. గవాక్షుడూ,



హనుమంతుడూ, అంగదుడూ పర్వత శిఖరాలను తీసుకుని యుద్ధానికి వచ్చారు.

ఈ లోపల కుంభకర్ణుడు పూర్తిగా వదలని నిద్రమత్తుతో రావణుడి వద్దకు వచ్చి, అతను విచారంగా ఉండటం గమనించాడు. కుంభకర్ణుణ్ణి చూసి, రావణుడు పరమానందంతో ఆసనం నుంచి లేచి, కుంభకర్ణుణ్ణి కౌగలించుకుని, ఇద్దరూ కూర్చున్న అనంతరం, కుంభకర్ణుడు, ''ఏం తొందర కలిగింది? నిద్రపోతున్న నన్ను ఎందుకు లేపించావు? నీ కిప్పుడు ఎవడు భయం కలిగించాడు? వాడికి చావు దగ్గిరపడింది!'' అన్నాడు.

దానికి రావణుడు, ''నాకు రాముడి వల్ల భయం కలిగింది. అతను సుగ్రీవుడితోనూ, వానరసేనతోనూ, సముద్రం దాటి వచ్చి, మనని సర్వనాశనం చేస్తున్నాడు. యుద్ధంలో వానరవీరుడు ఒక్కడూ చావలేదుగాని, వానరుల చేతిలో రాక్షస వీరులు చాలామంది చచ్చారు. అందుచేత ఇప్పుడు నువు వానరులనందరినీ చంపి, లంకను కాపాడు. అందుకే నిన్ను నిద్ర లేపాను,'' అన్నాడు.

కుంభకర్ణుడు నవ్వి, ''ముందు మనం సమాలోచన చేసినప్పుడు ఎలా జరుగుతుందనుకున్నామో, అలాగే జరిగింది. సీతను అపహరించి తెచ్చిన పాపానికి ఫలితం వెంటనే కనబడింది. ఈ విషయంలో మన తమ్ముడు విభీషణుడు చెప్పినదే మనకు హితమైనది. లేదా, నీకు ఇంకేమైనా తోస్తే అలా చెయ్యి,'' అన్నాడు.

రావణుడు కోపంగా, ''నా కన్న చిన్నవాడివి నాకు బోధలు చేస్తున్నావేమిటి? ఇది నీతి గురించి ఆలోచించే సమయం కాదు. పరాక్రమం చూపే సమయం,'' అన్నాడు.

దానికి కుంభకర్ణుడు, ''రాక్షసరాజా, నేను నీకు తమ్ముణ్ణి, బంధువును. నీకు హితం చెప్పటం నా విధి. ఇక నీకు

కలిగిన విచారం మాటకు వస్తే నువు నిశ్చింతగా ఉండు. రామ లక్ష్మణులను చంపి, వానర సేన పారిపోయేటట్టు చేస్తాను. తమ బంధువులు పోయినందుకు దుఃఖించే రాక్షసులందరికీ సంతోషం కలిగిస్తాను. నేను బతికి ఉండగా రాముడు నిన్ను చంపలేడు," అన్నాడు.

మహోదరుడు కుంభకర్ణుణ్ణి మందలిస్తూ ఇలా అన్నాడు:

"రావణుడు సీతను ఎత్తుకువద్దామనుకున్నప్పుడు అందుకు మేమంతా ఆమోదించాం. ఎవరి హితమూ వినకుండా రావణుడు ఆ పని చెయ్యలేదు. నువు ఇప్పుడు నీ పరాక్రమం గొప్పగా చెప్పుకుని, ఒక్కడివే యుద్ధానికి పోతానంటున్నావు. అదికూడా సముచితంగా లేదు. జనస్థానంలో అనేకమంది రాక్షసులను ఒంటరిగా చంపిన రాముణ్ణి నువు ఒక్కడివే ఎలా చంపుతావు? ఆ జనస్థానంలో రాముడికి ఓడిన మహాపరాక్రమవంతులైన రాక్షసులు ఇప్పటికీ రాముడి పేరు చెబితే భయపడుతున్నారు, చూడు."

తరవాత మహోదరుడు రావణుడితో, "నువు మమ్మల్ని కొందరిని యుద్ధానికి పంపు. మేం రాముణ్ణి చంపితే సరేసరి, లేకపోతే తిరిగివచ్చి, రాముణ్ణి తినేశామని చెబుతాం. నువు బహిరంగంగా పండగ



జరుపు. సీతను భర్త పోయినందుకు పరామర్శించు. నీదాన్ని చేసుకో. యుద్ధంతో పనేలేకుండా నీ కోరిక తీరిపోతుంది!" అన్నాడు.

మహోదరుణ్ణి చూస్తే కుంభకర్ణుడికి మండిపోయింది. అతను మహోదరుడితో, "ఇలాటి మాటలు ఇంకెన్నడూ చెప్పకు. జాగ్రత్త! పిరికివాళ్ళూ, బుద్ధిహీనులూ అయిన నీలాటివాళ్ళ మాటలు వినటం చేతనే రావణుడికి ఈ ఆపద వచ్చిపడింది. మీకు యుద్ధమంటేనే భయం. రాజు చెప్పిన దానికంతకూ తాళం వేస్తూ, ఇచ్చకాలాడటంమూలాన వ్యవహారం ఇంతదూరం వచ్చింది. మీ మూలంగా



లంక దాదాపు నాశనమయింది. బొక్కసం ఖాళీ అయింది. సైన్యమంతా తుడిచి పెట్టుకుపోయింది. మీరు రాజును శత్రువుగా చూసినట్టున్నది. మీరు చేసిన తప్పులు సరిచెయ్యటానికి నేను యుద్ధభూమికి పోతున్నాను,'' అన్నాడు.

కుంభకర్ణుడి మాటలకు రావణుడు పకపకా నవ్వి, ''మహోదరుడికి రాముడంటే భయం. అందుకే యుద్ధం వద్దంటాడు. నాకు నీ కన్న దగ్గరవాడూ, నీ అంత బలవంతుడూ మరొకడు లేడు. నువు వెంటనే యుద్ధానికి బయలుదేరు, వానరులను భక్షించు, యుద్ధంలో జయం పొందిరా. అసలు నిన్ను చూస్తూనే వానరులు పారిపోతారు; రామలక్ష్మణుల గుండెలు పగిలిపోతాయి,'' అన్నాడు.

కుంభకర్ణుడు యుద్ధానికి పోవటానికి సిద్ధపడుతూ, మంచి వాడి గల శూలాన్ని చేపట్టాడు. అది ఇనుముతో చేసినది. దానికి మెరిసే బంగారు అలంకరణలున్నాయి. ఆ శూలాన్ని చేబట్టి కుంభకర్ణుడు రావణుడితో, ''నేను ఒంటరిగానే పోతాను. నా సేనను ఇక్కడే ఉండనీ. నన్ను చూసి భయపడిన వానరులనందరినీ తినేస్తాను.'' అన్నాడు.

"సాయుధసైనికులను వెంటబెట్టుకుని వెళ్ళు. వానరులు చాలా పరాక్రమవంతులు, వేగవంతులు, పట్టుదల గలవాళ్ళు. ఒంటరిగా, ఏమరుపాటున ఉన్నవాణ్ణి చంపెయ్యగలరు,'' అన్నాడు రావణుడు.

అతను కుంభకర్ణుణ్ణి తన చేతుల మీదుగా అలంకరించాడు. కుంభకర్ణుడు కవచం ధరించి, రావణుణ్ణి కౌగలించుకుని, రావణుడి ఆశీర్వాదం పొంది, యుద్ధానికి బయలుదేరాడు. అతని వెంట రథాలమీద అనేకమంది, సైన్యంతో సహా, శంఖాలూ, భేరీలూ మోగిస్తూ బయలుదేరారు.

దారిలో కుంభకర్ణుడు రాక్షసులతో, ''వానరులు మన కేమీ అపకారం చెయ్య

లేదు. అవి వనాలకు అలంకారంగా కూడా ఉంటాయి. ఇప్పుడు వానరులు లంకను ముట్టడించటానికి కారణం రామ, లక్ష్మణులు. అందుచేత యుద్ధంలో వారిద్దరినీ చంపేస్తాను,'' అన్నాడు.

కుంభకర్ణుణ్ణి చూడగానే వానరసేన చెల్లాచెదురుగా పారిపోయింది. అది చూసి కుంభకర్ణుడు చాలా సంతోషించాడు.

అంగదుడు వానరుల భయం గమనించి, నల, నీల, గవాక్ష, కుముదులతో, ''మీరు మీ స్వరూపాలనూ, పరాక్రమాలనూ, వంశాలనూ మరచి, మామూలు కోతుల్లాగా భయపడి ఎక్కడికి పోతారు? వెనక్కు తిరగండి. మీ కిప్పుడు ప్రాణభయం పట్టుకున్నాదా ఏం? ఆ కనిపించేది యోధుడు కాడు, మనని భయపెట్టటానికి తయారుచేసిన యంత్రం. దీన్ని మనం నాశనం చేతాం,'' అన్నాడు.

ఆ మాటతో వానరులు ధైర్యం తెచ్చుకుని, చెట్లూ, రాళ్ళూ తీసుకుని యుద్ధభూమికి వెళ్లారు. వాళ్లు మదపుటేనుగుల లాగా కుంభకర్ణుడి మీద యుద్ధం చేశారు. అయితే వాళ్ళు వేసిన చెట్లూ, రాళ్ళూ కుంభకర్ణుణ్ణి కదిలించలేకపోయాయి. అతను వానరులను చంపసాగాడు.

ఈసారి వానరులు కుంభకర్ణుడి చేత దెబ్బతిని, వెనక్కు తిరిగి చూడకుండా



అతివేగంగా పారిపోయారు. కొందరు వెళ్లి సముద్రంలో దూకారు. కొందరు గాలిలోకి ఎగిరారు. మరికొందరు తాము వచ్చిన సేతువు మీదుగానే పారిపోయారు.

అంగదుడు పారిపోవద్దని వారిని హెచ్చరించాడు. ఇన్నివేలమంది వానరులు ఒక్క కుంభకర్ణుడికి భయపడటమేమిటన్నాడు. కాని వానరులు తమకు ప్రాణాలుదక్కితే చాలునన్నారు. అయినా అంగదుడు మంచి మాటలతో వారిని వెనక్కు మళ్ళించాడు. అతనికి హనుమంతుడు కూడా సహాయం వచ్చాడు.

తరవాత హనుమంతుడి నాయకత్వం కింద ఋషభుడూ, శరభుడూ, మైందుడూ,

ధూమ్రుడూ, నీలుడూ, కుముదుడూ, సుషేణుడూ, గవాక్షుడూ, రంభుడూ, తారుడూ, ద్వివిదుడూ, పనసుడూ యుద్ధానికి బయలుదేరారు. వాళ్ళు చావటానికి కూడా సిద్ధంగా ఉన్నారు.

ఈ లోపల కుంభకర్ణుడు వానరులను తినసాగాడు. ద్వివిదుడు ఒక కొండను పెకలించి, కుంభకర్ణుడి పైకి వెళ్ళాడు. అతను విసిరిన ఆ కొండ గురి తప్పి, కుంభకర్ణుడి వెంట ఉన్న సేనపైన పడింది. దానికిందపడి రథాలూ, గుర్రాలూ, రాక్షసులూ నుగ్గయిపోయారు. ఇంతలో ద్వివిదుడు మరొక పర్వతశిఖరాన్ని విసిరాడు. అదికూడా అంతులేని విధ్వంసం చేసింది. రాక్షసరథికులు వానరులను చంపారు; వానరులు మహావృక్షాలతో రాక్షసులను చంపారు.

హనుమంతుడు ఆకాశంలో నుంచి కుంభకర్ణుడి మీద రకరకాల శిలలనూ, వృక్షాలనూ వర్షించాడు. కుంభకర్ణుడు తన శూలంతో పర్వతాలను పగలగొట్టి, చెట్లను పక్కకు నెట్టేశాడు. తరవాత అతను ఆ శూలం చేతబట్టి వానరసేనను తరుముతూంటే, హనుమంతుడు ఒక కొండతో అతన్ని బలంగాకొట్టాడు.

కుంభకర్ణుడి శరీరం గాయమై, రక్తం కారింది. అతను తన శూలాన్ని గిరగిరా తిప్పి హనుమంతుడి రొమ్ములో పొడిచాడు. హనుమంతుడు భయంకరంగా అరిచి, నోట నెత్తురుకక్కుతూ, మూర్ఛపోయాడు.

నీలుడు కుంభకర్ణుడి మీదకు మరొక పర్వతశిఖరం విసిరాడు. కుంభకర్ణుడు దాన్ని తన పిడికిలితో పొడిచి, నుగ్గు చేశాడు. ఋషభుడూ, శరభుడూ, నీలుడూ, గవాక్షుడూ, గంధమాదనుడూ ఈ అయిదుగురూ ఒక్కసారిగా కుంభకర్ణుడి పైకి వెళ్ళి, చుట్టుముట్టి, రాళ్ళతోనూ, చెట్లతోనూ, పిడికిళ్ళతోనూ, కాళ్ళతోనూ కొట్టారు. ఆ దెబ్బలు కుంభకర్ణుడికి సుఖంగాతోచాయి. అతను ఆ అయిదుగురు వానరవీరులనూ, ఒకరి తరవాత ఒకరుగా నెత్తురు కక్కించి, నేల కూల్చాడు.





# వీర హనుమాన్

వానరులు వేల సంఖ్యలో కుంభకర్ణుడి మీదికి దూకారు. వాళ్ళు ఆ పర్వతాకారుణ్ణి కొరికి, గీరి, పిడికిళ్ళతోనూ, మోకాళ్ళతోనూ పొడిచారు. కాని కుంభకర్ణుడు ఏ మాత్రమూ లక్ష్యపెట్టక, వానరసేనలను నిర్మూలించసాగాడు. కుంభకర్ణుణ్ణి ఆపటం వానరుల వల్ల కాదని స్పష్టమయింది.

అంగదుడూ, అతని తరవాత సుగ్రీవుడూ కుంభకర్ణుడి మీదికి కొండలు విసిరారు, కాని అవి అతన్ని ఏమీ చెయ్యలేకపోయాయి. అతను సుగ్రీవుడి మీదికి తన శూలం విసిరాడు. హనుమంతుడు దారిలో దాన్ని ఒడిసిపట్టుకుని, విరిచి పారేశాడు. ఇదిచూసి వానరులు ఎంతో సంతోషించి, సింహనాదాలు చేశారు. అప్పుడు కుంభకర్ణుడు ఒక పర్వతశిఖరం విసిరి, సుగ్రీవుణ్ణి మూర్ఛపోగొట్టాడు. అది చూసి రాక్షసులు సింహనాదాలు చేశారు. కుంభకర్ణుడు మూర్ఛపోయిన సుగ్రీవుణ్ణి ఎత్తుకునిపోయాడు. సుగ్రీవుణ్ణి కాజేస్తే, రామ, లక్ష్మణులతో సహా వానరసేన వశమైనట్టేనని అతను అనుకున్నాడు. అతను సుగ్రీవుడితో సహా లంకలోకి వెళ్ళిపోయాడు.

ఇదంతా చూసి కూడా హనుమంతుడు భయపడలేదు. మూర్ఛ తెలియగానే సుగ్రీవుడు తనను తాను రక్షించుకోగలడని అతని నమ్మకం. అందుచేత అతను దిగులుపడవద్దని వానరులకు ధైర్యం

## 27. రామ లక్ష్మణుల మూర్ఛ



53



చెబుతూ యుద్ధ రంగంలో ఉండిపోయాడు.

అతను అనుకున్నట్టుగానే సుగ్రీవుడికి స్పృహవచ్చి చూసేసరికి, తాను కుంభకర్ణుడి భుజం మీద ఉన్నట్టు తెలిసింది. అతనికి లంకానగరపు వీధులు కనిపించాయి. అతను చప్పున కుంభకర్ణుడి ముక్కూ, చెవులూ కొరికేశాడు. కుంభకర్ణుడు నెత్తురు ఓడుతూ, సుగ్రీవుణ్ణి నేలకేసి కొట్టి, కాలితో మట్టగించాడు. అయితే సుగ్రీవుడు దాన్ని లక్ష్యపెట్టక, ఆకాశంలోకి ఎగిరి, రాముణ్ణి చేరుకున్నాడు.

సుగ్రీవుడు తప్పించుకు పోగానే కుంభకర్ణుడు తిరిగి యుద్ధభూమికి వచ్చి, వానరులను భక్షించసాగాడు. అప్పుడు లక్ష్మణుడు యుద్ధానికి వచ్చి, అతని మీద బాణాలు వేశాడు. కుంభకర్ణుడు వాటిని లక్ష్యపెట్టక, రాముడి మీదికిపోయాడు.

రాముడు అతనితో, "కుంభకర్ణుడా, నువు ఇంద్రుణ్ణి జయించావు కాబోలు. నేను ఇంద్రుణ్ణి కాను, రాముణ్ణి నిన్ను క్షణంలో చంపేస్తాను," అన్నాడు.

"రాముడా, నేను విరాధుణ్ణి కాను; వాలినీ, మారీచుణ్ణీ కాను, కుంభకర్ణుణ్ణి. నీ పరాక్రమం నా మీద చూపించు, తరవాత నేను నిన్ను తినేస్తాను." అన్నాడు కుంభకర్ణుడు రాముడితో.

సాలవృక్షాలను ఛేదించటానికీ, వాలిని చంపటానికీ ఉపయోగించిన బాణాలను రాముడు కుంభకర్ణుడి మీద వేశాడు, కాని అవి అతన్ని ఏమీ చెయ్యలేకపోయాయి. అప్పుడు రాముడు అతని మీద వాయవ్యాస్త్రం ప్రయోగించాడు. దానితో కుంభకర్ణుడి చెయ్యి, గదతో సహా తెగి పడిపోయింది.

కుంభకర్ణుడు గట్టిగా అరిచి, రెండో చేత్తో ఒక పెద్ద వృక్షం పెరికి, రాముడి మీదికి వెళ్ళాడు. రాముడు ఐంద్రాస్త్రంతో కుంభకర్ణుడి రెండో చేతినికూడా ఖండించేశాడు. అప్పటికీ కుంభకర్ణుడు రాముడి పైకి పోవయత్నించాడు. రాముడు అతని

కాళ్ళు కూడా ఖండించాడు, చిట్ట చివరకు కుంభకర్ణుడి శిరస్సు కూడా ఖండించేశాడు.

కుంభకర్ణుడు చావగానే రాక్షసులు అమితమైన దుఃఖంతో పెద్ద పెట్టున ఏడ్చారు. వాళ్ళు రాముణ్ణి చూసి హడలిపోయారు. వానరులు రాముడి చుట్టూ చేరి, అతన్ని పూజించారు.

కుంభకర్ణుడు రాముడి చేతిలో చచ్చాడన్న వార్త రాక్షసుల ద్వారా రావణుడికి చేరింది. ఈ మాట విని రావణుడు మూర్ఛపోయాడు. అతని కొడుకులైన దేవాంతకుడూ, నరాంతకుడూ, త్రిశిరుడూ, అతికాయుడూ పెద్ద పెట్టున ఏడ్చారు. అలాగే కుంభకర్ణుడి తమ్ములైన మహోదరుడూ, మహాపార్శ్వుడూ ఏడ్చారు.

మూర్ఛ తెలిసిన రావణుడు, ఇక లంక వానరుల వశమవుతుందని భయపడ్డాడు. అతనికి రాజ్యంతోనే రుణం తీరినట్టు తోచింది, సీత మాట సరేసరి. అతను రాముణ్ణి చంపి తన తమ్ముడి కోసం పగ తీర్చుకోవాలనీ, లేదా తాను కూడా చావాలనీ నిశ్చయించాడు. విభీషణుడి మాట వినక, అతన్ని దూరం చేసుకున్నందుకు కూడా రావణుడిలో పశ్చాత్తాపం కలిగింది.



రావణుడి దుఃఖం చూసి త్రిశిరుడు, "మూడు లోకాలనూ జయించగల నువు ఇలా అధైర్యపడతావేమిటి? నన్ను యుద్ధానికి పంపు. నేను రాముణ్ణి చంపి వస్తాను," అన్నాడు.

ఆ మాట విని దేవాంతకుడూ, నరాంతకుడూ, అతికాయుడూ కూడా యుద్ధానికి పోతామని ఉబలాటపడ్డారు. రావణుడు వారిని చూసి పరమానందం చెంది, కౌగలించుకుని, యుద్ధానికి పంపాడు.

మళ్ళీ రాక్షసులకూ, వానరులకూ యుద్ధం జరిగింది. రాక్షస వీరుడైన నరాంతకుడు వానరులలో భీభత్సం కలిగిస్తూండటం చూసి, అతన్ని చంపమని



సుగ్రీవుడు అంగదుడితో చెప్పాడు. అంగదుడు నరాంతకుడితో కొంతసేపు యుద్ధంచేసి, చివరకు అతన్ని చంపేశాడు.

అది చూసి త్రిశిరుడూ, మహోదరుడూ, దేవాంతకుడూ అంగదుడి మీదికి వచ్చారు. అంగదుడు సాహసంతో ముగ్గురు రాక్షసులనూ ఎదిరించి పోరాడుతూండటం చూసి, హనుమంతుడు తోడు వచ్చి, ఒక్క గుద్దుతో దేవాంతకుణ్ణి చంపాడు. అలాగే అంగదుడికి తోడువచ్చిన నీలుడు మహోదరుణ్ణి చంపేశాడు.

మహాపార్శ్వుడితో ఋషభుడు భయంకరమైన యుద్ధం చేసి, చివరకు అతన్ని చంపాడు. మహాపార్శ్వుడు చావగానే రాక్షసులు ఆయుధాలు వదిలి పారిపోయారు.

యుద్ధానికి పోయిన రాక్షస వీరులు చచ్చారని తెలిసి అతికాయుడు బయలుదేరాడు. చిన్న పర్వతంలాగా వచ్చే అతికాయుణ్ణి చూసి, రాముడు విభీషణుడితో, ''ఈ రాక్షస వీరుడు ఎవరు?'' అన్నాడు.

''ఇతను రావణుడికి ధాన్యమాలిని వల్ల కలిగిన కొడుకు, అతికాయుడు. ప్రతాపంలో రావణుడంతటివాడు. ఇతను బ్రహ్మదేవుడి అనుగ్రహం పొంది, దివ్యాస్త్రాలు సంపాదించి, దేవతలచేతా, రాక్షసులచేతా చావు లేకుండా వరం పొందాడు. అతను ధరించిన కవచమూ, అతను ఎక్కిన రథమూ కూడా బ్రహ్మదేవుడు ఇచ్చినవే. వీటి సహాయంతో అనేకసార్లు ఇతను దేవతలనూ, దానవులనూ జయించి, రాక్షసులను రక్షించాడు. ఇతన్ని త్వరగా చంపకపోతే వానర బలాలకు తీవ్రమైన నష్టం కలిగించగలడు,'' అని విభీషణుడు రాముడితో అన్నాడు.

ఈ లోపల వానరసేన మీదికి వచ్చిన అతికాయుణ్ణి కుముదుడూ, ద్వివిదుడూ, మైందుడూ, నీలుడూ, శరభుడూ ఎదుర్కొన్నారు. కాని అతన్ని వాళ్ళు ఏమీ

చేయలేకపోగా, అతని బాణాలతో తీవ్రంగా బాధపడ్డారు.

అతికాయుడు తన మీదికి రాని వాడి మీదికి పోక, తిన్నగా రాముడి వద్దకు వచ్చి, "పారిపోయే వాళ్ళతో యుద్ధం చెయ్యను. నాతో యుద్ధం చేసే ఉత్సాహం గలవారెవరు?" అని అడిగాడు.

ఈ మాటకు లక్ష్మణుడు అలిగి, అతికాయుడి ముందుకు వచ్చి, ధనుష్టంకారం చేశాడు. అతన్ని చూసి అతికాయుడు, "లక్ష్మణుడా, చిన్నవాడివి. నీకున్న పరాక్రమం ఎంత? నాతో ఏమని యుద్ధం చేయ వచ్చావు? ఎందుకు వృథాగా చచ్చిపోతావు. అవతలికి వెళ్ళు," అన్నాడు.

"శౌర్యం చూపవలసినది మాటల్లో కాదు, చేతల్లో. నిన్ను నువు పొగడుకోక, నీ పరాక్రమం నా మీద చూపు," అన్నాడు లక్ష్మణుడు.

ఇద్దరూ బాణాలతో యుద్ధం ఆరంభించారు. లక్ష్మణుడి బాణాల దెబ్బలు తిన్నమీదట అతికాయుడికి అతని మీద కొంత గౌరవం ఏర్పడి ఉత్సాహంతో యుద్ధం చేశాడు. ఇద్దరూ ఒకరి మీద ఒకరు దివ్యాస్త్రాలు ప్రయోగించారు. అతికాయుడి బాణాలు లక్ష్మణుణ్ణి బాధించాయిగాని, లక్ష్మణుడి బాణాలు



అతికాయుడి కవచాన్ని ఛేదించలేక పోయాయి. అందుచేత లక్ష్మణుడు అతని మీద బ్రహ్మాస్త్రం వేశాడు. అతికాయుడు దాన్ని ఆపటానికి చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. ఆ బాణం అతికాయుడి తల నరికేసింది.

అతికాయుడి చావుతో రాక్షసుల శోకానికి అంతులేకుండా పోయింది. ఈ వార్త రావణుడికి చేరేసరికి అతను నిర్ఘాంతపోయాడు. ఎందుకంటే మేటి రాక్షస వీరులు ఒకరొకరే రామలక్ష్మణుల చేతిలో చచ్చిపోతున్నారు. వానరులను తక్కువ చెయ్యటం కూడా పొరపాటే అయింది.



తన తండ్రి విచారంలో మునిగి ఉండటం చూసి ఇంద్రజిత్తు, "నేను బతికి ఉండగానే నీకు విచారం దేనికి? నా బాణాల దెబ్బ తిని ఎవడూ ప్రాణాలతో బయటపడలేడు. ఈ రామ, లక్ష్మణుల ప్రాణాలు నేను తీస్తాను. ఇప్పుడే యుద్ధానికి బయలుదేరుతున్నాను," అన్నాడు.

అతను తండ్రి అనుమతి పొంది, ఉత్తమమైన కంచర గాడిదలు కట్టిన రథం ఎక్కాడు. అతను యుద్ధభూమికి పోతూంటే, అనేకమంది రాక్షసయోధులు రకరకాల ఆయుధాలు ధరించి, సంతోషంగా అతని వెంటవెళ్ళారు.

ఇంద్రజిత్తు యుద్ధభూమిని చేరి, దివ్యరథం సంపాదించటానికై హోమం చేయ నిశ్చయించి, రాక్షసులను తన చుట్టూ కాపలా ఉండమన్నాడు. తరవాత అతను మంత్రయుక్తంగా అగ్నిలో హోమం చేశాడు. అతను హవిస్సులు హోమం చేస్తుంటే, అగ్ని పొగ లేకుండా పెద్ద జ్వాలలతో మండింది.

తరవాత ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రాన్ని జపించి, ఆ అస్త్రంతో తన వింటినీ, రథాన్నీ, ఇతర ఆయుధాలనూ మంత్రించాడు. హోమం పూర్తి అయింది. ఇంద్రజిత్తు తన రథంతోనూ, ఆయుధాలతోనూ, రథసారథితోనూ ఆకాశంలో అంతర్ధానమయాడు.

రాక్షససేన గుర్రాలతోనూ, రథాలతోనూ యుద్ధరంగానికి కదిలింది. రాక్షసులు వానరుల మీద రకరకాల ఆయుధాలతో యుద్ధం ప్రారంభించారు. ఇంద్రజిత్తు వాళ్ళను ప్రోత్సహించాడు. తరవాత అతను కూడా యుద్ధంలో ప్రవేశించాడు. అతను ఒక్కొక్క దెబ్బకు అయిదారుగురు వానరులను చంపసాగాడు. అతను మామూలు వానరులనే గాక, ముఖ్యమైన వానర వీరులందరినీ క్రూరంగా హింసించాడు. గంధమాదనుడూ, నలుడూ, మైందుడూ,

గజుడూ, సుగ్రీవుడూ, ఋషభుడూ, అంగదుడూ, ద్వివిదుడూ అతని బాణాలకు తీవ్రంగా గురి అయారు. కాని, అదృశ్యంగా ఉన్న ఇంద్రజిత్తును వారు చూడను కూడా లేదు.

ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణాలు రామ, లక్ష్మణులకు కూడా తగిలాయి. రాముడు లక్ష్మణుడితో, "ఈ ఇంద్రజిత్తు అదృశ్యంగా ఉండి యుద్ధం చేస్తున్నాడు. అందుచేత అతన్ని చంపలేం. మనం అతని బాణాల మూలంగా పడిపోయినట్టు ఉన్నామంటే, అతను సంతోషించి, లంకకు వెళ్ళిపోతాడు." అన్నాడు.



అలాగే రామలక్ష్మణులు బాణాల దెబ్బలు తిని పడిపోయారు. ఇంద్రజిత్తు సింహనాదంచేసి, లంకకు తిరిగివెళ్ళాడు.

ఇంద్రజిత్తు ప్రయోగించినది బ్రహ్మాస్త్రం. ఎంతమంది వానరులు దానికి కేవలమూ బద్ధులయారో, ఎంతమంది చచ్చిపోయారో తెలుసుకోవాలన్నాడు హనుమంతుడు విభీషణుడితో.

హనుమంతుడూ, విభీషణుడూ చెరొక మండే కట్టెనూ తీసుకుని, యుద్ధభూమి అంతటా వెతకసాగారు. వాళ్ళకు ప్రాణాలతో ఉన్న జాంబవంతుడు కనిపించాడు. విభీషణుడు ఆ వృద్ధుణ్ణి పలకరించి, "ప్రాణాలతో ఉన్నావుగద!" అన్నాడు.

జాంబవంతుడికి చూపు దెబ్బ తిన్నది. అతను విభీషణుణ్ణి, "హనుమంతుడు బతికి ఉన్నాడా?" అని అడిగాడు.

"రామలక్ష్మణులను గురించి అడగకుండా హనుమంతుణ్ణి గురించి అడుగుతున్నావెందుకు?" అని విభీషణుడు జాంబవంతుడితో అన్నాడు.

"నాయనా, విభీషణుడా! హనుమంతుడు బతికి ఉండి, మిగతా వానర సేన అంతా చచ్చినా ఏమంత నష్టంలేదు. కాని అతను చచ్చిపోతే, వానరసేన అంతా బతికి ఉండినా మన మంతా చచ్చినవారిలోనే జమ అవుతాము!" అన్నాడు జాంబవంతుడు.

పెద్దవాడు ఇలా అనే సరికి హనుమంతుడు ముందుకు వచ్చి, జాంబవంతుడి రెండు కాళ్ళూ పట్టుకుని నమస్కారం చేశాడు.

జాంబవంతుడు అతనితో, "నాయనా, హనుమంతుడా! ఇప్పుడు వానరులనందరినీ నువే రక్షించాలి. ఆ పనికి నువు తప్ప మరెవడూ లేడు." అన్నాడు.

తరవాత రామలక్ష్మణుల మూర్ఛ పోగొట్టటానికి జాంబవంతుడు హనుమంతుడికి ఒక పని చెప్పాడు:

"నువు సముద్రం మీదుగా హిమాలయానికి వెళ్ళాలి. అక్కడ నీకు అమిత ఎత్తయిన శిఖరాలు కాంచనమూ, కైలాసమూ కనిపిస్తాయి. ఆ రెంటికీ మధ్యగా ఓషధిపర్వతం ఉన్నది. దాని శిఖరం మీద నాలుగు దివ్యమైనఓషధులున్నాయి. అవి దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఉంటాయి. వాటి పేర్లు విశల్యకరణీ, మృతసంజీవినీ, సావర్ణకరణీ, సంధానకరణీ. ఈ నాలుగు ఓషధులనూ తీసుకుని త్వరగా రా. వాటితో వానరులను బతికించి, ఆరోగ్యవంతులను చేద్దాం."

వెంటనే హనుమంతుడు వాయుమార్గాన బయలుదేరాడు. అతను సముద్రాన్నీ, పర్వతాలనూ, నదులనూ, అరణ్యాలనూ దాటుకుంటూ హిమవత్పర్వతం కేసి అమితవేగంగా వెళ్ళాడు.

హిమాలయాన్ని చేరగానే హనుమంతుడికి అనేక ఎత్తయిన శిఖరాలూ, ఆశ్రమాలూ కనిపించాయి. బ్రహ్మకోశమూ, కైలాసపర్వతమూ, ఇంద్రుడు తపస్సు చేసినచోటూ, రుద్రబాణ మోక్షస్థానమూ, హయగ్రీవక్షేత్రమూ, బ్రహ్మకపాలమూ మొదలైన ప్రదేశాలను అతను చూశాడు. ఇంద్రుడికి బ్రహ్మ వజ్రం ఇచ్చినచోటూ, కుబేరుడి స్థానమూ, బ్రహ్మసనమూ, శివధనుక్షేత్రమూ చూశాడు. ఆఖరుకు ఔషధిపర్వతం కూడా అతనికి, కైలాసపర్వతానికీ, ఋషభపర్వతానికీ మధ్యన కనిపించింది. దానిమీద ఓషధులన్నీ వెలిగిపోతున్నాయి.





# వీర హనుమాన్

హనుమంతుడు ఓషధుల కోసం వెతకటం మొదలుపెట్టేసరికి వాటి జాడ తెలియ లేదు. అన్ని మొక్కలూ ఒకలాగే ఉన్నాయి. హనుమంతుడు మండిపడి, పర్వతశిఖరాన్ని పెల్లగించి, దాన్ని తీసుకుని బయలుదేరాడు.

పెద్ద కొండతో తిరిగి వస్తున్న హను మంతుణ్ణి చూసి వానరులు సంతోషంతో గర్జించారు. అది విని హనుమంతుడు కూడా గర్జించాడు. అతను కిందికి దిగి, వానరులలో పెద్దలకు నమస్కరించి, విభీషణుణ్ణి కౌగలించుకున్నాడు.

ఓషధుల మీదుగా వచ్చే గాలి పీల్చి రామ, లక్ష్మణులు స్వస్థత చెందారు. వానరులు కూడా మూర్ఛ తెలిసి, లేచారు. చచ్చిపడిపోయిన వానరులు ఓషధుల వాసన తగలగానే బతికి లేచారు. వారి శరీరబాధలన్నీ పోయాయి.

అలాగే అనేకమంది రాక్షసులు కూడా బతికి ఉండేవారేమో, కాని యుద్ధంలో చచ్చిపోయిన రాక్షసులందరినీ రావణుడు రహస్యంగా ఉండగలందులకు సముద్రంలో పడేయించాడు.

ఓషధులతో పని తీరిపోగానే హను మంతుడు ఓషధీపర్వతాన్ని యథాస్థానంలో ఉంచి, రామ, లక్ష్మణుల వద్దకు తిరిగివచ్చాడు.

తిరిగి వచ్చిన హనుమంతుడితో సుగ్రీవుడు, "కుంభకర్ణుడు చచ్చాడు, రావణుడి కొడుకులూ చచ్చారు. అందు

**28. ఇంద్రజిత్తు హోమం**



చేత రావణుడు ఇప్పుడు యుద్ధానికి రాడు. ఈ రాత్రికి బలవంతులైన వానరులు దివిటీలు తీసుకుని లంకకు వెళ్ళాలి,'' అన్నాడు.

సూర్యాస్తమానమై. చీకటి పడగానే వానర వీరులు దివిటీలు పట్టుకుని లంకకు బయలుదేరారు. ద్వారాల వద్ద కాపలా ఉన్న రాక్షసులు వానరులకు బెదిరి పారిపోయారు. వానరులు, తమను అడ్డేవారు లేక, నగరద్వారాలకూ, బురుజులకూ, వీధులలోనూ, ఇళ్ళకూ నిప్పు పెట్టేశారు. ఇళ్ళు అసంఖ్యాకంగా తగలబడ్డాయి. ఇళ్ళతోబాటు ఇళ్ళలో ఉండే అమూల్యమైన వస్తువులు కూడా తగలబడ్డాయి. చాలామంది రాక్షసులు కూడా మంటలలో చచ్చారు. వానరుల హర్షధ్వానాలూ, రాక్షసుల ఆర్తనాదాలూ మిన్నుముట్టాయి.

రాక్షసులు ఈ పరిస్థితిలో యుద్ధానికి సిద్ధపడ్డారు. కాని ఈసారి వాళ్ళు వానరులను లంకానగరంలోనే ఎదుర్కోవలసి వచ్చింది.

''మీరు రావణుడి మందిరం సమీపంలో రాక్షసులతో యుద్ధం చెయ్యండి,'' అని సుగ్రీవుడు వానరులకు ఆజ్ఞ ఇచ్చాడు. అతని ఆజ్ఞ ప్రకారం దివిటీలు పట్టుకున్న వానరులు తన మందిర ద్వారాల వద్ద నిలబడి ఉండటం చూసి రావణుడికి చాలా కోపం వచ్చింది. అతను కుంభకర్ణుడి కొడుకులైన కుంభ, నికుంభులను వానరుల మీద యుద్ధానికి పంపాడు. కుంభ, నికుంభుల వెంట యూపాక్షుడూ, శోణితాక్షుడూ, ప్రజంఘుడూ, కంపనుడూ కూడా వెళ్ళారు.

ఉభయపక్షాలకూ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో అంగదుడు కంపనుణ్ణి చంపాడు. తరవాత అతను శోణితాక్షుడి ఖడ్గం లాగేసుకుని, దానితోనే అతన్ని చంపి, ఇతర రాక్షసుల మీదికి వెళ్ళాడు. అతని చేతిలో ప్రజంఘుడూ చచ్చాడు. యూపాక్షుడు మైందుడి చేతిలో చచ్చాడు.

కుంభుడితో యుద్ధంచేస్తూ అంగదుడు మూర్ఛపోయాడు. అదితెలిసి రాముడు అంగదుడికి తోడుగా జాంబవంతుడు మొదలైనవారిని పంపాడు. కాని వాళ్ళు కుంభుడి బాణాలను ఎదుర్కొని, అతన్ని సమీపించలేకపోయారు. అదిచూసి సుగ్రీవుడు కుంభుడి బాణాలను సహిస్తూ, అతన్ని సమీపించి, అతని ధనుస్సును విరిచి, అతనితో కలియబడి యుద్ధం చేశాడు. ఆ మల్లయుద్ధంలో చివరకు కుంభుడు చచ్చాడు.

తన అన్న చచ్చినందుకు ఆగ్రహించి నికుంభుడు పరిఘ నొకదాన్ని గిరగిరా తిప్పి, ఎదురుగా కనిపించిన హనుమంతుడి రొమ్ము కేసి విసిరాడు. అది హనుమంతుడి రొమ్ముకు తగిలి, ముక్కలై కిందపడింది. కాని హనుమంతుడు మంచిదెబ్బతిన్నాడు. ఆ కోపంతో అతను పిడికిలిబిగించి, నికుంభుడి రొమ్ములో బలంకొద్దీ పొడిచాడు.

ఆ దెబ్బకు నికుంభుడు నెత్తురు కార్చుకుని, మూర్ఛపోయి, తిరిగి లేచి హనుమంతుడితో కలియబడ్డాడు. హనుమంతుడు ఉగ్రుడైపోయి, నికుంభుడి గొంతు పట్టుకుని గిరగిరా తిప్పి, అతని తల విరిచి చంపాడు.

కుంభ, నికుంభులు చచ్చినందుకు ఏడ్చి, రావణుడు యుద్ధానికి ఖరుడి కొడుకైన మకరాక్షుణ్ణి పంపాడు. మకరాక్షుడు రాముడితో యుద్ధం చేసి, చచ్చాడు.




ఈ వార్త అందగానే రావణుడు కోపంతో పళ్ళుకొరికి, ఇంద్రజిత్తును యుద్ధానికి వెళ్ళమన్నాడు. ఇంద్రజిత్తు హోమం చెయ్యటానికి యాగభూమికి వెళ్ళాడు. అతనిరాక చూసి, అక్కడ ఉండే రాక్షస స్త్రీలు ఋత్విజులు ధరించటానికి ఎర్ర తలగుడ్డలు తెచ్చారు.

ఇంద్రజిత్తు చేసిన హోమం అతి చిత్రమైనది. అతను దర్భలకు బదులు తన ఆయుధాలూ, సమిధలకు తాండ్ర పుల్లలూ, స్రుక్, స్రువాలుగా ఇనుప పాత్రలూ వాడాడు. అతని ఋత్విజులు



55



ఎర్రబట్టలు కట్టుకున్నారు. హోమం కోసం అతను నల్లమేక కంఠం నరికాడు. విజయ సూచకంగా అగ్ని పొగలేకుండా మండింది. ఈవిధంగా ఇంద్రజిత్తు అగ్నిలో హోమం చేసి, దేవ, దానవ, రాక్షసులకు తర్పణా లిచ్చి, మాయమయేశక్తిగల తన రథాన్ని ఎక్కాడు. ఆ రథం సూర్యుడిలాగా వెలిగి పోతున్నది.

ఇంద్రజిత్తు అంతర్ధానమై యుద్ధ రంగానికి వచ్చాడు. అతను వానరసేన మధ్య రామ, లక్ష్మణులను గుర్తించి, వారి మీద బాణవర్షం కురిపించాడు. రామ, లక్ష్మణులు తమ బాణాలతో ఆకాశమంతా కప్పినా, అవి ఇంద్రజిత్తుకు తగలలేదు. అతని బాణాలు రాముడి అన్ని అవయవా లనూ గాయపరిచాయి. రామ లక్ష్మణులు తమ బాణాలతో ఇంద్రజిత్తు బాణాలను చాలావరకు ఖండించారు. అతని బాణాలు వానర సేనలో అమితమైన నష్టాన్ని కలిగిస్తున్నాయి.

లక్ష్మణుడికి చాలాకోపం వచ్చి, "నేను బ్రహ్మాస్త్రంప్రయోగించి రాక్షసులనందరినీ చంపేస్తాను," అని రాముడితో అన్నాడు.

రాముడు అందుకు ఒప్పుకోక, "ఒక్కడి కోసం భూమి మీద ఉండే రాక్షసుల నందరినీ చంపుతాననటం భావ్యంకాదు. మనం ఇంద్రజిత్తును మాత్రమే చంపే ప్రయత్నంచేతాం. దివ్యాస్త్రాలను ప్రయో గింతాం," అన్నాడు.

ఇంతలో ఇంద్రజిత్తుకు ఏదో ఆలోచన వచ్చింది. అతను యుద్ధభూమి నుంచి లంకానగరంలోకి తిరిగివెళ్ళి, మాయా సీతను రథం మీద ఉంచుకుని యుద్ధ భూమికి మళ్ళీ వచ్చాడు. ఆ మాయా సీతను రామ, లక్ష్మణులు చూస్తూండగా చంపి, వారికి మనోదౌర్బల్యం కలిగించా లని అతని ఉద్దేశం.

ఇంద్రజిత్తు యుద్ధభూమికి తిరిగి రావటం చూసి హనుమంతుడు గొప్ప శిలను చేతబట్టుకుని అతని కేసి వచ్చాడు. అతని వెనకగా అనేకమంది వానరవీరులు

శిలలు చేతబట్టి వచ్చారు. అయితే హనుమంతుడికి ఇంద్రజిత్తు రథం మీద ఏడుస్తూ, కృశించిపోయిన సీత కన బడింది. అది చూసి హనుమంతుడికి కన్నీరు ఆగలేదు. అతను మిగిలిన వానరులను, "ఇంద్రజిత్తు తన రథం మీద సీతాదేవిని ఎందుకు తెచ్చి ఉంటాడు ?" అని అడిగాడు.

తరవాత అతను ఆవేశంతో ఇంద్రజిత్తు మీదికి వెళ్ళాడు. వానరసేన తన మీదికి వస్తూండటం చూసి, ఇంద్రజిత్తు తన కత్తితో మాయ సీత మెడ మీద రాచాడు, ఆమెను కొట్టి, జుట్టు పట్టుకున్నాడు.



హనుమంతుడికి కన్నీరు ఆగలేదు. అతను ఇంద్రజిత్తుతో, ''దుర్మార్గుడా, పాపీ! నువు చేసేపని ఏం పని? ఇలా చెయ్యటానికి నీకు సిగ్గు కూడా లేదా? నువు సీతను చంపావే, త్వరలోనే నువూ చస్తావు. నీ కెంత బలం ఉన్నా సరే! నా చేతికి చిక్కావు. నిన్ను ప్రాణాలతో వదలను,'' అన్నాడు.

ఇంద్రజిత్తు మీదికి వచ్చిన వానర సేనను రాక్షససేన ఎదిరించింది. ఇంద్ర జిత్తు హనుమంతుడితో, ''ఈ సీత కోసమే గదా నువూ, సుగ్రీవుడూ, రాముడూ లంకకు వచ్చారు? ఆమెను నీ కళ్ళ ఎదటే చంపేస్తాను. తరవాత రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ, నిన్నూ, సుగ్రీవుణ్ణీ, ద్రోహి అయిన విభీషణుణ్ణీ చంపేస్తాను. స్త్రీలను చంపరాదంటున్నావుగాని, శత్రువుకు బాధ కలిగించేది ఏదైనా చెయ్యవచ్చు,'' అన్నాడు.

ఇలా అని, ఏడుస్తున్న మాయ సీతను తన ఖడ్గంతో ఇంద్రజిత్తు నరికాడు. తరవాత అతను వికృతంగా సింహనాదం చేశాడు. ఆ ధ్వనికి బెదిరి వానరులు పారిపోయారు.

హనుమంతుడు వారిని వారిస్తూ, ''మీ ప్రతాపమూ, కార్య శూరత్వమూ ఏమయింది? శూరులు యుద్ధం నుంచి పారిపోతారా?'' అని వారిని వెనక్కు



అయితే హనుమంతుడు రాక్షససేనను తరిమికొట్టి, తన వారితో, "ఈ రాక్షస సేనతో మనకేమిటి? మనం సీత కోసం వచ్చాం. సీత చచ్చిపోయింది. ఇంద్రజిత్తు సీతను చంపాడన్న వార్త రాముడికీ, సుగ్రీవుడికీ చెప్పి, వాళ్లు ఏం చెయ్యమంటే అది చేద్దాం, పదండి," అన్నాడు.

హనుమంతుడు తిరిగిపోవటం చూసి, ఇంద్రజిత్తు హోమం చెయ్యటానికని నికుంభిళ చైత్యానికి వెళ్ళాడు. అక్కడ అతను అగ్నిలో మాంసమూ, రక్తమూ హోమం చేశాడు.

ఈ లోపల రాముడు వానరులకూ, రాక్షసులకూ కోలాహలంగా యుద్ధం సాగుతూండటం గ్రహించి, అది హనుమంతుడు చేస్తున్న యుద్ధం అయి ఉండాలని జాంబవంతుడితో అన్నాడు. రాముడు ఆజ్ఞాపించిన మీదట జాంబవంతుడు హనుమంతుడికి సహాయంగా పడమటి ద్వారం వద్దకు వెళ్ళాడు.

హనుమంతుడు తన కోసం వచ్చే భల్లూక సేనను చూసి, వారిని వెనక్కు రమ్మన్నాడు. అందరూ రాముణ్ణి చేరుకున్నారు. హనుమంతుడు దుఃఖంతో రాముడికి సీతను ఇంద్రజిత్తు చంపిన సంగతి చెప్పాడు. ఈ వార్త వింటూనే రాముడు కుప్పకూలిపోయాడు. అది

మళ్ళించాడు. ఆ వానర వీరులను వెంట వేసుకుని హనుమంతుడు రాక్షసుల పాలిటి యముడై మహా యుద్ధం చేశాడు.

అతను ఇంద్రజిత్తు రథం మీద బ్రహ్మాండమైన శిలను విసిరాడు. ఇంద్రజిత్తు సారథి యుక్తిగా రథాన్ని తప్పించాడు గాని, దానికిందపడి చాలామంది రాక్షసులు చచ్చారు. రాక్షసులను వానరులు విజృంభించి చంపసాగారు. వాళ్ళు ఇంద్రజిత్తు మీద శిలల వర్షం కురిపించారు. ఇంద్రజిత్తు కోపించి, తన బాణాలతో వానరులను చంపసాగాడు. రాక్షసులకు ఉత్సాహం వచ్చింది.

చూసి ఎక్కడెక్కడో ఉన్న వానర ప్రముఖులందరూ రాముడి దగ్గిరికి పరిగెత్తుకుంటూ వచ్చారు. వాళ్ళు రాముడి ముఖం మీద సుగంధ జలం చల్లారు.

లక్ష్మణుడు రాముణ్ణి కౌగలించుకుని ఇలా అన్నాడు: ''నువు ధర్మమార్గం అవలంబించి పితృవాక్య పరిపాలన చేశావు; రాజ్యాన్ని వదులుకున్నావు; కైకేయీ దశరథుల మీద ఎలాటి కక్ష పెట్టుకోలేదు. కాని నీకే అన్నిరకాల కష్టాలూ వస్తున్నాయి. నీ ధర్మం నిన్ను కాపాడకుండా ఉన్నది. ఈ ధర్మం నిష్ప్రయోజనం అనుకోవలసి ఉన్నది. ఇది అసత్యమైనది. అధర్మం అవలంబించిన రావణుడు మాత్రం సుఖంగానే ఉన్నాడు," అంటూ అతన్ని ఊరడించ యత్నించాడు.

అప్పుడు విభీషణుడు వారున్నచోటికి వచ్చి, రామలక్ష్మణుల దుఃఖం చూసి, సీతను ఇంద్రజిత్తు వధించాడన్న వార్త విన్నమీదట ఇలా అన్నాడు: ''రాముడా, ఈ వార్త నమ్మదగినది కాదు. సీతను నీకు ఇయ్యమంటే వినని రావణుడు సీతను వధించటానికి సమ్మతిస్తాడా? అతను ఆమెను ఏ పరిస్థితిలోనూ వదులుకోవటానికి ఇష్టపడడు. ఇంద్రజిత్తు హోమం చేస్తున్నాడు. ఆ సమయంలో వానరులు తన హోమానికి విఘ్నం కలిగించిపోతారని, వాళ్ళను దుఃఖంలో ముంచి ఉంచటానికి మాయ సీతను వధించి పోయి ఉంటాడు. అతను నిర్విఘ్నంగా హోమం చేసి వచ్చాడంటే, దేవతలందరూ ఏకమై వచ్చినా అతన్ని జయించలేరు. అందుచేత, ఇంద్రజిత్తు హోమం పూర్తి కాకముందే మనం నికుంభిళకు సైన్యంతో పోదాం. నువు నిశ్చింతగా ఇక్కడే ఉండు. మా వెంట లక్ష్మణుణ్ణి పంపించు. లక్ష్మణుడు ఇంద్రజిత్తు హోమానికి విఘ్నం కలిగించటమేగాక, అతనితో యుద్ధం చేసి చంపి, బ్రహ్మవరం నిజం చేస్తాడు.''






దుఃఖంలో ఉన్న రాముడికి విభీషణుడు ఏమి చెబుతున్నదీ అర్థంకాలేదు. అందుచేత అతను కొంతసేపటికి తనను తాను నిగ్రహించుకుని, ''విభీషణా, ఇప్పుడేమిటో చెప్పావు. నాకు సరిగా తెలియలేదు. మళ్ళీ చెప్పు.'' అన్నాడు.

దానికి విభీషణుడు ఇలా అన్నాడు:

''నువు నిష్కారణంగా దుఃఖిస్తూ, మాకు కూడా దుఃఖం కలిగిస్తున్నావు. సంతోషిస్తున్నది నీ శత్రువులు మాత్రమే. రాక్షసులను చంపటమూ, సీతను తిరిగి పొందటమూ నీ కోరిక అయిన పక్షంలో యుద్ధప్రయత్నం చెయ్యి. లక్ష్మణుణ్ణి వానరసేనతో సహా నికుంభిలకు పంపి, ఇంద్రజిత్తుతో యుద్ధంచేసి, అతన్ని చంపమను. ఇంద్రజిత్తు హోమం చెయ్యటానికి నికుంభిలకు వెళ్ళాడు. అతను ఆ హోమం పూర్తి చేశాడంటే మనందరికీ చావు తప్పదు. అది బ్రహ్మదేవుడు ఇంద్రజిత్తుకు ఇచ్చిన వరం. అతని నికుంభిలా హోమానికి ఆటంకం కలిగించిన వాడి చేతిలో ఇంద్రజిత్తు చస్తాడు. ఇంద్రజిత్తు చచ్చాడంటే, రావణుడూ, అతని మిత్రులూ చచ్చినవాళ్ళ కిందనే లెక్క.''

రాముడు లక్ష్మణుడితో ఇంద్రజిత్తును చంపి రమ్మన్నాడు. అందుకుగాను లక్ష్మణుడు బలమైన వానర, భల్లూక సేనలను వెంట తీసుకుపోయేటట్టూ, నికుంభిలకు దారి చూపటానికి విభీష

29. ఇంద్రజిత్తు మరణం



ణుడు లక్ష్మణుడి వెంట వెళ్ళేటట్టూ ఏర్పాటు జరిగింది. లక్ష్మణుడి వెంట హనుమంతుడు కూడా బయలుదేరాడు.

బయలుదేరేటప్పుడు లక్ష్మణుడు బంగారు అలంకరణలు గల ధనుస్సూ, బాణాలూ, కవచమూ ధరించాడు. విభీషణుడు కూడా మంచి విల్లు ధరించాడు. వాళ్ళు నికుంభిలకు వెళ్ళేటప్పుడు, దూరంగా వ్యూహం పన్ని ఉన్న రాక్షస సేన వారికి కనబడింది.

విభీషణుడు లక్ష్మణుడికి ఆ రాక్షస సేనను చూపి, "ఇంద్రజిత్తు హోమం పూర్తి కాకముందే వానరసేనలు రాక్షస సేనలను నాశనం చెయ్యాలి. నువు ఈ సేనను ఛేదించు. అప్పుడు నీకు ఇంద్రజిత్తు కనిపిస్తాడు. అప్పుడు నువు ఇంద్రజిత్తును చంపెయ్యి," అన్నాడు.

వెంటనే వానరులూ, భల్లూకాలూ, లక్ష్మణుడూ రాక్షససేన మీద దారుణమైన యుద్ధం చేశారు.

తన సేనలో చెలరేగిన హాహాకారాలు విని, ఇంద్రజిత్తు తన హోమం పూర్తి కాకుండానే లేచి, తన రథాన్ని ఎక్కి, యుద్ధానికి సిద్ధమైవచ్చాడు.

విభీషణుడూ, లక్ష్మణుడూ కొంత దూరం వెళ్ళాక ఒక మహా వనం కనిపించింది. ఇంద్రజిత్తు హోమం చేసే చోటు అక్కడే ఉన్నది. అక్కడ నల్లగా, భయంకరమైన మహా వృక్షం ఉన్నది. ఇంద్రజిత్తు అక్కడే భూత బలులు ఇచ్చి, యుద్ధానికి వస్తాడు. తరవాత అతను ఎవరికీ కనబడకుండా యుద్ధం చేస్తాడు.

ఈ సంగతి విభీషణుడు చెప్పేసరికి, లక్ష్మణుడు యుద్ధసన్నద్ధుడై ఆ మహా వృక్షం సమీపంలో నిలబడ్డాడు. ఇంతలో యుద్ధానికి సిద్ధమై, రథం మీద ఇంద్రజిత్తు ఆ చెట్టును సమీపించాడు.

"నిన్ను యుద్ధానికి పిలుస్తున్నాను. నాతో యుద్ధం చెయ్యి," అన్నాడు లక్ష్మణుడు ఇంద్రజిత్తుతో.

ఇంద్రజిత్తు లక్ష్మణుడి మాట విని, అతని వెంట విభీషణుడు ఉండటం చూసి, ఆగ్రహంతో ఇలా అన్నాడు:

''విభీషణా, నువు రాక్షసుడివై ఉండి కూడా కులాభిమానం ఎలా వదిలావు? ఇది నీ జన్మస్థలం. నువు సాక్షాత్తూ నా తండ్రికి తమ్ముడివి. నాకు ఎలా ద్రోహం తలపెట్టావు? ధర్మం లేని దుర్మార్గుడివి. నీకు బంధువులనీ, స్నేహమనీ, కులమనీ, రక్తస్పర్శ అనీ లేదు. అయిన వాళ్ళను వదిలిపెట్టి శత్రువుకు దాసుడివి అయావు! బంధువులు నిన్ను చూసి ఏడుస్తారు; మంచివాళ్ళు నిన్ను తిట్టిపోస్తారు. అయినవాళ్ళ మధ్య గొప్పగా ఉండటానికీ, శత్రువుల మధ్య హీనంగా ఉండటానికీ తేడా ఏమిటో నీకు తెలియలేదు. నాకు బంధువువై ఉండి, నా హోమం భగ్నం చేసి, నాకు అపకారం చెయ్యటానికి ఇలా చేశావు. ఇలాటి నీచమైనపని మరొకడు చెయ్యడు."

దానికి విభీషణుడు ఇలా అన్నాడు:

''నా స్వభావం నీకు తెలీదా? నాది సాత్విక స్వభావం. అధర్మాన్ని నేను సహించలేను. లేకపోతే, నా అన్నను నేను వదులుకుంటానా? నీ తండ్రికి అన్ని అవలక్షణాలూ ఉన్నాయి. త్వరలోనే ఈ లంకలోని రాక్షసులు, నీ తండ్రితో సహా నశించనున్నారు. నీకు చావు మూడింది. నన్ను ఏమనాలని ఉన్నదో అన్నీ అను. చచ్చిపోనున్నవాడివి నిన్ను





తిట్టి ఏం లాభం? మాయా సీతను చంపి, రామలక్ష్మణులకు అవమానం చేశావు. నువు జీవించలేవు. లక్ష్మణుడితో యుద్ధం చేసి, చచ్చిపోయి, యమదూతలకు సేవ చెయ్యి.''

ఇంద్రజిత్తు లక్ష్మణుణ్ణి చూసి. ''ఆ రాత్రి యుద్ధంలో నా బాణాలదెబ్బ తెలుసుకుని కూడా నువు మళ్ళీ నాతో యుద్ధానికి వచ్చావంటే నీకు మతిమరుపో, ఆయువు తీరిపోవటమో కావాలి,'' అన్నాడు.

''దొంగలాగా కనబడకుండా యుద్ధం చేసి గొప్ప వీరుణ్ణి అనుకుంటున్నావు! ఇప్పుడు చూపించు నీ అసలు ప్రతాపం," అన్నాడు లక్ష్మణుడు.

ఇంద్రజిత్తు చప్పున లక్ష్మణుడి మీద బాణాలు వేసి, అతని శరీరమంతా నెత్తురుమయం చేశాడు. లక్ష్మణుడు కోపించి, ఇంద్రజిత్తు మీద తీవ్రమైన బాణాలు వేశాడు. ఇద్దరూ సమంగా యుద్ధం చేశారు.

కొంతసేపు యుద్ధం సాగాక ఇంద్రజిత్తు ముఖంలో విభీషణుడికి భయం కనిపించింది. అతను లక్ష్మణుడితో, ''ఇంద్రజిత్తు దెబ్బ తిన్నట్టున్నాడు. అతన్ని చంపెయ్యటానికి ఇదేసమయం,'' అన్నాడు.

లక్ష్మణుడు మరింత తీక్ష్ణమైన బాణాలతో ఇంద్రజిత్తును కొట్టాడు. ఇంద్రజిత్తు మూర్ఛపోయాడు.

అయితే ఇంద్రజిత్తు స్పృహవస్తూనే ఎదురుగా లక్ష్మణుణ్ణి చూసి, తన పరాక్రమం మాట జ్ఞాపకం వచ్చి, లక్ష్మణుడి మీదా, అంతకన్న హెచ్చుగా విభీషణుడి మీదా బాణాలు వేశాడు.

ఆ బాణాలు లక్ష్మణుడికి కొంచెమైనా బాధ కలిగించలేదు. ''యుద్ధంలో గెలవగోరినవాడు ఇలాగా బాణాలు వేసేది?'' అంటూ అతను ఇంద్రజిత్తు మీద తీవ్రమైన బాణాలు వేశాడు.

లక్ష్మణుడి బాణాలకు ఇంద్రజిత్తు కవచం ముక్కలు ముక్కలుగా రథంలో



రాలిపడింది. అతని దేహం బాగా గాయ పడింది.

ఇంద్రజిత్తు ఆగ్రహించి, తన బాణా లతో లక్ష్మణుడి కవచాన్ని కూడా పగల గొట్టేశాడు. ఈ విధంగా వారిద్దరూ ఒకరి కొకరు తీసిపోకుండా చాలాసేపు యుద్ధం చేశారు. ఇద్దరూ జయమేకోరి పట్టుదలతో పోరాడారు. అలాటి యుద్ధం ఎవరో ఒకరు చచ్చినదాకా ఆగదు.

ఆ యుద్ధం చూసిన మీదట విభీష ణుడు తాను కూడా తన మంత్రులు నలుగురితోసహా యుద్ధానికి పూనుకోవటం మంచిదని భావించి వానర సైనికులతో ఇలా అన్నాడు:

"వానర వీరులారా, ఇక రావణుడికి ఈ ఇంద్రజిత్తు తప్ప వేరేగతిలేదు. వీణ్ణి ఎందుకు ఉపేక్షిస్తారు? మీరు ఇప్పటికి రాక్షస వీరుల నందరినీ చంపేశారు. ఈ ఒక్క ఇంద్రజిత్తు అనగా ఎంత? వీణ్ణి కూడా చంపేశారంటే రావణుడు దిక్కులేని వాడే! వాణ్ణి నేనే చంపుదును గాని, వాడు నాకు కొడుకు వరస. నేను వాణ్ణి చంపటం తప్పు అవుతుంది. ఇంద్ర జిత్తుకు సహాయంగా ఉన్న సేనను నిర్మూలించండి."

ఈ మాటలు విని వానరులు తోక లాడించి, సింహనాదాలు చేసి, రాక్షససేన మీదికి విజృంభించారు. విభీషణుడూ, అతని మంత్రులూ కూడా రాక్షససేనపై యుద్ధం సాగించారు.

ఈలోపుగా లక్ష్మణుడు ఇంద్రజిత్తు రథ సారథి తల ఒక బాణంతో నరికేశాడు. అప్పుడు ఇంద్రజిత్తు తానే తన రథాన్ని నడుపుకుంటూ యుద్ధం చేశాడు. అది చూడటానికి ఆశ్చర్యకరంగానే ఉన్నది గాని, లక్ష్మణుడు అతన్ని బాధించటానికి అవకాశం మరింతగా ఏర్పడింది. ఆ దెబ్బతో ఇంద్రజిత్తుకు ఉండిన యుద్ధ గర్వం పోయింది. అతని ముఖంలో మార్పు గమనించి వానరులు ఎంతగానో సంతోషించారు.

ప్రమాథీ, శరభుడూ, రభసుడూ, గంధమాదనుడూ అనే నలుగురు వానర వీరులూ, ఇంద్రజిత్తు రథాన్ని లాగే నాలుగు గుర్రాల మీదా ఒక్కసారి పడ్డారు. అవి నెత్తురు గక్కి, చచ్చి పడిపోయాయి.

ఇంద్రజిత్తు రథం నుంచి నేల మీదికి దిగి, లక్ష్మణుడిపై బాణాలు వేస్తూ మీదికి వచ్చాడు. అతని చుట్టూ రాక్షసులు కమ్ముకుని ఉన్నారు.

ఇంద్రజిత్తు వాళ్ళతో, "మీరు యుద్ధం సాగిస్తూ ఉండండి. మీ చాటున నేను నగరంలోకి వెళ్ళి, మరొక రథం ఎక్కి వస్తాను," అన్నాడు.

అతను ఆ ప్రకారమే లంకలోకి వెళ్ళి, మంచి రథం సిద్ధంచేయించి, దానిమీద తిరిగి యుద్ధానికి వచ్చాడు. అతను ఉన్నట్టుండి రథం మీద తిరిగి ప్రత్యక్షం కావటం చూసి, లక్ష్మణుడూ, విభీషణుడూ కూడా ఆశ్చర్యపోయారు.

ఈసారి ఇంద్రజిత్తు తన బాణాలతో వానరసేనకు అమితంగా నష్టం కలిగించాడు. అదిచూసి లక్ష్మణుడు అతని విల్లు విరిచాడు. తరవాత అతని సారథి తల నరికేశాడు. అయినా ఇంద్రజిత్తు యుద్ధం సాగించటమేగాక, విభీషణుణ్ణి కూడా తన బాణాలతో గాయపరిచాడు. విభీషణుడు



మండిపడి, తన గదతో ఇంద్రజిత్తు రథాశ్వాలను చంపాడు.

తరవాత ఇంద్రజిత్తూ, లక్ష్మణుడూ దివ్యాస్త్రాలు ఒకరి మీద ఒకరు ప్రయోగించుకున్నారు. చిట్టచివరకు లక్ష్మణుడు ప్రయోగించిన ఐంద్రాస్త్రంతో ఇంద్రజిత్తు తల తెగి కిందపడింది.

విభీషణుడూ, వానరులూ సింహనాదాలు చేశారు. వానరులు విజయగర్వంతో తమని వధ చెయ్యసాగేసరికి రాక్షసులు రెట్టింపు శోకంతో లంకలోకి పారిపోయారు.

ఇంద్రజిత్తు చావగానే వానరులు అమితంగా సంతోషించి, లక్ష్మణుణ్ణి కొని

యాడారు. లక్ష్మణుడు రాముడి వద్దకు పోయి నమస్కరించి నిలబడ్డాడు. రాముడు అతన్ని కౌగలించుకుని, ''ఇంద్రజిత్తు చావటం రావణుడి కుడిభుజం తెగి పోవటమే. ఇక రావణుణ్ణి అతి సులువుగా చంపగలను.'' అని, లక్ష్మణుడి గాయాలకు చికిత్స చేయమని సుషేణుణ్ణి నియోగించాడు.

ఇంద్రజిత్తు వెంట వచ్చి, యుద్ధ భూమిలో అక్కడక్కడా యుద్ధం చేస్తున్న రాక్షసవీరులు, ఇంద్రజిత్తు పోయినట్టు విని దుఃఖిస్తూ, రావణుడి వద్దకు వెళ్ళి, విభీషణుడి సహాయంతో లక్ష్మణుడు ఇంద్రజిత్తును చంపాడని చెప్పారు. ఆ వార్త వింటూనే రావణుడు మూర్ఛపోయాడు.

తిరిగి స్పృహవచ్చినాక రావణుడు ఇంద్రజిత్తు కోసం చాలా శోకించాడు. అతని పుత్రశోకం క్రమంగా క్రోధంగా మారింది. అతనికి సీతనే చంపెయ్యాలన్న అభిప్రాయం కలిగింది. అతను తన ఎదట ఉన్న రాక్షసులతో, ''నా కొడుకు ఇంద్రజిత్తు మాయసీతను వానరుల ఎదట చంపి చూపించాడు. నేను నిజమైన సీతనే చంపుతాను. రాముడి మీది నుంచి మనసు మరలని సీతను చంపేస్తాను.'' అని చెప్పి, కత్తి దూసి, రౌద్రంగా అశోకవనంలో ఉండే సీతాదేవి దగ్గిరికి బయలుదేరాడు.

ఈ సంగతి తెలిసి మండోదరీ, రావణుడి మంత్రులూ అతనికి అడ్డు తగిలారు.

''ఇప్పటికైనా సీతను రాముడికి అప్పగించి, సర్వనాశనం జరగకుండా చూడు,'' అని మండోదరి రావణుడికి హితవు చెప్పింది.

''ఈ కోపాన్ని రాముడి మీద చూపించు. సీతను చంపి సాధించేదేమిటి?'' అన్నారు రావణుడి మంత్రులు.

తన కర్తవ్యం రాముణ్ణి చంపటమే కాని, సీతను చంపటం కాదని తెలుసుకుని, రావణుడు ఉగ్రమైన లంకా యాగం మొదలు పెట్టాడు.





# వీరహనుమాన్

## 30. రామలక్ష్మణుల అపహరణ

రావణుడు లంకాయాగం చేస్తున్న సంగతి విభీషణుడికి తెలిసింది. అతను రాముడితోనూ, వానరవీరులతోనూ ఇలా అన్నాడు:

"రావణుడు చేసే హోమం పూర్తి అయిన పక్షంలో, అందులోనుంచి ఉక్కు శరీరాలు గల యోధులూ, చతురంగ బలాలూ పుట్టుకొస్తాయి. అప్పుడు రావణుణ్ణి జయించటం అసాధ్యం. అందుచేత యాగాన్ని భగ్నంచెయ్యాలి."

కాని అది ఎలా జరగాలన్నది సమస్య అయింది.

"అంగదుడికి అదృశ్యకరణి అనే విద్య తెలును. దాని సహాయంతో అతను రావణుడి హోమం సాగకుండా చెయ్యవచ్చు." అన్నాడు జాంబవంతుడు.

అదృశ్యకరణి ప్రభావంతో అంగదుడు ఎవరికీ కనబడకుండా రావణుడి అంతఃపురం ప్రవేశించి, మండోదరిని కొప్పు పట్టి ఈడ్చుకుంటూ రావణుడున్న చోటికి వచ్చాడు. అది చూసి కూడా రావణుడు యాగదీక్ష నుంచి లేవలేదు. అంగదుడు మండోదరిని ఇంకెక్కడికో ఈడ్చుకుపోసాగాడు.

"మూడు లోకాలనూ జయించినవాడి భార్యను ఇప్పుడు కాపాడేవారు లేరా?" అని మండోదరి ఆర్తనాదం చేసింది. రావణుడు ఇక భరించలేక యాగదీక్ష వదిలిపెట్టి లేచాడు. అదృశ్యుడుగా ఉన్న అంగదుడు మండోదరిని వదిలిపెట్టి, చల్లగా జారుకున్నాడు.



''ఇప్పటికైనా రాముడితో సంధి చేసుకో,'' అని మండోదరి రావణుడికి సలహా ఇచ్చింది.

ఒకప్పుడు తన బలమూ, తనకున్న అంగబలమూ చూసుకుని రాముడితో యుద్ధం చేయ నిశ్చయించిన రావణుడు, ''బంధుమిత్రులనూ, తమ్ముణ్ణీ, కొడుకులనూ పోగొట్టుకుని, ఇప్పుడు క్షుద్రుడిలాగ రాముడితో సంధి చేసుకోమంటావా? రాముడు నన్ను చంపుతాడన్న నమ్మకంతోనే గదా ఈ సలహా ఇస్తున్నావు? రాముడు నన్ను చంపాడన్న కీర్తి పొందకుండా నేనే ప్రాయోపవేశం చేసి, యోగమార్గాన కపాలం భేదించుకుని ప్రాణత్యాగం చేస్తాను. నన్ను చంపి, విభీషణుడికి పట్టం గట్టుతానని ప్రతిజ్ఞ చేసిన రాముడు నన్ను చంపలేడు గనక ప్రతిజ్ఞాభంగం చేసినవాడవుతాడు. విభీషణుడికి రాజ్యం రాదు. నన్ను చంపి సీతను తీసుకుపోతానన్న ప్రతిజ్ఞ కూడా భంగమవుతుంది. రాముడు దొంగలాగా వచ్చి తన భార్యను ఎన్నడూ తీసుకుపోలేడు. నేను పోయినాక మీరంతా సహగమనం చేసేటప్పుడు సీతను కూడా చితిలోకి నెట్టండి. సీతా వియోగంతో రాముడు చస్తాడు.'' అని మతిభ్రమ కలిగినవాడిలాగా పడమటి దిక్కుగా వెళ్ళాడు.

లంకలో ఇలా ఉండగా, లంకకు సహస్రయోజనాలు దిగువన ఉన్న పాతాళ లంకలో మరొక కథ జరుగుతున్నది.

పాతాళలంకను ఏలేవాడు మైరావణుడు. అతను గొప్ప మంత్రశక్తులు గలిగి, మాయలు తెలిసినవాడు. అతని అన్న అహిరావణుడు.

మైరావణుడు నాగలోకం నుంచి వాసుకి కుమార్తె అయిన చంద్రసేనను తన మాయతో ఎత్తుకొచ్చి, తనను పెళ్ళాడమని నిర్బంధించసాగాడు. చంద్రసేన అసమాన సౌందర్యవతి. ఆమె రాముణ్ణి వరించి, అతనే తన భర్త అని మైరావణుడితో అన్నది. సీతా స్వయంవరానికి ఆమె

నాగుల వెంట వెళ్ళి, రాముణ్ణి చూసినది మొదలు అతని విగ్రహాన్ని ఆరాధిస్తూ వస్తున్నది

లంకలో రావణుడు పడమటి తీరానికి చేరుకుని, అక్కడ దర్భలు పరిచి, వాటి మీద పడుకుని, ప్రాయోపవేశానికి సిద్ధమయాడు.

అప్పుడు నారదుడు అటుగా వచ్చి, "ఇదేం పని, రావణా? నువు తోడులేనివాడివైపోయావా? నీ మిత్రుడూ, నీకు సోదరుడిలాటివాడూ అయిన మైరావణుణ్ణి మరిచావా?" అని హెచ్చరించి, వెళ్ళిపోయాడు.



ఈ మాట వింటూనే రావణుడు నూతనోత్సాహంతో లేచి కూర్చుని, కళ్ళు మూసుకుని మైరావణుణ్ణి తలచుకున్నాడు. ఆ సమయంలో మైరావణుడు చంద్రసేన వద్దకు వచ్చి, ఆమె ఆరాధిస్తున్న రాముడి విగ్రహాన్ని లాగేసి, "ఈ రాముణ్ణి తెచ్చి కాళీమాతకు బలి ఇస్తాను," అన్నాడు.

"ఆ రాముడే నిన్ను చంపేస్తాడు," అన్నది చంద్రసేన.

"నన్ను చంపటం తేలిక అనుకున్నావా? ఈ పాతాళలంకకు వెయ్యియోజనాల దిగువన ఒక భయంకరమైన గుహలో, ఒక రత్నపేటికలో అయిదు తుమ్మెదల రూపంలో నా ప్రాణాలున్నాయి. పేటిక తెరిచి, ఝుమ్మని పైకి వచ్చే అయిదు తుమ్మెదలనూ ఒక్కసారిగా చంపితేనే గాని నేను చావను. ఆ భయంకర గుహను అతిభయంకర పిశాచాలు రక్షిస్తున్నాయి. నా ప్రాణాలను తీయగలవాడు మూడు లోకాలలోనూ లేడు," అంటూ మైరావణుడు రాముడి విగ్రహాన్ని నేలకేసి కొట్టి ముక్కలు ముక్కలు చేశాడు.

ఆ క్షణంలోనే అతనికి రావణుడు తనను తలుచుకోవటం తెలిసింది.

రావణుడు కళ్ళు తెరిచేసరికి, భూమిని చీల్చుకుని వచ్చి, తన ఎదట నిలబడిన మైరావణుడు కనిపించాడు. ఇద్దరూ కౌగలించుకున్నారు.



రావణుడు మైరావణుడితో రామ, లక్ష్మణుల సంగతి చూడమన్నాడు.

''నాకు కావలసినదే నువూ అడిగావు. రేపు ఆ రామలక్ష్మణులను కాళికి బలి ఇచ్చేస్తాను.'' అన్నాడు మైరావణుడు. రావణుడు సంతోషించి, మైరావణుణ్ణి తన మందిరానికి తీసుకుపోయాడు.

చారుల ద్వారా విభీషణుడికి ఈ సంగతి తెలియవచ్చింది. అప్పటికి రాత్రి అయిపోవటం వల్ల రామ, లక్ష్మణులు నిద్రకు ఉపక్రమించబోతున్నారు. విభీషణుడు వానరుల వద్దకు వచ్చి, మైరావణుడి సంగతి చెప్పి, ''మైరావణుడు రామ, లక్ష్మణులను అపహరించకుండా మనం కాపాడాలి.'' అని హెచ్చరించి వెళ్లిపోయాడు.

హనుమంతుడు వెంటనే తన తోకను పెంచి, రామ, లక్ష్మణుల చుట్టూ ఒక కోటలాగా చుట్టాడు. తరవాత అతను ఆ తోకచుట్ట మీద ఎక్కి కూర్చుని, ఒక్క చీమ అయినా లోపలికిపోకుండా జాగ్రత్తగా చూస్తున్నాడు.

కొంతసేపటికి విభీషణుడు మళ్లీ వచ్చి, హనుమంతుడి శ్రద్ధను మెచ్చుకుని, ఒక్కసారి తాను లోపలికి వెళ్లి, రామలక్ష్మణుల చేతులకు రక్షాబంధాలను కట్టవలసి ఉన్నదని చెప్పాడు. హనుమంతుడు తన తోకను సడలించి, విభీషణుడు లోపలికి పోవటానికి దారి ఇచ్చాడు.

విభీషణుడు తన పని పూర్తిచేసుకుని బయటికి వచ్చి, ''హనుమంతుడా, ఆ మాయలమారి మైరావణుడు నా రూపంలో గాని, మనలో మరొకరి రూపంలో గాని వచ్చి మోసం చేయగలడు, జాగ్రత్తసుమా!'' అని హెచ్చరించి వెళ్ళిపోయాడు.

అతను అన్నట్టే కొంతసేపటికి విభీషణుడు మళ్ళీ వచ్చాడు. హనుమంతుడు అతని గొంతు పట్టుకుని, గదతో చావగొట్టబోయాడు, ''మైరావణుడా, నీ జిత్తులు నా దగ్గిరనా?'' అంటూ.

"అయ్యో, వెర్రివాడా! మోసం జరిగిందా? మైరావణుడు నా రూపంలో వచ్చాడా? రామ, లక్ష్మణులను వాడు ఎత్తుకుపోలేదు గదా?" అన్నాడు విభీషణుడు. హనుమంతుడు తన తోక చుట్టలోకి చూస్తే రామ, లక్ష్మణులు లేరు!

హనుమంతుడు నీరుగారిపోయి, చతికిల బడ్డాడు. అప్పుడు జాంబవంతుడు, "లే, లే! రామ, లక్ష్మణులను రక్షించ గలవాడివి నువు ఒక్కడివే!" అన్నాడు.

హనుమంతుడు విభీషణుడి ద్వారా పాతాళలంకకు ఎలా వెళ్లాలో తెలుసుకుని, శరీరాన్ని పెంచి, ఆకాశంలోకి ఎగిరాడు.



ఈలోపల, విభీషణుడి రూపంలో రామ, లక్ష్మణులను చేరిన మైరావణుడు, వారిద్దరినీ చిన్న ప్రతిమలుగా మార్చి, తన బట్టల చాటున దాచి, పాతాళలంకకు చేరుకుని, రామలక్ష్మణులను చంద్రసేనకు చూపించి, "ఇదుగో నీ రాముడు! ఇతడు అతని తమ్ముడు. వీళ్ళిద్దరినీ రేపు కాళికి బలి ఇచ్చి, నిన్ను పెళ్ళాడేస్తాను," అని వికటాట్టహాసం చేసి, రామ, లక్ష్మణులను బంధించాడు.

హనుమంతుడు పడమటి సముద్రంలోకి చొచ్చుకుపోయి తామర మొగ్గ ఆకారంలో ఉండి, నిప్పుకణిక లాగా మెరిసే పర్వతాన్ని చూశాడు. హనుమంతుడు ఆ పర్వతశిఖరాన్ని చేరి, అక్కడ ఉన్న సన్నని బిలాన్ని చూసి, సూక్ష్మ రూపంలో ఆ బిలంకుండా దిగి వెళ్ళాడు. ఆ బిలం అతన్ని పాతాళలంక సింహ ద్వారం వద్దకు తీసుకుపోయింది.

ఆ ద్వారాన్ని మహాబలుడైన యువకుడొకడు కాపలా కాస్తున్నాడు. బల పరాక్రమాలు ఉట్టిపడే ఆ ద్వారపాలకుణ్ణి చూసి, హనుమంతుడు ఎంతో ముచ్చట పడ్డాడు. ఆ క్షణంలో అతడికి, ఆ యువకుడి మీద ఒక విధమైన వాత్సల్యం కలిగింది.

హనుమంతుడు సూక్ష్మ రూపంలో వున్నా, ద్వారపాలకుడైన యువకుడు



అతణ్ణి గుర్తించి, ''ఎవడవురా నువ్వు? నా కన్నుగప్పి సింహద్వారం దాటి పోవాలనుకుంటున్నావా? ఇదిగో, నీకు చావు మూడింది!'' అంటూ పిడికిలి బిగించి, హనుమంతుడి మీద కలబడ్డాడు.

ద్వారపాలకుడి బల పరాక్రమాలు చూసి హనుమంతుడు ఆశ్చర్యపోతూ, "వీడెవ్వడోగాని, నాతోసమానంగా పోరాడ గలుగుతున్నాడు. ఇలాంటి వాణ్ణి కొంచెం మరిపించి, హతం చేయాలి,'' అనుకుంటూ, అలసిపోయిన వాడిలా చతికిలబడ్డాడు.

తన శత్రువు నీరసించి పోయాడనుకుని, ద్వారపాల యువకుడు ఉత్సాహంతో పెద్దగా నవ్వుతూ, ''ఓరీ మాయావీ! నే నెవ్వడనుకుని, నాతో యుద్ధానికి వచ్చావు? నా పేరు మత్స్యవల్లభుడు. వీరాగ్రేసరుడైన హనుమంతుడు, నా తండ్రి. తెలుసా?'' అన్నాడు.

యువకుడిలా అనగానే హనుమంతుడికి ఆశ్చర్యంతోపాటు కోపం కూడా కలిగింది. అతడు పళ్ళుకొరుకుతూ, ''ఓరీ, చేపలవాడా! జగమెరిగిన బ్రహ్మచారి హనుమంతుడు, నీ తండ్రా? ఇలాంటి అబద్ధపు కూతలు కూసినందుకు, నీకు చావు తప్పదు!'' అంటూ మత్స్యవల్లభుడి మీదికి లంఘించాడు.

హనుమంతుడు బలమైన పిడికిటి పోటులతో యువకుణ్ణి చంప చూస్తున్నంతలో, వెనకనుంచి, "స్వామీ, తొందరపడకండి, ఆగండి!'' అన్న కేక వినిపించింది.

హనుమంతుడు చప్పున తల తిప్పి చూశాడు. మెరుపులాంటి సౌందర్యవతి ఒకామె అతడి కేసి పరుగు పరుగున వస్తూ కనిపించింది. ఆశ్చర్యపోతూ నిలబడిన హనుమంతుడి పాదాలకు నమస్కరించి, ఆమె, ''వాడు చెప్పింది సత్యమే! నా పేరు సువర్చలాదేవి. దక్షిణ సాగరుడు నా తండ్రి. అసంఖ్యాక జలచరాలకు నేను రాణిని. నన్ను, నీవు ఎరగవుగాని; నిన్ను నేను ఎరుగుదును. ఒకసారి నువ్వు

సముద్రాన్ని లంఘిస్తున్నప్పుడు సింహిక, నీ నీడను పట్టి లాగగా, నువు దానితో పోరాడసాగావు. ఆ సమయంలో నేను మత్స్యశరీరంతో, సముద్రం మీద తేలు తున్నాను. నువు, సింహికను చంపి, నీ నొసటపట్టిన చెమటను వేలితో తీసి విదిలించావు. ఆ చెమట బిందువు, నా నోటిలో పడింది, నేను మింగాను. ఆ కారణంగానే నేను గర్భవతినయి, యీ మత్స్యవల్లభుడిని కన్నాను. అందు వల్ల యితడు నీ కుమారుడే!'' అన్నది.

ఆమెమాట ముగించేసరికి, ''హనుమా! సువర్చల చెప్పినదంతా నిజం. మత్స్య వల్లభుడు నీ కుమారుడే!'' అంటూ దివ్యవాణి పలికింది.

ఇంకా ఆశ్చర్య సంభ్రమాల నుంచి తేరుకొనని హనుమంతుడితో, సువర్చలా దేవి యిలా చెప్పింది: ''మత్స్యవల్లభుడు బాల్యంనుంచే ధైర్యసాహసాలు కలవాడు. మహా పరాక్రమశాలిగా పెరిగి పెద్దవాడవు తున్న అతణ్ణి, మైరావణుడు ఎత్తుకు పోయి, తన బానిసగా చేసుకున్నాడు. నీ దర్శనంతోగాని, వాడికి దాస్యవిముక్తి కలగదని దివ్యవాణి చెప్పింది. నీదర్శనం కలిగింది; మత్స్యవల్లభుడికి యీనాటితో దాస్యం తొలగిపోయింది.''

''సువర్చల చెప్పినదంతా నిజం. మత్స్యవల్లభుడు హనుమంతుడి కుమారుడే!'' అని దివ్యవాణి మరొకసారి పలికింది.

మత్స్యవల్లభుడు, హనుమంతుడికి ప్రణమిల్లాడు. హనుమంతుడు అతణ్ణి భుజాలుపట్టి లేవనెత్తి, గాఢాలింగనం చేసుకున్నాడు.

సువర్చలాదేవి ఎంతో సంతోషపడి పోతూ హనుమంతుడితో, ''నువు చంద్ర సేన దగ్గిరకు వెళ్ళు. మైరావణుడి ప్రాణ రహస్యం ఆమెకు తెలుసు. నీకు అన్ని విధాలా సహాయం చేస్తుంది.'' అని హనుమంతుడికి నమస్కరించి, మత్స్య వల్లభుడిని వెంటబెట్టుకుని, వెళ్ళి పోయింది.





# వీర హనుమాన్

హనుమంతుడు సూక్ష్మ రూపంలో నిరాటంకంగా పాతాళలంక సింహ ద్వారం దాటి నగరంలో ప్రవేశించాడు. అతడికి ఒక దిక్కు నుంచి పెద్ద కోలాహలం వినిపించింది. అతడు ఆ దిక్కుకేసి వెళ్ళాడు.

ఒక చోట పెద్ద పర్వత గుహను అద్భుత శిల్పంతో కాళికాలయంగా నిర్మించారు. ఆలయ ప్రాంగణమంతా తోరణాలతోనూ, మణిదీపాల కాంతులతోనూ వెలిగిపోతున్నది. మైరావణుడి సేవకులైన రాక్షసులు మద్యంతో నింపిన కుండలను వరుసలుగా పేరుస్తూ, శివాలెత్తి పాడుతూ, చిందులు తొక్కుతూ పెద్ద కోలాహలం చేస్తున్నారు.

ఆలయం ముందు డప్పులు, ఢమరులు, ఝంజులు మోగుతున్నవి. రామలక్ష్మణులను తెల్లవారుజామున కాళికి బలి యివ్వబోతున్నారని హనుమంతుడు గ్రహించాడు. వెంటనే అతడు బల్లిపిల్లంత అతి సూక్ష్మ రూపంతో, కాళికాలయం గర్భగుడి పైకి వెళ్ళాడు. అక్కడ కాళీవిగ్రహం పాదాలు అభిషేకించే ద్రవాలు పోయడానికి ఏర్పాట్లు జరిగివున్నవి. విగ్రహానికి సూటిగా గుండ్రని రంధ్రం వున్నది. హనుమంతుడు దానిలో నుంచి, గర్భాలయంలోకి దూకాడు.

కాళికా విగ్రహం ఉగ్రస్వరూపంతో, చాలా ఎత్తుగా వున్నది. హనుమంతుడు విగ్రహం ఎదురుగా నిలబడి, "ఓ, మహాకాళీ! నువ్వు, రామలక్ష్మణులనే బలి



కోరుతున్నావా ?'' అని రౌద్రంగా గర్జించాడు.

ఆ వెంటనే కాళికాదేవి సౌమ్య రూపంతో ప్రత్యక్షమై, ''హనుమంతుడా! మైరావణుడి ఆయువు తీరిపోయేకాలం సమీపిస్తున్నది. నీకు జయం కలుగుతుంది,'' అని ఆశీర్వదించి, అంతర్థానమైంది.

హనుమంతుడు ఆ మాటలకు చాలా సంతోషించి, గర్భగుడి లోపలి తలుపులు బిగించి, కాళీవిగ్రహం వెనుకకు చేరి, జరగబోయేదానికోసం నిరీక్షించసాగాడు.

ఆ సమయంలో మైరావణుడి రాణివాసంలో చాలా సందడిగా వున్నది. అక్కడ రామలక్ష్మణుల బలి అనంతరం, చంద్రసేనతో మైరావణుడికి జరగబోయే వివాహం కోసం, పెద్దఎత్తున సన్నాహాలు సాగుతున్నాయి. రాణివాసం పాలకురాలు కంటకి అనే రాక్షసి. అది చంద్రసేనకు అలంకరణలు చేస్తూ, మధ్య మధ్య ఆమెను బుగ్గపోట్లుపొడుస్తూ, మైరావణుడి గొప్పదనాన్ని గురించి తెగవాగుతున్నది.

భవనప్రాంగణంలో పెద్ద కోలాహలం బయలుదేరింది. రామలక్ష్మణులు ప్రతిమాకారాల నుంచి, మామూలు స్వరూపంలోకి మార్చబడ్డారు. వాళ్ళనిద్దరినీ ఒక బండి మీద ఎక్కించి, పొడవాటి కొయ్య కర్రలకు తాళ్ళతో గట్టిగా బిగించి కట్టారు. వాళ్ళ శరీరాలు ఎర్రని జపాపుష్పాలతో అలంకరించబడ్డవి. బండిని కాళ్ళు గల భూతసర్పాలు ఈడుస్తున్నవి. రాక్షసులు, రామలక్ష్మణులను పెద్ద ఊరేగింపుతో కాళికాలయానికి తీసుకుపోతున్నారు.

రాక్షసులు పెట్టేకేకలు విని, దానికి కారణం ఏమిటో గ్రహించిన చంద్రసేన చివాలునలేచి, కంటకి వారించేలోపలే భవనప్రాంగణం దాటి, వీధిలోకి పరిగెత్తింది. ఆమెకు పసుపుబట్టలతో, ముఖానికి ఎర్రటి సింధూరం పూయబడిన రాముడు కంటబడగానే, గుండెలు అవిసి కూలిపడి మూర్ఛపోయింది.

చంద్రసేనను అనుసరించి వస్తున్న కంటకి, యిదిచూసి ఎక్కడలేని కోపంతో కొరడా తీసుకుని, మూర్ఛలోవున్న చంద్రసేనను ఎడాపెడా కొట్టటం ప్రారంభించింది. కాని ఎంతకూ చంద్రసేనలో చలనం కనబడకపోయేసరికి విసిగి, ఆమెను ఎత్తుకుపోయి భవనంలోని ఒక గదిలో బంధించింది.

కంటకి, కాళికాదేవి పాదతీర్థ ప్రధాన అర్చకురాలు. ఆ పని చూసేందు కామె ఆలయంలోకి పరిగెత్తింది. మైరావణుడు గాని, అహిరావణుడు గాని దేవీపాదతీర్థమని పిలవబడే మద్యాన్ని, కంటకి చేతి మీదుగా తాగవలసిందే.

రాక్షసులు, కాళిని మద్యంతో అభిషేకించటం మొదలుపెట్టారు. గుండ్రని రంధ్రంలో నుంచి ధారగా పడుతున్న మద్యాన్ని చూసి హనుమంతుడు అసహ్యించుకుని, గర్భాలయం ఎత్తున దేహాన్ని పెంచి, "ఇక మద్యాన్ని ఆపి, పాలతో అభిషేకించండి!" అని, కాళి మాట్లాడుతున్నట్టుగా అరిచాడు.

హనుమంతుడు యిలా అనగానే దేవాలయం వెలుపల కోలాహలం ఒక్కసారిగా ఆగిపోయింది. కాళి మద్యం వద్దనటం రాక్షసులందరికీ ఆశ్చర్యం కలిగించింది. సోమసూత్రంగుండా, తీర్థకుండంలో పడే



మద్యాన్ని తాగేందుకు పానపాత్రలతో రాక్షసులు సిద్ధంగా వున్నారు.

బండి మీద తాళ్ళతో కట్టబడివున్న రాముడు, లక్ష్మణుడి కేసి చూసి చిరునవ్వు నవ్వాడు. కంటకి, మైరావణుడి కేసి దిగాలుపడుతూ చూసింది. మైరావణుడు ఎక్కడలేని ఆశ్చర్యంతో కళ్ళింతచేసి, పక్కనేవున్న అహిరావణుడి కేసి చూశాడు. అహిరావణుడు తలపంకించి, "తమ్ముడా మైరావణా! ఇందులో ఆశ్చర్యపడవలసిందేమీలేదు. రామలక్ష్మణులు సాత్వికమూర్తులు గదా! మద్యానికి యీ సాత్వికాహారం కొరగానిదవుతుంది. అందుకే, దేవి పాలు కావాలంటున్నది," అన్నాడు.

తలుపుల దగ్గిరకుపోయి మోకరిల్లి, "కాళీ మాతా! నీ దర్శనం చేసుకునేందుకు అనుజ్ఞకావాలి," అన్నాడు.

వెంటనేలోపలినుంచిగంభీరస్వరంలో, "మైరావణా! ముందుగా నీ అన్న అహిరావణుణ్ణి ఫలపుష్ప, నైవేద్యాలతో అర్చనకు పంపు," అన్నమాటలు వినిపించినై.

మైరావణుడు తన అన్న దగ్గిరకువచ్చి, "అన్నా, మాతకు నీ వంటేనే ఎక్కువ వాత్సల్యం. ఆమె, నిన్ను నైవేద్యాలతో రమ్మని ఆజ్ఞాపిస్తున్నది," అని చెప్పాడు.

అహిరావణుడు పర్వతంలాంటి తన దేహాన్ని అటూయిటూ ఊపుతూ, ఫలపుష్పాలూ, ఇంపైన భక్ష్యాలూ, బంగారు పాత్రలో మధువూ తీసుకుని తలుపుల దగ్గిరకు వెళ్లాడు. హనుమంతుడు ముందుగానే లోపలిగడియ తీసివుంచాడు. అహిరావణుడు తలుపులు వెనక్కు నెట్టి లోపల ప్రవేశించగానే, తలుపులు రెండూ చప్పున మూసుకున్నాయి.

అహిరావణుడు తాను తెచ్చిన నైవేద్యాలను దించబోతున్నంతలో హనుమంతుడు అతడి గొంతు పడిసిపట్టుకుని, బలంగా నొక్కి, కిక్కుడుమనకుండా అతణ్ణి చంపేశాడు. తరవాత హనుమంతుడు, అహిరావణుడు తెచ్చిన ఫలభక్ష్యాలను తృప్తిగా తిని, బంగారుకలశంలోని



"అన్నా, బహుబాగా చెప్పావు. నిత్యం దేవీపాదతీర్థమద్యాన్ని తాగే నీలాగా, మాకు ఆమె ఆంతర్యం ఎలా తెలుస్తుంది?" అని మైరావణుడు, రాక్షసులను కాళిని పాలతో అభిషేకించమని ఆజ్ఞాపించాడు.

రాక్షసులు పెద్ద పెద్ద పాత్రలతో పాలు తెచ్చి కాళీదేవిని అభిషేకించసాగారు. హనుమంతుడు తీర్థకుండానికి పైగా వున్న రంధ్రం దిగువగా నోరు తెరిచి, ధారగా పడుతున్న పాలన్నిటినీ తాగటం ప్రారంభించాడు. అతడికి ఉత్సాహమూ, బలమూ కలిగాయి.

కొంతసేపటికి అభిషేకం పూర్తయింది. మైరావణుడు ఉత్సాహంగా గర్భగుడి

మధువును తాగాడు. ఇప్పుడతడికి మరింత ఉత్సాహోద్రేకాలు కలిగాయి.

హనుమంతుడు చుట్టూ ఓమారు కలయ చూసి, అహిరావణుడి కళేబరాన్ని, గర్భ గుడిలోని ఒక చీకటిమూలకు తన్ని, "మైరావణా! ఇప్పుడు రామలక్ష్మణులను లోపలికి పంపు. నా ప్రియతమభక్తుడు అహిరావణుడు వాళ్ళచేత ముందు నాకు మంత్రయుక్తంగా పూజ చేయించాలి," అని కేకవేసి, తలుపులకున్న గడియను తీసివుంచాడు.

మైరావణుడు, రామలక్ష్మణులను గర్భ గుడిలోకి నెట్టాడు. కాళికావిగ్రహం వెనక దాగివున్న హనుమంతుడు చిన్నగొంతుతో, "రఘువీరుల్లారా! ముందు తలుపులకు లోపల గడిపెట్టి, తయారుగా వుండండి," అన్నాడు కాళి పలుకుతున్నట్టుగా.

ఆ మాటలు విని లక్ష్మణుడు ఆశ్చర్య పోతూ రాముడి కేసి చూశాడు. రాముడు మందహాసం చేసి, "లక్ష్మణా, యింకా సంగతి అర్థంకాలేదా? ముందు తలుపులకు గడిపెట్టు," అన్నాడు.

లక్ష్మణుడు తలుపులు బంధించగానే, "ఇక విగ్రహం వెనకకు రండి!" అన్న మాటలు వినిపించినై.

రామలక్ష్మణులు కాళీవిగ్రహం వెనకకు పోయి, హనుమంతుణ్ణి చూసి పరమా



నందంచెందారు. లక్ష్మణుడు యింకా దిక్కులుచూస్తూ, ఆశ్చర్యంలో వుండటం గమనించి రాముడు, "లక్ష్మణా! కాళీదేవి తనకు మద్యంతో అభిషేకం వద్దన్నప్పుడే, గర్భగుడిలో మన హనుమంతుడున్నాడని నేను గ్రహించాను," అన్నాడు.

రాముడిలా చెప్పిన తరవాత లక్ష్మణుడికి సంగతి సందర్భాలు అర్థమయినై. హనుమంతుడు, రామలక్ష్మణులకు కాళీ విగ్రహం ముందు పూజ కోసం పెట్టిన సరికొత్త విల్లులూ, అమ్ములపొదులూ చూపించాడు. రామలక్ష్మణులు విల్లంబులు తీసుకున్నారు. హనుమంతుడు తన శరీ రాన్ని పెంచి, రామలక్ష్మణులను భుజాల



మీద ఎక్కించుకుని, విగ్రహం ముందున్న బాణాలన్నిటినీ కట్టగాకట్టి పట్టుకున్నాడు.

గర్భాలయం వెలుపల రాకసులు పెద్ద కోలాహలం చేస్తున్నారు. వాళ్ళకు రామ లక్ష్మణుల బలి చూడాలని ఆదుర్దాగా వున్నది. బలికిగాను పెట్టిన ముహూర్తం దాటిపోతున్నది. అయినా గర్భగుడిలో వున్న రామలక్ష్మణులను అహిరావణుడు బయటికి తెచ్చే సూచనలు కనబడలేదు.

గర్భగుడిలో ఏదో మోసం జరిగి వుంటుందన్న అనుమానం ముందుగా కంటకికి కలిగింది. ఆ రాకసి జాగ్రత్తగా తలుపుసందుల్లో నుంచి చూసింది. దానికి ఎక్కడా కాళిని అభిషేకించిన పాలు, ఆలయంలో పడిన సూచనలే కనిపించ లేదు. అంటే దాని అర్థం, గర్భాలయంలో ఎవరో ప్రమాదకారుడైన శత్రువు చేరా డన్నమాట!

కంటకి యిలా ఆలోచిస్తూనే కీచు మంటూ పెద్దగా అరిచింది. రాకసులు దానిచుట్టూ మూగి, ''లోపల నీకేం కనబడింది? కాళీమాత నిన్ను బలి కోరిందా?'' అని అడిగారు.

ఆ ప్రశ్నకు కంటకి మరింత పెద్దగా అరిచి, ''ఓరీ, మందమతుల్లారా, మన కళ్ళముందే పెద్దమోసం జరిగిపోయింది. మన రహస్యాలను శత్రువులకు చెప్పే మనిషి ఒక్కరే వున్నారు—అది చంద్ర సేన. కొరడాతో దాని ఒళ్ళు చితకబాదితే గాని, అది నిజం చెప్పదు.'' అంటూ చంద్రసేన వున్న మందిరం కేసి పరుగులు తీసింది.

కంటకి మాటలు విన్న రాకసులు దిగాలుపడిపోయి, ఒకరిముఖాలొకరు చూసుకోసాగారు. ఆ రాకసి అనుమానించి నట్టు నిజంగానే గర్భాలయంలో ఎవరైనా శత్రువు చేరాడా? మహాబలుడైన మైరావణుడు పాలించే పాతాళలంకను చేరగల శత్రువు ఎవరు?

ఇలా ఆలోచిస్తూ, రాకసుల్లోని కొందరు ధైర్యవంతులు గర్భాలయద్వారం కేసి

నడిచారు. వాళ్ళు తలుపుల మీద చేయి వేసేంతలో, లోపలినుంచి హనుమంతుడు పెద్దగా సింహనాదంచేసి, ద్వారం కూలేలా కాలితో గట్టిగా తన్ని, బయటికి వచ్చాడు.

హనుమంతుణ్ణి చూస్తూనే రాకసులు, "మోసం! మోసం!" అంటూ కేకలు పెట్టారు. హనుమంతుడి భుజాల మీద వున్న రామలక్ష్మణులు, రాకసుల మీద బాణ వర్షం కురిపించసాగారు. రాకసులు హాహా కారాలు చేస్తూ చెల్లాచెదరుగా పారిపోవటం ప్రారంభించారు.

కాళికాలయం ముందు నిలబడి, తన ముఖ్యానుచరులతో మాట్లాడుతున్న మైరావణుడు తల తిప్పి, హనుమంతుడి భుజాల మీద ఉన్న రామలక్ష్మణులను చూస్తూనే పెద్దగా హుంకరించి, ధనుర్బాణాలు తీసుకుని యుద్ధానికి సిద్ధమయ్యాడు.

రామలక్ష్మణులు యినుమడించిన ఉత్సాహంతో, మైరావణుడి మీద బాణాలు ప్రయోగించారు. ఆ బాణం దెబ్బలు తగిలి మైరావణుడి శరీరం నుంచి కారి కింద పడే ప్రతి రక్తబిందువు నుంచీ, ఒక్కొక్క మైరావణుడు పుట్టుకురాసాగాడు. వాళ్ళు కూడా మైరావణుడిలాగానే హుంకార ధ్వనులు చేస్తూ, రామలక్ష్మణుల మీద బాణప్రయోగం చేయసాగారు.

రామలక్ష్మణులు యిదిచూసి ఆశ్చర్య చకితులై హనుమంతుడితో, "హనుమంతుడా, ఏమిటీ వింత? ఇంతమంది మైరావణులను రక్తపుచుక్క నేల బడకుండా వధించటం ఎలా?" అన్నారు.

ఆ ప్రశ్నతో హనుమంతుడికి, సువర్చలా దేవి చెప్పిన చంద్రసేన గుర్తుకువచ్చింది. హనుమంతుడు ఒకటి రెండు మాటల్లో సంగతి రామలక్ష్మణులకు చెప్పి, ఆకాశం లోకి ఎగిరి, ఒక ఎత్తయిన చోట రామలక్ష్మణులను దించి, తానుచంద్రసేన వుండే భవనం కేసి పరుగుతీశాడు. రామలక్ష్మణులు, లకలసంఖ్యలో పుట్టుకొచ్చిన మైరావణమూక మీద ఎడాపెడా బాణాలు ప్రయోగిస్తూనే వున్నారు.





# వీరహనుమాన్

హనుమంతుడు శరవేగంతో పోయి, చంద్రసేన వున్న రాణివాస భవనాన్ని చేరుకున్నాడు. ఆ భవనం పచ్చ రాతితో, అద్భుతమైన శిల్పంతో నిర్మించబడి వున్నది. అంత చీకటిలో కూడా భవనం పచ్చని కాంతులు విరజిమ్ముతున్నది; అక్కడక్కడ తాపిన కెంపులు ఎర్రని వెల్తురును ప్రసరిస్తున్నవి.

భవన ద్వారం వద్ద రాక్షసులెవరూ కాపలా లేరు. అందరూ కాళికాలయం దగ్గిర జరిగే మహోత్సవంలో పాల్గొనేందుకు వెళ్ళిపోయారు. కాని, ద్వారం ముందు ఎర్రగా మెరుస్తున్న కనుగుడ్లను తిప్పుతూ, కాళ్ళు గల ఒక భయంకర రక్కసిసర్పం తిరుగుతున్నది.

హనుమంతుడు, రక్కసి సర్పాన్ని, సర్పం హనుమంతుణ్ణీ ఒకేసారి చూడటం జరిగింది. వెంటనే సర్పం బుసలు కొడుతూ ఉవ్వెత్తున లేచింది. దాని ముక్కుపుటాల నుంచి పొగలూ, జ్వాలలూ వెలువడసాగినై. హనుమంతుణ్ణి మింగేందుకు అది నోరు తెరిచి ముందుకు రాసాగింది. హనుమంతుడు, ఆ రక్కసి సర్పాన్ని చంపేందుకు లంఘించబోయేంతలో, భవనం పై భాగంనుంచి కోమలమైన స్త్రీ కంఠం చేసిన ఆర్తనాదం వినిపించింది.

హనుమంతుడు మరుక్షణం సూక్ష్మరూపం ధరించి, రక్కసి సర్పం నోటిగుండా లోపల ప్రవేశించి, దాని పొట



చీల్చి చంపి, భవనంలోకి పరిగెత్తాడు. భవనం అంతా చీకటిమయంగా వున్నది. అక్కడక్కడ మాత్రం ఎర్రని కెంపులు చిన్నగా మెరుస్తున్నాయి. హనుమంతుడు స్త్రీ ఆర్తనాదం వచ్చిన ప్రదేశం కోసం దిక్కులు చూసేంతలో, పై అంతస్తు నుంచి కొరడా ఛెళుకులూ, ఆర్తస్వరమూ మరొకసారి వినిపించాయి.

హనుమంతుడు చప్పున కదిలి చంద్రసేన బంధింపబడి వున్న గది దగ్గిరకు పోయాడు. గది తలుపులు లోపల గడి పెట్టబడి వున్నాయి. హనుమంతుడు ఎత్తుగా వున్న కిటికీగుండా లోపలికి చూశాడు. అప్పుడే మూర్ఛనుంచి తేరుకున్న చంద్రసేనను కంటకి కొరడాతో కొడుతూ, "ముదనష్టపుదానా! బుద్ధిమాలి మైరావణుడు, మా పాతాళలంకకు చీడపురుగును తెచ్చినట్టు నిన్ను తెచ్చిపెట్టాడు. కాళికాలయంలోకి ఎవడిని పంపావో చెప్పు? ఇప్పుడే గొడ్డలితో నీ తల నరికివేస్తా. ఊహుఁ, కాదు, గొంతు పిసికి చంపటమే నీకు తగిన శిక్ష!" అంటూ చంద్రసేన గొంతు పట్టుకున్నది.

హనుమంతుడు వెంటనే తన వాలాన్ని పెంచి కిటికీలోకుండా లోపలికి పంపాడు. కంటకి చంద్రసేన గొంతు నులుముతున్నంతలో, హమమంతుడి తోక ఆ రాకసి మెడను చుట్టి, గట్టిగా బిగించి, యివతలికి గుంజింది. కంటకి చాపచుట్టలా నేలమీద పడి, ప్రాణాలు వదిలింది.

హనుమంతుడు గది తలుపులు విరగదన్ని లోపలప్రవేశించి, చంద్రసేనకు నమస్కరించాడు. తరవాత కొద్ది మాటల్లో పరిస్థితి అంతా ఆమెకు చెప్పి, మైరావణుణ్ణి చంపే మార్గం తెలియపరచమన్నాడు.

రాముడి పేరు వింటూనే చంద్రసేన తాను కంటకి వల్ల పడిన హింస అంతా మరిచి, సేదదేరి, "హనుమంతుడా! నీకు మైరావణుడి ప్రాణ రహస్యం చెబుతాను. కాని, ముందుగా నువ్వు, ఒక వాగ్దానం చేయాలి. మైరావణ

సంహారం జరిగాక, నీ యజమానిని నా దగ్గిరకు తీసుకురావాలి,'' అన్నది.

హనుమంతుడు అలాగే రాముణ్ణి తీసుకువస్తానని వాగ్దానం చేశాడు. చంద్ర సేన అతడికి మైరావణుడి ప్రాణాలు భద్రపరిచి వున్న చోటు గురించి చెప్పింది. వెంటనే హనుమంతుడు గది బయిటికి వచ్చి, ఆకాశంలోకి ఎగిరి, సప్త సముద్ర మధ్యంలో వున్న జ్వాలాముఖి పద్మాన్ని చేరుకున్నాడు. భగభగ మండే జ్వాలలే ఆ పద్మానికి రేకులుగా వున్నవి. హనుమంతుడు అగ్నిదేవుణ్ణి స్మరించి, పద్మంలో ప్రవేశించి, దాని కాడగుండా జారి, మకరబిలాన్ని చేరాడు.

మకరబిలంలో భయంకరమైన సర్పాలు బుసలు కొడుతున్నవి; పిశాచ గణాలు హుంకరిస్తున్నవి. హనుమంతుడు పెద్దగా సింహనాదం చేసి, ఆ దుష్ట శక్తులను ఎడాపెడా పిడికిళ్లతో కుమ్ముతూ, కరాళ గుహలోకి పోయాడు. అతడి ధాటి చూసిన భూతశక్తులన్నీ పారిపోయాయి గాని, గుహ ఎత్తున వున్న ఒకే ఒక్క నల్లని భయంకరాకారం, తెల్లని కోరలతో, ఎర్రని కళ్ళతో అతడి దారికి అడ్డంగా నిలబడి వికటాట్టహాసం చేసింది.

'' ఎవడవురా నీవు? అడ్డం తొలుగు!'' అన్నాడు హనుమంతుడు తీవ్రస్వరంతో.



ఆ మాటలకు భయంకరాకారం వికవిక నవ్వి, '' నేను బేతాళుడను; భూత, ప్రేత, పిశాచాలకు నాయకుడను! నువ్వెవడివి? ఇక్కడికి రాగలవారు యిద్దరే. ఒకడు మైరావణుడు-నువ్వు మైరావణుడివి కావు! ఇకపోతే, నీవు ఆ రెండో మహాశక్తిమంతుడవే అయి వుండాలి,'' అన్నది.

హనుమంతుడు బిగ్గరగా నవ్వి, '' ఔరా, బేతాళా! శ్మశానాల్లో స్వేచ్ఛగా విహరించే నీకు, ఈ చీకటి గుహలో వుండే దురవస్థ ఎందుకు కలిగింది? ఛీ, అడ్డం తొలగు! లేకపోతే నా శక్తి ఎలాంటిదో చూపవలసివస్తుంది,'' అన్నాడు.



బేతాళుడు హేళనగా నవ్వి, "ఏదీ, ఆ శక్తి ఏపాటిదో చూస్తాను!" అన్నాడు.

హనుమంతుడు చప్పున పిడికిలితో బేతాళుణ్ణి పొడిచాడు. ఆ దెబ్బకు బేతాళుడు నేలకొరిగి, హనుమంతుడికి నమస్కరిస్తూ, "స్వామీ హనుమా! ధన్యుణ్ణి. చిన్న అపచారం చేసి, ఈ గుహలో పడి వుండేట్టుగా శాపం పొందాను. నీ స్పర్శతో నాకు శాపవిముక్తి కలుగుతుందని శివుడు చెప్పాడు. జై, వీర హనుమా!" అంటూ మాయమయ్యాడు.

హనుమంతుడు గుహ మధ్యకు పోయాడు. అక్కడ ఉన్నతమైన ఒక శిలావేదిక మీద గుండ్రటి రత్నపేటిక వున్నది. దాని మూత మీద అగ్ని శిఖ జ్వలిస్తున్నది. అతడు, పేటికను సమీపించేసరికి, ప్రచండమైన జ్వాలలు చెలరేగి, అతడి శరీరం కందిపోయేట్లుగా చుట్టుముట్టాయి. వెంటనే హనుమంతుడు గట్టిగా గాలిపీల్చి, మంటల మీదికి ప్రళయమారుతంలాగా ఊదాడు. కాని, మంటలు చల్లారకపోగా, అవి అతణ్ణి మరింత తీవ్రంగా చుట్టుముట్టాయి.

హనుమంతుడు చేతులెత్తి, "అగ్నిదేవా! నేను నీ మిత్రుడైన వాయువు కుమారుణ్ణి. అనుగ్రహించు!" అంటూ అగ్నిని ధ్యానించాడు. వెంటనే అగ్ని జ్వాలలన్నీ చల్లారిపోయాయి.

ఆ వెంటనే రత్నపేటిక మీది జ్యోతి నుంచి యిలా మాటలు వినిపించాయి:

"మారుతీ! నీకు ఒక ముఖ్య విషయం చెప్పేందుకే, నేనిలా విజృంభించాను. నీవు యీ పేటికలోని తుమ్మెదలను ఒక్కసారిగా సంహరించాలంటే, ఐదు ముఖాలు తెచ్చుకుని, వాటిని నీ నోళ్ళతో లోపలికి పీలుస్తూ, నమిలివెయ్యాలి. బాగా గుర్తుంచుకో!"

హనుమంతుడు అగ్నికి నమస్కరించి, తుమ్మెదలున్న రత్నపేటికను తీసుకుని వాయువేగంతో రామలక్ష్మణులున్న చోటుకు వచ్చాడు. వాళ్ళిద్దరూ యింకా



అసంఖ్యాకులైన మైరావణులతో పోరాడు తూనే వున్నారు హనుమంతుడు పెద్దగా సింహనాదం చేస్తూ, మైరావణుడి ఎదురుగా వాలి, నిలబడి, రత్నపేటికను ఎత్తి పట్టుకుని, ''ఒరే, పాతాళ లంకేశ్వరా! నీ పంచ ప్రాణాలున్న పేటికను తెచ్చాను. ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకుని, రామలక్ష్మణులను శరణు వేడుకో!'' అన్నాడు.

తన పంచప్రాణాలు గల రత్నపేటికను చూసి మైరావణుడు కలవరపడ్డాడు. శరీరం బండరాళ్ళ మధ్య నలిగిపోతు న్నట్టు బాధపడుతూ, "ఎంతపని చేశావురా వానరా! పేటికలో వున్నవి నా ప్రాణాలే కాని, అవి రామలక్ష్మణుల పాలిటా, నీ పాలిటా మృత్యువనుకో. ఆ పేటికను తెరిచావో, అవి నిన్ను కుట్టి, నీ శరీరాన్ని కాలకూట విషంతో నింపి, నిన్ను నిలువునా దగ్ధం చేస్తాయి. మీ ముగ్గురి మృత్యువునూ యిక్కడికి మోసుకొచ్చావు. ప్రాణాలమీద ఆశ వుంటే, ఆ పేటికను కిందపెట్టు,'' అన్నాడు.

హనుమంతుడు ఆ మాటలకు పెద్దగా నవ్వి, ''నిద్రలో వున్న రామలక్ష్మణు లను మాయతో యిక్కడికి తెచ్చినందుకు, నీకు చావు తప్పదు. చచ్చేముందు మరేవైనా తెలిసిన మాయ మంత్రాలుంటే ప్రదర్శించు,'' అన్నాడు.

హనుమంతుడి నిర్భయత్వం చూసి, మైరావణుడు బెంబేలు పడిపోతూ, ''కంటకీ! కంటకీ! వెంటనే చంద్ర సేనను చంపు!'' అని బిగ్గరగా అరిచాడు.

హనుమంతుడు మందహాసం చేసి, ''ఓరి మాయల మైరావణా! ఆ కంటకి నీ కన్న మరికాస్త ముందు చూపున్న దుర్మార్గురాలు. అది యింతకుముందే చంద్రసేనను చంపే ప్రయత్నం చేసింది. కాని, ఆ సమయంలోనే దాని ఆయువు తీరిపోయింది,'' అన్నాడు.

మైరావణుడికి జరిగినదంతా అర్థమై పోయింది. అతడు బిగ్గరగా ఒక కేకపెట్టి,

అందుబాటులో వున్న ప్రతి ఆయుధాన్నీ బాణంలా ప్రయోగిస్తూ, రామలక్ష్మణుల మీదికి వెళ్ళాడు. అతడు మధ్య మధ్య తన శరీరాన్ని తానే గాయపరుచుకుని రక్తం చిందించుతూంటే, మైరావణులు తండోపతండాలుగా పుట్టుకొచ్చి, రామ లక్ష్మణులను చుట్టుముట్టారు. అది చూసి హనుమంతుడు శివుణ్ణి స్మరించి, ఐదు ముఖాలు తెచ్చుకుని, పంచముఖాంజ నేయుడుగా అవతరించాడు.




హనుమంతుడు ఐదు ముఖాలతోనూ ఒకేసారి ప్రళయహుంకారం చేసి, రత్న పేటిక మూత తీయగానే, ఉరుము లురిమి పిడుగులు పడినట్లుగా, ఎర్రని మెరుపులతో ప్రళయఝుంకారం చేస్తూ వెలువడిన ఐదు తుమ్మెదలు, అతణ్ణి కాటువేసేందుకు మీదికి వెళ్ళాయి. హనుమంతుడు ఒక్కొక్క ముఖంతో గట్టిగా లోపలికి గాలి పీలుస్తూ, ఒక్కొక్క తుమ్మెదనూ నోటపట్టి, కసిగా ఏక కాలంలో వాటిని గట్టిగా నమిలి చంపి, నేలమీద ఊశాడు. మరుక్షణం మాయ మైరావణ మూక అంతా నేలకూలి ప్రాణాలు వదిలారు.

ఈ విధంగా తన బలగమంతా నశిం చినా, మైరావణుడు పారిపోయే ప్రయత్నం చేయక రామలక్ష్మణుల మీద రకరకాల ఆయుధాలూ, బాణాలూ ప్రయోగించ సాగాడు. అప్పుడు రాముడు ఒక మహాస్త్రంతో మైరావణుడి తల తెగి నేల మీద పడేలా కొట్టి, అతణ్ణి చంపాడు.

పంచముఖాంజనేయ, రామ లక్ష్మణులపై పూలజల్లు కురిసింది. బ్రహ్మాది దేవతలూ, శివుడూ అక్కడి కొచ్చారు. బ్రహ్మ రాముడితో, "ఓయీ రామా! ఈ మైరావణుడు కాలనేమి అంశతో జన్మించినవాడు. హనుమంతుడి సాయంవల్ల, నీ చేతిలో అతడు చావటం జరిగింది. హనుమంతుడు, శివుని అంశతో జన్మించినవాడు గనకనే, మైరావణ సంహారానికి అవసరం అయిన, ఆ రత్న

పేటికను సప్త సముద్రాల మధ్యనుంచి తేగలిగాడు,'' అని చెప్పాడు.

శివుడు హనుమంతుణ్ణి ఆశీర్వదించి, ''హనుమంతుడా, నీ శక్తియుక్తులూ, బల పరాక్రమాలూ అపారమైనవి. మైరావణ సంహారం మాటలు కాదు! ఎంతో దుర్ఘటమైన ఆ కార్యాన్ని విజయవంతంగా నెరవేర్చావు. పంచముఖాంజనేయ రూపాన్ని స్మరించినవారికి, భూత పిశాచాదుల నుంచి ఎటువంటి హానీ కలగదు,'' అన్నాడు.

హనుమంతుడు తన పంచముఖ స్వరూపాన్ని ఉపసంహరించుకుని, బ్రహ్మకూ, శివుడికీ ప్రణామాలు చేశాడు. బ్రహ్మ, శివుడూ వారి వెంటవచ్చిన దేవతలూ, రామలక్ష్మణులకు విజయం కలగాలని ఆశీర్వదించి, వెళ్ళిపోయారు.

బ్రహ్మ వెళ్ళిపోయే ముందు రాముడికి, పాతాళలంకా రాజ్యానికి మత్స్యవల్లభుణ్ణి అధిపతిగా చేయమని ఆదేశం యిచ్చాడు. దానిప్రకారం రాముడు, మత్స్యవల్లభుడిని పిలిపించి, అతణ్ణి పాతాళలంక పాలకుడుగా అభిషేకించి, పట్టాభిషిక్తుణ్ణి చేశాడు.

ఇవన్నీ పూర్తి అయింతరవాత హనుమంతుడు ఎంతో వినయంగా రాముడికి, తాను చంద్రసేనకుచేసిన వాగ్దానంగురించి చెప్పి, ''రామా, ఆ చంద్రసేన సహాయం లేకపోయినట్టయితే, నేను మైరావణుడి ప్రాణాలున్న ప్రదేశం కనుక్కోవటం సాధ్యమయేది కాదు. కార్యసాధన కోసం, మైరావణుడి సంహారం తరవాత నిన్ను, ఆమె దగ్గిరకు తీసుకువస్తానని వాగ్దానం చేశాను,'' అన్నాడు.

రాముడు కొంచెంసేపు మౌనంగా ఆలోచించి, తల పంకిస్తూ, ''అలాగా! సరే పద,'' అన్నాడు.

రాముడు యిలా అనగానే హనుమంతుడు ఎంతో సంతోషపడి, చంద్రసేన వున్న మందిరానికి ముందుండి దారి తీశాడు. రాముడు చిరునవ్వు నవ్వుతూ అతణ్ణి అనుసరించాడు.






యుద్ధంలో మైరావణుడు మరణించిన వార్త సువర్చలాదేవి ద్వారా చంద్రసేన విన్నది. సువర్చల ఆమెకు లంకా రాజ్యానికి మత్స్యవల్లభుడు పట్టాభిషిక్తుడైనట్టు కూడా చెప్పింది.

మైరావణుడి చెర నుంచి తనకు విముక్తి కలిగిందని ఆనందపడుతున్న చంద్రసేనతో, సువర్చల, "అమ్మా, నువు అదృష్టవంతురాలివి. మైరావణ సంహారం చేసి, రామచంద్రుడు సరాసరి నీ భవనానికే వస్తున్నాడు," అన్నది.

ఈ శుభవార్త చెప్పి సువర్చలాదేవి వెళ్ళిపోగానే, చంద్రసేన సంతోషంతో ఉక్కిరిబిక్కిరవుతూ, రాముడికి తగిన విధంగా స్వాగతం చెప్పేందుకు సన్నాహాలు ప్రారంభించింది. ముందుగా తానున్న మందిరంలో పూలతోరణాలు కట్టింది. చందనతాంబూలాలనూ, అభిషేకజలాన్నీ సిద్ధపరిచింది. హంసతూలికాతల్పం మీద పూలు చల్లింది.

ఈ పనులన్నీ పూర్తికాగానే చంద్రసేన ఒక బంగారుపళ్ళెంలో పూవులూ, పన్నీరు కలశం పెట్టుకుని రాముని రాక కోసం చూస్తూ, ద్వారం వద్ద నిలబడింది. ఒకటి రెండు నిమిషాలు గడిచేలోపలే ముందు హనుమంతుడూ, వెనకగా రాముడూ రావటం ఆమె కంటబడింది. రామున్ని చూస్తూనే, చంద్రసేన సిగ్గుతో తడబాటు చెంది, ఆనందతన్మయత్వంలో చేతులు మోడ్చి, మోకరిల్లి కూర్చున్నది.

**33. రామలక్ష్మణుల ఆగమనం**



హనుమంతుడు ముందుగా గదిలో ప్రవేశించి చంద్రసేనతో, "అమ్మా, నీకు చేసిన వాగ్దానం ప్రకారం రామచంద్రుణ్ణి, నీ మందిరానికి తీసుకువచ్చాను," అన్నాడు.

ఆ మాటలు వింటూనే చంద్రసేన కళ్లు తెరిచింది. ఎదురుగా ఆమెకు రాముడు శాంతగంభీరవదనంతో సాక్షాత్కరించాడు. వెంటనే ఆమె తొట్రుపడుతూ రాముని పాదాలను బంగారుపళ్ళెరంలో కడిగి, ఆ నీటిని తలపై చల్లుకుని, అతడిని పూలతో పూజించి, కర్పూరహారతి యిచ్చింది.

చంద్రసేన ఆనందపారవశ్యంలో మాట్లాడబోయి, పెదవులు తడబడగా మాట్లాడలేకపోయింది. ఆమె మౌనంగా రాముణ్ణి ఆహ్వానించుతూ హంసతూలికా తల్పం దగ్గిరకు తీసుకుపోయింది. అక్కడ శయ్యపైన వున్న ఒక పుష్ప హారాన్ని తీసుకుని రాముడి మెడలో వేసేందుకు కదిలింది.

ఈలోపల రాముడు హంసతూలికా తల్పాన్ని సమీపించి, దానిమీద కూర్చో బోతూండగా, తల్పం ఫెళఫెళమంటూ మధ్యకు విరిగిపోయింది.

చంద్రసేన ఏమిజరిగినదీ తెలియని పారవశ్యంలో, రాముడి మెడలో పూల మాల వేయబోతూండగా అతడామెను వారించి, "చంద్రసేనా! చూశావుగద? శకునం ఏమాత్రం బాగాలేదు." అన్నాడు. ఆ మరుక్షణం చంద్రసేన చేతుల నుంచి పూలమాల జారి, రాముడి పాదాల మీద కుప్పగా పడింది.

అప్పటికి చంద్రసేన తెప్పరిల్లి, విరిగి పోయిన హంసతూలికాతల్పాని కేసి తీవ్రంగా చూసింది. తల్పాన్ని విరిగిపడేలా చేసిన హనుమంతుడు అక్కడే సూక్ష్మ రూపంలో దాగివున్నాడు. అతడు చంద్ర సేన తీక్ష్ణదృష్టిని భరించలేకపోయాడు.

హనుమంతుడు వెంటనే తన సూక్ష్మ రూపాన్ని విసర్జించి, మామూలు రూపంతో చంద్రసేన ముందు మోకరిల్లి, "తల్లీ,

నన్ను క్షమించు! అవసరంకొద్దీ వాగ్దానం చేశాను. ఆ ప్రకారం రాముణ్ణి నీ దగ్గిరకు తీసుకువచ్చాను. కాని, రాముడు ఏకపత్నీ వ్రతుడు. ఫలాపేక్షలేకుండా ఆయన్ని సేవించటమే ఉత్తమపద్ధతి.'' అన్నాడు.

చంద్రసేన ఏదో చెప్పాలని చూసింది కాని, గొంతు తడబడింది. రాముడు తేజోవంతమైన శాంతనయనాలతో చూస్తూ ఆమెకు పరతత్వజ్ఞానాన్ని బోధించాడు. ఆ సమయంలో చంద్రసేనకు, రాముడు మహావిష్ణువులా కనిపించాడు. ఆ విష్ణువు, చంద్రసేనతో, ''చంద్రసేనా! ఇప్పుడు రాముడుగా నేను ఏకపత్నీవ్రతుణ్ణి. రాబోయే కృష్ణావతారంలో, నా అష్ట భార్యల్లో నీవు సత్యభామవై, నా కెంతో ప్రియతమురాలి వవుతావు.'' అన్నాడు.

ఆ సమయంలో చంద్రసేనకు, తనలో విష్ణువు నిండివున్నట్టుగానూ, తాను ఒక జ్యోతిలాగా విష్ణుతేజంలో కలిసిపోతున్నట్టుగానూ అనిపించింది. ఆమె జ్యోతిలా ప్రకాశిస్తూ, రాముడిలో లీనంకావటం చూస్తున్న హనుమంతుడు, అద్భుతపడిపోతూ కళ్ళు మూసుకుని, చేతులు జోడించాడు. కొద్దిక్షణాల తరవాత అతడు కళ్ళు తెరిచి చూస్తే, ఎదురుగా రాముడు చిరునవ్వు నవ్వుతూ కనిపించాడు. వెంటనే హనుమంతుడికి అంతకుముందు జరిగిన



దంతా గుర్తులేకుండాపోయి; రావణ సంహారం సంగతి మాత్రమే మనసులో మెదిలింది.

అంతలో అక్కడికి పాతాళ లంకా రాజ్యానికి రాజయిన మత్స్యవల్లభుడు వచ్చాడు. అతడు రాముణ్ణీ, హనుమంతుణ్ణీ పూలతో అర్చించి, వారి నుంచి ఆశీర్వాదాలు పొందాడు. తరవాత అతడు పాతాళలంకావాసులతో కలిసి రాముడికి ఘనంగా వీడ్కోలు యిచ్చాడు. హనుమంతుడు రామలక్ష్మణులను భుజాల పై ఎక్కించుకుని, పాతాళలంకను దాటి, రావణలంక కేసి రివ్వుమంటూ ఆకాశంలోకి ఎగిరాడు మత్స్యవల్లభుడు చేతు



లెత్తి ఊపుతూ, అతడికి జయజయ ధ్వానాలు పలికాడు.

హనుమంతుడు లంకానగరాన్ని చేరనున్న సమయంలో, అక్కడ వున్న వానర సేనతోపాటు, వానరప్రముఖు లందరూ తీరని విచారంలో వున్నారు. వారిలో కొందరు ఆకాశం కేసి ఆశగా చూస్తున్నారు. జాంబవంతుడు మాత్రం మందహాసం చేస్తూ, వానరులకు ధైర్యం చెబుతున్నాడు.

అక్కడ లంకానగరంలో రాకసులు బాకాలు ఊదుతూ, ఆనందంకొద్దీ దిక్కులు పిక్కటిల్లేలా కేకలు పెడుతున్నారు. వారిలో కొందరు మద్యం తాగుతూ, పాటలు పాడుతూ నాట్యం చేస్తున్నారు.

రావణుడు అమితోత్సాహంలో వున్నాడు. కాళికి బలిగా పెట్టిన రామలక్ష్మణుల తలలతో మైరావణుడు ఏ క్షణాన అయినా తన దగ్గిరకు రావచ్చుని అతడు ఎదురు చూస్తున్నాడు. రామలక్ష్మణుల తలలను బంగారుపళ్ళెంలో వుంచి, దానిని సీత దగ్గిరకు తీసుకుపోయేందుకు అవసరం అయిన ఏర్పాట్లు కూడా పూర్తిచేశాడు.

కాలం గడుస్తున్నది. రావణుడు తన మందిరం నుంచి బయిటికి వచ్చి, కోట గోడ అంచున నిలబడి, దూరంగా కనిపిస్తున్న వానరసేనను పరికించి, తృప్తిగా నవ్వుకున్నాడు. తలలు వంచుకుని విచారంగా నిలబడివున్న వానరసేనకు ఒకపక్కగా విభీషణుడు నిలబడివున్నాడు. రావణుడు అతణ్ణి గుర్తించి, "ఔరా, తమ్ముడూ విభీషణా, నువ్వెంత అమాయకుడివి! ఇంకా అక్కడ పడిగాపులు గాయటం ఎందుకు? పాతాళకాళీ ప్రసాదంగా రామలక్ష్మణుల తలలు నా దగ్గిరకు రానున్నవి. తలమాంసం అత్యంత రుచికరమైనదని నీకు తెలియంది కాదుగదా. ఆ తలలమాంసం రుచిచూసేందుకైనా, త్వరగా లంకానగరం చేరుకో. నీకేం భయం లేదు. ఎంతైనా నువు, నా తమ్ముడివి. అభయంయిస్తున్నాను. ఇకనుంచి అయినా యువరాజుగా నాపట్ల వినయవిధేయతలతో

మెసులుకో. వెంటనే నగరానికి బయలు దేరు,'' అంటూ, నాలుగు యోజనాల దూరం వినిపించేంత బిగ్గరగా అరిచాడు.

రావణుడి మాటలు వింటూనే విభీష ణుడు చెవులు మూసుకున్నాడు అతడి కళ్ళలో నీళ్ళు తిరిగాయి; దుఃఖంపెల్లుబి కింది. విభీషణుడి దైన్యం చూసి సుగ్రీవు డికి కూడా గుండెజారిపోయింది. వాళ్ళిద్దరి దుఃఖం చూసి మిగతా వానరులు హాహాకారాలుచేస్తూ, ఒకర్ని చూసి ఒకరు ఏడ్వటం మొదలుపెట్టారు.

వానరసేన దీనస్థితి చూసి రావణుడు మరొకసారి తృప్తిగా నవ్వుకున్నాడు. కోట గోడ పక్కగా పోతున్న రాక్షసస్త్రీలను కేక వేసి పిలిచి, ''మీరిప్పుడే సీత దగ్గిరకు వెళ్ళి, యీ సంగతి చెప్పండి. రాముడి తలతోపాటు లక్ష్మణుడి తలను కూడా ఆమెకు కానుకగా పంపబోతున్నాను. వాళ్ల శరీరాలను పాతాళలంకలోని రాక్షసులు విందుభోజనంగా తినేసివుంటారు. సీతకు యీ వార్త చెప్పి, రామలక్ష్మణుల తలలు స్వీకరించేందుకు సిద్ధంగావుండమనండి." అన్నాడు ఉత్సాహంగా.

రాక్షసస్త్రీలకు ఆ క్షణంలో రావణుడి ఆనందం వెనక కొద్దిపాటి మతిచాంచల్యం వున్నట్టు కనిపించింది. వాళ్ళు ఒక క్షణ కాలం తటపటాయించి, రావణుడికి వంగి



నమస్కారాలు చేసి గబగబా అక్కణ్ణించి వెళ్ళిపోయారు.

రావణుడు కోటగోడ మీదినుంచి కదిలి, తిరిగి తన మందిరానికి పోయి, గవాక్షం దగ్గిర కూర్చుని, మైరావణుడి రాక కోసం సముద్రం మీద ఆకాశపు అంచు కేసి ఆశగా చూడసాగాడు. అంతలో అతడికి, ఆకాశంలో నలుసు లాంటి ఆకారం ఒకటి ఎగిరి వస్తూండటం కంటబడింది.

రావణుడు దిగ్గున గవాక్షంముందు లేచి నిలబడి, చప్పట్లు చరుస్తూ, ''అదుగో, మైరావణుడు కాళికి బలిచేసిన రామ లక్ష్మణుల తలలు తెస్తున్నాడు. బంగారు పళ్ళెం ఎక్కడ? తలలను అందులో



అంగదుడు ఉత్సాహంపట్టలేక, విజయ ధ్వానం చేసి, ''మన హనుమంతుడు రామలక్ష్మణులతో వస్తున్నాడు. స్వాగతం చెప్పండి,'' అంటూ కేక పెట్టాడు.

రామలక్ష్మణులను భుజాలపై ఎక్కించుకుని వస్తున్న హనుమంతుణ్ణి చూసి, వానర సైన్యం ఆనందంతో ఎగిరి గంతులు వేసింది. జయజయధ్వానాలు మిన్ను ముట్టాయి. అక్కడ లంకానగరంలో రాక్షసుల ఆనందోత్సవాలు హఠాత్తుగా ఆగిపోయాయి.

వానరసేన ఉత్సాహంతో వేసే కేకలూ, అక్కడ రేగిన కోలాహలం వింటూ రావణుడు తన మందిరంలోని గవాక్షం దగ్గిర స్థాణువులా నిలబడిపోయాడు. అతడికి రామలక్ష్మణులు సజీవులని మాత్రం అర్థమైంది. కాని, మైరావణుడూ, అతడి అన్నా ఏమైనట్టు ? వాళ్ళను హనుమంతుడు గాని, రామలక్ష్మణులు గాని సంహరించారా ?

రావణుడు యిలా ఆలోచిస్తున్నంతలో రాక్షససైనికుడొకడు అతడి దగ్గిరకు వచ్చి, తాను వానరసైనికుల మాటల ద్వారా విన్న దంతా చెప్పాడు. ఆ విధంగా రావణుడికి పాతాళలంకలో జరిగినదంతా తెలిసింది. వెంటనే అతడు భయకంపితుడైపోయి, చిన్నగా కేకపెట్టి మూర్ఛపోయాడు.

పెట్టాలి. త్వరగా పళ్ళెం తెండి !'' అని, అంతలోనే బిక్కచచ్చి, హతాశుడై కూలబడ్డాడు.

సముద్రం మీది ఆకాశం కేసి చూస్తూ నిలబడివున్న జాంబవంతుడు, ఆకాశంలో నలుసు లాంటి రూపం కనిపించగానే ఆ రూపం ఎవరిదో గుర్తించి, పక్కకు తల తిప్పాడు. పక్కనే నిలబడి సముద్రం కేసి చూస్తున్న అంగదుడు ఆశ్చర్యంగా జాంబవంతుడి కేసి చూశాడు.

జాంబవంతుడు చేతులెత్తి, వానరులతో, ''అదుగో, చూడండి. హనుమంతుడు వస్తున్నాడు. ఇక విచారం మానండి,'' అన్నాడు.

కొంతసేపటికి రావణుడు మూర్ఛ నుంచి తెప్పరిల్లాడు. ఇప్పుడతడిలో కోపం, ద్వేషం పరవళ్ళు తీయసాగాయి. అతడు పిడికెళ్ళు బిగించి, పళ్ళు కొరుకుతూ, "నా ప్రేమాస్పదుడైన ఇంద్రజిత్తును చంపిన, ఆ లక్ష్మణుడెక్కడ? వాణ్ణి ఎక్కడ దాగి వున్నా చంపి తీరుతాను. వాడెక్కడో వానరసేన మధ్యంలో పిరికి పందలా దాగి వుంటాడు. వాణ్ణి నా కంట పడమనండి. వాడి ఆయువు యివాల్టితో ముగిసినట్టే!" అంటూ ఉన్మాదిలా అరవసాగాడు.

రావణుడి యీ దుస్థితి చూసి మండోదరి విస్తుపోయి, కంట నీరు పెట్టుకున్నది. రావణుడు ఆమెను చూసీ చూడనట్టే, కాళ్ళతో భూమిని తన్నుతూ, "ఆ లక్ష్మణుణ్ణి చంపటానికి నాకు ఎవరి సహాయమూ అక్కరలేదు. నేనొక్కణ్ణే యుద్ధంలో ఆ రామలక్ష్మణులను చంపి, వాళ్ళ తలలను సీతకు పంపుతాను. మధ్యలో యీ మైరావణుడు వచ్చి నాకు లేనిపోని ఆశలు కల్పించి, నా అమూల్యమైన కాలమంతా వృథా చేశాడు. వాడూ, వాడి అన్నా అసమర్థులూ, పిరికిపందలూ కనకే, వాళ్ళను రాముడు సునాయాసంగా చంపగలిగాడు. సరే, ఆ మైరావణ భ్రష్టుడి సంగతి వదిలేస్తాను. నా సుపుత్రుడు ఇంద్రజిత్తును చంపిన, ఆ లక్ష్మణుణ్ణి ముందుగా నా ఆయుధానికి బలిపెట్టాలి," అంటూ పిచ్చిగా కేకలు పెట్టాడు.

వానరసేన యుద్ధానికి సర్వసన్నద్ధమై శంఖాలు పూరిస్తూ చేస్తున్న కోలాహలం రావణుడికి వినిపించింది. అది వింటూనే అతడి కళ్ళు నిప్పుల్లా మెరిశాయి. రౌద్రంతో శరీరమంతా జ్వాలలాగా ఎరుపెక్కింది. అతని కళ్ళలోని అశ్రుజలం యింకిపోయి, పౌరుషం కరుడుకట్టింది.

రావణుడు వెంటనే కవచం ధరించి, విల్లంబులు తీసుకుని, "ఆ లక్ష్మణుడెక్కడ?" అంటూ తన మందిరం నుంచి బయిటికి వచ్చి, వానరసేన కేసి బయలుదేరాడు.





# వీర హనుమాన్

సూర్యోదయం అయేవేళ వానరసేనకూ, రాక్షససేనకూ యుద్ధం ఆరంభమయింది. మామూలు ప్రకారమే రాక్షసులు వానరుల మీద బాణాలూ, పరిఘలూ, ఖడ్గాలూ, పరశువులూ ప్రయోగిస్తే, వానరులు రాక్షసుల మీద చెట్లూ, గండశిలలూ ప్రయోగించారు. ఇరు పక్షాలా రక్తం కాలవలుగట్టి పారి, లేస్తున్న దుమ్మును అణచివేసింది.

రాక్షసుల తాకిడికి తట్టుకోలేకుండా ఉన్న వానరసేనలకు అండగా రాముడు విల్లు చేతబట్టి, రాక్షస సైన్యాలలో ప్రవేశించి, నిప్పులాటి బాణాలను రాక్షసుల మీద వర్షంలాగా కురిపించసాగాడు. రాముడి దెబ్బకు రాక్షసులు తట్టుకోలేక పోయారు. అతని బాణ ప్రయోగం వారికి తెలిసేది కాదు, దాని ఫలితం మాత్రమే తెలిసేది. చెట్లు ఊగిపోవటం కనిపిస్తుంది గాని, ఝంఝామారుతం కనిపించదు గదా! క్షణాల మీద అంతులేని రాక్షస సంహారం జరిగింది.

రాముడు తనకు సమీపంగా ఉన్న సుగ్రీవ, విభీషణ, జాంబవంత, హనుమంతాదులతో, "నాలాగా బాణాలు ప్రయోగించటం ఒక్క శివుడికి తప్ప మరెవరికీ తెలియదు," అన్నాడు.

యుద్ధరంగంలో జరుగుతున్న రాక్షస హత్యా కాండ లంకలో రాక్షస స్త్రీలకు తెలిసింది. చచ్చిన వారిలో అనేకమంది భర్తలు ఉన్నారు, కొడుకులున్నారు.

**34.** రాముడికి దేవేంద్రుడి సహాయం



వాళ్ళు పెద్దపెట్టున ఏడుస్తూ, ఈ పీడ కంతటికీ మూల కారకురాలైన శూర్పణఖను తిట్టుకున్నారు. ఆ పాపిష్ఠిది వెళ్ళి రాముణ్ణి మోహించటమేమిటి? ఆ శూర్పణఖ మాటలు విని రావణుడు సీతను ఎత్తుకువచ్చి, రాముడితో ఈ విరోధం తెచ్చుకోవటమేమిటి? పోనీ ఆ సీత రావణుడికి స్వాధీనమయిందా అంటే అదీ లేదు! సీతను ఎత్తుకు పోవటానికి ప్రయత్నించిన విరాధుడు రాముడి చేతిలో చచ్చాడు కాడా? నిశ్చయంగా రాముడే గెలుస్తాడు. రాముడి శక్తి రావణుడికి మాత్రమే ఇంకా తెలియకుండా ఉన్నది! ఇట్లా అనుకుంటూ రాక్షస స్త్రీలు తమ మొగుళ్ళు చచ్చినందుకూ, సోదరులు చచ్చినందుకూ, కొడుకులు చచ్చినందుకూ శోకాలు పెట్టారు.

ఒకవంక రాముడు తన రాక్షససేనను కార్చిచ్చులాగా దహిస్తుంటే, రావణుడు తన సమీపాన ఉన్న మహోదర, మహాపార్శ్వ, విరూపాక్షులతో, "ఖరుణ్ణీ, కుంభకర్ణుణ్ణీ, ప్రహస్తుణ్ణీ, ఇంద్రజిత్తునూ చంపిన శత్రువును ఇప్పుడు నిర్మూలిస్తాను! నా బాణాలు భూమ్యాకాశాలను అంధకారంలో ముంచేస్తాయి. వానర సేనను గుంపులు గుంపులుగా వధిస్తాను," అంటూ ప్రగల్భాలు పలికాడు.

రావణుడు ఎక్కి ఉన్న రధానికి ఎనిమిది గుర్రాలు పూన్చి ఉన్నాయి. దానిమీద రావణుడు భయంకరమైన తేజస్సుతో ప్రకాశిస్తున్నాడు. అతని వెంట రధాల మీద మహాపార్శ్వుడూ, మహోదరుడూ, విరూపాక్షుడూ ఉన్నారు. రావణుడు వానర సేనలో జొరబడి, భయంకరమైన యుద్ధం చేశాడు.

రాముడు రాక్షస సేనలో ఎలాటి విధ్వంసం సాగించాడో, రావణుడు వానర సేనలో అలాటి విధ్వంసమే చేశాడు. అది చూసి సుగ్రీవుడు, వానరసేనను కాపాడే భారం సుషేణుడికి అప్పగించి,

తాను భయంకరమైన యుద్ధం చేయటానికి పూనుకుని, భీకరంగా అరుస్తూ, అనేకమంది మామూలు రాక్షసులను చంపి, రాక్షస వీరులను చంపటానికి సిద్ధపడ్డాడు.

ఇది చూసిన విరూపాక్షుడు రథం మీది నుంచి సమీపంలో ఉన్న ఏనుగు మీదికి ఎగిరి కూర్చుని, వానరసేనను ప్రవేశించాడు. వానరసేనా ముఖంలోనే అతనికి సుగ్రీవుడు తగిలాడు. విరూపాక్షుడు బాణాలతో సుగ్రీవుణ్ణి బాధించాడు. విరూపాక్షుణ్ణి చంప నిశ్చయించి, సుగ్రీవుడు ఒక పెద్ద చెట్టు పెరికి విరూపాక్షుడు ఎక్కిన ఏనుగు ముఖం మీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు ఏనుగు వెనక్కు తుళ్ళి, చచ్చిపడిపోయింది. విరూపాక్షుడు చప్పున ఏనుగు మీది నుంచి దిగి, కత్తీ, డాలూ తీసుకుని, సుగ్రీవుణ్ణి కత్తితో బలంగా కొట్టాడు. తరవాత ఇద్దరికీ సమంగా గొప్ప యుద్ధం జరిగింది. చిట్టచివరకు సుగ్రీవుడు విజృంభించి విరూపాక్షుడి చేత ముక్కులా, నోటా నెత్తురుకక్కేలాగ కొట్టి, అతన్ని చంపేశాడు.

విరూపాక్షుడు పోగానే అతని స్థానంలో వానర సేనను నిర్మూలించటానికి రావణుడు మహోదరుణ్ణి నియమించాడు. మహోదరుడు వానర సేనను చంపుతూ వస్తూంటే సుగ్రీవుడు అడ్డుపడి, ఒక పరిఘ సంపాదించి, దానితో మహోదరుడి రథాశ్వాలను చంపాడు. మహోదరుడు కోపంతోవణికిపోతూ, వెంటనే రథం దిగి, గద చేతబట్టి, సుగ్రీవుడిపై తలపడ్డాడు.



త్వరలోనే సుగ్రీవుడి చేతి పరిఘా, మహోదరుడి గదా విరిగిపోయాయి. తరవాత ఇద్దరూ ముష్టి యుద్ధానికి దిగారు. కొంతసేపటికి ఇద్దరూ అలిసిపోయి, యుద్ధభూమిలో దొరికిన ఆయుధాలు తీసుకుని పోరాటం సాగించారు. ఇంతలో మహోదరుడి చెతి కత్తి, సుగ్రీవుడి చేతి



డాలులో గుచ్చుకున్నది. దాన్ని అతను లాగుతూండగా సుగ్రీవుడు అతని తల కాస్తా నరికేశాడు.

ఈ సమయానికి మహాపార్శ్వుడు అంగదుడి సేన మీద విరుచుకుపడి, దాన్ని ధ్వంసం చెయ్యసాగాడు. అంగదుడు మండిపడి, బంగారు కట్ల ఇనుప గుదియను విసిరాడు. ఆ దెబ్బకు విరూపాక్షుడూ, అతని సారథీ కూడా స్పృహ తప్పి కిందపడ్డారు. అదే సమయంలో గవాక్షుడూ, జాంబవంతుడూ అక్కడికి వచ్చి, పెద్ద శిలలతో మహాపార్శ్వుడి రథాన్ని నుగ్గు చేశారు, గుర్రాలను చంపారు.

ఇంతలో మహాపార్శ్వుడికి స్పృహ తెలిసి, గవాక్షుణ్ణీ, జాంబవంతుణ్ణీ బాణాలతో కొట్టనారంభించాడు. అది చూసి అంగదుడు ఉగ్రుడై, దూరం నుంచి ఒక పరిఘను విసిరి, వెంటనే సమీపంగా వచ్చి, కొంతసేపు యుద్ధంచేసి, చివరకు మహాపార్శ్వుడి గుండెలో పిడికిలితో పొడిచి, చంపేశాడు.

ఇక రావణుడు తానే యుద్ధభారం వహించదలచాడు. అతను ఇతర వానర వీరులతో యుద్ధం చెయ్యదలచలేదు. అందరికీ మూలకందమైన రాముణ్ణే చంప నిశ్చయించాడు. అతను రాముడి కేసి వెళుతూ, తామసాస్త్రం వానరసేన మీద ప్రయోగించాడు. అది ప్రచండమైన అస్త్రం. దాని తాకిడికి వానరులు అమితంగా దెబ్బతిన్నారు. వారు భయపడి చెల్లాచెదరై పారిపోయి రావటం చూసి రాముడు యుద్ధసన్నద్ధుడై, ముందుకు వచ్చాడు. అతని వెంట లక్ష్మణుడు కూడా ఉన్నాడు.

రావణుడిపై మొదట విల్లెత్తి బాణాలు వేసినవాడు లక్ష్మణుడు. కాని రావణుడు అతని బాణాలన్నిటినీ దారిలోనే ఖండించి, రాముడి కేసి తిరిగి, అతని మీద బాణవర్షం కురిపించాడు. రాముడు వాటిని తన బాణాలతో ఖండించాడు. ఇద్దరికీ



చాలా సేపు ఘోరమైన యుద్ధం జరిగింది. ఒకరి అస్త్రాలను ఒకరు దారిలోనే ఖండించారు.

రావణుడు రాముడిపై అసురాస్త్రం ప్రయోగించాడు. అది మహా భయంకరమైనది. రాముడు ఆగ్నేయాస్త్రంతో దాన్ని ధ్వంసం చేశాడు. అది చూసి సుగ్రీవుడు మొదలైన వానర వీరులు చాలా సంతోషించారు.

తరవాత రావణుడు రౌద్రాస్త్రం ప్రయోగించాడు. రాముడు గాంధర్వాస్త్రంతో దాన్ని ధ్వంసం చేశాడు. రావణుడు సౌరాస్త్రం ప్రయోగించాడు. రాముడు దాన్ని కూడా ఖండించాడు.

తరవాత ఇద్దరూ మామూలు బాణాలతో యుద్ధం చేశారు. రాముడు రావణుణ్ణి తన బాణాలతో బాగా గాయపరచి, కొంత సేపు విశ్రాంతి తీసుకున్నాడు.

అప్పుడు లక్ష్మణుడు బాణాలు ఎక్కుపెట్టి, రావణుడి ధ్వజం విరగగొట్టాడు, రావణుడి సారధి తల నరికాడు, రావణుడి ధనుస్సును ముక్కలు, ముక్కలు చేశాడు.

లక్ష్మణుడు ఆగగానే విభీషణుడు రావణుడి రథాశ్వాలను తన గదతో కొట్టి చంపాడు. రావణుడు విభీషణుడిపై మండిపడి, రథం నుంచి నేలకు ఉరికి, విభీషణుడి మీద ఒక శక్తిని విసిరాడు. లక్ష్మణుడు ఆ శక్తిని మధ్య దారిలోనే తన బాణాలతో మూడుగా ఖండించాడు.

రావణుడు ఈ సారి ఇంకా దారుణమైన శక్తిని చేతపట్టాడు. లక్ష్మణుడు చప్పున విభీషణుడికి అడ్డం వెళ్ళాడు. రావణుడు ఆ శక్తిని విభీషణుడిపై విసిరే లోపల లక్ష్మణుడు రావణుణ్ణి బాణవర్షంలో ముంచి ఎత్తాడు.

రావణుడు లక్ష్మణుడితో, "విభీషణుడికి అడ్డం వచ్చావు గనక ఈ శక్తిని నీ మీదే వేస్తాను. ఇది నీ ప్రాణాలు తీస్తుంది," అంటూ ఆ శక్తిని లక్ష్మణుడి మీదనే ప్రయోగించాడు.

రాముడు ఆ శక్తిని శపిస్తూ, "నువు వ్యర్థమగుదువుగాక!" అన్నాడు. అయినా అది సూటిగా లక్ష్మణుడి రొమ్ములో తాకింది. లక్ష్మణుడు పడిపోయాడు. శక్తి అతని శరీరంలోనుంచి ధూరి కింద పడింది. రాముడు కోపంతోనూ, దుఃఖంతోనూ ఆ శక్తిని తన చేతులతో విరిచాడు. ఆ సమయంలో రావణుడు అతని మీద విడవకుండా బాణాలు వేస్తూనే ఉన్నాడు. రాముడు వాటిని లక్ష్యపెట్టకుండా, లక్ష్మణుణ్ణి కౌగలించుకుని, హనుమంతుడూ, సుగ్రీవుడూ మొదలైన వానరులతో, "మీరు లక్ష్మణుణ్ణి చూస్తూ ఉండండి. ఇక రావణుణ్ణి వధించక తప్పదు," అన్నాడు.



కాని లక్ష్మణుడి స్థితి చూసి రాముడికి యుద్ధం చేసే అసక్తి కూడా తగ్గుతున్నది. ఇది తెలిసి సుషేణుడు రాముడితో, "లక్ష్మణుడి ప్రాణం పోలేదు. ఇతను బతికే ఉన్నాడు. నీకు విచారం వద్దు." అని హనుమంతుడితో, "నువు ముందు తెచ్చిన ఓషధీ పర్వతం దక్షిణ శిఖరం మీద ఉండే ఓషధిని పట్టుకురా. మనం లక్ష్మణుణ్ణి బతికించుకోవాలి," అన్నాడు.

హనుమంతుడు ఓషధీ పర్వతం వద్దకు వెళ్లాడుగాని, కావలసిన ఓషధిని పోల్చుకోలేక, పర్వతం యొక్క దక్షిణ శిఖరాన్నే ఏకంగా పట్టుకొచ్చాడు. అతను సుషేణుడితో, "నువు చెప్పిన ఓషధి నాకు తెలియలేదు. శిఖరమంతా పెల్లగించి తెచ్చాను. నీకు కావలిసిన ఓషధి నువే తీసుకో," అన్నాడు.

సుషేణుడు హనుమంతుడి పటుత్వాన్ని మెచ్చుకుంటూ ఓషధిని పైకి తీశాడు. తరవాత అతను దాని రసాన్ని లక్ష్మణుడి ముక్కులో పిండాడు. లక్ష్మణుడు వెంటనే బాధలన్నీ పోయి, స్పృహ వచ్చి, లేచి నిలబడ్డాడు.

రాముడు ఆనందబాష్పాలతో లక్ష్మణుణ్ణి కౌగలించుకుని, "లక్ష్మణా, నువు చచ్చి కూడా బతికావు. నువు

నిజంగా చచ్చిపోయి ఉంటే నాకు సీతతో ఏం పని? ఈ యుద్ధంతో ఏం పని? నా అదృష్టం కొద్దీ బతికావు.'' అన్నాడు.

''నువు ఇలా బలహీనుడిలాగా మాట్లాడ రాదు. రావణుణ్ణి చంపి, విభీషణుణ్ణి లంకకు రాజును చేస్తానని ప్రమాణం చేశావు. నా కోసం నిరాశ మాని, రావణుణ్ణి చంపు. ఆ విధంగా విభీషణుడికి నువు చేసిన వాగ్దానం నెరవేర్చుకో. సూర్యుడు అస్తమించే లోపల రావణుడు చావాలని నేను కోరుతున్నాను,'' అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుడు ఇలా అనగానే రాముడు తన విల్లు ఎక్కుపెట్టి, రావణుడిపై బాణాలు ప్రయోగించాడు.

రామ రావణ యుద్ధంలో ఒక లోటు కనబడింది. రావణుడు రథం మీద ఉండి యుద్ధం చేస్తున్నాడు. రాముడు నేలమీద నిలబడి యుద్ధం చేస్తున్నాడు.

ఈ లోటు సరి చెయ్యటానికి ఇంద్రుడు తన సారథి అయిన మాతలి చేత తన రథాన్ని భూలోకానికి పంపాడు. దానికి బంగారు నగిషీలున్నాయి, అనేక గంట లున్నాయి, వైడూర్యంతో చేసిన నొగ ఉన్నది. అది ఉదయ సూర్యుడిలాగా వెలిగిపోతున్నది. మాతలి ఆ రథాన్ని తీసుకుని రాముడి వద్దకు వచ్చి, రాముడితో ఇలా అన్నాడు :

''రాముడా, నీకు విజయం కోరుతూ దేవేంద్రుడు ఈ రథాన్ని నీకు పంపాడు. దీనితో బాటు ఈ ఇంద్రధనుస్సునూ, కవచాన్నీ, బాణాలనూ, శక్తినీ ఇంద్రుడు నీకు ఇచ్చాడు. పూర్వం ఇంద్రుడు ఇదే రథం మీద, నేను సారథిగా పనిచేయగా, దానవులను చంపాడు. ఇప్పుడు నువు దీనిమీద ఎక్కి రావణుణ్ణి చంపు.''

మాతలి మాటలు విని రాముడు ఆ రథానికి ప్రదక్షిణం చేసి, నమస్క రించి, దానిమీద ఎక్కాడు. అటుపైన రామ రావణులకు, చూసేవాళ్ళకు అద్భుతం అనిపించేటట్టుగా యుద్ధం జరిగింది.






రాముడు రథం మీద నిలబడి తన పైకి బాణ ప్రయోగం ప్రారంభించేసరికి, రావణుడు కోపంతో ఉగ్రుడైపోయి, రాముడి మీద గాంధర్వాస్త్రాన్ని వేశాడు. దివ్యాస్త్రాల ప్రభావం క్షుణ్ణంగా ఎరిగి వున్న రాముడు గాంధర్వాస్త్రాన్ని, గాంధర్వాస్త్రంతోనూ, తరవాత రావణుడు వేసిన దైవాస్త్రాన్ని, దైవాస్త్రంతోనూ తునాతునియలు చేశాడు.

ఈసారి రావణుడు, రాముడి మీద మహా భయంకరమైన రాక్షసాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రం నుంచి వెలువడిన అనేక విషసర్పాలు, తమ నోళ్ళ వెంట మంటలు కక్కుతూ, రాముడికేసి రాసాగినై. రాముడు వెంటనే వాటి పైకి గరుడాస్త్రాన్ని ప్రయోగించాడు. దానిలోనుంచి వెలువడిన గరుడపక్షులు, రావణుడు ప్రయోగించిన విషసర్పాలను తమ నోళ్ళతో పట్టి సంహరించినై.

రావణుడు యిది చూసి మరింత కోపోద్రిక్తుడై, రాముడి మీదా, రథసారథి అయిన మాతలి మీదా బాణవర్షం కురిపించాడు. ఒక శక్తివంతమైన బాణంతో రాముడెక్కి వున్న రథపు ధ్వజస్తంభాన్ని పడగొట్టాడు. మరికొన్ని బాణాలతో రథాశ్వాలను నొప్పించాడు. ఆకాశంలో వుండి అతి దారుణమైన యీ రామ రావణ యుద్ధాన్ని చూస్తున్న దేవతలు, గంధర్వులు, చారణులు పరమ దుష్టుడైన రావణుడు, రాముణ్ణి తన బాణాలతో



బాధించటమేగాక, దేవేంద్రుడి రథపు ధ్వజాన్ని కూలవేసినందుకు చాలా విచార పడ్డారు. విభీషణుడితో పాటు వానరులందరూ యుద్ధంలో రావణుడిది పైచెయ్యి కావటం చూసి కలతచెందారు.

రాముణ్ణి సంహరించటానికి యిదే మంచి అదనని భావించిన రావణుడు ఇంద్రుడి వజ్రాయుధంతో సమానమైన ఒక శూలాన్ని చేతికి తీసుకున్నాడు. అది పొగలు చిమ్ముతూ, మంటలు కక్కుతూ మహా భయంకరంగా వున్నది.

రావణుడు ఆ జ్వలిస్తున్న శూలాన్ని ఎత్తిపట్టుకుని రాముడితో, ''ఓరి, రాముడా! ఇదుగో, నీ పాలిటి మృత్యువు! ఈ క్షణంలోనే నిన్నూ, నీ తమ్ముణ్ణీ చంపి, మహా శూరులైన రాక్షసులను వధించినందుకు నీ మీద పగ తీర్చుకోబోతున్నాను,'' అంటూ రాముడి కేసి విసిరాడు.

రావణుడు అలా విసిరిన శూలం జ్వాలలతోనూ, మెరుపులతోనూ ప్రళయ భయంకరంగా గర్జిస్తూ, రాముడి కేసి రాసాగింది. రాముడు దానికేసి ప్రయోగించిన బాణాలన్నీ, దాన్ని తాకి భస్మమై పోయి, బూడిద గాలిలోకి లేచింది. రాముడు ఆ సరికి రావణుడు వదిలిన మహాస్త్రం ఎంత శక్తివంతమైనదో గ్రహించి, ఇంద్రుడు తన రథంతోపాటు పంపిన మహా శక్తిని దానిమీద ప్రయోగించాడు. రావణుడు ప్రయోగించిన శూలం రెండుగా విరిగి, నేలకూలింది.

ఆ వెంటనే రాముడు విజృంభించి, రావణుడి మీద వివిధాస్త్రాలు ప్రయోగించసాగాడు. తాను వేసిన మహాశక్తి యీ విధంగా నిష్ప్రయోజనం అవటం చూసి, రావణుడు దిగులుపడ్డాడు. ఇప్పుడు రాముడు వేసే బాణాల నుంచి ఆత్మరక్షణ కూడా చేసుకోలేని స్థితికి దిగజారాడు. అది గమనించిన రావణుడి రథ సారథి, రథాన్ని యుద్ధరంగం నుంచి దూరంగా తోలుకుపోసాగాడు. రాక్షసులు భయకంపితులై హాహాకారాలు చేశారు.



తన రథం ఆ విధంగా యుద్ధభూమిని వదిలి కొంతదూరం పోగానే, రావణుడు తేరుకుని, రథ సారథిపై ఆగ్రహం చెంది, "ఓరీ, దుష్టుడా! నా అనుమతి లేకుండా రథాన్ని యుద్ధరంగం నుంచి ఎందుకు మళ్ళించావు? నే నేమైనా పిరికివాణ్ణీ, అసమర్థుణ్ణీ అనుకుంటున్నావా? అస్త్ర ప్రయోగం చేతకానివాణ్ణీ, యుద్ధంలో శౌర్య ప్రతాపాలూ, అవసరం అయితే యుక్తులూ ప్రదర్శించలేని వాణ్ణనుకుంటు న్నావా? ఛీ, యీ మతిమాలిన పని ఎందుకు చేశావు? శత్రువుల నుంచి ఏమైనా లంచం పుచ్చుకున్నావా? వెంటనే రథాన్ని యుద్ధరంగం మధ్యకు నడుపు," అన్నాడు.

ఈ పరుష వాక్కులకు సారథి ముఖం చిన్నబుచ్చుకుని, రావణుడితో, "మహా రాజా! నీ క్షేమం కోరినవాణ్ణి గనకనే, రథాన్ని యుద్ధరంగం నుంచి దూరంగా నడిపాను. రాముడు చేసే అతి తీవ్రమైన యుద్ధానికి, నీవు తగిన విధంగా ప్రతి యుద్ధం చేయటంలేదు. నీవు బాగా అలిసి వున్నావు. రథాశ్వాలు కూడా బాగా డస్సి పోయి వున్నాయి. నీకూ, వాటికీ కొంత విశ్రాంతి అవసరం అని రథాన్ని యిలా నడుపుకు వచ్చాను. యుద్ధరంగంలో రథాన్ని ఎప్పుడు ఎలా నడిపించాలో తెలియకపోతే, నేను సారథి నెలా అవు తాను? ఇప్పుడేం చెయ్యమని ఆజ్ఞ?" అన్నాడు.

సారథి ఇలా అనగానే, రావణుడు అతడి రాజభక్తికీ, సమయస్ఫూర్తికీ మెచ్చి, అతడికి విలువైన ఒక హస్త కంకణాన్ని బహూకరించి, "రాముణ్ణి యీ క్షణంలోనే, నా బాణ ఘాతానికి బలి చెయ్యబోతున్నాను. నేను అలసి వున్నానని సంశయించక రథాన్ని, అతడి కేసి తీసుకుపో," అన్నాడు.

సారథి రథాన్ని రాముడి ముందుకు తెచ్చి నిలిపాడు. ఆ సమయంలో రాముడు బాగా అలిసిపోయి, రావణుడితో యుద్ధం



చేసే శక్తిలేని స్థితిలో వున్నాడు. రామ, రావణ యుద్ధం చూడవచ్చిన దేవతలతో పాటు వున్న అగస్త్యమహర్షి అది గమనించాడు. ఆయన త్రికాలజ్ఞుడు. ఆయన రాముడి వద్దకు వచ్చి, "రామా, నీ అలసట పోయేందుకూ, తిరిగి నీలో యుద్ధోత్సాహం కలిగేందుకూ, నీకు అదిత్యహృదయం అనే స్తోత్రం చెబుతాను. అది సర్వ స్తోత్రాలలోనూ ఉత్తమమైనది. దానిని జపించి, తిరిగి శక్తివంతుడవై రావణునితో యుద్ధం చెయ్యి,'' అని రాముడికి అదిత్య హృదయం బోధించి, వెళ్లిపోయాడు.

రాముడు ఆ స్తోత్రాన్ని మూడుసార్లు జపించి, ఇనుమడించిన బలోత్సాహాలతో విల్లంబులు చేతబట్టి, రావణునితో యుద్ధం చేసేందుకు ముందుకు వచ్చాడు.

రాముడు రథసారథి అయిన మాతలితో, "మాతలీ! ఇప్పుడు రావణుణ్ణి నిశ్చయంగా చంపబోతున్నాను. నువ్వు రథాన్ని ఎంతో ఒడుపుగా, చాకచక్యంతో నడపవలసి వుంటుంది. దేవేంద్రుడి రథసారథివయిన నీకు యింతగా చెప్పవలసిన అవసరం లేదని నాకు తెలుసు. అయినా, నువ్వేమాత్రం ఏమరుపాటూ, అజాగ్రత్తా లేకుండా రథం నడపటం అవసరం అని, యిలా హెచ్చరిస్తున్నాను,'' అన్నాడు.

మాతలి రథాశ్వాలను గట్టిగా అదిలించి, రథం వేగంగా కదిలేటప్పుడు రేగిన దుమ్ము, రావణుణ్ణి చుట్టుముట్టేలా చేశాడు. రావణుడు యిది చూసి కోపోద్రిక్తుడై, రాముడి మీద బాణవర్షం కురిపించాడు. రాముడు తనకు ఇంద్రుడు పంపిన విల్లూ, బాణాలూ తీసుకుని రావణుడితో యుద్ధానికి ఉపక్రమించాడు.

రామ, రావణుల మధ్య యుద్ధం అతి భయంకరంగా సాగింది. రెండు శత్రు పక్షాల వీరులూ యుద్ధం మాని, వాళ్ళ ద్వంద్వ యుద్ధాన్ని భయాశ్చర్యాలతో చూడసాగారు. రాముడూ, రావణుడూ కూడా యిదే తమ అంతిమ పోరాటం అన్నంత తీవ్రంగా యుద్ధం చేశారు.



ఆశ్చర్యం కలిగింది. లోగడ తాను దండకారణ్యంలో విరాధుణ్ణీ, క్రౌంచారణ్యంలో కబంధుణ్ణీ వధించేందుకు ఉపయోగించిన బాణాలు రావణుడి పట్ల ఎందుకు వృధా అవుతున్నవో అతడికి అర్థంకాలేదు.

రామ రావణులు యీ విధంగా ఒక్క క్షణమైనా విశ్రాంతి లేకుండా ఏడు పగళ్ళూ, ఏడు రాత్రులూ యుద్ధం చేశారు. రాముడి బాణాలు రావణుడి మీద ఎందుకు వ్యర్థమవుతున్నవో మాతలికి తెలుసు. కారణం, రావణుడి మరణ కాలం యింకా సమీపించలేదు.

ఎనిమిదవనాడు రావణుడి అంత్య కాలం సమీపించిందని తెలియగానే మాతలి, రాముడితో, "రామా, యిదే మంచి సమయం. ఇక తాత్సారం చేయక, యీ దుష్ట రావణుడి పైన బ్రహ్మాస్త్రం ప్రయోగించి, వధించు," అన్నాడు.

మాతలి యిలా హెచ్చరించగానే రాముడు, భయంకర సర్పంలాటి బాణాన్నొకదాన్ని చేతికి తీసుకున్నాడు. దేదీప్యమానంగా వెలిగిపోతున్న ఆ బాణాన్ని బ్రహ్మ ఒకప్పుడు ఇంద్రుడి కోసం సృష్టించాడు. అది చాలా బరువైనది, పెద్ద పెద్ద రెక్కలు గలది, వజ్రంలాగా అతి కఠినమైన ఆయుధాలను సహితం ఛేదించ

ఇలా కొద్దిసేపు యుద్ధం జరిగాక రాముడు ప్రయోగించిన అతి తీక్షణమైన బాణం దెబ్బకు, రావణుడి శిరస్సు తెగి నేలమీద పడింది. కాని, అదే క్షణంలో రావణుడికి మరొక శిరస్సు పుట్టుకొచ్చింది. రాముడు మరొక వాడి బాణంతో ఆ శిరస్సును కూడా ఖండించాడు. అది నేలబడే లోపుగా రావణుడికి మరొక శిరస్సు మొలిచింది.

రాముడు ఈ విధంగా నూట ఒక్క సార్లు రావణుడి శిరస్సు ఖండించాడు. కాని, ప్రతిసారీ రావణుడికి మరొక శిరస్సు మొలవటంతో, అతడు మరణించ లేదు. ఇది చూసి రాముడికి చాలా

గలది. రాముడు ఆ సర్వశక్తిమంతమైన మహాస్త్రాన్ని, వేదోక్తంగా మంత్రించి, ఎక్కుపెట్టి, రావణుడిపైన వేశాడు. అది రావణుడి రొమ్మును ఛేదించి, అతడి వీపులోంచి దూసుకుపోయి బయిటికి వచ్చింది. రావణుడు తన చేతగల ధనుర్బాణాలను జారవిడిచి, ప్రాణాలు పోగా, రథం మీదినుంచి నేలమీద పడ్డాడు.

తమ రాజు మరణించటం చూస్తూనే రాక్షసులు గుండెలవిసి, హాహాకారాలు చేస్తూ లంకానగరం కేసి పారిపోసాగారు. వానరులు విజయధ్వానాలు చేస్తూ, పెకలించిన వృక్షాలూ, యితర ఆయుధాలూ పట్టుకుని, వాళ్ళను వెంటదగిలి, అందిన వారిని అందినట్టు చంపసాగారు.

రావణుడు చావగానే దేవదుందుభులు మోగాయి. ఆకాశం నుంచి పుష్పవర్షం కురిసింది. వానరులతోపాటు ఆకాశంలోని దేవతలూ, గంధర్వులూ, చారణులూ రాముణ్ణి గొప్పగా స్తుతించారు. సుగ్రీవుడూ, అంగదుడూ చాలా ఆనందపడ్డారు. విభీషణుడూ, వానర ముఖ్యులూ రామలక్ష్మణులను ప్రశంసించారు.

విభీషణుడికి తన అన్న మరణం చాలా దుఃఖం కలిగించింది. సీతను అపహరించి తెచ్చి దుర్మరణం పాలయాడే గాని, అతను నిజంగా మహాపురుషుడని



చెప్పదగినవాడు. గొప్ప తపశ్శాలి, పండితుడు, నిష్ఠాపరుడు, అసమాన శౌర్య పరాక్రమవంతుడు!

అన్న మరణించినందుకు యిలా దుఃఖ వివశుడైన విభీషణుణ్ణి, రాముడు ఓదార్చుతూ. "రావణుడు పిరికివాడులా మరణించలేదు; వీరుడులాగా పోరాడుతూ యుద్ధరంగంలో మరణించాడు. ఎంత మహావీరుడైనా యుద్ధంలో శత్రువు చేత హతుడు కావచ్చు. వీరుడిలా మరణించి, వీరస్వర్గం చేరిన వాడికోసం శోకించ కూడదు." అన్నాడు

తరవాత రాముడి అనుమతి తీసుకుని విభీషణుడు, తన అన్నకు శాస్త్రోక్తంగా

దహనక్రియలు జరిపేందుకు ఏర్పాట్లు చేయసాగాడు.

రావణుడి మరణవార్త తెలియగానే అతని భార్యలు అంతఃపురం నుంచి బయలుదేరి, ఉత్తర ద్వారంగుండా యుద్ధభూమికి వచ్చి, అక్కడ రావణుడి శవాన్ని చూసి, దానిపైనపడి గుండెలు అవిసేలా విలపించారు. విభీషణుడు చెప్పినట్టు సీతను, రాముడికి యిచ్చి వున్నట్టయితే, ఈ విపత్తు సంభవించేది కాదని ఆక్రోశించారు. "మూడు లోకాలనూ జయించి, దేవతలంతటి వారిచేత ఊడిగం చేయించుకున్న నీవు, చివరకు ఒక మానవమాత్రుడి చేతిలో ప్రాణాలు కోల్పోయావా?" అంటూ మండోదరి విలపించింది.

రాముడు, విభీషణుణ్ణి దగ్గిరకు పిలిచి, "విభీషణా, యీ శోకించే స్త్రీలందరినీ వెంటనీ అంతఃపురానికి పంపి, త్వరగా నీ అన్నకు ఉత్తర క్రియలు చెయ్యి," అని చెప్పాడు.

ఆఖరిక్షణంలో విభీషణుడికి ఒక ధర్మ సందేహం కలిగింది. తన అన్న యితరత్రా ఎంత ధర్మపరుడూ, మహాజ్ఞానీ అయినా, పర స్త్రీని చెరబట్టి తీసుకురావటంతో, పరమనీచుడూ, దుష్టుడూ అయిపోయాడు. అలాంటి వాడికి తాను అగ్నిసంస్కారం లాంటి కర్మలు చేయటం ధర్మవిహిత మైన కార్యం అవుతుందా?

ఈ సందేహాన్ని విభీషణుడు రాముడికి వెల్లడించినప్పుడు రాముడు, రావణుడి యితర గుణగణాలను ప్రశంసించి, "నీ అన్నకు నీ చేతి మీదుగా ఉత్తరక్రియలు జరపటం పూర్తిగా ధర్మ సమ్మతం," అన్నాడు.

బ్రాహ్మణులు చందనపు చెక్కలతో చితిపేర్చి, దానిపైన ఒక గొంగళీ పరిచి, రావణుడి శవాన్ని అలంకరించి, దానిపైన పడుకోబెట్టారు. విభీషణుడు చితికి నిప్పు పెట్టాడు. తరవాత అతడు స్నానం చేసి, నీళ్ళు వదిలి, రావణుడి భార్యలను లంకకు పంపి, రాముడి దగ్గిరకు వచ్చాడు.





# వీర హనుమాన్

రామరావణ యుద్ధం చూడవచ్చిన దేవతలూ, గంధర్వులూ రాముడి పరాక్రమం గురించీ, వానరులు చేసిన భయంకర యుద్ధం గురించీ మాట్లాడుకుంటూ, తమతమ ప్రదేశాలకు వెళ్ళిపోయారు.

రాముడు, మాతలిని గౌరవించి, అతణ్ణి ఇంద్రుడి రథంతోసహా స్వర్గానికి పంపేశాడు. తరవాత లక్ష్మణుణ్ణీ, సుగ్రీవుణ్ణీ వెంటబెట్టుకుని తన శిబిరానికి వెళ్ళాడు. అక్కడ లక్ష్మణుడితో, ''లక్ష్మణా! మనం యిప్పుడు విభీషణుణ్ణి లంకారాజ్యాభిషిక్తుణ్ణి చెయ్యాలి. అందుకవసరం అయిన ఏర్పాట్లు త్వరగా చేయించు,'' అన్నాడు.

లక్ష్మణుడు, వానరులకు సువర్ణకలశాలిచ్చి, వాళ్ళచేత సముద్రజలం తెప్పించాడు. అతను స్వయంగా విభీషణుణ్ణి తీసుకుపోయి సింహాసనం మీద కూర్చోబెట్టి, జలంతో అభిషేకించాడు. విభీషణుడి మంత్రులూ, అతనిపట్ల భక్తిగల రాక్షసులూ జయజయధ్వానాలు చేశారు. ఆ సమయంలో విభీషణుడు తాను పరిపాలించనున్న రాక్షసుల భయం పోగొట్టి, యిక నుంచి లంకానగరం సుఖశాంతులతో తులతూగగలదని వాగ్దానం చేశాడు. రాక్షసపౌరులు అతడికి కానుకలు సమర్పించారు. విభీషణుడు కృతజ్ఞతా సూచకంగా రామలక్ష్మణులకు దివ్యమైన అనేక వస్తువులను కానుకలుగా యిచ్చాడు.

**36. విభీషణ పట్టాభిషేకం**



విభీషణుడు తన కోరిక ఈడేరినందుకు కృతజ్ఞతా భావంతో ఇచ్చిన కానుకల మీద ఏ మాత్రమూ మనసులేకపోయి నప్పటికీ రాముడు విభీషణుడి తృప్తి కోసం వాటన్నిటినీ స్వీకరించాడు.

తరవాత రాముడు తన సమీపంలో చేతులు జోడించి, మహా పర్వతంలాగా నిలబడి ఉన్న హనుమంతుడితో, "రాక్షస రాజైన ఈ విభీషణుడి అనుమతితో నువు లంకానగరానికి వెళ్ళి, రావణుడి ఇంట ఉన్న సీతకు విజయాభి వందనం తెలిపి, నా చేత రావణుడు చచ్చాడనీ, నేను లక్ష్మణ సుగ్రీవుల వెంట ఉన్నాననీ చెప్పు. ఈ శుభవార్త ఆమెకు చెప్పి, ఆమె సంగతి సమాచారం తెలుసుకుని తిరిగిరా," అన్నాడు.

ఆ ప్రకారమే హనుమంతుడు దారి పొడుగునా రాక్షసుల మర్యాదలు అందు కుంటూ లంకానగరం ప్రవేశించాడు. అతను రావణుడి మందిర ప్రాంగణానికి వెళ్ళి, ఒక చెట్టు కింద రాక్షస స్త్రీల నడుమ విచారంగా కూర్చుని ఉన్న సీతను చూశాడు.

అతను దగ్గిరికి వచ్చి, తన పేరు చెప్పుకుని నమస్కారం చేసి, చేతులు కట్టుకుని నిలబడగానే సీత ముందు గుర్తుపట్టలేదుగాని, తరవాత జ్ఞాపకం వచ్చి, ఆనందం చెందింది. ఆమెలో మార్పు గమనించి హనుమంతుడు, రాముడు చెప్పమన్న మాటలు ఇలా చెప్పాడు:

"సీతాదేవీ, రాముడు క్షేమంగా ఉన్నాడు. అతను విభీషణ, సుగ్రీవుల వెంట వానరసేన మధ్య ఉన్నాడు. తాను శత్రువును వధించి, తన ఆశయం నెరవేర్చుకుని క్షేమంగా ఉన్నానని నీతో చెప్పమన్నాడు. రాముడు రావణుణ్ణి చంపటానికి విభీషణుడి సహాయమూ, వానర వీరుల పరాక్రమమూ, లక్ష్మణుడి నీతిబలమూ తోడ్పడ్డాయి. రాముడు నీ క్షేమం అడిగి, నీతో ఇలా చెప్పమన్నాడు:

'నీకు శుభవార్త చెప్పి, సంతోషం కలిగిస్తాను. పాతివ్రత్య ధర్మం తెలిసిన నువు నా అదృష్టంకొద్దీ ప్రాణాలతో ఉన్నావు. నా పరాక్రమం వల్ల విజయం కలిగింది గనక, ఇక నువు నిశ్చింతగా ఉండు. విచారం మాను. రావణుడు చచ్చాడు. లంకానగరం మన వశమయింది. నేను దృఢనిశ్చయంతో సముద్రానికి సేతువు గట్టి, రావణుణ్ణి చంపుతానన్న శపథం నిలబెట్టుకున్నాను. లంక ఇప్పుడు విభీషణుడి అధీనంలో ఉన్నది. నువు రావణుడి ఇంట ఉన్నందుకు భయపడే పనిలేదు. అది ఇప్పుడు నీ ఇల్లే. నిన్ను చూడటానికి విభీషణుడు రాబోతున్నాడు.' "

ఈ మాటలు విని సీత ఆనందాతిరేకంతో లేచి నిలబడింది, కాని ఏమీ జవాబు చెప్పలేకపోయింది.

అది చూసి హనుమంతుడు, "దేవీ, ఏమిటి ఆలోచిస్తున్నావు? నే నన్నదానికి ఏమీ జవాబు చెప్పవేం?" అని అడిగాడు.

సీత వణుకుతున్న గొంతుతో, "నా భర్త విజయవార్త నీ నోట విని, ఆనందం పట్టలేక నాకు నోట మాట రాలేదు. ఇలాటి ప్రియవార్త తెచ్చినందుకు నిన్ను అభినందించటానికి, ఎంత ఆలోచించినా, మాటలు తట్టటం లేదు. పోనీ నీకు



బహుమానం ఇద్దామంటే అందుకు తగిన వస్తువు మూడు లోకాలలోనూ కనబడదు," అన్నది.

హనుమంతుడు ఆమెకు నమస్కరించి, "ఈ మాట మరొకరు అనలేరు. నీ భర్త విజయం కోరిన నీకే చెల్లింది! నీ మాటలే నాకు ఉత్తమోత్తమమైన బహుమానం. రావణుణ్ణి చంపిన రాముణ్ణి చూస్తేనే నాకు ఇంద్రపదవి లభించినంత సంతోషం కలిగింది," అన్నాడు.

సీత కూడా హనుమంతుణ్ణి ప్రశంసించింది. హనుమంతుడు ఆమెతో, "నువు ఒప్పుకుంటే, నిన్ను క్రూరంగా చూసిన రాక్షసస్త్రీల నందరినీ చంపెయ్యాలని



నాకు కోరికగా ఉన్నది,'' అన్నాడు. తలుచుకున్న కొద్దీ అతనికి ఆ రాక్షస స్త్రీలను అప్పటికప్పుడే చిత్రవధ చెయ్యాలని ఉన్నది.

సీత ఆ సంగతి గ్రహించి హనుమంతుడితో, ''ఈ రాక్షస స్త్రీలు రావణుడి దాసీలు. రాజును సేవించుకుని బతికే వాళ్ళు, రాజాజ్ఞ పాలించాలిగద! అలా చెయ్యకపోతే వాళ్ళు శిక్ష పొందరా? అందుచేత వారి మీద కోపగించటం అక్రమం. నా గ్రహచారం బాగులేకనూ, నేను పూర్వజన్మలో చేసుకున్న పాపాలకు ఫలితంగానూ కష్టాలు అనుభవించాననుకోవాలి. అందుచేత నాకు ఈ రాక్షస స్త్రీల మీద ఎలాటి కోపమూ లేదు. రావణుడు చచ్చాడు గనక వీళ్ళు నన్ను ఇప్పుడేమీ చేయలేరు. ఈ రాక్షసస్త్రీలు తమ దుర్బుద్ధి కొద్దీ నన్ను బాధించారే అనుకున్నా వారిని శిక్షించటం యుక్తం కాదు,'' అన్నది.

హనుమంతుడు సీత మాటలను మెచ్చుకుని, ''నువు అన్నివిధాలా రాముడికి తగిన భార్యవు. అతనికి ఏం చెప్పమంటావో చెప్పి, నన్ను పంపించు,'' అన్నాడు.

''నాకు నా భర్త అయిన రాముణ్ణి చూడాలని ఉన్నది,'' అన్నది సీత.

ఆ సందేశం తీసుకుని హనుమంతుడు అతి వేగంగా రాముడి వద్దకు వచ్చేశాడు. అతను రాముడితో, ''ఎవతె కోసం సేతువు కట్టి, ఇంత యుద్ధం చేశామో, ఆ సీతను చూశాను. ఆమె నన్ను గుర్తించింది. మనకు విజయం లభించిందంటే చాలా సంతోషించింది. రావణాసురుణ్ణి చంపిన రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ చూడాలని ఉన్నదని చెప్పింది,'' అన్నాడు.

ఈ మాట విని రాముడు కంట తడిపెట్టి, ''అంతకాలం రావణుడి ఇంట ఉండిన సీతను స్వీకరించానంటే లోకం ఆడిపోస్తుంది; నిర్దోషి అయిన సీతను త్యజించానంటే పాపం చుట్టుకుంటుంది. ఏం చేసేటట్టు?'' అన్నాడు.

అతను వేడి నిట్టూర్పులు విడుస్తూ, సమీపంలోనే ఉన్న విభీషణుడితో, "నువు సీత చేత అభ్యంగన స్నానం చేయించి, శరీరమంతా మంచి పూతలు పూయించి, చక్కగా నగలతో అలంకరించి వెంటనే ఇక్కడికి తీసుకురా," అన్నాడు.

విభీషణుడు వెంటనే లంకానగరానికి వెళ్ళి, తన అంతఃపురస్త్రీల చేత సీతకు కబురు చేయించి, ఆమెను చక్కగా స్నానం చేసి, అలంకరించుకుని రమ్మనీ, ఆమెను ఆమె భర్త చూడగోరుతున్నాడనీ చెప్పించాడు.

తాను తన భర్తను ఉన్నపాళంగానే చూడగోరుతున్నానని సీత విభీషణుడికి తెలిపింది. అలా కాదు, రాముడు కోరినట్టుగానే చెయ్యాలన్నాడు విభీషణుడు. సీత అందుకు సరేనన్నది.

విభీషణుడు సీత చేత తలంటి స్నానం చేయించి, శరీరానికి అంగరాగాలు పూయించి, సమస్తమైన ఆభరణాలతో అలంకరించి, దివ్యమైన బట్టలు కట్టించి, పల్లకీలో ఎక్కించి, అనేకమంది రాక్షసులను ఆమెకు తోడు ఇచ్చి, రాముడి వద్దకు చేర్చాడు.

విభీషణుడు రాముడితో, "సీతను తెచ్చాను," అని చెప్పినప్పుడు రాముడు, ఆ సంగతి ముందుగా తెలిసి కూడా



విచారంగా కూర్చుని ఉన్నాడు. అతన్ని ఒకేసారి మూడు భావాలు పట్టి పీడించాయి; ఇంత కాలానికి సీత మళ్ళీ కనిపిస్తున్నదన్న సంతోషమూ, ఆమెను ఎలా విసర్జించటమా అన్న విచారమూ, అంతకాలం రాక్షసుడి ఇంట ఉన్న దాన్ని ఎలా ఏలుకోవటమా అన్న రోషమూనూ!

రాముడు కొంచెం ఆలోచించి, విభీషణుడితో, "సీతను నా ఎదటకి తీసుకురా!" అన్నాడు.

విభీషణుడు వేత్రహస్తుల చేత అక్కడ మూగి ఉన్న వానర, భల్లూకాలను దూరంగా తోలించాడు. రాముడది చూసి, వాళ్ళను తరమవద్దని వారించి, "వీళ్ళు



పరాయివాళ్లు కారు, నా వాళ్లే. ఎందుకిలా మందలను తోలినట్టు తోలిస్తున్నావు? సీతను వీళ్లు కూడా చూడనీ! తప్పేమిటి?" అన్నాడు.

విభీషణుడు పశ్చాత్తాపపడుతూ, సీతను రాముడి వద్దకు తెచ్చాడు.

రాముడి మాటలు వింటున్న లక్ష్మణుడికీ, సుగ్రీవుడికీ, అతనిలో సీత మీద ప్రేమ అన్నది ఉన్నట్టు తోచక, బాధ కలిగింది. రాముడి వాలకం చూస్తుంటే వారికి భయంకరంగా తోచింది.

సీత సిగ్గుతో ముడుచుకుపోతూ విభీషణుడి వెంట రాముడి ఎదటికి వచ్చింది. అంతమంది మధ్య ఉండటం చేత ఆమె చెంగు ముఖానికి అడ్డం పెట్టుకుని, "ఆర్యపుత్రా!" అని ఏడవ నారంభించింది. అదేసమయంలో ఆమెకు, ఇంతకాలానికి తిరిగి తన భర్త కనిపించాడన్న సంతోషం కూడా కలిగింది. ఆమె దుఃఖం క్రమంగా ఉపశమించింది.

రాముడికి మాత్రం సీతను చూడగానే కోపం పుట్టుకొచ్చింది. అతను ఇలా అన్నాడు: "సీతా, యుద్ధంలో శత్రువును వధించి, నిన్ను విడిపించి, నా పౌరుషం నిరూపించుకున్నాను. శత్రువు పొగరు అణచి, అతను నాకు చేసిన అవమానానికి ప్రతిక్రియ చేశాను. నా ప్రయత్నం నెరవేరింది. నా శపథం నుంచి నాకు విముక్తి లభించింది. రావణుడు నిన్ను ఎత్తుకుపోయిన కారణం చేత నాకు కలిగిన అవమానాన్ని కడిగేసుకున్నాను. హనుమంతుడు సముద్రాన్ని దాటటమూ, లంకను దహించటమూ, ఇంకా అతను చేసిన అనేక ఘనకార్యాలు ఇప్పుడు సఫలమయాయి. అలాగే యుద్ధంలో సుగ్రీవుడు నాకు చేసిన సహాయం సఫలమయింది. నన్నే నమ్ముకుని, నాతో చేరిన విభీషణుడి శ్రమ కూడా సఫలమయింది."

రాముడు తనను గురించి ఒక్కమాట అనకపోవటం చూసి సీతకు దుఃఖం ఆగ

లేదు. ఆమె దుఃఖం చూసినకొద్దీ రాముడికి కోపం హెచ్చిపోయింది. అతను ముఖం చిట్లించి, "సీతా, అవమానానికి గురి అయినవాడు చేయదగినదంతా చేశాను. కాని ఇదంతా నేను నీ కోసం చేయలేదని గ్రహించు. సదాచారం రీత్యా నువు నాకు విరుద్ధమైన మనిషివి. అందుచేత నేను అనుమతిస్తున్నాను, నువు నీ యిష్టం వచ్చిన చోటికి వెళ్ళవచ్చు. నాకు నువు అవసరం లేదు. చాలా కాలం పర పురుషుడి ఇంట ఉన్న స్త్రీని పరాక్రమమూ, అభిమానమూ గలవాడు ఎలా స్వీకరిస్తాడు? నువు రావణుడి ఒడినుంచి దిగి వచ్చిన దానవు! రావణుడి కళ్ళను నీ అందంతో ఆనందింప చేసిన దానవు! గొప్ప వంశంలో పుట్టి, ఆ వంశానికి కీర్తి తీసుకురావలసిన నేను నిన్ను ఎలా ఏలుకోగలను? నాకు నీ మీద భ్రమ ఏమీ లేదు. నీ యిష్టం వచ్చిన చోటికి నువు వెళ్ళవచ్చు. నేనీమాట బాగా ఆలోచించి మరీ చెబుతున్నాను. కావాలంటే నీ జరుగుబాటు కోసం లక్ష్మణుడి దగ్గిర ఉండు, లేదా భరతుడి దగ్గిర ఉండు. సుగ్రీవుడి వద్ద గాని, విభీషణుడి వద్దగాని ఉండు. నీకు ఎక్కడ సుఖంగా ఉంటుందని తోస్తే అక్కడే ఉండు. నువు మహా అందమైనదానివి! కుదురైన శరీరం గలదానివి! నీ వంటిది అసహాయురాలుగా తన ఇంట ఉంటే, మహాబలుడైన రావణుడు మన్మదబాధ సహిస్తూ, నిన్నేమీ చేయకుండా ఉంటాడని నేను అనుకోలేను," అన్నాడు మహా పరుషంగా.

ఎన్నడూ అలాటి మాటలు అనిపించుకోని సీత, ఎవరూ వినదగని మాటలు రాముడి నోట రావటమూ; తాను ఇంత కాలమూ యమచెర అనుభవించి, ప్రియమైన మాటలు చెవిన పడతాయని ఎంతో ఆశించే సమయంలో ఇలాటి మాటలు వినపడటమూ చూసి, కత్తితో నరికిన లతలాగా కంపించిపోయి, కన్నీరు కార్చసాగింది.






రాముడు సీతతో కోపంకొద్దీ ఇంత పరుషంగా మాట్లాడేసరికి, వింటున్న వాళ్ళకు భయమూ, జలదరింపూ కలిగాయి. ఎన్నడూ ఇలాటి మాటలు పడి ఎరగని సీత వంచిన తలను మరింతగా వంచుకుని, అంతమంది మధ్య జరిగిన అవమానానికి కన్నీరు కార్చింది.

ఆమె కన్నీరు తుడుచుకుంటూ డగ్గుత్తికతో, "వీరుడా, ఎందుకు ఇలాటి మాటలు అంటున్నావు? అవి అజ్ఞాని అయినవాడు తనకు తెలియనిదాన్ని గురించి మాట్లాడే మాటలు. నేను వినటానికి యోగ్యమైనవి కావు. నువు అనుకుంటున్నట్టు నేను చెడిపోలేదు. కావలిస్తే తగిన పరీక్ష ఏదైనా పెట్టు. స్త్రీలలో చెడ్డ వాళ్ళు ఉన్నారుగదా అని స్త్రీలందరినీ చెడ్డవాళ్ళుగా భావించకు. నా స్వభావం నీకు బాగా తెలిసి ఉన్నట్టయితే నా మీద అనుమానం విడిచిపెట్టు. రావణుడు నన్నెత్తుకుపోయినప్పుడు వాడి శరీరం నాకు తగిలితే అది నా అసహాయతవల్ల జరిగినది కాబట్టి ఆ తప్పు దైవానిది, నాది కాదు. నా అధీనంలో ఉండిన నా మనసు మాత్రం నీ మీదనే ఉన్నది. ఇంతకాలం కలిసి ఉన్న తరవాత నా స్వభావం నీకు తెలియకపోతే, నీకు అది మరి ఏ విధంగానూ తెలిసే అవకాశం లేదు. నన్ను విడిచిపెట్టదలచినవాడివైతే నన్ను వెదకటానికి హనుమంతుణ్ణి ఎందుకు పంపావు? నన్ను విడిచి

37. సీత అగ్నిప్రవేశం



పెట్టినట్టు ఆ హనుమంతుడి ద్వారా కబురు చేసినా, హనుమంతుడు చూస్తూండగానే ప్రాణాలు విడిచి ఉండేదాన్ని. నీకు ఈ యుద్ధం చేసే అవసరం కూడా లేక పోను. నీ మిత్రులు ఇంతదూరం రావలసిన శ్రమ కూడా తప్పి ఉండును," అన్నది.

తరవాత ఆమె లక్ష్మణుడితో, "లక్ష్మణా, నా బాధకు విరుగుడుగా చితిని పేర్చు. అందులో పడి ప్రాణాలు విడుస్తాను. ఇంతమాట పడి బతికి ఉండటం నా కిష్టంలేదు. ఇంతమంది ఎదట నా భర్త నన్ను వదిలేస్తే అగ్ని ప్రవేశం తప్ప నాకు వేరే గతి ఏమున్నది?" అన్నది.

ఈ మాటకు ఎంతో నొచ్చుకుంటూ లక్ష్మణుడు రాముడి ముఖం కేసి చూశాడు. రాముడి వాలకం చూస్తే సీత అగ్నిప్రవేశం చెయ్యటం అతనికి అభ్యంతరం లేనట్టు కనబడింది. అందుచేత లక్ష్మణుడు సీత కోరిన ప్రకారం చితి పేర్చాడు.

చితి బాగా మండుతున్నది. తల వంచుకున్న రాముడి చుట్టూ ప్రదక్షిణం చేసి, సీత చితిని సమీపించింది. ఆమె చేతులు మోడ్చి, "నా మనసు రాముడి మీద తప్ప మరొక పురుషుడి మీదికి పోదన్న మాట నిజమైతే ఈ అగ్నిహోత్రుడు నన్ను కాపాడుగాక! సూర్యుడూ, వాయువూ, దిశలూ, చంద్రుడూ, పగలూ, రాత్రీ, ఉభయ సంధ్యలూ, భూమీ, ఇతర దేవతలూ నేను పతివ్రతనని ఒప్పుకున్న పక్షంలో అగ్నిహోత్రుడు నన్ను రక్షించుగాక!" అని, చితికి ప్రదక్షిణం చేసి, మండుతున్న చితిలో ప్రవేశించింది.

ఇది చూసి అక్కడ చేరిన వారందరూ హాహాకారాలు చేశారు. రాముడు కళ్ళ వెంట నీరు కార్చుతూ విచారంగా ఉండిపోయాడు.

అంతలోనే చితి చెల్లాచెదరైపోయింది. దానిలోనుంచి అగ్నిహోత్రుడు మనిషి

రూపంలో సీతను ఎత్తుకుని ఇవతలికి వచ్చాడు. సీత ముందులాగే నగలు ధరించి, ఎర్ర చీర కట్టుకుని, నొక్కులు నొక్కుల నల్లని జుట్టుతో, ఏ మాత్రమూ కందిపోకుండా ఉన్నది.

అగ్నిహోత్రుడు రాముడితో, "రాముడా, ఇదుగో నీ భార్య అయిన సీత! ఈమె ఏ పాపమూ ఎరగదు. ఈమె నిన్ను తప్ప మరొక పురుషుణ్ణి తలవలేదు. రావణుడు ఈమెను తన అంతఃపురంలో ఉంచి, భయంకర రాక్షస స్త్రీలను కాపుపెట్టి, ఎన్నో ఆశలు పెట్టాడు, ఎన్ని విధాలనో బెదిరించాడు. అయినా ఆమె రావణుణ్ణి తలచనేలేదు. ఈ సీతను పరిగ్రహించి ఏలుకో. ఇది నా ఆజ్ఞ!'' అన్నాడు.

అగ్ని ఇలా చెప్పినందుకు రాముడు చాలా తృప్తిపడ్డాడు; అలాటి దాన్ని అవమానించి, అగ్నిప్రవేశం చేయించినందుకు చాలా విచారించి, కన్నీరు కార్చాడు. అతను అగ్నిహోత్రుడితో ఇలా అన్నాడు: ''సీతలో ఏ పాపమూలేనిమాట నిజమే. అయితే ఆమె రావణుడి ఇంట చాలాకాలం ఉన్నది. నేను సీతను పరీక్షించకుండా స్వీకరించి ఉంటే, లోకులు, 'దశరథ మహారాజు కడుపున పుట్టిన ఈ రాముడు మూఢుడూ, కాముకుడూను! అంతేగాని ధర్మం తెలిసినవాడు కాడు.'




అని ఉందురు. అయితే మూడులోకాలకూ నిజం తెలియగలందులకు, సీత అగ్ని ప్రవేశం చేస్తూంటే చూస్తూ ఊరుకున్నాను. ఆమెకు నా యందే ప్రేమ అని తెలియక కాదు. మీ ఆజ్ఞ తప్పక శిరసావహిస్తాను,'' అన్నాడు.

ఆ సమయంలో స్వర్గం నుంచి దశరథుడు దివ్య విమానంలో అక్కడికి వచ్చాడు. ఆయనను చూసి రామ, లక్ష్మణులు నమస్కారం చేశారు. దశరథుడు తన ప్రియపుత్రుడైన రాముణ్ణి కౌగిలించుకుని ఇలా అన్నాడు:

''నాయనా, రామా! నిన్ను విడిచి ఉండటంచేత నాకు ఈ స్వర్గసుఖాలూ,



దేవర్షులు నాకు చూపించే గౌరవమూ ఆనందం కలిగించలేక పోయాయి. శత్రువులను చంపి, వనవాసదీక్ష పూర్తి చేసిన నిన్ను చూస్తే నాకు పరమానందగా ఉన్నది. నిన్ను అడవికి పంపమని కైకేయి కోరిన కోరిక ఇంకా నా మనస్సును వేధిస్తూనే ఉన్నది. రావణుణ్ణి నువు చంపటం కోసం దేవతలే నీ పట్టాభిషేకానికి విఘ్నం కలిగించారని నాకిప్పుడు తెలిసింది. నువు వనవాసం మాని ఇంటికి తిరిగి వెళ్ళగానే కౌసల్య సంతోషిస్తుంది. నువు వెళ్ళి పట్టాభిషేకం చేసుకో. రాజ్యపాలన చేస్తూ నీ తమ్ములతో సహా సుఖంగా ఉండు.''

రాముడు చేతులుజోడించి దశరథుడితో ఇలా అన్నాడు: ''నన్ను వనవాసానికి పంపమనే పక్షంలో కైకేయినీ, భరతుణ్ణీ విడిచిపెట్టుతానన్నావు. ఇప్పుడు వాళ్ళ మీద అనుగ్రహం చూపించు.''

దశరథుడు అందుకు ఒప్పుకుని, లక్ష్మణుణ్ణి కౌగలించుకుని, అతను రాముడికి చేసిన సేవలను ప్రశంసించాడు. తరవాత ఆయన సీతతో, ''రాముడు నిన్ను విడిచిపెట్టుతానన్నందుకు కోపగించుకోకు,'' అని చెప్పి, స్వర్గానికి తిరిగి వెళ్ళిపోయాడు.

తరవాత ఇంద్రుడు రాముడి ముందుకు వచ్చి, ఏదైనా వరం కోరుకోమన్నాడు. తన కోసం ప్రాణాలర్పించిన వానరులందరూ తిరిగి బతికేలాగు చెయ్యమని రాముడు ఇంద్రుణ్ణి కోరాడు. ఇంద్రుడు అందుకు సమ్మతించాడు. యుద్ధరంగంలో అవయవాలూ, తలలూ తెగి, చచ్చి పడి ఉన్న వానరులూ, భల్లూకాలూ చెక్కుచెదరకుండా బతికి లేవటం చూసి, బతికి ఉన్నవాళ్ళు ఆశ్చర్యపడ్డారు.

ఆ రాత్రి గడిచి తెల్లవారగానే విభీషణుడు రాముడి కోసం స్నానానికి పనికివచ్చే నీరూ, సుగంధలేపనాలూ, బట్టలూ తెచ్చి, రాముడి చేత స్నానం చేయించటానికి స్త్రీలను కూడా తెచ్చాడు.

రాముడు విభీషణుడితో, "సుగ్రీవుడు మొదలైన వానర వీరులను స్నానానికి పిలు. నేను వెంటనే అయోధ్యకు పోవాలి. పధ్నాలుగేళ్ళూ నిండిన మర్నాడు నేను కనిపించకపోతే అగ్నిప్రవేశం చేస్తానని శపథం చేసిన భరతుణ్ణి చూడటం కన్న నాకు ఈ స్నానం వగైరా ముఖ్యం కాదు," అన్నాడు.

దానికి విభీషణుడు, "రామా, నిన్ను ఒక్క రోజు లోపల అయోధ్యకు చేర్చ గలను. కుబేరుడి నుంచి రావణుడు బలాత్కారంగా సంగ్రహించిన పుష్పక విమానం ఉన్నది. నీకూ, సీతకూ, లక్ష్మణుడికీ నేను చేసే సత్కారాలన్నీ స్వీకరించమని నా ప్రార్థన," అన్నాడు.

దానికి రాముడు, "విభీషణా, నువు యుద్ధంలో నాకు సహాయపడటమే నాకు గొప్ప సత్కారం. నా కోసం చిత్రకూట పర్వతానికి వచ్చిన భరతుణ్ణి చూడాలని నా మనసు చాలా తొందరపడుతున్నది. అంతేగాక మా తల్లులైన కౌసల్యనూ, సుమిత్రనూ, కైకేయినీ, గురువులైన వసిష్ఠుడు మొదలైన వారినీ, స్నేహితులనూ, నగరవాసులనూ చూడాలని కూడా తొందరగా ఉన్నది. అందుచేత వెంటనే పుష్పక విమానం తెప్పించు. నేనిక్కడ ఒక్క క్షణం కూడా ఉండ



లేను. వెంటనే నేను వెళ్ళిపోవటానికి అనుజ్ఞ ఇయ్యి," అన్నాడు.

వెంటనే విభీషణుడు పుష్పక విమానాన్ని తీసుకు వచ్చాడు. పూలమాలలతో అలంకరించి ఉన్న ఆ విమానాన్ని రాముడికి చూపి, "ఇంక ఏమి సెలవు?" అని అడిగాడు.

"వానరులు చేసిన సహాయం ఇంతా, అంతా కాదు. వారికి బట్టలూ, నగలూ మొదలైనవి ఇచ్చి సత్కరించు. దేవతలకు లొంగని ఈ లంకానగరం వానరుల ధర్మమా అంటూ మనకు లొంగింది. వారి శ్రమకు తగిన ప్రతిఫలం చూపించు. వారికి నీ కృతజ్ఞత చూపితే వాళ్ళు



సంతోషిస్తారు,'' అని రాముడు విభీష ణుడికి చెప్పాడు.

విభీషణుడు ఆ ప్రకారమే వానర వీరుల నందరినీ సత్కరించాడు. తరవాత రాముడు సీతను వెంటబెట్టుకుని పుష్పక విమానం ఎక్కాడు. వాళ్ళ వెనకగా లక్ష్మణుడు కూడా ఎక్కాడు. తరవాత రాముడు వానరులతోనూ, సుగ్రీవ విభీష ణులతోనూ, ''మీరు నాకు కార్యసిద్ధి కలిగించారు. ఇక మీరు మీ ఇష్టం వచ్చిన చోటికి పోవచ్చునని నేను అనుమతిస్తున్నాను. సుగ్రీవుడా, నువు బంధువుగానూ, మిత్రుడుగానూ ఎంత చెయ్యవచ్చునో అంతా చేశావు. నువు నీ సేనలతో కిష్కింధకు తిరిగిపోయి, సుఖంగా ఉండు. విభీషణా, నేను నీ కిచ్చిన లంకా రాజ్యాన్ని సుఖంగా ఏలుకో. దేవతలు కూడా నిన్ను ఎదిరించ లేరు. నేనిక అయోధ్యకు పోతాను, మీరు అనుమతించండి,'' అన్నాడు.

అప్పుడు సుగ్రీవుడు మొదలైన వానరులూ, విభీషణుడూ రాముడితో, ''మాకు కూడా అయోధ్యకు రావాలని ఉన్నది. మమ్మల్ని కూడా తీసుకుపో. అక్కడి ప్రజలకు మా వల్ల ఏ బాధా లేకుండా అరణ్యంలోనూ, నగరంలోనూ సంచరిస్తాం. మేం నీ పట్టాభిషేకం చూసి, కౌసల్యాదేవికి నమస్కరించినాకనే మా ఇళ్ళకు పోతాం,'' అన్నారు.

''మీరంతా నా వెంట వస్తామంటే నాకు మరీ సంతోషం. సుగ్రీవా, నువూ, నీ వానరులూ వెంటనే పుష్పకంలోకి రండి. విభీషణా, నువూ, నీ మంత్రులూ కూడా రండి,'' అన్నాడు రాముడు.

సుగ్రీవుడి వెంబడి వానరులూ, విభీషణుడి వెంట అతని మంత్రులూ ఎక్కగానే పుష్పక విమానం ఆకాశం లోకి లేచింది. అది వాయువేగంతో ఆకాశంలో పోతూ ఉంటే, రాముడు సీతకు త్రికూట పర్వతం మీద ఉన్న లంకా నగరాన్ని, రక్తంతో తడిసిన

యుద్ధభూమినీ, తాను రావణుణ్ణి చంపిన స్థలాన్నీ, కుంభకర్ణుణ్ణి చంపిన స్థలాన్నీ, సముద్రాన్నీ, సేతువునూ, విభీషణుడు మొట్టమొదట తన వద్దకు వచ్చిన ప్రదేశాన్నీ, కిష్కింధా నగరాన్నీ, తాను వాలిని చంపిన స్థలాన్నీ చూపాడు.

సీత రాముడితో, "నేను అయోధ్య ప్రవేశించేటప్పుడు నా వెంట సుగ్రీవుడి భార్యలైన తార మొదలైన స్త్రీలనూ, ఇతర వానర ప్రముఖుల భార్యలనూ తీసుకుపోవాలని కోరుతున్నాను," అన్నది.

రాముడు పుష్పకాన్ని కిష్కింధలో ఆపి, సుగ్రీవుడితో, "మీ భార్యలందరూ తన వెంట అయోధ్యకు రావాలని సీత కోరుతున్నది. ఆ మాట మీ ఆడవారందరికీ చెప్పు," అన్నాడు.

సుగ్రీవుడు తార దగ్గిరికి పోయి, "నిన్నూ ఇతర వానర స్త్రీలనూ అయోధ్యకు తీసుకురమ్మని రాముడి ఆజ్ఞ. సీతాదేవి అలా కోరిందట. వెంటనే బయలుదేరండి," అన్నాడు.

తార ఆపాదమస్తకమూ అలంకరించుకుని, మిగిలిన వానర స్త్రీలతో, "మనమందరమూ అయోధ్యకు పోయి, అక్కడి విశేషాలు చూసి వద్దాం, బయలుదేరండి," అన్నది. వానర స్త్రీలు అలంకరించుకుని, సీతను చూడాలన్న కుతూహలంతో తార వెంట బయలుదేరి, పుష్పక విమానంలో ఎక్కారు. తిరిగి విమానం ఆకాశంలో ప్రయాణం సాగించింది. రాముడు సీతకు ఋశ్యమూక పర్వతాన్నీ, తాను సుగ్రీవుణ్ణి మొదట కలుసుకున్న స్థలాన్నీ, పంపాసరస్సునూ, సీతను పోగొట్టుకుని తాను ఏడ్చిన ప్రాంతాన్నీ, కబంధుణ్ణి చంపిన స్థలాన్నీ, ఇతర ప్రదేశాలనూ చూపాడు.

విమానం అత్రి మహర్షి ఆశ్రమం మీదుగానూ, గుహుడు ఉండే శృంగిబేరపురం మీదుగానూ, చిత్రకూటం మీదుగానూ, భరద్వాజాశ్రమం మీదుగానూ ఎగురుతూ, అయోధ్యానగరాన్ని చేరవచ్చింది.






రాముడు అయోధ్య విడిచి, వనవాసానికి బయలుదేరింది చైత్ర శుద్ధ పంచమినాడు. పధ్నాలుగేళ్లు చైత్రశుద్ధ చవితికి పూర్తి అయాయి. ఆ మర్నాడు అతను భరద్వాజాశ్రమం చేరాడు. అతను భరద్వాజుడికి నమస్కరించి, "స్వామీ, అయోధ్యానగరం సుభిక్షంగా ఉన్నదా? భరతుడు చక్కగా పరిపాలిస్తున్నాడా? మా తల్లులు సుఖంగా ఉన్నారా?" అని అడిగాడు.

దానికి భరద్వాజుడు, "భరతుడు దేహ సంస్కారం లేక, మట్టికొట్టుకుని, జుట్టు జడలు కట్టి, నీ పాదుకలు ముందుంచుకుని రాజ్యపాలన చేస్తున్నాడు. నీ రాకకోసం ఎదురు చూస్తున్నాడు. అంతా క్షేమంగానే ఉన్నారు," అని చెప్పాడు.

ఆయన రాముణ్ణి ఆ రోజు తన అతిథిగా ఉండి, మర్నాడు అయోధ్యకు వెళ్ళమని కోరాడు.

రాముడు ముందుగా హనుమంతుణ్ణి పంపదలచి, అతనితో, "నువు శృంగిబేర పురానికి వెళ్లి అక్కడి బోయరాజైన గుహుడితో, నేను శత్రువులను జయించి, క్షేమంగా తిరిగి వస్తున్న సంగతి చెప్పు. నాకు ఆప్తుడైన గుహుడు చాలా సంతోషిస్తాడు. అతను నీకు అయోధ్యకు దారి చెప్పి, భరతుడి విశేషాలు కూడా చెబుతాడు. తరవాత నువు భరతుణ్ణి కలుసుకుని, నా క్షేమం తెలిపి, నేను వనవాసం

**38. రామ పట్టాభిషేకం**



భరతుడికి రాజుగా ఉండాలన్న కోరిక ఉంటే, పోనీ అతన్నే పాలించనీ! నువు మాత్రం మేం ఎక్కువ దూరం ప్రయాణం చెయ్యకముందే తిరిగి రావాలి," అన్నాడు.

రాముడు ఇలా ఆజ్ఞాపించగా హనుమంతుడు మనుష్య రూపంలో ఆకాశ మార్గాన అయోధ్యకు వేగంగా బయలు దేరాడు. అతను శృంగిబేరపురం చేరి, గుహుణ్ణి కలుసుకుని, "రాముడు తన క్షేమం నీకు తెలుపమన్నాడు. అతను సీతా లక్ష్మణులతో సహా ఈ రాత్రికి భరద్వాజాశ్రమంలో ఉండి, రేపు ఉదయం బయలుదేరుతాడు. త్వరలోనే నువు అతన్ని చూడగలవు," అని అతనితో చెప్పి, తిరిగి ఆకాశ మార్గాన అతివేగంగా బయలుదేరి, నందిగ్రామం చేరబోయాడు.

నందిగ్రామం చుట్టూ ఉండే చెట్లు చాలా అందంగా, నందనోద్యానానికి సాటివచ్చేవిగా ఉంటాయి. అక్కడికి అయోధ్య రెండు ఘడియల ప్రయాణం. అక్కడ భరతుడు ఆశ్రమం నిర్మించుకుని, జింకతోళ్ళే బట్టలుగా ధరించి, పధ్నాలుగేళ్ళు నిండినా రాముడు ఇంకా రాలేదే అని విచారంగా ఉన్నాడు. అతను స్నానం లేక మట్టిగొట్టుకొని ఉన్నాడు. జుట్టు జడలు కట్టుకుపోయింది. అతను కేవలమూ కందమూల ఫలాలే తింటు

పూర్తిచేసి సీతా లక్ష్మణ సహితంగా వస్తున్నానని చెప్పు. నువు భరతుడితో సీతాపహరణం లగాయతు రావణ సంహారం వరకూ విపులీకరించి చెప్పి, అతని ముఖాన ఎలాటి భావాలు గోచరిస్తాయో శ్రద్ధగా గ్రహించు. నేను శత్రువుల నందరినీ జయించి, అంతు లేని కీర్తి సంపాదించి, మహా బలవంతులైన స్నేహితులతో వస్తున్నానంటే భరతుడి మనసులో ఎలాటి వికారాలు కలుగుతాయో నువు తెలుసుకుని రావాలి. తండ్రి తాతల రాజ్యాన్ని అనుభవిస్తున్న వాడికి దాన్ని విడిచిపెట్టటం చాలా కష్టం. చాలా కాలంగా రాజ్యపాలన చేస్తున్న

న్నాడు. ఆ స్థితిలోనే అతను మంత్రులనూ, పురోహితులనూ, సేనాధ్యక్షులనూ వెంట బెట్టుకుని రాజ్యం పాలిస్తున్నాడు. అతని కింద కొలువు చేస్తున్న వారందరూ కాషాయవస్త్రాలు ధరించి ఉన్నారు.

హనుమంతుడు భరతుణ్ణి చూసి, నమస్కరించి, ''రాముడు తన క్షేమం నీకు చెప్పమన్నాడు. నీ విచారం తొల గించే వార్త చెబుతాను. నువు త్వరలోనే రాముణ్ణి చూడగలవు. రాముడు రావణుణ్ణి చంపి, సీతను తిరిగి పొంది, కోరికలన్నీ తీరినవాడై, మహా బలవంతులైన మిత్రు లతో సహా వస్తున్నాడు. అతని వెంట సీతా, లక్ష్మణుడూ కూడా వస్తున్నారు.'' అని చెప్పాడు.

ఈ వార్త వినగానే భరతుడు సంతోషం పట్టలేక మూర్ఛపోయాడు. తరవాత మూర్ఛతేరి అతను హనుమంతుడితో, ''అయ్యా, నాకు ఇంత ప్రియమైన వార్త తెచ్చిన నువు మనిషివో, దేవతవో తెలియదు. నీకు బహుమానంగా లక్ష గోవులూ, నూరు గ్రామాలూ, సమస్త ఆభరణాలూ, పధ్నాలుగురు చక్కని కన్యలనూ ఇస్తాను,'' అన్నాడు.

అతను కోరినమీదట హనుమంతుడు, భరతుడు రామపాదుకలు తీసుకుని చిత్రకూటం నుంచి అయోధ్యకు తిరిగి



పోయిన అనంతరం జరిగిన విషయాలన్నీ చెప్పాడు.

భరతుడు అంతా విని పరమానంద భరితుడై, శత్రుఘ్నుడితో, ''పురుషు లందరూ చక్కగా స్నానం చేసి, పట్టణం లోని చతుష్పథ మంటపాలలో దేవతల నందరినీ సుగంధ పుష్పాలతోనూ, వాద్యాలతోనూ పూజించేటట్టు చూడు. రాముణ్ణి చూడటానికి వైతాళికులూ, వేశ్యలూ, బాజా భజంత్రీలతో గుంపులు, గుంపులుగా బయలుదేరాలి.'' అని ఆజ్ఞా పించాడు.

శత్రుఘ్నుడు అనేక వేలమంది సేవ కులను పిలిపించి, ''మీరు నందిగ్రామం



నుంచి అయోధ్య దాకా గల దారిని మిట్టపల్లాలు లేకుండా చదును చెయ్యండి. కొందరు దారి పొడుగునా మంచులాటి చల్లని నీరు చల్లి, పైన పూలు పరచండి. తెల్లవారే లోపల అయోధ్యలో వీధులన్నిటినీ, ఇళ్ళనన్నిటినీ అలంకరించాలి. విశాలమైన రాజమార్గం పొడుగునా పూల తోరణాలు కట్టి, పూలూ, గంధమూ చల్లి, అయిదు రంగుల చూర్ణాలతో ముగ్గులు పెట్టాలి,'' అని ఆజ్ఞాపించాడు.

రాణులూ, మంత్రులూ, సైనికులూ, వాళ్ళ భార్యలూ, బ్రాహ్మణులూ, క్షత్రియులూ, గణనాయకులూ, గణాలవారూ రాముణ్ణి చూడటానికి బయలుదేరారు. కొందరు ఏనుగులమీదా, కొందరు రథాల మీదా వెళ్ళారు. సైనికులు రకరకాల ఆయుధాలు పట్టుకుని నడిచారు. ధృష్టి, జయంతుడూ, విజయుడూ, సిద్ధార్థుడూ, అర్థసాధకుడూ, అశోకుడూ, మంత్రపాలుడూ, సుమంత్రుడూ అనే మంత్రులు బయలుదేరారు. దశరథుడి భార్యలు వాహనాలలో నందిగ్రామం చేరారు.

భరతుడు రామ పాదుకలు నెత్తిన పెట్టుకుని రాముడికి ఎదురు బయలు దేరాడు. అతని వెంట బ్రాహ్మణులూ, వర్తకులూ, పురప్రముఖులూ, దండలు చేతపట్టుకుని మంత్రులూ, స్తోత్ర పాఠకులూ బయలుదేరారు. భరతుడి వెంట రాజ చిహ్నలయిన ఛత్ర, చామరాలూ, బంగారు దండమూ వెళ్ళాయి.

ఎంతసేపటికీ రాముడు ఎదురు రాకపోయేసరికి భరతుడు హనుమంతుడితో, ''కోతిబుద్ధి కారణంగా రాముడు వస్తున్నాడని చెప్పావా ఏం? ఏడీ రాముడు? కనిపించడేం?'' అని అడిగాడు.

''భరద్వాజ మహాముని వానర సేనలకు బ్రహ్మాండమైన విందు చేశాడు. ఆయన ఆశ్రమంలో చెట్లన్నీ ఫలపుష్పాలతో నిండి, వానరులకు ఉత్సాహం కలిగించాయి. వాళ్ళ కోలాహలం వినిపిస్తున్నది. వాళ్ళు

ఇప్పుడు గోమతీ నదిని దాటుతున్నట్టు తోస్తున్నది. అదుగో పుష్పకం! దూరాన కనిపిస్తున్నది. ఒకప్పుడు కుబేరుడిదైన ఈ విమానం ఇప్పుడు రాముడి దయింది. అందులో రాముడితోబాటు సీతాదేవీ, లక్ష్మణుడూ, వానర రాజైన సుగ్రీవుడూ, రాక్షస రాజైన విభీషణుడూ ఉన్నారు,'' అని హనుమంతుడు భరతుడితో అన్నాడు.

వెంటనే, ''అడుగో, రాముడు! వస్తున్నాడు!'' అన్న కేకలు మిన్ను ముట్టాయి. రాముణ్ణి చూడటానికి వచ్చిన వారందరూ తమ తమ వాహనాల మీది నుంచి దిగి, నేలమీద నిలబడ్డారు.

రాముడు రానే వచ్చాడు. తన ఎదురుగా నిలబడిన రాముడికి నమస్కారం చేసి, భరతుడు, ''అన్నమాట తప్పకుండా మా అందరికీ శుభం కలిగే లాగు వచ్చావు," అని పొగడాడు.

రాముడు భరతుణ్ణి విమానంలో ఎక్కించుకుని, ఆనందంతో కౌగలించు కున్నాడు. భరతుడు లక్ష్మణుణ్ణి పరామర్శించి, సీతకు నమస్కారం చేశాడు. అతను వానర వీరులందరినీ కౌగలించు కున్నాడు. అతను సుగ్రీవుడితో, ''నువు మా నలుగురు అన్నదమ్ములకూ అయిదోవాడివి అయావు. ఉపకారం చేసినవాడు మిత్రుడవుతాడు,'' అని, విభీషణుడితో, ''నువు మాకు గొప్ప సహాయం చేశావు,'' అన్నాడు.

శత్రుఘ్నుడు రామ, లక్ష్మణులకు నమస్కారం చేసి, సీత పాదాలకు





వందనం చేశాడు. రాముడు తన తల్లిని చూడబోయి, ఆమె పాదాలకు నమస్కారం చేశాడు, తరవాత సుమిత్రకూ, కైకేయికీ, వసిష్ఠుడికీ నమస్కారం చేశాడు. పౌరులందరూ రాముడికి సంతోషంగా స్వాగతం పలికారు.

భరతుడు రాముడి పాదుకలను తన చేత్తోనే రాముడి కాళ్ళకు తగిలించాడు. అతను రాముడితో, "ఇన్నాళ్ళూ నేను చూస్తూ ఉండిన నీ రాజ్యాన్ని తిరిగి నీకు ఇచ్చేశాను. నువు మళ్ళీ అయోధ్యకు తిరిగి రావటం కళ్ళారా చూశానుగనక నా జన్మ సార్థకమయింది. నా కోరిక నెరవేరింది," అన్నాడు.

రాముడు విమానంతోనే నందిగ్రామం చేరాడు. అక్కడ అతను తన వెంటవున్న వారందరితోపాటు విమానం నుంచి దిగి, ఆ విమానాన్ని కుబేరుడి దగ్గిరికి వెళ్ళిపొమ్మన్నాడు.

రాముడి పట్టాభిషేకానికి ముహూర్తం నిర్ణయమయింది. రామ, లక్ష్మణ, భరతులు మంగళ్ళచేత క్షౌరం చేయించుకున్నారు. భరతుడూ, లక్ష్మణుడూ, సుగ్రీవుడూ, విభీషణుడూ, రాముడూ వరసగా మంగళ స్నానాలు చేశారు. రాముడు పుష్పమాలలు ధరించి, శరీరానికి చందనం పూయించుకుని, పచ్చని పట్టుబట్టలు కట్టుకుని సింహాసనం మీద కూర్చున్నాడు. శత్రుఘ్నుడు రామ, లక్ష్మణ, భరతులకు హారాలూ, కేయూరాలూ, ఇతర ఆభరణాలు తొడిగి అలంకరించాడు. దశరథుడి భార్యలు సీతను అలంకరించారు

సుమంత్రుడనే సారథి రాముడి కోసం రథం తెచ్చి, అందులో రాముణ్ణి ఎక్కించుకున్నాడు. సుగ్రీవుడూ, హనుమంతుడూ స్నానాలు చేసి, మంచి బట్టలూ, ఆభరణాలూ ధరించి, అయోధ్యకు బయలుదేరారు.

దశరథుడి మంత్రులు ముందుగానే అయోధ్యకు పోయి, వసిష్ఠుడితో సంప్ర

తించి, పట్టాభిషేక సన్నాహాలు చేయించారు.

రాముడు తనకు సుగ్రీవుడితో మైత్రీ, హనుమంతుడి ప్రభావమూ, యుద్ధంలో వానరులు చూపిన పరాక్రమమూ, విభీషణుడు తన పక్షం వచ్చెయ్యటమూ చెప్పితే, పౌరులు ఆశ్చర్యపోయారు. రాముడు దశరథుడి మందిరం ప్రవేశించాడు. రాముడి మందిరం, అంతఃపురోద్యానంతో సహా, సుగ్రీవుడికి విడిదిగా ఏర్పాటు చేయబడింది.

సుగ్రీవుడు నాలుగు బంగారు కలశాలను నలుగురు వానరోత్తములకిచ్చి, "రేపు తెల్లవారేసరికి, మీరు నాలుగు సముద్రాల జలంతోనూ సిద్ధంగా ఉండాలి," అని ఆజ్ఞాపించాడు.

జాంబవంతుడూ, హనుమంతుడూ, వేగదర్శీ, ఋషభుడూ కలశాలు తీసుకుని, అయిదు వందల నదుల జలాలు తెచ్చారు. నాలుగు సముద్ర జలాలు కూడా వచ్చేశాయి.

తరవాత శాస్త్రోక్తంగా రాముడి పట్టాభిషేకం జరిగింది. రాముణ్ణీ, సీతనూ రత్నఖచితమైన పీఠం మీద కూర్చోబెట్టారు. తరవాత ఋత్విజులూ, బ్రాహ్మణులూ, కన్యకలూ, పౌరులూ, యోధులూ ఒకరి తరవాత ఒకరు రాముణ్ణి అభిషేకించారు.

రాముడికి శత్రుఘ్నుడు తెల్లగొడుగు పట్టాడు. సుగ్రీవుడు వింజామర వీచాడు. విభీషణుడు మరొక వింజామర వీచాడు.

తన పట్టాభిషేక సందర్భంలో రాముడు బ్రాహ్మణులకు దూడలతో సహా గోవులనూ, బంగారాన్నీ, బట్టలనూ దానం చేశాడు. అతను సీతకు ఒక ముత్యాలహారం ఇచ్చి, వానరులలో తనకు ఎక్కువ అభిమానం గల వాడికి దాన్ని ఇయ్యమన్నాడు. సీత వెంటనే దాన్ని హనుమంతుడికి ఇచ్చింది. తరవాత రాముడు ఇతర వానరవీరులకు బహుమానాలిచ్చాడు.

విభీషణుడు లంకకు తిరిగి వెళ్ళాడు. తరవాత రాముడు భరతుణ్ణి యువరాజుగా చేసి, రాజ్యపాలన చేయసాగాడు.






రాముడు అయోధ్యలో అతివైభవంగా పట్టాభిషిక్తుడైన తరవాత స్వయంగా రాజ్యపాలన విషయాల్లో శ్రద్ధతీసుకో సాగాడు. అతను ఒకనాడు సుమంతుణ్ణి పిలిపించి, తనకు రాజ్యంలో ప్రజోపయోగకార్యాలు భారీ ఎత్తున చేయాలని వున్నదనీ, అందుకు అవసరం అయిన ధనం సమకూర్చమనీ చెప్పాడు.

"గడచిన పధ్నాలుగేళ్ళుగా ప్రజలు, తాము కట్టవలసిన కప్పాలు కట్టటం మానివేశారు, ప్రభూ!" అన్నాడు సుమంతుడు.

"సకాలంలో వర్షాలుపడక కరువు, కాటకాలు వచ్చి, ప్రజలు అవస్థల పాలయ్యారన్న మాట!" అన్నాడు రాముడు బాధగా.

సుమంతుడు ఒకక్షణకాలం సంశయిస్తూ వూరుకుని, "అలాంటి దేమీ లేదు, ప్రభూ! దేశం సస్యశ్యామలంగానే వున్నది. ప్రజలే మారిపోయారు. ధనికులైన వర్తకులు పన్నులు ఎగవేశారు; రైతులు కప్పాలు చెల్లించలేదు. సంపన్నులు మరికాస్త సంపన్నులయారు; పేదలు మరింతగా పేదలైపోయారు," అన్నాడు.

"ఇలా ఎందుకు జరిగింది? మరి భరతు డేం చేస్తున్నాడు?" అన్నాడు రాముడు చిరుకోపంగా.

"ప్రభూ, ఆయన రాజ్యపాలన చేసిం దెప్పుడు! తమ పాదుకలను పూజిస్తూనే పధ్నాలుగేళ్ళూ గడిపేశాడు. అతని

**39. రామరాజ్యంలో హనుమంతుడి ముచ్చట్లు**



అమాయకత్వాన్ని ఆసరాగా తీసుకుని, అతని ముందు తమ నామ సంకీర్తనం చేసి, చాలామంది బహుమానంగా ధనం పుచ్చుకుపోయారు. దేశపాలకుడుగా ఆయన కర్తవ్యాన్ని గుర్తుచేస్తే, 'పన్నులు కట్టని ప్రజలను ఎలాంటి బాధలకూ గురిచేయకండి. అందరూ మా అన్న గారైన శ్రీరాముని పౌరులేగదా!' అని మాత్రం చెప్పి వూరుకున్నాడు. నేను, ప్రభువైన వారి ఆజ్ఞను శిరసావహించవలసిన వాణ్ణేగద,'' అన్నాడు సుమంతుడు.

రాముడికి సంగతంతా అర్థమైపోయి, ''ఇంక నే నెలా రాజ్యపాలన చేసేది?'' అంటూండగా లక్ష్మణుడు వచ్చాడు.

సుమంతుడు, లక్ష్మణుడికి కూడా ధనాగారం వట్టిపోయిన సంగతి చెప్పాడు.

లక్ష్మణుడు కొంచెం సేపు ఆలోచించి, ''అయితే, నా మాట మన్నించి ఒక పని చేయండి. ప్రభుత్వానికి పన్ను చెల్లించవలసిన వారందరూ, తలా ఒక గుమ్మడికాయంత బంగారం యిచ్చుకుంటే చాలునని చాటింపువేయించండి. ఈ పద్ధతి వల్ల ప్రజలకు ఎలాంటి అన్యాయం జరగదని హామీ యిస్తున్నాను,'' అన్నాడు.

రాముడు యిందుకు అంగీకరించాడు. ఆ రోజునే కోసలదేశం అంతటా చాటింపు వేయబడింది. పధ్నాలుగేళ్ళుగా పన్నులు ఎగవేసిన దేశప్రజలు, గుమ్మడికాయంత బంగారంకాదు, ఏనుగు తలకాయంత బంగారం యివ్వమన్నా, యివ్వటానికి సిద్ధంగా వున్నారని లక్ష్మణుడికి తెలుసు. అయినా ఎందుకైనా మంచిదని లక్ష్మణుడు హనుమంతుణ్ణి పిలిచి, ''నీవు ప్రజల మధ్య రహస్యంగా తిరిగి, ఈ చాటింపు విషయమై, వాళ్ళేమైనా అసంతృప్తి చెందారేమో తెలుసుకురా,'' అని చెప్పాడు.

హనుమంతుడు సూక్ష్మరూపంతో ప్రజల మధ్యకు వెళ్ళి, వాళ్ళనుకునేదంతా విని తిరిగి వచ్చి, లక్ష్మణుడితో, ''గుమ్మడికాయంత బంగారం యివ్వటానికి ప్రజల్లో ఎవరికీ అభ్యంతరం

లేకపోగా, వాళ్ళు, భరతుడికన్న రాముడు యింకా అమాయకుడని మాట్లాడు కుంటున్నారు. ఇన్నేళ్ళుగా పన్నులు చెల్లించనందుకు, ఎన్నో గుమ్మడికాయల ఎత్తు బంగారం చెల్లించమని అననందుకు వాళ్ళు చాలా సంతోషిస్తున్నారు,'' అని చెప్పాడు.

ఇది విన్న మీదట లక్ష్మణుడికి ఒక సందేహం కలిగింది. ప్రజల్లో కొందరైనా నీతిమంతులు వుండకపోరు. అలాంటి వారికి అన్యాయం జరక్కూడదు. గుమ్మడి కాయంత బంగారంకన్న తక్కువ చెల్లించ వలసిన వారెవరైనా వుంటే, వాళ్ళు బాధపడకూడదు!

లక్ష్మణుడు యీ సమస్యకు పరిష్కారం ఏమిటా అని కొంచెంసేపు ఆలోచించి, ఒక ఉపాయం తోచగా, హనుమంతుణ్ణి వెంట బెట్టుకుని, అయోధ్యలోవున్న ధర్మ దేవతాలయానికి వెళ్ళాడు. ఆలయంలో కొంతసేపుండి లక్ష్మణుడూ, అతిసూక్ష్మ రూపంతో హనుమంతుడూ, చిన్నగా మాట్లాడుకుంటూ బయిటికి వచ్చారు. ఆ సమయానికి సూర్యాస్తమానమై, బాగా చీకటి పడిపోయింది.

ఉదయం అవుతూనే రాజభవన ప్రాంగణంలో పెద్ద త్రాసు ఒకటి వేలాడ కట్టారు. ఒక సిబ్బెలో మామూలు గుమ్మడి



కాయ వుంచారు. ప్రజలంతా బంగారం మూటలు కట్టుకుని అక్కడికి వచ్చారు. వాళ్ళల్లో ఒకడు ముందుగా తాను తెచ్చిన బంగారాన్ని రెండవ సిబ్బెలో వేశాడు. గుమ్మడికాయవున్న సిబ్బె పైకి లేవలేదు. అతడు ఆశ్చర్యపోయి, తల గోక్కుంటూ ఇంటికి పరిగెత్తి, యీసారి పెద్ద బంగారం మూటతో తిరిగి వచ్చి, దాన్నంతా సిబ్బెలో వేసిం తరవాత, తూకం సరిపోయింది. ఇది చూసిన ప్రజలు ఇళ్ళకుపోయి, మరి కొంత బంగారం తీసుకుని వచ్చారు.

ప్రజల్లో ఒకడు భయపడుతూనే తన దగ్గిరున్న కొద్ది బంగారాన్ని త్రాసులో వేశాడు. ఆ కొద్దిపాటి బంగారానికే కాటా



హనుమంతుడు కూడా సూక్ష్మ రూపంలో మందిరం ప్రవేశించాడు.

"లక్ష్మణా, గుమ్మడికాయ బరువెంత వుంటుంది? అది మణుగులకొద్దీ బంగారానికి సరిసమానంగా తూగింది! అంతే కాక రకరకాల బరువుల్ని చూపింది. మీరంతా కలిసి ప్రజల్ని మోసగించారు, ఔనా?" అని రాముడు గద్దించి అడిగాడు.

లక్ష్మణుడు చేతులు కట్టుకుని, "ఇందులో మోసం ఏమీ లేదు; అంతా ధర్మదేవత ఆదేశానుసారం జరిగింది. ఇందులో మన హనుమంతుడు పడిన శ్రమ కూడా కొంత లేకపోలేదు! త్రాసు మీది నడికొమ్ము పట్టుకుని హనుమంతుడు సూక్ష్మరూపంలో నిలబడ్డాడు. ధర్మదేవత చెప్పినంతమేరకు ఎటు ఎంత మొగ్గు చూపాలో, అటుపక్క త్రాసును పాదంతో నొక్కి పెడుతూ వచ్చాడు. ధర్మదేవత ఏమి చెప్పిందో అది ఒక్క హనుమంతుడికే వినిపించింది. నేనూ, హనుమంతుడూ ధర్మదేవతను అర్థించి, యీ విధమైన సహాయాన్ని పొందాము. ప్రజల్లో ధర్మం తప్పక పన్నులు కట్టిన వారు కొద్దిమందే; ఎగవేసిన వాళ్ళు చాలా మంది వున్నారు. ఇప్పుడు న్యాయసమ్మతంగా రావలసిన పన్నులన్నీ వసూలు చేశాం. ఈ పథకం ఆలో

కొమ్ము వాలి, మొగ్గు చూపింది. ఇది చూసిన ప్రజలు చాలా విడ్డూరపడ్డారు.

ఇలా మరికొందరు త్రాసులో బంగారం వేసిం తరవాత, అది సామాన్యమైన త్రాసు కాదనీ, ఏదో మహత్తుగలదనీ, న్యాయంగా ఎవరెంత చెల్లించాలో అంత తీసుకుంటుందనీ గ్రహించి, ప్రజలు సంతోషంగా తాము చెల్లించవలసినదంతా చెల్లించారు. ఆ విధంగా చాలా బంగారం వసూలైంది. కోశాగారం నిండిపోయింది.

ఈ జరిగినది చూసి రాముడు ఆశ్చర్యపడ్డాడు. అతను లక్ష్మణుణ్ణీ, మంత్రి సుమంతుణ్ణీ తన రహస్య సమాలోచనా మందిరానికి పిలిపించాడు. వాళ్ల వెనకగా

చించేందుకు నేనూ, హనుమంతుడూ చాలా శ్రమపడ్డాం,'' అన్నాడు.

రాముడు ఏదో అనబోయేంతలో, '' రామా! లక్ష్మణుడు చెప్పింది నిజం!'' అంటూ ధర్మదేవత అశరీరవాణి వినిపించింది. ఆ వెంటనే హనుమంతుడు సూక్ష్మరూపం నుంచి నిజరూపం ధరించి, రాముడికి పీఠాసనంవేసి, నమస్కరించారు. రాముడు హనుమంతుణ్ణి ఎంతగానో శ్లాఘించాడు.

ఆ తరవాత కొద్దిరోజులకు రాముడు, కోసల నగర పౌరులందరికీ విందు భోజనం ఏర్పాటు చేశాడు. ఆ విందుకు అవసరం అయిన సామగ్రులు తెప్పించటంలోనూ, చలవ పందిళ్ళు వేయించటంలోనూ హనుమంతుడే ముందుండి, ఒక్క క్షణమైనా తీరిక లేకుండా పనిచేయసాగాడు.

సీత, హనుమంతుడు పడుతున్న శ్రమ గమనించింది. ఆమెకు అతడంటే పుత్ర వాత్సల్యం. లంకలో తన ఉనికిని మొదటగా తెలుసుకున్నవాడతను. ఆమె, హనుమంతుణ్ణి దగ్గిరకు పిలిచి, 'నాయనా, హనుమా! ఉదయం నుంచీ క్షణంతీరిక లేకుండా శ్రమిస్తున్నావు. భోజన సమయం అయింది. అతిథులకు ఏ లోటూ రాకుండా చూడవలసిన వాడివి నువ్వు. అందువల్ల



ముందుగా నువు భోజనం చెయ్యటం బావుంటుంది.'' అన్నది.

హనుమంతుడు సరేనని, సీత వెనకగా వంటశాలలోకి వెళ్ళాడు. సీత అతడికి విస్తరివేసి వడ్డించటం ప్రారంభించింది. హనుమంతుడు వడ్డించిన పదార్థాలు మరుక్షణం తినేస్తున్నాడు. ఇలా కొంతసేపు జరిగేసరికి వేలమంది పౌరుల కోసం వండిన అన్నం, కూరల గంగాళాలూ ఖాళీ అయిపోసాగినై. ఇది చూసి సీత ఆశ్చర్యపోతూ పరుగు, పరుగున రాముడి దగ్గిరకు పోయి, సంగతి చెప్పింది.

రాముడు నవ్వి, '' హనుమంతు డెవరనుకుంటున్నావు? పరమశివుడు,



ఈ రూపంలో అవతరించాడు. అతణ్ణి ఎలా తృప్తిపరుస్తావో, అదంతా నీ ప్రజ్ఞ. నే చేయగలిగిందేమీ లేదు,'' అన్నాడు.

సీత వంటశాలకు తిరిగివచ్చి, హను మంతుడికి వెనకగా నిలబడి, మనసులో, ''పరమేశ్వరా! నీ వెవరో నేను తెలుసు కున్నాను. ఇంతటితో నీ ఆకలికి స్వస్తి చెప్పకపోతే, మా పరువు దక్కదు, స్వామీ!'' అనుకుని పంచాక్షరీ మంత్రాన్ని ముమ్మారు పఠించింది.

ఆ మరుక్షణం హనుమంతుడు తృప్తిగా త్రేన్చాడు. సీత అతడి ముందుకు వచ్చి, ''ఏం నాయనా, ఇంకా వడ్డించ మంటావా?'' అని అడిగింది.

''వద్దు తల్లీ, వద్దు! కడుపు నిండి పోయింది,'' అని హనుమంతుడు వంట శాల నుంచి బయిటికి వెళ్ళాడు.

ఆ తర్వాత సీత, అన్నపూర్ణాదేవిని ధ్యానించింది. ఆమె వంటకాలను ఎప్పటిలా గంగాళాలలో నింపింది. పౌరులకూ, వానరులకూ విందు ప్రారంభ మయింది. వానరుల పంక్తిలో చివరగా కూర్చున్న ఒక పిల్ల వానరుడు, ఊర వేసిన ఉసిరికాయను వింతగా చూస్తూ, వేళ్ళతో నొక్కేసరికి, ఉసిరికాయవిత్తు తుప్‌మంటూ పైకెగిరింది.

పిల్లవానరుడు, ''ఆట్! నీకే గంతు వెయ్యటం వచ్చనుకున్నావా? చూడు, నా ప్రతాపం!'' అంటూ లేచి, పైకెగిరాడు. వాణ్ణి చూసి మరొక వానరుడు, మరి కాస్త ఎత్తు ఎగిరాడు. అది చూసి మరొక వానరుడు యింకొంచెం పైకెగిరాడు.

ఈ విధంగా వానర సమూహమంతా ఒకర్ని మించి మరొకరు అంతరిక్షంలోకి ఎగరసాగారు. అంగదుడూ, నీలుడూ, సుగ్రీవుడూ కూడా ఎగిరారు. హను మంతుడు మాత్రం, అలా ఎగరమని రాముడి ఆజ్ఞ ఏమో అనుకుని, లాంఛన ప్రాయంగా ఒక కుప్పిగంతు వేశాడు.

వానరుల కోలాహలం చూసి రాముడు అక్కడికి వచ్చి, హనుమంతుడితో,

"అందరూ అలా ఆకాశంలోకి ఎగురుతూంటే, నువ్వు చిన్న గంతు వేసి వూరుకున్నావేం?" అని అడిగాడు.

"రామా, యింతమంది మహావీరుల ముందు, నేనేపాటి?" అన్నాడు హనుమంతుడు వినయంగా.

అప్పుడు జాంబవంతుడు ముందుకు వచ్చి, "రామా! హనుమంతుడికి ఒకరు చెపితేనేగాని, అతడి శక్తిసామర్థ్యాలు తెలియవు," అన్నాడు.

రాముడు ఒక తెల్లతామరను హనుమంతుడికి యిస్తూ, "మా వంశకర్త అయిన సూర్యభగవానుడికి, యీ తెల్ల తామరను అర్పించవలసి వున్నది. సూర్యుణ్ణి శ్వేతపద్మధరుడని పిలుస్తారు. దీన్ని ఆయనకు చేర్చగలవాడివి నువ్వొక్కడివే!" అన్నాడు.

హనుమంతుడు, "రామాజ్ఞ!" అంటూ తెల్లతామరను తీసుకుని, ఒక్క ఎగురున ఆకాశంలోకిపోయి, సూర్యుడి రథాన్ని పట్టుకుని, "గురుదేవా! రాముడు దీన్ని మీకు సమర్పించమన్నాడు," అంటూ తామరపువ్వును సూర్యుడి పాదాలముందు వుంచాడు.

సూర్యుడు, హనుమంతుణ్ణి, "చిరంజీవ!" అని దీవించి, తన చేతనున్న ఒకశ్వేతపద్మాన్ని హనుమంతుడికి యిచ్చి, "దీన్ని రాముడికి యివ్వు. దీని ప్రభావం వల్ల రాముడిపాలనలో దేశం సుభిక్షంగా వుంటుంది!" అన్నాడు.

ఆ శ్వేతపద్మం వాడదు. అది ఎక్కడ వుంటే అక్కడ వర్షాలు సక్రమంగా కురుస్తాయి. సస్యాలు సమృద్ధిగా పండుతాయి. ప్రజలకు ఎలాంటి వ్యాధులూ సోకవు. హనుమంతుడు, సూర్యుడి దగ్గిర సెలవుతీసుకుని, పద్మంతో తిరిగి వచ్చి, దాన్ని రాముడికి యిచ్చాడు.

రాముడు మహదానందంతో హనుమంతుణ్ణి కౌగలించుకున్నాడు. హనుమంతుడు, సీతారాములకు ప్రణమిల్లాడు. సీత, "నాయనా, నువ్వు చిరంజీవిగావుండు!" అని దీవించింది.





# వీరహనుమాన్

రాముడు రాజ్యం చేస్తూండగా ఉత్తర దిక్కున గంధర్వులు విజృంభించి ప్రజలను బాధించసాగారు. భరతుడు సేనలతో వెళ్ళి గొప్ప యుద్ధంచేసి వారిని అణచివేశాడు. గంధర్వుల దుండగాల నుంచి ప్రజలు బయటపడి సుఖించారు. అటు పిమ్మట వాయువ్య దిక్కున లవణాసురుడు అనే రాక్షసుడు ప్రళయం లాగ విజృంభించాడు. రాముడు శతృఘ్నుడికి దివ్యాస్త్రాలను ఇచ్చి లవణుడిని సంహరించి రమ్మని చెప్పాడు. శతృఘ్నుడికి తోడుగా రాక్షసమాయలకు ప్రతిక్రియలు చెప్పగల విభీషణుడు కూడా ఉంటే మంచిదని, లంకకు హనుమంతుడిచేత కబురు పంపించాడు. లంక నుంచి విభీషణుడు రాక్షసవీరులను వెంటబెట్టుకొని వచ్చాడు. శత్రుఘ్నుడు తన సేనలతో రాక్షసులను కూడ కలుపుకొని, విభీషణుడితో కలిసి, లవణాసురుడి పైకి యుద్ధానికి వెళ్లాడు.

శతృఘ్నుడు సుదర్శన చక్రాయుధం లాగ విజృంభించి లవణాసురుడి సేనలను చీల్చి చెండాడాడు. అప్పుడు జరిగిన ఘోర సంగ్రామంలో, విభీషణుడి రాక్షస సేన కూడా గొప్ప పరాక్రమం చూపింది. శతృఘ్నుడు లవణాసురుడితో యుద్ధంచేసి వాణ్ణి సంహరించాడు. విజయం సాధించి శత్రుఘ్నుడూ, విభీషణుడూ సేనలతో అయోధ్యకు తిరిగి వచ్చారు.

40. శతకంఠరావణ సంహారం



ఒకనాడు రాముడు తన కొలువు కూటానికి వచ్చి, సింహాసనం మీద కూర్చున్నాడు. ఎడమపక్క సీత కూర్చున్నది. రాముడికి ముందు హనుమంతుడు కూర్చున్నాడు. భరత, లక్ష్మణ, శత్రుఘ్న, సుగ్రీవ, అంగద, నల, నీల, జాంబవంత, విభీషణాదులూ; వసిష్ఠ, వామదేవాదులూ సభను అలంకరించి ఉన్నారు.

ఆ సమయంలో ఆ సభకు అగస్త్య మహాముని వచ్చాడు. రాముడు ఆయనకు చేతులెత్తి నమస్కారం చేసి, అతిథి సత్కారాలు జరిపి, క్షేమ సమాచారాలు అడిగాడు.

దానికి అగస్త్యుడు, "దుష్టశిక్షణా, శిష్టరక్షణా చేసేవాడివి నువు ఉండగా మాకు క్షేమం కాకేమి, రామా? నువు దశకంఠుడైన రావణుణ్ణి చంపి గొప్ప కీర్తి సంపాదించావు నిజమేగాని, తిక్త సముద్రం అవతల మాయానగరం రాజధానిగా చేసుకుని శతకంఠుడనే రాక్షసుడు నిన్ను జయించాలనే ఉద్దేశంతో ఉన్నాడు," అన్నాడు.

రాముడు అమితాశ్చర్యంతో, వాడి కథ చెప్పమని అగస్త్యుణ్ణి అడిగాడు. అగస్త్యుడు ఇలా చెప్పాడు:

"కశ్యపుడికి వసువు అనే భార్య ఉండేది. ఆమె అసుర సంధ్యవేళ గర్భవతి అయి, మహా వికృతమైన ఆకారం గల శతకంఠుణ్ణి కన్నది. వాడు బ్రహ్మదేవుణ్ణి గురించి దారుణమైన తపస్సు చేశాడు. బ్రహ్మ సంతోషించి, శతకంఠుడికి ప్రత్యక్షమై, దేవేంద్రుడు మొదలైన దేవతలకు అసాధ్యమైన వరాలు ఇచ్చేశాడు. దానితో వాడు విజృంభించి, మూడు లోకాలనూ జయించే ఆలోచనలో ఉన్నాడు. రామా, నువు వాణ్ణి యుద్ధంలో చంపాలి."

రాముడు కొంచెం ఆలోచించి, "వాడు చూడటానికి ఎలా ఉంటాడు?" అని అగస్త్యుణ్ణి అడిగాడు.

"వాడు ఎలా ఉంటే మాత్రం నీ బాణాలకు అసాధ్యమేమిటి? రావణుడికి పదిరెట్లు ప్రతాపము, భీకర కంఠస్వరమూ గలవాడు. వాణ్ణి ఎలా చంపాలో నీకు ఒకరు చెప్పాలా?" అన్నాడు అగస్త్యుడు.

అగస్త్యుడు వెళ్ళిపోయాక రాముడు తన తమ్ములతో, "యుద్ధంలో రావణ, కుంభకర్ణాది రాక్షసులను చంపి అలిసి ఉన్నాను. లక్ష్మణుడు కూడా నాతోపాటు శ్రమపడినవాడే. భరతుడు గంధర్వులతోనూ, శత్రుఘ్నుడు లవణాసురుడితోనూ యుద్ధం చేసి అలిసిపోయి ఉన్నారు. ఎక్కడో సముద్రాల అవతల ఉన్న ఈ శతకంఠుణ్ణి చంపటానికి ఎవరిని నియోగిస్తాం? నూరు యోజనాల సముద్రం దాటటమే ఎంతో కష్టమయింది గదా!" అని కొంత విచారంలో పడ్డాడు.

ఇంతలో రాముడి దృష్టి తన ముందు కూర్చుని ఉన్న హనుమంతుడి పైన పడింది. అతను వెంటనే, "హనుమంతుడా. ఈ పని నీవల్లనే కావాలి. ఏకపాద రుద్రుడివి!" అన్నాడు.

హనుమంతుడు రాముడితో, "మీకీ రాక్షసులనగా ఎంత? నా మీద ఎక్కి, ఆ రాక్షసుడుండే దీవికి పోయి, వాణ్ణి చంపెయ్యండి!" అన్నాడు.



రాముడు హనుమంతుణ్ణి కౌగలించుకుని, "నీకు గల శౌర్యపరాక్రమాలు మరొకరికి వస్తాయా?" అని ఎంతగానో ప్రశంసించాడు.

ఇదంతా కంటూ, వింటూన్న సీత రాముడితో, "ఇతన్ని ఏకపాదరుద్రుడన్నారు. రుద్రుడు కోతి రూపం ధరించటానికి కారణం?" అని అడిగింది.

దానికి రాముడు ఇలా చెప్పాడు:

బ్రహ్మాండాన్ని పాలించే ఏకపాద రుద్రుడు మహారుద్రగణాలు సేవిస్తూండగా ఒకసారి తన ధ్యానశక్తితో మహావిష్ణువు రూపాన్ని చూసి, ఎన్నడూ కనిపించని ఆ రూపం తనను కాపాడే ఈశ్వరుడిదే



అయి ఉండాలనుకున్నాడు. వెంటనే అతను అక్కడి నుంచి బయలుదేరి, విశ్వమంతా తిరిగి, భూలోకానికి వచ్చి, శివుడిలో ఐక్యమయాడు. ఆ శివుడి అంశ నుంచే హనుమంతుడు పుట్టాడు.

తరవాత రాముడు శతకంఠుడిపై యుద్ధానికి సిద్ధపడ్డాడు. అతని వెంట సీత కూడా వస్తానన్నది. లక్ష్మణ, భరత, శత్రుఘ్నులూ, సుగ్రీవ, విభీషణులూ, సైన్యమూ యుద్ధానికి కదిలారు. రాముడు హనుమంతుడి కోసం చూస్తే, హనుమంతుడు విశ్వరూపం ధరించి. భూమ్యాకాశాలూ, సమస్త దిక్కులూ నిండి కనిపించాడు. అతని పూర్తి రూపం చూడటం ఎవరికీ సాధ్యం కాలేదు. భయాశ్చర్యాలు కొలిపే, ఆ రూపాన్ని చూసి అందరూ దిగ్భ్రాంతి చెందారు.

తరవాత హనుమంతుడు భూమి కేసి వంగాడు. అతని వీపు మీద రాముడు సీతను ఎక్కించి, తాను ఎక్కి, తన వెంట వచ్చేవారినీ, వానర, రాక్షస బలాలనూ కూడా ఎక్కమన్నాడు. రాముడి సేనలకు నడకా, ప్రయాసా లేదు. వాళ్ళు హాయిగా హనుమంతుడి వీపు మీద ఆకాశయానం సాగించారు. ఆకాశాన వెళుతున్న హనుమంతుడు ఎగిరే మేరుపర్వతం లాగా కనిపించాడు.

హనుమంతుడు నాలుగు సముద్రాల మీదుగా ఎగిరిపోతూంటే రాముడు సీతకు ఒక్కొక్క సముద్రాన్నే చూపించాడు. చివరకు, శతకంఠుడు ఉండే మాయా పట్టణం కనిపించింది. ఆ నగరం చుట్టూ బంగారు ప్రాకారం ఉన్నది. హనుమంతుడి వల్ల సాధ్యమయిందిగాని, ఆ సముద్రాలు దాటి ఆ కోటను చేర రావటం మరొకరికి సాధ్యం కాదు.

మాయాపట్టణం గల లంకలో నందన వనానికి తీసిపోని వనం ఉన్నది. రాముడు హనుమంతుణ్ణి అక్కడ దిగమన్నాడు. సేనలూ అక్కడే దిగాయి. రాముడు సుగ్రీవుడు మొదలైనవాళ్ళతో, ''మీరు

ఈ రాక్షసుడి మీదికి యుద్ధానికి వెళ్లండి,'' అన్నాడు.

వెంటనే సుగ్రీవ, అంగద, విభీషణాది మహావీరులు తమ సేనలతో శతకంఠుడి నగరం పైకి యుద్ధానికి వెళ్ళారు. వానర సేనా, రాక్షససేనా కలిసి, కోటను సమీపించి, కోట చుట్టూ ఉండే అగడ్తను పూడ్చి, కోట గోడలు కూల్చి, గోపురాలు నేలమట్టం చేసి, ద్వారాల తలుపులు విరగదన్ని విజృంభించారు.

ఆ కోటను రక్షించే కాలకేయు లనే వాళ్ళకు ఈ కోతులూ, రాక్షసులూ విజృంభించటం చూసి ఆశ్చర్యం కలిగింది. ''ఈ పట్టణాన్ని పాలించేది శతకంఠుడని వీళ్ళకు తెలీదా? వీళ్లు ప్రాణాలతో ఎలా తప్పించుకుందా మనుకుంటు న్నారు?'' అనుకుని సింహనాదాలు చేశారు.

తరవాత ఆ కాలకేయులు రకరకాల ఆయుధాలు ధరించి వానర, రాక్షససేన మీదికి వచ్చారు. వాళ్ళ దెబ్బకు తట్టుకోలేక వానరసేన చెల్లా చెదరయింది. విభీషణుడు వానరులను ఆపి, తన రాక్షససేనలను పురికొల్పాడు. వారితో పాటు వానరులు కూడా ఎదురు తిరిగి కాలకేయులను ప్రతిఘటించారు. యుద్ధం తీవ్రంగా సాగింది.

ఈలోపల శతకంఠుడు శివపూజ చేస్తూ ఉండి, యుద్ధ కోలాహలం చెవులపడే సరికి, ద్వారపాలకులను, ''ఏమిటా కోలాహలం?'' అని అడిగాడు.





ద్వారపాలకులు అతనికి నమస్కరించి, ''స్వామీ, ఎవరో రాజు కోతి మీద ఎక్కి ఎక్కడినుంచో నరవానర, రాక్షసులుగల సేనతో వచ్చి దిగాడు. మన కాలకేయులు వారితో యుద్ధం చేస్తున్నారు. అదే ఆ చప్పుడు," అన్నారు.

''ఎవడో రాజు కోతి మీద ఎక్కి, వానరసేనతో నానగరం మీదికి యుద్ధానికి వచ్చాడంటే లోకులు నవ్విపోరా! దేవతలే నాకు తలవంచగా ఈ రాజు వానరసేనతో ఎలా వచ్చాడు?'' అని శతకంఠుడు తన మంత్రులు మొదలైన వారిని యుద్ధ సన్నద్ధులు కమ్మని, రణభేరి వేయించి, తాను కూడా యుద్ధానికి సిద్ధమయాడు.

తనతో యుద్ధానికి వచ్చిన శతకంఠుడి కిరీటమూ, అలంకారాల కాంతీ, వాడి శరీరమూ, మదమూ చూసి రాముడు అద్భుతం చెందుతూ ఉండిపోయాడు.

అది చూసి హనుమంతుడు, ''స్వామీ, ఏమిటి వాణ్ణి చూసి ఆశ్చర్యపడి పోతున్నావు? నీ ప్రతాపం ముందు వీడెంత? వాణ్ణి చంపెయ్యి!'' అంటూ వెళ్ళి, విశాలంగా ఉన్న శతకంఠుడి రొమ్ము మీద బలంగా పొడిచాడు.

ఆ దెబ్బకు శతకంఠుడు కిందపడి, వెంటనే లేచి, ఎదురుగా ఉన్న హనుమంతుణ్ణి చూసి, ''అరె, ఎంత బలం నీది! వానరుడా, మూడు లోకాలనూ హడలగొట్టే నన్నే పిడికిలి పోటుతో పడగొట్టితివే! ఎంతో తిరిగాను, ఎందరో దేవతలను యుద్ధంలో గెల్చి, ఇంతవాణ్ణి అయాను; కాని నీలాగ నన్ను ఎవరూ పడగొట్టలేదు. నీ ముష్టిదెబ్బ నేను చూశాను. నా శూలం దెబ్బ నువు చూడు!'' అంటూ తన కన్న ఎక్కువ పొడుగు గల శూలాన్ని బలంగా హనుమంతుడి మీదికి విసిరాడు. దాన్ని హనుమంతుడు విరిచి పారేశాడు.

''భేష్!'' అంటూ శతకంఠుడు హనుమంతుడి మీద ముసలమూ, గొడ్డలీ, ఖడ్గమూ మొదలైన ఆయుధాలు ప్రయో

గించాడు. అన్నింటినీ హనుమంతుడు విరిచేశాడు. రాముడు హనుమంతుణ్ణి చూసి ఆనందించి, తాను ఒక విల్లు తీసుకుని శతకంఠుడిపై యుద్ధానికి వచ్చాడు. రాముడితోపాటు విభీషణుడు కూడా వచ్చాడు. శతకంఠుడు వారిద్దరి బాణాలనూ దారిలోనే భగ్నంచేస్తూ, కాలితో తన్ని, ఇద్దరినీ వెళ్లి లంకలో పడేట్టు చేశాడు.

అప్పుడు హనుమంతుడు తన తోకను నాలుగు సముద్రాల మీదుగా సేతువు కట్టినట్టు పెట్టాడు. రాముడూ, విభీషణుడూ దానిమీద వచ్చారు. వాళ్లు శతకంఠుడితో యుద్ధం ప్రారంభించగానే వానరసేనలు చెట్లూ, రాళ్ళూ విసిరాయి. శతకంఠుడు అన్నిటినీ తన అస్త్రాలతో నుగ్గు చేస్తూ వచ్చాడు. అతని ధాటికి తట్టుకోలేక అంగదుడూ, నలుడూ, నీలుడూ, ఋక్షజుడూ లాటి మేటివానర వీరులు పారిపోయారు. రాముడి తమ్ములు ముగ్గురూ ఓడిపోయారు.

అప్పుడు రాముడు సీతతో హనుమంతుడి మీద ఎక్కి, శతకంఠుడితో యుద్ధానికి వచ్చాడు. అప్పుడు శతకంఠుడు రాముడితో, "నాతో యుద్ధం చెయ్యటమంటే రావణుడితో యుద్ధం చెయ్యటమనుకున్నావా? ఈ కోతి మీద



ఎక్కి ఇంతదూరం నువు ఎందుకు వచ్చినట్టు? పైపెచ్చు సీతను కూడా తెచ్చుకున్నావెందుకు?" అని ఆక్షేపించాడు.

రాముడు అతనిపై అస్త్రాలు వేశాడు. అప్పుడు శతకంఠులు కోట్ల సంఖ్యలో తన ఎదట ఉన్నట్టు రాముడికి తోచింది. రాముడి మహాస్త్రాలన్నీ వ్యర్థమయాయి.

హనుమంతుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. అతను ప్రచండమైన శక్తితో శతకంఠుడి రాక్షస మూకలను నాశనం చేశాడు. అంతవరకూ యుద్ధం చేస్తున్న రాముడు విశ్రాంతి కోరినట్టుగా, తన విల్లునూ, రెండు అమ్ముల పొదులనూ

తన చెంత ఉన్న సీతకు ఇచ్చాడు. వాటిని తీసుకుని సీత శతకంఠుడితో యుద్ధం చేసింది. శతకంఠుడికి కోపం వచ్చి, ఆమె మీద తన ప్రతాపమంతా చూపుతూ యుద్ధం చేశాడు.

"రాముడు సత్యం తప్పనివాడైతే, నేను పతివ్రతనైతే ఈ బాణంతో రాక్షసుడు చచ్చుగాక!" అని సీత వింటికి బాణం సంధించి వదిలింది. దానితో శతకంఠుడు చచ్చిపడిపోయాడు. సీత తన చేతి విల్లును రాముడికి ఇచ్చి నమస్కరించింది.

రాముడు తన మణిహారాన్ని సీతకు ఇచ్చాడు. సీత రాముడితో సేనలను మోసుకువచ్చి, అంతులేని రాక్షసులను చంపి శతకంఠ రావణుడి పతనానికి ఎంతగానో సహాయపడిన హనుమంతుడికే ఆ హారాన్ని ఇయ్యమన్నది. రాముడు ఇచ్చిన హారాన్ని హనుమంతుడు తన మెడలో వేసుకొని పరమానందంతో, "సీతారాములు ప్రసాదించిన ఈ హారం నా వక్షస్థలం మీద ప్రకాశిస్తూ లోపల నా హృదయంలో సీతారాములను ఎల్లప్పుడూ నిలుపుతుంది," అన్నాడు.

అందరూ తిరిగి అయోధ్యకు వెళ్లారు. రాముడి వద్ద శలవు తీసుకొని విభీషణుడు రాక్షసులతో లంకకు వెళ్లాడు. సుగ్రీవుడు మొదలైన వానరులంతా కిష్కింధకు వెళ్లారు. హనుమంతుడు రాముడి దగ్గిరే ఉండిపోయాడు.

శతకంఠ రావణ సంహారానంతరం రాముడు నిష్కంటకంగా, ఆదర్శప్రాయంగా రాజ్యం చేస్తున్నాడు. రామరాజ్యంలో శోకమూ, క్రోధమూ, ముసలితనమూ, వైరమూ, లోభమూ, సంక్షోభమూ ఎలా ఉంటాయో మనుషులెరగరు.

రాముడి సేవలో అయోధ్యలో గడుపుతున్న హనుమంతుడికి కొన్నాళ్ళకు తన తల్లి అంజనాదేవిని చూడాలనిపించింది. రాముడి అనుజ్ఞ తీసుకొని హనుమంతుడు గంధమాదన పర్వతం దగ్గిర ఉంటున్న అంజనాదేవి ఆశ్రమానికి బయలుదేరి వెళ్ళాడు.






అయోధ్యలో ఒకనాడు రాముడు, మంత్రి సామంతాదులతో కొలువుతీరి ఉండగా, విశ్వామిత్ర మహర్షి చరచరా సభను ప్రవేశించి, ''ఓయి రామా! కాశికాపురి రాజైన యయాతి గర్వాంధుడై నన్ను అవమానించాడు. ఆ రాజాధముణ్ణి నీవు వెంటనే పరిమార్చాలి! గురువుగా ఇది నా ఆజ్ఞ!'' అని చెప్పి, వచ్చినట్లే చరచరా వెళ్ళిపోయాడు.

విశ్వామిత్రుడి ఆజ్ఞకు రాముడు విస్తుపోయాడు. యయాతి రాముడిపట్ల వినయ విధేయలతో కాశీరాజ్యాన్ని ధర్మం తప్పకుండా పాలిస్తూన్న సామంతుడైన రాజు. విశ్వామిత్రుడు తొలుత యాగరక్షణకోసం రామలక్ష్మణులను తీసుకు వెళ్ళి, రాముడికి ఎన్నెన్నో దివ్యాస్త్రాలను ఉపదేశించి బల, అతిబల మొదలైన విద్యలను ప్రసాదించిన గురుదేవుడు. ప్రజానురంజకుడై, తనపట్ల భక్తికలిగి వున్న యయాతిని ఎలా చంపడం? విశ్వామిత్రుడి ఆజ్ఞను ఎలా త్రోసిపుచ్చడం?

రాముడు అప్పటికి సభ చాలించి, లేచి వెళ్ళి, ఆంతరంగిక మందిరానికి సుమంతుణ్ణి పిలిపించి, ''సుమంతా! ఇది నా ఆంతరంగిక వ్యక్తిగత విషయం! నేను ఒంటరిగాపోయి యయాతిని వధించక తప్పదు. మే మిద్దరమూ ద్వంద్వయుద్ధం చేస్తాము. అంతకు మించి ఎటువంటి ప్రజాక్షయమూ జరగవలసిన పనిలేదు. రాముడు నిన్ను చంపడానికి వస్తున్నాడని

41. రామాంజనేయ యుద్ధం



యయాతికి వర్తమానం పంపించండి,'' అని స్థిరచిత్తంతో చెప్పాడు.

జరిగిన దేమంటే, కాశీనగరాన్ని పాలిస్తున్న యయాతితో గ్రామీణప్రజలు వచ్చి, అరణ్యాల నుంచి ఏనుగుల మందలు, ఇతర వన్యమృగాలు తమ పల్లెలపైబడి అపారనష్టాన్ని కలిగిస్తున్న వని మొరపెట్టుకున్నారు యయాతి వేటాడ్డం కోసం బయలుదేరాడు. అప్పుడే విశ్వామిత్రుడు ఆ దారిన వస్తున్నాడు. వేట సంరంభంలో వేగంగా పరుగిడు తూన్న రథంలో కూర్చుని ఉన్న యయాతి విశ్వామిత్రుడి ఆగమనాన్ని గమనించక, వేటకు వెళ్ళిపోయాడు.

అది తనపట్ల ఘోరమైన అవమానంగా విశ్వామిత్రుడు భావించి, ''రథం దిగి ప్రణమిల్లి, భక్తి శ్రద్ధలు చూపవలసిన దానికి మారుగా, నన్నింత పరాభవించిన ఈ యయాతిని అంత మొందించకపోతే, నేను విశ్వామిత్రుణ్ణేకాను!'' అని ప్రతిజ్ఞ చేసి, సరాసరి రాముడి దగ్గిరకు వెళ్ళి, అజ్ఞాపించిపోయాడు.

చారులు తెచ్చిన వర్తమానాన్ని అందుకొని యయాతి భయంతో తల్లడిల్లి పోయాడు. యయాతి భార్య యశోధర. ఆ దంపతులకు చంద్రాంగదు డనే కుమారుడు, చంద్రముఖి అనే కుమార్తె ఉన్నారు. ఆ కుటుంబానికి రాముడి యందు చాలా ఆరాధన ఉన్నది. అందరూ ఒక్కసారిగా శోకసముద్రంలో మునిగిపోయారు.

కొంతసేపటికి యయాతి తెప్పరిల్లి, ''శరణాగతుణ్ణి, నిరపరాధిని, నీ దయ అని నేనే రాముణ్ణి స్వయంగా వేడు కుంటాను,'' అని లేచాడు.

ఆ రాజూ, కుటుంబం అంతా కలిసి అయోధ్యకు వెళ్ళడానికి బయలుదేరు తూండగా, వారికి నారదుడు ఎదు రయ్యాడు. నారదుడు యయాతిని చూచి ఫక్కున నవ్వి, ''అమాయకుడా! ఆపత్కాలంలో, నీ వివేకం పూర్తిగా

పోయిందిలాగుంది. ఒకే బాణం, ఒకే మాట అని పేరొందిన రాముడు, నిన్ను వధించి తీరుతాడు. ఆలోచించడానికి వ్యవధి లేదు. అంజనాదేవి ఆశ్రమానికి తక్షణం వెళ్ళు. ఆమె అభయం కోరుకో. హనుమంతుడు ఆమె కుమారుడే గద. కొంతకాలంగా అక్కడే ఉంటున్నాడు." అని చెప్పాడు.

యయాతికి, నారదుడి మాటలు నచ్చాయి. అంజనాదేవి ఆశ్రమానికి పరిగెత్తాడు. ఆశ్రమంలో అంజనాదేవి ధ్యానం ముగించి లేస్తూ, "శరణాగతుడను! రక్షించండి! ప్రాణభీతితో, అభయం కోరి వచ్చాను!" అనే ఆర్తనాదం విని యివతలకు వచ్చింది. చేతులు జోడించి ప్రాణభీతితో కంపించిపోతూన్న యయాతి కనిపించాడు.

"నాయనా, భయం విడిచిపెట్టు! నా కుమారుడి మీద ఒట్టుపెట్టి చెబుతున్నాను, నీ కెటువంటి ఆపదారానీయను!" అని అంజనాదేవి యయాతికి అభయమిచ్చింది.

అప్పుడే హనుమంతుడు గంధమాదన పర్వతం నుండి వచ్చాడు. యయాతి తల్లికుమారులిద్దరి ముందూ ప్రణామాలు చేసి, "నా పేరు యయాతి, కాశీరాజును, రాముని యందు భక్తిప్రపత్తులు గల



వాడను. నన్ను రక్షించగలవారు మీరు తప్ప మరెవ్వరూ లేరు!" అని భయం భయంగా చెప్పుకున్నాడు.

హనుమంతుడు యయాతిని భుజాలు పట్టి లేవనెత్తి, "ఓ రాజా, ఇప్పుడేగదా, మా అమ్మ నీకు అభయమిచ్చింది! ఇంకా భయపడతావెందుకు? నా తల్లి మాట నిలబెట్టుతానని నేను కూడా ప్రతిజ్ఞ చేస్తున్నాను," అన్నాడు.

అప్పుడు యయాతి, "హయ్యో, ఓ ఆంజనేయా! ఏమని చెప్పగలను? రాముడు నన్ను నిష్కారణంగా చంపబోతున్నాడు!" అని చెప్పి, జరిగినదంతా వివరించాడు.



హనుమంతుడు అంతా నిశ్చలంగా విన్నాడు. అంజనాదేవి, "ఎంత పొరబాటు జరిగిపోయింది! నేను తెలియక అభయ మిచ్చాను!" అని విచారించసాగింది.

అప్పుడు హనుమంతుడు తల్లితో, "అమ్మా! ఇప్పుడు చింతించవలసిన దేమీ జరగలేదు. ఆర్తులను రక్షించడం కంటే గొప్ప ధర్మం వేరేదీ లేదుగదా! ఈ యయాతికి నేను జీవించి ఉండగా ఎటువంటి హానీ జరగదు!" అని చెప్పాడు.

యయాతికి హనుమంతుడు అభయ ప్రదానం చేసిన సంగతి అందరికీ తెలిసింది. ఆ వార్త అయోధ్యకు శీఘ్రంగా చేరుకుంది. రాముడి చెవిని కూడా పడ్డది. అంతఃపురంలో సీతకు కూడా తెలిసింది.

అంతఃపురం మీదినుంచి సీతాదేవి చూస్తూండగా, ఇద్దరు పిల్లలతో వస్తున్న యశోధర కనిపించింది. యశోధర సౌధాన్ని సమీపించి, "అమ్మా, జానకీ! భిక్ష పెట్టించు! పతి భిక్ష పెట్టించు, తల్లీ!" అని ఎలుగెత్తి అరిచింది.

"అమ్మా! నీ భర్త, హనుమంతుడి ఆశ్రమంలో క్షేమంగా ఉన్నాడని తెలిసింది. అతని కింక ఎటువంటి భయమూ ఉండదని నమ్మి. నీవూ, పిల్లలూ యిక్కడే నాతో ఉండండి!" అని చెప్పి అంతఃపురంలో వారికి సకల మర్యాదలతో విడిది ఏర్పాటు చేయించింది. ఆ పిల్ల లిద్దరికీ సీత దగ్గర మంచి చనువు ఏర్పడింది. అటువంటి పిల్లలిద్దరు తనకు ఉంటే బాగుండునని సీతకు సంతాన వాంఛ కలిగింది.

రాముడు ధనుర్బాణాలను ధరించి యయాతిని వధించడానికి పాదచారిగా బయలుదేరాడు. అతని వెనుక ముగ్గురు తమ్ములూ, వారి వెంట మంత్రులూ, పరివారమూ బయలుదేరారు. రాముడు తప్ప ఎవ్వరూ ఎటువంటి ఆయుధమూ పట్టుకోలేదు.

రాముడు దగ్గిరకు రాగానే హనుమంతుడు స్వాగతవచనాలు పలికి, దోసిట్లోని పువ్వులను, అతని పాదాల ముందు జల్లాడు.



హనుమంతుడు రాముడి పాదాల ముందు మోకరిల్లి, "రామా! యయాతిపై అనుగ్రహం చూపు! అతడు నిరపరాధి. బలహీనుడైన వాణ్ణి దండించడం నీవంటి వానికి తగదు. అతని పక్షాన నేను వేడుకొంటున్నాను," అని అన్నాడు.

రాముడు ఆగ్రహంతో, "ఓహో. నాకే చెప్పగలంతటి వాడి వయ్యావా?" అంటూ హనుమంతుణ్ణి పాదంతో తన్నాడు. ఆ తాపుకు హనుమంతుడు పరవశించి పోతూ, "ఏ పాదం తాకగానే బండరాతికి శాపవిమోచనం కలిగి, అహల్యగా పవిత్రత పొందిందో, అటువంటి నీ పాద స్పర్శతో నా మేను యిన్నాళ్ళకు ధన్యమైంది. ఇప్పుడు నా శరీరానికి అపూర్వమైన శక్తి వచ్చింది," అన్నాడు.

రాముడు తిరిగి మండిపడుతూ, "ఓరి, వానరా! ఇంటువంటి కల్లబొల్లి పొగడ్తలు కట్టిపెట్టి, యయాతిని విడిచిపెట్టు. గురువాజ్ఞను నేను నిర్వర్తించాలని యిక్కడకు వచ్చాను!" అన్నాడు.

"రామా! నీ గురువు ఆజ్ఞ యెంత అన్యాయమైనదో గుర్తించకుండానే, నిష్కారణంగా ఒక అమాయకుణ్ణి చంపాలని నీవు వచ్చావు! తల్లిమాట నిలబెట్టడం కోసం నేను యయాతికి రక్షగా నిలబడ్డాను. ముందు నన్నుచంపి, తర్వాత నీవు వచ్చిన పని చూసుకో!" అని హనుమంతుడు గంభీరంగా లేచి నిల్చున్నాడు. ఉన్నట్టుండి హనుమంతుడి శరీరం పెరగసాగింది. నిగనిగలాడుతూ ప్రకాశాన్ని విరజిమ్మసాగింది.

అది చూచి రాముడు, "ఓ, ఇంత వాడివయ్యావా? ఏదో ఒక వానరుడివనే అనుకున్నానుగాని, నా కెదురునిలిచేటంత వీరుడివి అవుతావని అనుకోలేదు!" అన్నాడు హేళనగా.



''రామా! అది అంతా నీ పాద మహిమే అని ఇప్పుడే గద చెప్పి ఉన్నాను!'' అన్నాడు హనుమంతుడు.

రాముడు ధనుస్సు తీసి బాణాన్ని సంధించాడు. హనుమంతుడు తన తోకను పెంచి గిరగిరా తిప్పుతున్నాడు. రాముడు ప్రయోగించిన అస్త్రాలన్నిటినీ హనుమంతుడు తోకతో అడ్డుకొని, గిరవాటేస్తున్నాడు. ఆ సమయంలో విశ్వామిత్రుడు కూడా అంగలువేస్తూ అక్కడకు పరుగు, పరుగున వచ్చాడు.

రాముడు వేసిన ఒక్కొక్క అస్త్రానికీ, హనుమంతుడు శరీరాన్ని పెంచుతూ, మహోన్నతంగా పెరిగిపోయాడు. రాముడు వింటిని పైకెత్తి, నడినెత్తి ఆకాశానికి గురిపెట్టవలసినంత పని అయింది. అప్పుడు హనుమంతుడు వీరాసనం వేసి కూర్చుని, ''రామా! ఇప్పుడు నీ గురికి కొంత అందుబాటులో ఉంటాననుకుంటాను!'' అన్నాడు.

రాముడు ఒక్కసారిగా మహోగ్రుడై, ''ఇప్పుడు చిట్టచివరిగా నా రామబాణాన్ని, నీ గుండెకు గురిపెట్టి ప్రయోగిస్తున్నాను. దీనితో నీ పనీ, నా పనీ ముగుస్తుంది,'' అంటూ చంద్రవంక ఆకారం గల రామబాణాన్ని తీశాడు.

విశ్వామిత్రుడు కూడా పరుగున వచ్చి రాముడితో, ''రామా, ఇక నీవు యుద్ధం మాని హనుమంతుడి పట్ల ప్రసన్నుడివి కావాలని కోరుతున్నాను. నా అహంకారం, ఇదంతా చూశాక నశించింది. యయాతి దోషమేమీ లేదు,'' అన్నాడు.

రాముడు తల అడ్డంగా ఊపుతూ, ''లేదు, గురుదేవా! ఇంకా నా అస్త్రం మిగిలే ఉన్నది. మీ ఆజ్ఞ నెరవేర్చి తీరుతాను, నన్ను వారించకండి,'' అని కసిరినట్టు అన్నాడు.

రాముడు అస్త్రాన్ని నారికి సంధించి, హనుమంతుడికి గురిపెట్టి, ''హనుమా! నా రామబాణాన్ని నీ గుండెకు గురి పెడుతున్నాను; ఇప్పుడైనా నీ అహంకారం

విడిచి, యయాతిని నాకు అప్పగించి, రాముని బంటువనిపించుకో!'' అన్నాడు.

హనుమంతుడు, "అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ నేను రాముని నమ్మిన బంటునే! శరణు యిచ్చి వదిలివేసే క్షుద్రుడు నీకు బంటుగా ఉండతగడు. అది నీకే చిన్నతనం! త్వరగా నీ రామబాణాన్ని వదులు, హృదయపూర్వంగా నీ బాణానికి స్వాగతమిస్తున్నాను,'' అంటూనే హనుమంతుడు రెండు చేతులతోనూ తన గుండెను చీల్చి అస్త్రానికి సూటిగా పట్టుకున్నాడు. రాముడు బాణాన్ని వదిలాడు. ఆ బాణం హనుమంతుడి గుండెలో చొరబడుతూ అదృశ్యమైంది. అప్పుడు హనుమంతుడి గుండెలో దేదీప్యమానంగా ప్రకాశిస్తూ రాముడి రూపం కనిపించింది. ఆ అద్భుతాన్ని అంతా నిశ్చేష్టులై చూస్తూ ఉండిపోయారు.

రాముడు ధనుస్సు కిందకు దించి, ''హనుమా! నువ్వు అజేయుడివి! నేనే ఓడిపోయాను!'' అన్నాడు.

అప్పుడు హనుమంతుడు, గుండెను చీల్చి పట్టుకున్న చేతులు వదిలిపెట్టగానే, గుండె యథాప్రకారం మూసుకున్నది. ''రామా! ఇందులో జయాపజయాలు ఎవరివీ కావు. నీ అస్త్రాన్ని నా హృదయంలో ఉన్న నీవే గ్రహించావు. అదీ నీలోనే లీనమైంది. ఇందులో నా ప్రతాపమేమీ లేదు,'' అన్నాడు హనుమంతుడు తలవంచి నమస్కరిస్తూ.

విశ్వామిత్రుడు వచ్చి హనుమంతుణ్ణి దగ్గరకు తీసుకొని, ''హనుమంతా! శరణాగత రక్షణలో నీవు, రాముడంతటివాడితో ఎదురొడ్డి, ప్రతిజ్ఞాపాలన నెరవేర్చి, ఇప్పుడు అసలైన వీరుడివనిపించుకున్నావు; వీరహనుమానుడని సార్ధక నామధేయుడివైనావు,'' అని ఎలుగెత్తి శ్లాఘించాడు.

రాముడికీ, సీతకూ వందనాలు చేసి, వారికి వీడ్కోలు చెప్పి, హనుమంతుడు గంధమాదన పర్వతం మీద తపస్సులో నిమగ్నమయ్యాడు.





# వీర హనుమాన్

అంజనాదేవి చేసిన ఘనమైన అతిథి సత్కారాలు పొంది, విందు ఆరగించిన తరవాత, రాముడితో వచ్చినవారందరూ తిరిగి అయోధ్యకు వెళుతున్నారు.

దారిలో సీత, యశోధరతో, "చూశావా! నేను ముందే చెప్పానుగదా! నీ భర్తకు ఎటువంటి భయమూ ఉండదని. హనుమంతుడి శరణు పొందిన యయాతి చరితార్థుడైనాడు!'' అని అన్నది.

దానికి యశోధర కృతజ్ఞతతో సీతను చూస్తూ, ''అంతా, మీ సీతారాముల అనుగ్రహమే కదమ్మా! హనుమంతుని హృదయంలో రామునితోబాటు నీవు కూడా మాకందరికీ కనిపించావు, మా కన్నులు ధన్యమైనాయి!'' అన్నది.

"ఔను, సీతమ్మా, మేమూ చూశాము!" అంటూ ఆనందోత్సాహాలతో చంద్రాంగదుడూ, చంద్రముఖీ కూడ బలుకుతూ చప్పట్లు చరిచాడు. యశోధర వారిని ఉష్ అని వారించి, తన పిల్లలను మమతగా చూస్తూన్న సీత ముఖాన్ని చూసి, ''అమ్మా! త్వరలో నీవు సంతానవతివి అవుతావు; నీ ముఖంలో మాతృకళ దివ్యంగా కనిపిస్తున్నది,'' అన్నది.

సీత సిగ్గుపడుతూ, చిరునవ్వుతూ యశోధరతో, ''వయసులో పిన్నదానివిగా కనిపిస్తున్నా, ఇలాంటి రత్నాలవంటి పిల్లల్ని కన్నందుకు నాకంటే నీవు గొప్పదానివి; అదృష్టవంతురాలవు. నీ మాటలు ఆశీర్వాదాలుగా భావిస్తున్నాను!'' అన్నది.

42. అశ్వమేధయాగము



ఆ విధంగా పల్లకిలో వాళ్లు ముచ్చ టించుకుంటూండగా అయోధ్యకు చేరారు. యయాతి సకుటుంబంగా రాముడి అతిథిగా ఉన్నాడు. సీత యశోధరతో సంతోషంగా కబుర్లు చెప్పుకుంటూ, ఆమె పిల్లలతో ఆటపాటలతో ముచ్చట తీర్చు కున్నది. పిల్లలిద్దరూ 'అమ్మా! అమ్మా!' అంటూ చుట్టుకొని తిరుగుతూ ఉంటే అమె ఆనంద తన్మయురాలైంది.

కొన్నాళ్ళ తర్వాత యయాతి సీతా రాముల వద్ద శలవు తీసుకొని భార్యా, బిడ్డలతో తన రాజ్యానికి వెళ్లాడు.

ఒక పూర్ణిమనాటి సాయంకాలం సీతతో రాముడు అంతఃపురోద్యానవనంలో విహరిస్తున్నాడు. అప్పుడే చంద్రోదయ మవుతూన్నది. రాముడు సీతతో "జానకీ! అటు చూడు!" అని చూపించాడు.

సీత, "తూర్పుదిశ అనే కౌసల్యాదేవికి రామచంద్రుడు ఉదయిస్తున్నాడు!" అని అన్నది.

రాముడు, "కాదు, సీతాదేవికి అటు వంటి చంద్రోదయమే అవుతుంది, అని తూర్పుదిక్కు జోస్యం చెబుతోంది," అన్నాడు.

"ఆ చంద్రుడు రామచంద్రుడి లాగే ఉంటాడని కూడ చెబుతున్నది కదూ?" అన్నది సీత.

"ఆ చంద్రుడు జానకీదేవిని పోలి ఉంటాడని అంటున్నది!" అన్నాడు రాముడు.

ఇద్దరూ ఆనందంగా నవ్వుకున్నారు. వారు కూర్చున్న చంద్రశిలావేదిక దాపునే ఉన్న చిన్న కొలనులో రెండు కలువలు జంటగా వికసిస్తున్నవి. చూడముచ్చటగా ఉన్న వాటిని పదేపదే చూస్తూ సీత రాముడితో అంతఃపురంలోకి వెళ్ళింది.

కొంత రాత్రి గడిచాక సీత ఒకసారి యివతలకు వచ్చి మేడ మీద నుంచి ఉద్యానవనం కలయజూచింది. పున్నమి వెన్నెల నిండుగా ఉన్నది. దాపున ఉన్న ఆ చిన్న కొలనులో వెన్నెల మిలమిలా

మెరుస్తున్నది. కలువలు రెండూ తెల్లగా నక్షత్రాల్లా మెరుస్తూ కనిపించాయి సీతకు.

* * *

గంధమాదన పర్వతం మీద హనుమంతుడు జపతపాలతో గడుపుతూండగా, ఎంతకాలమైందో తెలీకుండానే చాలా ఏళ్ళు దొర్లిపోయినై. ఒకనాడు అయోధ్య నుంచి రాముడి ఆప్త అంతరంగికుడూ, వయోవృద్ధుడూ అయిన భద్రుడు వచ్చి, "రాముడు నిన్ను రమ్మంటున్నాడు!" అని హనుమంతుడికి చెప్పాడు.



భద్రుడు చాలా విచారంగా కనిపించాడు. "ఏమి జరిగింది? అయోధ్యలో జరిగిన విశేషాలేమిటి?" అని హనుమంతుడు అడిగాడు.

భద్రుడు నిట్టూర్చి, "అంతా జరిగిపోయింది...." అన్నాడు.

"ఏమిటి నీవంటున్నది? వివరంగా చెప్పు!" అన్నాడు హనుమంతుడు.

"క్లుప్తంగా చెప్తాను విను!" అంటూ భద్రుడు జరిగినది ఇలాగ చెప్పాడు:

ఒకనాడు ఋషులను కూడా వెంట బెట్టుకుని బ్రాహ్మణుల గుంపొకటి, రాముడి దగ్గిరికి వచ్చింది. శంబుకుడు అనే శూద్రుడు వేదాధ్యయనం చేసి తపస్సు చేస్తూన్న కారణంగా ధర్మహాని కలిగిందనీ, అందువల్ల తమ బాలుడొకడు అకాల మరణం పొందాడనీ, వెంటనే శంబుకుణ్ణి వధించాలనీ వాళ్లు, రాముడిని ఆజ్ఞాపిస్తున్నట్లుగా చెప్పారు.

అన్నివర్గాలవారినీ తృప్తిపరుస్తూ రాజ్యపాలన చేయాలనే దీక్ష పట్టిన రాముడు వెళ్ళి, సాధు జీవనం గడుపుతూ తల క్రిందుగా తపస్సు చేస్తూన్న శంబుకుణ్ణి నరికాడు. అప్పుడు శంబుకుడి భార్య కపిల రాముడితో, "ఓ రాజా! నీకు ఏదో అనర్థం రాబోతూన్నది! దానికి సూచనగా ఇంతటి దారుణం చేశావు!" అని హెచ్చరించి, ప్రాణాలు విడిచింది.

అది జరిగిన కొద్ది రోజుల తర్వాత ఒకనాటి రాత్రి రాముడు, భద్రుడు కూడా



వెంటరాగా మారువేషాలతో వేగు తిరుగుతూ అయోధ్య చివర ఒక చాకలిపేట సమీపానికి వచ్చారు. అక్కడ అలుమగల తగువు జరుగుతూన్నది.

ఎక్కడికో వెళ్ళి కొన్నాళ్ళుండి వచ్చిన పెళ్ళాన్ని ఒక చాకలివాడు చావబాది ఇంటి గుమ్మం తొక్కనియ్యలేదు. రక్తం చిమ్ముతున్న వీపు చూపుకుంటూ చాకలిది భోరున వెక్కి వెక్కి ఏడుస్తూ, "ఆ సీతను రాముడంతటి మారాజే ఏలగా లేందినువ్వేనా మహా మగాడివి?" అని అన్నది. తప్పతాగి తూలుతూన్న చాకలివాడు ఓంద్ర పెట్టినట్టుగా, "రాజును గదా, అడిగేవాడెవుడూ. అనేవాడెవడూ అని అన్నాళ్ళు లంకలో పరాయివాడి దగ్గిరున్న దాన్ని తెచ్చుకుని సిగ్గుమాలి కులకడానికి నేను వెర్రి రాముణ్ణి కాను." అని అందరిముందూ అరిచాడు.

దాని ఫలితంగా రాముడు సీతను అరణ్యంలో విడిచిరమ్మని లక్ష్మణుడికి ఆజ్ఞాపించాడు. అప్పుడు సీత నిండు చూలాలు. ఆ ముందటి రోజునే సీత తనకు మునిపల్లెలకు వెళ్ళి మునిపత్నులతో ముచ్చటగా గడిపి రావాలని కోరికగా ఉన్నదని రాముడితో చెప్పింది. ఆ నెపంతోనే లక్ష్మణుడు సీతను రథంలో తీసుకు వెళ్లి అడవిలో విడిచి వచ్చాడు.

సీతను త్యజించి రాముడు నిద్రాహారాలు మాని కృంగిపోవడం భద్రుడు చూడలేకపోయాడు. భద్రుడు చిన్నతనంలో రాముణ్ణి ఎత్తుకొని తిప్పి లాలించి ఆడించినవాడు. పసి రాముడు చందమామను ఇమ్మని మారాంపెట్టినప్పుడు అద్దం యిచ్చి చందమామను చూపినప్పుడు తన ముఖాన్నీ, చంద్రబింబాన్నీ కలిపి అందులో చూస్తూ రాముడు ముద్దు ముద్దుగా రామ-చంద్రుడు అని పలికాడు. అప్పుడు భద్రుడు రాముడి పక్క తన ముఖాన్నిపెట్టి, మరి ఇప్పుడో? అని అడిగితే, రామ-భద్రుడు అని మరింత ముద్దుగా అన్నాడు రాముడు. అప్పట్నించీ

రాముడికి రామచంద్రుడు, రామభద్రుడు అనే పేర్లు వచ్చాయి. రాముడితో అలాంటి అనుబంధము ఉన్న భద్రుడికి ఆ చాకలి వాడిని పట్టి చిత్రవధ చేయాలనిపించి, చాకలిపేటకు వెళ్లి విచారించాడు.

"అంతమాట అన్నందుకు వాణ్ణి పట్టి ఉతికేద్దామని పట్టుకోబోతే వాడు దొరక్కుండా పారిపోయాడు! వాడి పెళ్లామూ కనిపించలేదు!" అని అక్కడి వాళ్ళు భద్రుడితో చెప్పారు.

లక్ష్మణుడు విడిచి వెళ్ళాక సీత నదీ ప్రవాహంలో కొండరాతి మీదినుంచి దూక బోతూండగా వాల్మీకి మహాముని వారించి తన ఆశ్రమానికి తీసుకెళ్లాడు. సీత ఇద్దరు మగ కవల బిడ్డలను కన్నది. కుశుడు, లవుడు అని వారికి పేర్లుపెట్టి, వాల్మీకి విద్యా బుద్ధులు నేర్పాడు, తాను రచించిన రామాయణ కథను గానం చేయడం కూడా నేర్పాడు. సీత వాళ్లకు విలువిద్య నేర్పింది.

ఒకనాడు కుశలవులు రామాయణ రాముడెలా ఉంటాడో, తమ తల్లి పేరే గల సీత ఎలాంటిదో చూడాలని అయోధ్యకు రామకథను పాడుతూ వెళ్ళారు.

రాముడు సీతను కొంత మరిచిపోవ డానికి వసిష్ఠుడు మొదలైన పెద్దలు ఆలోచించి, రఘువంశ రాజులందరూ



చేసినట్లే లోక కళ్యాణం నిమిత్తం అశ్వమేధ యాగాన్ని చేయవలసిందని రాముడికి ఆదేశించారు. బంగారంతో మలచిన సీత విగ్రహాన్ని పక్కనుంచుకుని రాముడు అశ్వమేధ యాగాన్ని ప్రారం భించాడు. అదే రోజున ముని బాల కులమని చెప్పుకొంటూ లవకుశులు రామాయణం పాడుతూ అయోధ్యా నగరం వీధులు తిరుగుతూ వస్తున్నారు. లక్ష్మణుడు వాళ్ళను చూసి వాళ్ళెవరై ఉండవచ్చునో కొంత అంచనాకట్టి రాజ మందిరానికి తీసుకువెళ్ళాడు.

రాజ ప్రాసాదంలో కుశలవులు సీత అగ్నిప్రవేశ ఘట్టాన్ని కన్నులకు కట్టేలాగ



పాడి వినిపించారు. అక్కడ ఉన్న కౌసల్య మొదలైన అంతఃపుర స్త్రీలు, యాగంచేయిస్తున్న పెద్దలూ, పరివారమూ పుర ప్రముఖులు అంతా కన్నీరు కారుస్తూ స్వర్ణ సీతను చూసి చేతులు జోడించి కళ్ళకద్దుకున్నారు. రాముడు వాళ్ళు మునిబాలురనుకుంటూనే తెలియరాని ఆనందంతో వాళ్ళను దగ్గరకు తీసుకొని ముద్దాడి, అనేక కానుకలు, చీనాంబరాలు ఇచ్చి పంపాడు.

యాగ ప్రారంభ క్రియలన్నీ పూర్తయ్యాక రఘువంశ సూర్యపతాకంతో అలంకరించబడ్డ యాగాశ్వం స్వేచ్ఛగా స్వైరవిహారం చేయడానికి విడిచిపెట్టబడింది. ఆ గుర్రం దౌడు తీసి తిన్నగా వెళ్లి వాల్మీకి ఆశ్రమ సమీపాన్ని చేరింది. గుర్రం నుదుట ఉన్న బంగారు బాసికం చదివి, అది రాముడి యాగాశ్వంగాగుర్తించి దాన్ని పట్టి కట్టివేశారు లవకుశులు.

గుర్రాన్ని విడిపించడానికి వెళ్ళిన శత్రుఘ్న, భరత, లక్ష్మణులు కుశలవులతో యుద్ధంచేసి మూర్ఛపోయారు. రాముడు వెళ్ళి యుద్ధం చేశాడు.

కుశలవులు తమ తల్లి మహాసాధ్వి అని ప్రతిజ్ఞ చెప్పి విడిచిన బాణాలు తగిలి రాముడు మూర్ఛపోయాడు. సీత వచ్చి రాముడి పాదాలు తాకి తెలివి తెప్పించింది.

సీత పవిత్రురాలనీ, రాణిగా అయోధ్యకు తీసుకెళ్ళమనీ వాల్మీకి రాముడికి చెప్పాడు. అందుకు రాముడు సీత ఆ విధంగా శపథం చేసి పౌరులను మెప్పించితే బాగుంటుందని అన్నాడు.

అయోధ్యకు వచ్చి కుమారులను రాముడికి అప్పగించి సీత, "నా పవిత్రతకు నిదర్శనంగా భూదేవి నన్ను స్వీకరించును గాక!'' అని పలికిన వెంటనే భూమి కంపించింది. దిక్కులు చీకట్లుకమ్మాయి. మెరుపులు మెరిశాయి. ఉరుములురిమాయి. అయోధ్యా పౌరులు ఇళ్ళలోంచి బయటకు వచ్చి కోలాహలంగా

పరుగులెత్తి అందరూ సీత ఉన్న చోట గుమిగూడారు. సీత నిల్చున్న చోట భూమి చీలింది. అందులోంచి మణిమయ సింహాసనం మీద కూర్చుని ఉన్న భూదేవి వచ్చింది. ఆ సింహాసనాన్ని నాగకాంతలు మోస్తున్నారు. భూదేవి సింహాసనం దిగి, తల్లి బిడ్డను తీసుకున్నట్లుగా రెండు చేతులతో సీతను ఎత్తుకొని సింహాసనం మీద తన ఒడిలో కూర్చుండబెట్టుకొంది. భూమి మళ్ళా కంపించింధి. అయోధ్యా నగరం ఊగిసలాడింది, కాని ఒక్క ఇంటి పెంకు అయినా రాలలేదు. సీతతో భూదేవి లోపలికి వెళ్లిపోయింది. చీలిన ఆనవాలైనా లేకుండా భూమి మూసుకుంది. అందరూ కర్రగట్టి కళ్ళప్పగించి చూస్తూండగా, అంతా రెప్పపాటు కాలంలో జరిగిపోయింది.

రాముడు ఆగ్రహంతో భూమిని చీలుస్తానని వింటికి బాణాన్ని సంధించాడు. అప్పుడు ఆకాశం నుంచి, "రామా! రఘువంశ రాజులందరూ భూమిని చల్లగా పాలించారు, నువ్వు భూమిని చీలుస్తావా? చేతులారా నువ్వే శపథం చేయించి సీతను పుట్టినింటికి పంపించి ఎందుకు ఆవేశపడతావు?'' అని అశరీరవాణి వినిపించింది. రాముడు ఎత్తిన ధనుస్సు దించాడు, తల దించుకున్నాడు.

రాముడు లవకుశులను యువరాజులుగా సింహాసనం మీద కూర్చుండబెట్టి, విషాదమూర్తిగా మిగిలాడు.

''అశ్వమేధం సాగుతూన్నది. యాగాశ్వం ఉత్తరం నుంచి తూర్పుగా వెళుతున్నది. లక్ష్మణ భరత శత్రుఘ్నులు సైన్యంతో దాని వెంట వెళ్తున్నారు,'' అని భద్రుడు చెప్పడం ముగించాడు.

శిలాప్రతిమలాగ కన్నీరు కారుస్తూ వింటూన్న హనుమంతుడు కళ్లు ఒత్తుకొని, లేచి, ''నేనిప్పుడే రాముడి దగ్గిరకు వెళ్తున్నాను, నువ్వు వెనకగా రా!'' అని భద్రుడికి చెప్పి తన గదను భుజాన వేసుకొని, ఆకాశానికి ఎగిరి అయోధ్యకు వెళ్లాడు.





# వీర హనుమాన్

హనుమంతుడు అయోధ్యను చేరే దారిలో ఉన్న వాల్మీకి ఆశ్రమంలో దిగి, వాల్మీకి మహామునికి నమస్కరించి, "మహాను భావా! ఎందుకిలా జరిగింది? అని అడిగాడు.

వాల్మీకి చిరునవ్వునవ్వి, "హను మంతా! రాజ్యపాలన ఎంత కఠోరమైనదో, శంబుకుడిలాంటి పరమసాధువైన నిర పరాధులు అధికవర్గాల వారి ప్రాబల్యం వల్ల ఎలా బలి అవుతూంటారో అనేకాక, కానిపని అని తెలిసి కూడా పాలకుడు పాపం మూటగట్టుకోవలసి ఉంటుందనీ, మాయావులయిన పాపిష్ఠి నోళ్ళనుండి వెలువడిన విషబీజాలు పామర ప్రజల్లో చెలరేగకుండా ఎలాంటి త్యాగాలు చేయ వలసి ఉంటుందో నిరూపణ కావడానికే, ఇలా జరిగిందనీ నీకు తెలుసు: నేను వేరే చెప్పాలా?" అని అన్నాడు.

హనుమంతుడు వాల్మీకి ఆశ్రమంలో సీత ఉండిన కుటీరాన్నీ, లవకుశులు చెట్లబోదెలపై బాణాలతో పెట్టిన గుర్తుల్నీ తనివితీరా చూచాడు. సీత సంచరించిన నేలను కళ్ళకద్దుకొని అయోధ్యకు ఎగిరాడు.

హనుమంతుడు ఎగురుతూ అయోధ్యను చేరి రాజభవనం ముందు ఉద్యాన వనంలో వాలాడు.

అక్కడ కుశలవులు విలువిద్యలో వినోదిస్తున్నారు. వాళ్ళిద్దరిమధ్యా బాణా లతో ఒంటిస్తంభం మేడ ఎత్తుగాలేచి

## 43. శత్రుశేష నిర్మూలన



ఉంది. లవకుశులు హనుమంతుడిని చూసి, కనుసైగలు చేసుకొని ఇద్దరూ హనుమంతుడి చుట్టూరా బాణాలుకొట్టి కంచెనాటారు.

''మాయావీ! ఎవరు నువ్వు?'' అని గద్దించాడు లవుడు.

లవుడిలో సీత పోలికలు ఎక్కువగా ఉన్నవి. కుశుడు రాముడినిపోలిఉన్నాడు. సీతారాముల లాగ కనిపిస్తున్న లవకుశులను హనుమంతుడు కళ్ళవిందుగా చూస్తూ, ''నేను హనుమంతుడిని! రాముడిని కలుసుకోవాలి!'' అన్నాడు.

''నిన్ను నమ్మేదిలేదు, గదాగిదాపట్టుకొని హనుమంతుడి వేషం వేసుకు వచ్చిన మాయలమారివి. మారీచుడికేమౌతావు?'' అంటూ లవుడు బాణం ఎక్కుపెట్టాడు.

లవుణ్ణి శాంతపరుస్తూ, రాముడిలాగ శాంతంగా కుశుడు, ''నువ్వు హనుమంతుడివేనని నిరూపించుకొంటేనేగాని నిన్ను కదలనివ్వము!'' అన్నాడు.

''నీ ప్రతాపాలన్నీ చూపించు! మొదట నీ ప్రబల రూపం చూపించు!'' అన్నాడు లవుడు.

హనుమంతుడు పెరిగి వారినిద్దరినీ ఆలింగనం చేసుకున్నాడు. వారిని తన వీపు మీద కూర్చుండబెట్టుకొని ఆకాశానికెగిరి సరయూనది మీదుగా అయోధ్యా నగరం చుట్టూరా గిరగిరా తిప్పాడు. ఆకాశం ఎత్తున పెరిగి సీతకు చూపిన విశ్వరూపాన్ని చూపించాడు. తోకను పెంచి గిరగిరా తిప్పి, చుట్టచుట్టి కోట కట్టాడు. లవకుశులను భుజాలమీద ఎక్కించుకొని, ''మైరావణ సంహారంలో రామలక్ష్మణులను ఇలాగే మోశాను.'' అంటూ కోట గోడలమీద చుట్టూరా తిప్పి వచ్చాడు.

లవకుశులు హనుమంతుడికి నమస్కరించి, ''హనుమంతుడా! నీ ప్రతాపాల్ని కళ్ళారా చూడాలని నిన్ను ఆటాడించాము, మమ్మల్ని మన్నించు!'' అని ముసిముసినవ్వుతూ క్షమాపణ చెప్పుకున్నారు.

"మీ కోరిక తీర్చడానికే నేనూ మిమ్మల్ని అడించాను మరి!" అన్నాడు హనుమంతుడు నవ్వుతూ. లవకుశులు చెరోపక్కా హనుమంతుడి చేతులు పట్టుకొని రాముడి దగ్గరకు నడిపించారు.

రాముడు హనుమంతుడిని చూస్తూనే దుఃఖాతిశయం వల్ల మాటాడక కన్నీరు పెట్టుకున్నాడు. హనుమంతుడు రాముడి ముందు మోకరిల్లి "నువ్వూ, పామరుడి లాగ దుఃఖానికి వశమైతే ఎలాగ? రాజ్య పాలన సుఖభోగాల పూలశయ్య కాదనీ, ఎలాంటి పనినైనా చేయవలసి ఉంటుం దనీ, ఎంతటి త్యాగాన్నైనా చేయక తప్పదనీ మున్ముందు కాలాల్లో కూడా రామరాజ్యాన్ని ఉదాహరణగా చెప్పు కోవడం కోసమే ఇలా జరిగింది కదా! నువ్వేది చేసినా అందులో ఏదో పరమార్థం ఉంటుంది, అర్థం చేసుకోగల వాళ్ళకే అది అర్థమౌతుంది!" అని ఊరడించాడు.

అప్పుడు రాముడు, "హనుమా! నిన్ను చూసి, నీ మాటలు విని నా మనస్సు కొంత తేరుకుంటున్నది; సీతలేని బెంగకు తోడు ఈ అశ్వమేధ యాగం విఫలమైతే నీ రాముడు నీకు దక్కడు! యాగాశ్వం ఇప్పుడు మణిపురం దిశగా వెళ్తూన్నట్లు తెలిసింది. అశ్వరక్షణ భారం నీ భుజ స్కంధాల మీద కూడా మోపుతున్నాను.



అందుకే నిన్ను పిలిపించాను. అశ్వం వెంట నా ముగ్గురు తమ్ముళ్ళూ వెళ్తు న్నారు. నీవు వాళ్ళతో చేరు!" అని చెప్పాడు.

రాముడి ఆజ్ఞను శిరసావహించి హను మంతుడు గదను భుజాన వేసుకొని రివ్వున ఆకాశానికి ఎగిరాడు.

హనుమంతుడు ఆకాశమార్గాన పోతూండగా, ఒక కీకారణ్యంలో ఒక రాక్షసి, ఒక రాక్షసుడు విజయనాదాలు చేస్తూ తాగి తందనాలాడుతూ కనిపించారు. అనుమానం వేసి హనుమంతుడు సూక్ష్మ రూపంతో వాళ్ళకు సమీపంలో ఒక చెట్టు మీద వాలి పొంచి ఉన్నాడు. వాళ్ళు



కరాళకంఠుడు శతకంఠ రావణుడి తమ్ముడు. యుద్ధంలో చావు తప్పించుకొని పారిపోయి తన అన్న శతకంఠ రావణుడిని చంపిన సీత మీదా, రాముడి మీదా పగ సాధించడానికి చాకలివాడి రూపంతో అయోధ్య చేరాడు. రావణాసురుడి చెల్లెలు శూర్పణఖ బ్రతికే ఉంది. కాకతాళీయంగా అది కూడా పగ సాధించడానికే చాకలిదాని రూపంతో అయోధ్య చేరింది. వాళ్ళిద్దరూ చాలా చిత్రంగా కలుసుకున్నారు.

ఇద్దరూ ఆకలితో మనిషి దొరికితే తిందామని ఊరు పొలిమేరల్లో తిరుగుతూ ఒకరికొకరు చాకలి రూపాల్లోనే తారసపడ్డారు. శూర్పణఖ వయ్యారాలొలికిస్తూ క్రీగంటి చూపుతో కరాళుడిని లాక్కెళ్ళింది. అడమాంసమైనా, ఏదో ఒకటి తినక తప్పదుగదా అని ఆకలిగొన్న కరాళుడు ఆమె వెంటపడ్డాడు. మనిషి దొరికాడు తిందామని శూర్పణఖ రాక్షసాకారం తాల్చి నోరావులించేసరికి, "నువ్వూ రాక్షసివేనా?" అంటూ కరాళుడూ రాక్షసుడై నిలిచాడు. వాళ్ళిద్దరూ చాకలి దంపతులుగా కపట నాటకం ఆడి, అయోధ్య నుంచి పారిపోయి అరణ్యాల్లో ఉంటున్నారు.

చెట్టుమీద ఉన్న హనుమంతుడు వాళ్ల మాటలు వింటున్నాడు :

నృత్యం చాలించి చెట్టు కిందకు చేరి మాట్లాడుకుంటున్నారు. హనుమంతుడు వింటున్నాడు :

"శత్రుశేషం ఉండరాదని ఊరికే అన్నారా? శత్రుశేషంగా మిగిలిన మనం మన అన్నల రుణం తీర్చుకున్నాం, కరాళకంఠుడా! ఆ రాత్రి చాకలివాడిగా నీ కరాళకంఠ స్వరంతో ఎంత బాగా అరిచావు, ఓంద్రపెట్టావు!" అని రాక్షసి అన్నది.

"శూర్పణఖా! నీ వగల ఏడుపెంత బాగుందనుకున్నావు, దొంగవేషం చాకలిదానా!" అని రాక్షసుడు బదులు మెచ్చుకున్నాడు.

"అప్పుడు హనుమంతుడు లేక పోయాడు కాబట్టి సరిపోయింది గాని, అయోధ్యలోనే ఉంటే మనల్ని పసిగట్టి మన అన్నల దగ్గిరికి పంపేవాడు. మన అదృష్టం బాగుండబట్టే ఏదో పర్వతం మీద ఉండిపోయాడు ఆ వానరుడు!" అన్నాడు కరాళుడు.

"ఆ హనుమంతుడి* ఊసెత్తకు, వాడంటే నాకు కోపం!" అన్నది శూర్పణఖ.

"కోపం కాదు, గుండె దడ అను!" అన్నాడు రాక్షసుడు పళ్ళికిలిస్తూ.

"మా అన్న బంగారంతో నాకు కట్టిచ్చిన మేడ కాల్చిపారేశాడుగద, తోకగాడు! వాడంటే నాకు భయం గియం లేదుగాని మా చెడ్డ ఒళ్లుమంట!" అంటూ శూర్పణఖ వీపు తడుముకొంది. దాని వీపు మీద పెద్ద కాలిన మచ్చ ఉంది. అది లంకాదహనమప్పుడు మండుతున్న దూలం దాని వీపున పడినందున ఏర్పడిన మచ్చ. కరాళుడు దాన్ని చూసి హేళనగా, "అందుకా మంట అంటున్నావు! ఇంకా చురచురలాడుతోంది కాబోలు పాపం! మేడ కాలిపోయినా మచ్చ ఉంది పోన్లే!" అన్నాడు.

వాడి వేళాకోళానికి శూర్పణఖ ముఖం ముడుచుకొని, "చాల్లే, మహా చెప్పొచ్చావు!" అంది.



"అది కాదే శూర్పణీ! నాకూ వాడంటే మంటే, మంటన్నరాను! మా చెడ్డవాడు సుమీ!" అన్నాడు వాడు.

"అలాగ చెప్పు! మహావీరుడిలాగ మాటాడకు! వాడి బారినుండి పారిపోయావు, పిరికివెధవా! యుద్ధంలో చచ్చావు కాదు వీరుడిలాగ!" అంది శూర్పణఖ కోపంగా.

"పారిపోబట్టే కదా పగ తీర్చుకున్నాను; నీలాంటి అందాల రాక్షసి నాకు దొరికింది!" అన్నాడు వాడు.

"ఇహ మనం ఏ దూర తీరాలకో పోయి జీవితాలు సార్థకం చేసుకుందాం పద!" అంది శూర్పణఖ.



"మరొక్కపని చేసి మరీ పోదాం. రాముడి యాగాశ్వాన్ని మనం పట్టుకోవాలి!" అన్నాడు కరాళుడు.

"భలే! దానిమీద సవారీ చేస్తూ పోదాం!" అంది శూర్పణఖ.

"సవారీకి కాదే వెర్రిమొగమా!" అన్నాడు వాడు.

"ఆఁ! ఏమని కూశావు? మళ్ళీ అలాగన్నావంటే జాగరత! నా గోళ్ళ పదును చూపిస్తా! ముక్కూ చెవులూ కొంచెం మొద్దుబారాయి కాని, నా మొగానికేం? లక్ష్మణుడు కోసెయ్యక మునుపు మూరెడు ముక్కూ, బారెడు చెవులూ ఉండేవి. ఇప్పుడే నా ముఖం అందంగా ఉందనుకో! అన్నట్టు, కామగమనం గల మనకు గుర్రం ఎందుకురా, కరాళా?" అంది శూర్పణఖ.

"దాన్ని మనం చంపెయ్యాలి!" అన్నాడు కరాళుడు.

"గుర్రం మీద మన కేం పగనీ?" అంది శూర్పణఖ.

"గుర్రం మీద కాదే శూర్పణఖా, రాముడి మీద పగ! గుర్రం కనిపించకపోతే రాముడియాగం ధ్వంసం అవుతుంది. సీత లేక అరప్రాణంతో ఉన్న రాముడు ఠారుమంటాడు!" అని విడమర్చాడు కరాళుడు.

"అయితే త్వరగా చంపేద్దాం పద! గుర్రం తలమాంసం మాంచిరుచిగా కూడ ఉంటుందిలే!" అంది శూర్పణఖ.

"తిండిపోతూ! ఎంతసేపూ తిండి ధ్యాసే నీకు!" అంటూ కరాళుడు లేచాడు.

హనుమంతుడు చెట్టు కొమ్మలు విరిచి వాళ్ళమీద వేశాడు.

"మనమీద పూలవాన కురిపిస్తున్నారా పెద్దలు!" అంది శూర్పణఖ.

"పూలవర్షం కాదే కామరూపిణీ! చెట్టు ఆకులవర్షం!" అన్నాడు కరాళుడు.

"ఏదో ఒకటి, పద వేగం గుర్రం పనిపడదాం!" అంటూ శూర్పణఖ కరాళుడి చేతులుపట్టుకుని, ఇద్దరూ బయలుదేర బోతూండగా హనుమంతుడు

తన తోకను పెంచి వాళ్ళదారి కడ్డంగా పంపాడు.

"సర్పం! మహాసర్పం!" అన్నాడు, కరాళుడు.

శూర్పణఖ పరికించి, "పాముకాదు, తోక! యముడు విసిరిన ఉరిత్రాడు! హనుమంతుడి తోక," అంది కెవ్వున అరుస్తూ.

"ఊరుకోవే! ఇక్కడేం హనుమంతుడే? ఏది చూసినా నీకు హనుమంతుడి భయం!" అన్నాడు కరాళుడు.

"నాకు బాగాగుర్తు రా! లంకకాల్చిన ఆ తోక ఇదే!" అంది శూర్పణఖ గజగజలాడుతూ. శూర్పణఖ మాటలు వింటూనే కరాళుడు పారిపోబోతూంటే శూర్పణఖ, "నన్నొక్కదాన్నీ వదిలేసి పారిపోతావుట్రా?!" అంటూ వాణ్ణి పట్టుకుంది.

చెట్టు దిగి హనుమంతుడు భీకరాకారంతో నిల్చున్నాడు. రాక్షస జంట కీచుకీచుమంటూ పారిపోతూంటే హనుమంతుడు పెద్ద గండశిలాపర్వతాన్ని పెకల్చి, వాళ్ళమీదకు విసిరాడు. దాని కింద పడి వాళ్ళు చచ్చారు.

ఆ విధంగా శత్రుశేషనిర్మూలన తన చేతుల మీద జరిగినందుకు సంతోషించి హనుమంతుడు అడవి దద్దరిల్లేలా సింహనాదం చేసి రివ్వున ఆకాశాని కెగిరి మణిపురం దిశగా వెళ్ళాడు.

హనుమంతుడు ఆకాశంలో ఎగురుతూ, పాయలుగా చీలి, సుందరవనాల గుండా పరవళ్లు తొక్కుతూ ప్రవహిస్తున్న గంగానదిని దాటి, మణిపురరాజ్య పరిసరాల్ని చేరాడు. దూరంలో బ్రహ్మపుత్రానది వెండి కరిగి పారుతూన్నట్లు మిలమిల మెరుస్తూన్నది.

అంతలో మణిపుర రాజధాని పొలిమేరలో ఆకాశంలో ఒక మెరుపు మెరిసి, గొప్ప ధ్వనితో రివ్వున దూసుకుని పోతున్నట్లు కనిపించింది. హనుమంతుడు మెరుపును మించిన వేగంతో అటు ఎగురుతూ వెళ్లాడు.






మణిపుర రాజ్యాన్ని ఏలుతున్న మణిధ్వజుడు పరాక్రమవంతుడే గాకుండా, గొప్ప శివభక్తుడు. నూరుసార్లు హోమగుండంలో తన శరీరాన్ని దహింపజేసుకున్నాడు. పదిసార్లు తల నరుక్కున్నాడు. అటువంటి ఉగ్ర పూజలతో శివుణ్ణి ప్రత్యక్షం చేసుకుంటూ, సారెసారెకూ వరాలు పొందిన వీరశైవుడు.

శివుడి త్రిశూలం అతడు కోరినప్పుడు వచ్చి శత్రుసంహారం చేస్తుంది, పాశుపతాస్త్రం కూడ ప్రసాదింపబడింది. తుదకు అతడు కోరినప్పుడు శివుడే వచ్చి అండగా నిల్చి శత్రువులతో యుద్ధం చేసే పెద్ద వరాన్ని కూడా శివుడు మణిధ్వజుడికి ఇచ్చుకున్నాడు. తనకు ఎవరివల్లా అపజయంగాని, ఆపదగాని రాకుండా శివుడే తనకు రక్షగా ఉన్నాడని మితిమీరిపోయిన గర్వంతో విర్రవీగిపోయి మణిధ్వజుడు నిరంకుశంగా పాలిస్తున్నాడు.

శివుణ్ణిగాక ఇతర దేవుళ్ళనూ, మతాలనూ నమ్మినవారినందరినీ దేశం నుండి వెళ్ళగొట్టాడు. శివాలయాలు తప్ప మరే ఆలయమూ లేకుండా ధ్వంసం చేయించాడు. మణిధ్వజుడి వల్ల అగచాట్లు పడుతున్న వారంతా అయోధ్యకు శరణార్థులుగా పోయి, రాముడితో మొర పెట్టుకున్నారు. మణిధ్వజుడి అహంకారం నశించేకాలం ఆసన్నమైందనీ, వారి అగచాట్లు త్వరలోనే తీరుతాయనీ రాముడు వారికి అభయమిచ్చి, అంత

**44. అశ్వమేధ సమాప్తి**



వరకూ తన రాజ్యంలో సుఖంగా ఉండమని శరణు ఇచ్చాడు.

స్వైరవిహారం చేస్తూ వస్తున్న రాముడి యాగాశ్వం తొలి డెక్క తన రాజ్య సరిహద్దు మీద పడీ పడగానే, మణిధ్వజుడు దాన్నిపట్టి తన రాజధాని మణిపురం అశ్వశాలలో బంధించాడు.

గుర్రాన్ని విడిచిపెట్టి రాముడిపట్ల స్నేహభావాన్ని చూపవలసిందిగా మణిధ్వజుడికి చెప్పిరమ్మని లక్ష్మణుడు రాచ మర్యాదగా దూతను పంపాడు. మణిధ్వజుడు దూత వీపుమీద కాల్చిన త్రిశూలంతో వాతపెట్టించి, "రావణాది శివభక్తులను చంపిన రాముణ్ణి, శివప్రీతిగా భైరవుడి విగ్రహం ముందు చిత్రవధ చేసి, బలి ఇద్దామని ఉవ్విళ్లూరుతున్నాను! కోటిమంది రాముళ్ళు వచ్చినా నాకు లెక్కలేదు. త్రిశూలం ముద్రలు వేయించి పంపుతానని, నేను చెప్పినట్లుగా వెళ్ళి చెప్పు!" అని దూత నెత్తిమీద గంపెడు భస్మాన్ని గుమ్మరింపించాడు.

అంతవరకు ఎటువంటి ఘర్షణా లేకుండా వస్తున్న లక్ష్మణ భరత శత్రుఘ్నులకు మణిధ్వజుడితో యుద్ధం తప్పనిసరి అయింది. భరతుడు పూరించిన పాంచజన్యం లాంటి శంఖధ్వనితో దిక్కులు పిక్కటిల్లుతూండగా, ఒక వంక శత్రుఘ్నుడు సుదర్శన చక్రంలాగ విజృంభిస్తూంటే, తన వంక వెయ్యి పడగలు విప్పి బుసలు కొడుతూన్న శేష సర్పంలాగ ఎత్తివస్తున్న లక్ష్మణుడి ప్రచండ ధాటికి మణిధ్వజుడు తట్టుకోలేక శివుని త్రిశూలాన్ని పిలిచాడు.

అప్పుడు మణిధ్వజుడి పూజామందిరం నుంచి మెరుపులాగ ఉరుముకొంటూ త్రిశూలం లక్ష్మణుడి మీదికి దూసుకుంటూ వెళ్ళింది. సరిగ్గా అదే సమయానికి హనుమంతుడు లక్ష్మణుడికి అడ్డంగా వాలి, ఏనుగు తొండంతో చెరుకు గడను పట్టుకొన్నట్లుగా లక్ష్మణుడిని సంహరించడానికి వస్తున్న శివుడి త్రిశూ

లాన్ని ఎడమచేత్తో ఒడిసి పట్టుకొని, గంభీరాకృతితో శివుడిలాగే నిల్చున్నాడు.

మణిధ్వజుడు సంభ్రమంతో శివుడే దిగివచ్చాడనుకుని చేతులెత్తి జోడించ బోతూంటే నవ్వి, హనుమంతుడు, "ఓయి, శివమహాభక్తుడా! నేను శివుణ్ణి కాను. ఒక కోతిని, హనుమంతుడిని! రాముడి బంటును! తెలిసిందా?" అంటూ గదను ఎత్తి లంఘించాడు.

మణిధ్వజుడు వేటు తప్పించుకొని దూరంగా పారిపోయి హనుమంతుణ్ణి చూసి తెల్లమొహం వేశాడు. హనుమంతుడి జటాజూటం గాలిలో ఎగురుతున్నది. కళ్ళు అగ్నిగోళాల్లా మెరుస్తున్నాయి. ఒక చేత్తో త్రిశూలాన్ని నేలకు తాటించి పట్టుకొని, అపరమహేశ్వరుడిలాగ నిల్చున్నాడు. తనకు చావు తప్పదనే భయంతో మణిధ్వజుడు ఎలాగో తెగించి పాశుపతాస్త్రం గుర్తు తెచ్చుకొని మంత్రం జపించి, వింటికి సంధించి విడిచాడు.

పాశుపతాస్త్రం వేడికి ఆ ప్రదేశమంతా ఉడికిపోయింది. లక్ష్మణ భరత శత్రుఘ్నులు వారి సైన్యమూ అంతా నేలకు ఒరిగి మూర్ఛపోయారు. హనుమంతుడు రామనామం జపిస్తూ రొమ్ము విరుచుకొని అస్త్రానికి ఎదురుగా వెళ్ళాడు. పాశుపతాస్త్రం హనుమంతుడి గుండెను తాకి చీపురుపుడకలాగ విరిగి హనుమంతుడిలో లీనమైంది. హనుమంతుడు మణిధ్వజుడి రథాన్ని తుత్తునియలు చేసి,





గదతో కొట్టి, అతణ్ణి చంపడానికి విరుచుకు పడ్డాడు. మణిధ్వజుడు దెబ్బతిని చావ కుండా, పరుగు పరుగున పారిపోయి పూజామందిరంలో శివలింగానికి తల బాదుకుంటూ, "హరహర మహాదేవా! వేగంగా రా!" అంటూ అరిచాడు.

"ఏమిటిది? మణిధ్వజా! కోటిమంది రాముళ్లు వచ్చినా లెక్కలేదన్నావే, ఒక్క రాముడి బంటును ఎదుర్కోలేవా? వెళ్ళు యుద్ధం చెయ్యి, నీకు అండగా నేను నిలబడతాను!" అని శివలింగం నుంచి మాటలు వినిపించాయి.

ఇచ్చిన వరం ప్రకారం నందివాహనం ఎక్కి శివుడు యుద్ధరంగంలో అండగా మణిధ్వజుడి ముందర సాక్షాత్కరించాడు. హనుమంతుడు శివుడితో, "నువ్వు దేవుడివే కావచ్చుగాని, నీకు నేను జంకేది లేదు, కాచుకో!" అంటూ సింహగర్జన చేసి శివుడి మీదకు బయలుదేరాడు. నంది బెదిరిపోయి శివుణ్ణి క్రిందకు పడద్రోసి పారిపోయింది.

శివుడు సర్దుకొని లేచి హనుమంతుడితో, "నా త్రిశూలాన్ని పట్టేశావు, పాశు పతాస్త్రాన్ని నీలో ఐక్యం చేసుకున్నావు. ఇలా చేయడం విష్ణుదేవుడికి ఒక్కడికే సాధ్యం. నువ్వు విష్ణువువా? విష్ణు భక్తుడివా? ఎవరు నువ్వు?" అన్నాడు.

"మీ దేవుళ్ళతో నాకు నిమిత్తం లేదు, నేను మానవుడైన రాముణ్ణి నమ్ముకొన్న వాడిని. కోతినైన నాకు ఆ మానవుడే దేవుడు. బుద్ధి కూడా కోతిలాగే అతి చంచలమైనది. నా బుద్ధిని ఏకాగ్రతతో ఉత్తమ మానవుడి మీద నిలిపి అంతులేని మనోబలాన్ని, సాహస పరాక్రమాల్ని పొందాను. దీన్ని భక్తి అన్నా, లక్ష్య సాధన అన్నా రెండూ ఒకటే! లోక కళ్యాణం కోసం నేను నమ్మిన మానవుడు చేస్తున్న అశ్వమేధ యాగాన్ని ఏ దైవ భక్తీ, ఎటువంటి శక్తులూ అడ్డలేవు. భక్తులమని చెప్పి మణిధ్వజుడు లాంటి వాళ్ళు చేస్తున్నదేమిటి? ఇలాంటి అహం

కారులకు, స్వార్థపరులకు అండగా నిల్చే దేవుళ్ళు లేకపోతేనేం?'' అని హనుమంతుడు దిక్కులు దద్దరిల్లేలాగ గద్దించాడు.

ఆ మాటలకు శివుడు నవ్వుకొని, లేని కోపాన్ని తెచ్చిపెట్టుకుంటూ, ''నా ఫాలనేత్రాన్ని తెరుస్తున్నాను, కాచుకో!'' అన్నాడు.

''త్వరగా తెరు! నీ భక్తుడికి కనువిప్పు కలిగించు!'' అన్నాడు హనుమంతుడు.

శివుడు తన మూడో కన్ను తెరవగానే భగ్గున ప్రళయాగ్ని హనుమంతుడి మీదకు దూసుకు వచ్చింది. హనుమంతుడు కుడి చేయి చాచి, అగ్నిని దోసిట్లో పట్టి, ఒకప్పుడు శివుడు హాలాహలాన్ని తాగినట్లుగా, ''రామార్పణమస్తు!'' అంటూ నోట్లో వేసుకొని గుటుక్కున మింగేశాడు.

శివుడు మణిధ్వజుడిని చూసి, ''అంతా చూశావుగా! ఇహ నేను చేయగలిగింది ఏమీ లేదు. హనుమంతుడు ఎవరో కాదు, నా ఆత్మస్వరూపమే! నా అంశతో అవతరించిన అతనిలో, నా సర్వశక్తులూ లీనమైనాయి. అతనివల్ల భక్తి అంటే ఏమిటో తెలుసుకో!'' అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

ఈ లోగా హనుమంతుడు రివ్వున ద్రోణగిరికి వెళ్ళి సంజీవకరణిని పెళ్లగించి



తీసుకొని వచ్చి, మూర్ఛపడి వున్న లక్ష్మణ, భరత, శత్రుఘ్నులనూ, సైన్యాన్నీ బ్రతికించాడు.

మణిధ్వజుడికి కనువిప్పు కలిగింది. హనుమంతుడి ముందు మోకరిల్లి అంజలి ఘటించాడు. హనుమంతుడు అడిడితో, ''మణిధ్వజా! స్వార్థంతో నీ భక్తి ఎంత క్షుద్రమైపోయిందో గ్రహించావా? స్వప్రయోజనాల్ని కోరి ఈశ్వరుణ్ణి సేవకుడిగా వినియోగించుకోవడం భక్తి కాదు; జీవకోటి సుఖంగా ఉండాలనే ఈశ్వర సంకల్పాన్ని నెరవేర్చడమే భక్తి! నీలాంటి వారివల్ల దేవుళ్ళ పరువు పోతున్నది. భక్తులనిపించుకొనే స్వార్థపరులనూ,



అహంకారులనూ ఏవగించుకొని, మంచి వాళ్ళు నాస్తికులుగా మారుతున్నారు! ఇప్పుడు నీ అజ్ఞానం తొలగింది గనుక, ఇకనుండి ద్వేషం వదలి దైవత్వం అన్నిటిలోనూ ఒకటేనని గుర్తుంచుకొని, ప్రజలందరి సుఖమే నీ పరమావధిగా పాలించు!'' అని చెప్పాడు.

అప్పుడు మణిధ్వజుడు, ''ఆంజనేయ స్వామీ! గర్వం మితిమీరి భంగపడితేనే గాని జ్ఞానం రాదు. నా గర్వం మితిమీరడానికే శివుడు నేను కోరిన వరాలన్నీ ఇచ్చాడని ఇప్పుడు అర్థం చేసుకున్నాను. గర్వంతో నేను బంధించిన యాగాశ్వం నాకు మేలే చేసింది, జ్ఞానోదయం కలిగించింది. ఇదంతా రాముడి దయ అనుకుంటాను. నేను రాముడి దగ్గిరకు వెళ్ళి క్షమాపణ వేడుకొని, నన్ను తన బంధుకోటిలో చేర్చుకోమని అర్థిస్తాను!'' అని చెప్పి యాగాశ్వాన్ని తెచ్చి వినమ్రుడై లక్ష్మణుడికి అప్పగించాడు.

యాగాశ్వాన్ని స్వేచ్ఛగా వదలి అందరూ దాని వెంట బయలుదేరారు. వారికి మణిధ్వజుడు ఘనంగా వీడ్కోలు ఇచ్చాడు.

మణిధ్వజుడికి శుభ, శోభ అనే ఇద్దరు చక్కని కుమార్తెలున్నారు. వాళ్ళు కూడా కవలలుగా పుట్టినవారే. వారిని వెంటబెట్టుకొని మణిధ్వజుడు అయోధ్యకు వెళ్ళి రాముణ్ణి, తన తప్పిదాన్ని మన్నించమని వేడుకున్నాడు. రాముడు మణిధ్వజుణ్ణి మిత్రుడిగా ఆదరించాడు. తరువాత మణిధ్వజుడు తన కుమార్తెలను లవకుశులకు వధువులుగా అంగీకరించి తనకు రఘువంశంతో బాంధవ్య భాగ్యం కలిగించమని అర్థించాడు. రాముడు అంగీకరించి అశ్వమేధం పూర్తికాగానే పెళ్ళిళ్ళు జరపవచ్చునని అన్నాడు. మణిధ్వజుడు తాను వెళ్ళగొట్టిన వారినందరినీ సాదరంగా తన రాజ్యానికి తీసుకువెళ్ళి, ప్రజా శ్రేయస్సునే శివపూజగా, ప్రజా సేవనే భక్తిగా ఎంచి రాజ్యపరిపాలన సాగించాడు.

రాముడి యాగాశ్వం తూర్పునుండి దక్షిణ పడమరలను నానాదేశాల్లో తిరిగి, స్వేచ్ఛగా అయోధ్యకు తిరిగి వచ్చింది. అశ్వమేధ పరిసమాప్తికి కిష్కింధ నుండి సుగ్రీవాది వానరులు, లంక నుండి విభీషణుడు, మణిపురం నుండి మణిధ్వజుడు, అనేకమంది దేశదేశాల రాజులు గొప్ప కానుకలతో వచ్చారు. విభీషణుడు మంచి ముత్యాలను, పగడాలను బండ్లతో తెచ్చాడు. సుగ్రీవుడు వజ్రాలను, బంగారాన్ని తీసుకువచ్చాడు. మణిధ్వజుడు గరుడపచ్చలను, కెంపులను, చీనాంబరాలనూ తెచ్చాడు. దేశదేశాల రాజులు తెచ్చిన వెండిబంగారాలతో కోశాగారం నిండిపోయి, ఆరుబయట రాసులుగా పోగుపడ్డవి.

లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు నానాదేశాల్లో ఘనస్వాగతాలు, రాచమర్యాదలు పొంది దిగ్విజయంగా సేనలతో అయోధ్యకు చేరుకున్నారు. వారి వెనకగా హనుమంతుడు భరద్వాజ, గౌతమ, అత్రి, అగస్త్యాది ఋషులతో వచ్చాడు. రాముడికి అస్త్ర గురువైన విశ్వామిత్రుణ్ణి ప్రత్యేకంగా ఆహ్వానించుకొని వచ్చాడు.

అశ్వమేధయాగం పరిసమాప్తి ఘనంగా జరిగింది. రాముడు ధనధాన్యాలను ఇంటింటికీ పంపించాడు. రాజ్యంలోని పుణ్యస్త్రీలందరికీ రత్నాల నగలనూ, బంగారాన్నీ పంచిపెట్టాడు. ప్రజాహిత కార్యాలు చేసేవారికి అనేక విలువైన బహుమతులను యిచ్చి సన్మానాలు జరిపించాడు.

తరువాత అందరూ మణిపుర రాజ్యానికి మణిధ్వజుడి ఆహ్వానంపై తరలివెళ్లారు. మణిపురంలో కుశుడికి శుభతోను, లవుడికి శోభతోను వైభవంగా వివాహం జరిగింది. పెళ్ళి సందర్భంలో మణిధ్వజుడు తన రాజ్యాన్నంతనూ లవకుశులకు కానుకగా చదివించి, కొన్నాళ్ళ తర్వాత తపస్సు చేసుకోడానికి అరణ్యానికి వెళ్ళిపోయాడు.





రామరాజ్యంలో న్యాయంకోసం ఎక్కువ, తక్కువ మొదలైన తేడాలు లేకుండా నిరాటంకంగా వెళ్లి రాజుతో చెప్పుకొని న్యాయం పొందవచ్చు. ఒకనాటి రాత్రి ఒక కుక్క రక్తం ఓడుతూ కొనప్రాణంతో వెళ్ళి రాముడు ఉండే సౌధంముందు నిల్చి పిలుస్తున్నట్లుగా మొరిగింది.

రాముడు మేల్కొని వచ్చి కుక్క తల నిమిరాడు. దాని బాధ అంతా మాయమై ఉత్తేజం వచ్చి, "ఓ, రామా! ఒక యువకుడు నన్ను అన్యాయంగా చావగొట్టాడు. వాడికి ఉద్యోగం సద్యోగం లేక చెడు తిరుగుళ్ళు తిరుగుతున్నాడు. వాడినో పెద్ద దేవస్థానం ధర్మకర్తగా చేయవలసిందిగా కోరుతున్నాను," అన్నది.

రాముడు ఆశ్చర్యంతో, "మరణ దండనో, కఠినశిక్షనో విధించమని కోరకుండా అపకారికి ఉపకారం కోరుతున్నావా?" అని అడిగాడు.

"ఇందులో అదేమీలేదు. క్రిందటి జన్మలో నేనొక పెద్ద దేవస్థానం ధర్మాధికారిగా, ప్రధాన పూజారిగా ఉండి దేవాదాయాన్ని కాజేసి, చేయని అకార్యమంటూ లేకుండాచేసి కుక్కగా పుట్టాను. ఆ యువకుడు కుక్కగా పుట్టి నాలాగే అగచాట్లు పడాలి, నా కసి తీరాలి, అనుకున్నాను. కాని పతితపావనమైన నీ స్పర్శవల్ల నా కసి పోయింది; నేను ఉత్తమగతులు పొందబోతున్నాను," అని చెప్పి కుక్క ప్రాణాలు విడిచింది. తరవాత

45. దేశరక్షణ



ఆ యువకుడు అంతా తెలుసుకొని, పశ్చాత్తప్తుడై ఉత్తముడిగా మారాడు.

* * *

అశ్వమేథయాగం చేసి రాముడు కొద్ది కాలం రాజ్యపాలన చేశాక, ఒక నాడు యముడు బ్రాహ్మణరూపంతో వచ్చి, "రామా! నీతో రహస్యంగా మాట్లాడాలి. మనం మాట్లాడుకుంటూండగా ఎవరు వచ్చినా శిరశ్ఛేదం చేయాలి!" అని చెప్పాడు.

రాముడు అందుకు సమ్మతించి లక్ష్మణుడికి ఆ సంగతి చెప్పి, ద్వారం దగ్గిర కాపు ఉంచి, యముడితో రహస్య మందిరంలోకి వెళ్ళాడు.

"రామా! నువ్వు మహావిష్ణువువి. నీవు అవతరించిన పని పూర్తి అయింది. సీత లక్ష్మిగా, పుట్టినిల్లు క్షీరసాగరంలో నీ కోసం నిరీక్షిస్తున్నది. ఆదిశేషుడు, శంఖచక్రాలైన నీ తమ్ములతో నీవు క్షీరసాగరం చేరుకోవాలి!" అని చెప్పాడు.

అదేసమయంలో దూర్వాసుడు హుటాహుటిగా వచ్చి లక్ష్మణుడితో, "నేను ఇప్పుడే రాముణ్ణి చూడాలి! లేకుంటే రఘువంశం నశించేలాగ శపిస్తాను!" అని చెప్పాడు.

వంశనాశనానికి బదులు తాను శిరశ్ఛేదం పొందటమే మంచిదని లక్ష్మణుడు తలంచి, దూర్వాసుడి రాకను రాముడితో చెప్పడానికి లోపలికి వెళ్లాడు. వెంటనే యముడు అంతర్థానమయ్యాడు.

రాముడు తాను మాట యిచ్చిన ప్రకారం లక్ష్మణుడికి శిరశ్ఛేదం విధించాడు. పెద్దలు ఆలోచించి దేశబహిష్కరణ శిరశ్ఛేదంతో సమానమే గనక, లక్ష్మణుడిని దేశం నుండి వెళ్ళగొట్టి పంపితే చాలునని రాముడికి చెప్పారు. లక్ష్మణుడు అంతా విని, సరయూనదిలో పడి తన అవతారం చాలించాడు.

లక్ష్మణుడు సరయూనదిలో మునిగిన తర్వాత రాముడు భరతశత్రుఘ్నులకు విషయమంతా చెప్పి, పట్టాభిషేకానికి

చేయవలసిన ఏర్పాట్లన్నీ చూడమని చెప్పాడు. అయోధ్యానగరం అంతా దివ్యంగా అలంకరింపబడింది.

రాముడు లవకుశులకు రాజ్యపట్టాభిషేకం చేసి, హనుమంతుడిని పిలిచి, "హనుమంతా! నేను చాలాకాలం రాజ్యపాలనచేసి విశ్రాంతి కోరుకుంటున్నాను. నేను ఉంటాను, లేకపోతాను. నీవు కుశలవులకు పెద్ద దిక్కుగా ఉండి అన్నీ చూసుకుంటూ ఉండు! రాజ్యరక్షణ భారం నీ మీద పూర్తిగా ఉంచుతున్నాను. వీరినే నన్నుగా చూసుకో. అందనిల్నీ ఉత్తమ పాలకులుగా తీర్చిదిద్దు!" అని చెప్పాడు.

రాముడు సరయూనదికి వెళ్ళడానికి పెద్ద ఊరేగింపు ఏర్పాటు చేయించాడు. ఆ రోజు మహోదయపర్వదినం. మంగళధ్వనులు మారుమోగుతున్నాయి. బ్రాహ్మణులు వేదఘోషచేస్తున్నారు. తూర్యనాదాలు మిన్నుముట్టుతున్నాయి. రాముడు సరయూనదికి పాదచారిగా బయలుదేరాడు. భరతుడు అతనికి తెల్లగొడుగు పట్టాడు. శత్రుఘ్నుడు వింజామరం వీస్తున్నాడు. మేడల మీది నుంచి పుణ్యాంగనలు పూల జల్లుకురిపిస్తున్నారు. హనుమంతుడు రాముడి వెనక మందంగా మతిపోయినవాడిలాగ అడుగులు వేస్తు



న్నాడు. రాముడు సరయూనదికి ఎందుకు వెళ్తున్నాడో తెలియని ప్రజలు పరిపరి విధాలుగా చెప్పుకుంటూ అనుసరిస్తున్నారు. ఊరేగింపు సరయూనది ఒడ్డు చేరింది.

రాముడు సరయూనది నీళ్లలో పాదాలు మోపాడు. భరతుడు శంఖాన్ని పూరించాడు. శత్రుఘ్నుడు కర్పూరహారతి వెలిగించి, చక్రంగా తిప్పాడు. బ్రాహ్మణులు సామవేదం గొంతెత్తి చదువుతున్నారు. మంగళవాద్యాలతో దిక్కులు పిక్కటిల్లుతూన్నవి. భరతశత్రుఘ్నులు కూడ నదిలోకి దిగి రాముడి భుజాల వెనుక ఇరుపక్కలా నిలబడ్డారు.



రాముడు మెల్లగా నదిలో నడుస్తూ, లోతుకు వెళ్ళి నిల్చుని కుడిచేయి ఎత్తి, అరచేత్తో అభయముద్రపట్టి ప్రజలను ఆశీర్వదిస్తూ, "సంతోషంగా ఇళ్ళకు వెళ్ళండి. సుఖసంతోషాలతో వర్ధిల్లండి!", అని అన్నాడు.

లవకుశుల దగ్గిర నిల్చున్న హనుమంతుడు విలవిల్లాడిపోతూ, "రామా! ఆగు! నీ కంటే ముందు నేనే నదిలో తనువు చాలిస్తాను. నువ్వు లేకుండా నేనెందుకు?" అని గుండెబాదుకొంటూ నదిలో దిగబోతూంటే, రాముడు ముక్కు మీద వేలు పెట్టి వారిస్తూ, "హనుమా, నువ్వు చిరంజీవివి! నేను చెప్పిందంతా మరిచావా? లవకుశులను తోడ్కొని త్వరగా ఇక్కడి నుంచి కదులు!" అని గట్టిగా ఆజ్ఞాపించాడు.

హనుమంతుడు లవకుశులతో రాజమందిరానికి వెళ్ళాడు.

రాముడు సరయూనది లోతుల్లోకి వెళ్లి, కనిపించలేదు. రాముడి వెనుకనే భరత శత్రుఘ్నులు నదిలో కలిసిపోయారు. రామావతారం ముగిసింది.

క్షీరసాగరంలో లక్ష్మణుడు ముందుగానే ఆదిశేషుడై పాన్పుగా అమరి ఉన్నాడు. రసాతలం నుంచి సీత లక్ష్మిగా వచ్చి కూర్చొని ఎదురుచూస్తున్నది. రాముడు విష్ణువుగా శేషతల్పం మీదకు చేరుకున్నాడు. భరతశత్రుఘ్నులు శంఖ చక్రాలుగా అతని చేతుల్లో ఉన్నారు. లక్ష్మి విష్ణువు పాదాలు ఒత్తసాగింది.

* * *

ఒకనాడు కుశలవులు సింహాసనం మీద కూర్చొని తల్లిని, తండ్రిని తలచుకొని వెక్కివెక్కి కన్నీరు కారుస్తూండగా, హనుమంతుడు చూసి, వారిని ఓదార్చుతూ, "రఘువంశ దీపకులైన మీరు గొప్పగా రాజ్యపాలన చేయాలిగాని దిగులు పడవచ్చా? మీకు చూడాలనిపించినప్పుడల్లా సీతా రాములను నేను చూపిస్తాను. వారు నా గుండెలో ఎంత ఆనందంగా

ఉన్నారో చూడండి!" అంటూ తన రొమ్ము చీల్చి చూపించాడు. అందులో చిరునవ్వుతో ప్రేమతో చూస్తూ ఆశీర్వదిస్తున్న తమ తలిదండ్రులను చూసి, కుశలవులు ఎంతగానో సంతోషించారు.

కుశలవులు యువకులై చక్కగా రాజ్యపాలన నిర్వహిస్తున్నారు. తూర్పున మణిపురాన్నీ, పడమట మధురానగరాన్నీ ఉపరాజధానులుగా చేసి, శుభతో కుశుడు మణిపురంలోనూ, శోభతో లవుడు మధురలోనూ ఉంటూ, రెండు వైపులా శాంతిభద్రతలు చూసుకొంటున్నారు.

అంతలో దేశానికి గొప్ప ఆపద ముంచుకొచ్చింది. రాక్షసుడి కంటే క్రూరాతిక్రూరుడైన ఘోరకలి అనే నరరూప రాక్షసుడు శకులు, కుషాణులు, పాషాణులు అనే కొండజాతి దుండగులను కూడగట్టుకొని దండయాత్ర చేస్తూ, వాయవ్యదిశ నుంచి విరుచుకుపడ్డాడు. వాడి సేనలైన దుండగులు పశ్చిమోత్తర రాజ్యభాగం మీదపడి అల్లకల్లోలంచేశారు.

ఘోరకలికి తోడు పడమటి దిక్కున కాలకలి అనే మరొక నరరూప రాక్షసుడు పెద్ద నౌకాబలంతో, కాలకేయులనే సముద్రరాక్షస సేనలతో సముద్రం నుంచి విజృంభించాడు. కాలకలి ఆజ్ఞలప్రకారం కాలకేయులు రాజ్యాలను కొల్లగొడుతూ



అంతులేని ధనధాన్యాలను వాళ్ళ స్థావరమైన కాలకూటద్వీపానికి చేరుస్తూంటారు.

ప్రజలు భీతితో తల్లడిల్లిపోతూ, ఎవరి ధనప్రాణాలను వారు రక్షించుకోడానికి దార్లు వెతుక్కోసాగారు. అప్పుడు హనుమంతుడు ప్రజలమధ్యకు వచ్చి, ఎవరి ఆత్మరక్షణ వారు చూసుకోవడం సరి కాదనీ, అందరూ ఏకమై దేశరక్షణ చేసుకోవాలనీ ఉత్తేజపరిచి, రామసేన అనేపేరుతో ప్రజల్ని సైనికులుగా తయారు చేసి నడిపించాడు.

రాముడు పాలించిన రామరాజ్యంలో దేశమంతా రామసేనగా ఉంటే సాధించలేనిదంటూ ఉండదనీ, ఎటువంటి



లవుడు కాలకలితో ఘోరయుద్ధంచేసి, వాడిని వారుణాస్త్రంతో హతమార్చాడు. రామసేన ప్రజలు కాలకేయ రాక్షసులను దొరికినమట్టుకు మట్టుపెట్టారు. హనుమంతుడు తనవాలంతో నౌకలను చుట్టబెట్టి సముద్రంలో ముంచివేశాడు. నౌకలతోబాటు కాలకేయులు చచ్చారు.

రెండు ఘనవిజయాలు సాధించిన ప్రజలతో హనుమంతుడు, "రాముడేలిన భూమిలో ప్రతి పౌరుడూ లవకుశులకు సోదరుడనీ, సోదరులంతా సమానులుగా, రామదండుగా ఉంటూ ఏ ఒక్కరికి కష్టంకలిగినా అది అందరిదిగా భావించి తొలగించాలనీ, అదే దేశభక్తి అనీ ఉద్బోధించి రాజ్యాన్ని సురక్షితం చేశాడు.

విజయచిహ్నాలుగా హనుమంతుని ప్రోత్సాహంతో కుశుడు తనపేరిట కుశావతి అనే నగరాన్నీ, లవుడు తన పేరిట లవంతిక అనే నగరాన్నీ నిర్మించారు.

లవకుశులు సమర్థంగా రాజ్యపాలన చేస్తున్నారు. వారి బల పరాక్రమాల మీద హనుమంతుడికి మంచి నమ్మకం కుదిరింది. వారు రామరాజ్యం పేరు నిలబెట్టుతూ, రాజ్యనిర్వహణ చేస్తున్నందుకు సంతృప్తికలిగింది. తాను యింక గంధమాదన పర్వతానికి వెళతానని లవకుశులకు చెప్పాడు.

ఉపద్రవాల భయమూ ఉండదనీ నచ్చజెప్పి, దుండగులను ఎదుర్కొన డానికి పురిగొలిపాడు. దేశప్రజలందరూ యోధులుగా హనుమంతుడి నాయకత్వంలో ఘోరకలితోను, కాలకలితోను యుద్ధానికి తలపడ్డారు. అప్పుడు హనుమంతుడు రెండు యుద్ధరంగాల్లోనూ వెయ్యి రూపాలతో, ఎక్కడచూచినా హనుమంతుళ్ళుగా కనిపిస్తూ, సహస్రరూపాంజనేయుడని అనిపించుకున్నాడు.

కుశుడు గొప్పగా యుద్ధంచేసి, ఘోరకలిని ఆగ్నేయాస్త్రంతో చంపాడు. రామసేన వాడిసేనల్ని తరిమి కొట్టింది. దుండగుల్ని హతమార్చారు.

కుశలవులు పెద్ద ఉత్సవంతో హనుమంతుడిని గంధమాదన పర్వతం దగ్గర దిగబెట్టారు.

హనుమంతుడు చిరకాలం రఘువంశ కీర్తి ప్రతిష్ఠలను నిలబెట్టుతూ వర్ధిల్లండని కుశలవులను ఆశీర్వదించాడు. ప్రజా సమూహాన్ని ఉద్దేశించి హనుమంతుడు, "రామదండుగా దేశమంతా కలిసి కట్టుగా పనిచేస్తే సాధించలేనిది లేదు. రామరాజ్యంలో అందరూ లవకుశులే!" అని చెప్పి వారిని అయోధ్యకు మరలమన్నాడు.

ప్రజలు హనుమంతుడికి నమస్కరించి చేతులెత్తి, "జై వీరహనుమాన్!" అంటూ జయ జయధ్వానాలు చేస్తూండగా తపస్సు చేసుకోడానికి హనుమంతుడు గంధమాదన పర్వతం మీదకు వెళ్ళిపోయాడు.

కుశలవులు, వారి సంతతివారు రామరాజ్యం పేరు నిలుపుతూ రఘువంశ కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింపజేస్తూ చిరకాలం రాజ్యపాలన చేశారు.

హనుమంతుడు గంధమాదన పర్వతం మీద తపస్సు చేసుకుంటున్నాడు.

* * *

ఆ విధంగా గంధమాదన పర్వతం మీద తపస్సులో మగ్నమై ఉన్న హనుమంతుడికి ఒక్కసారి ధ్యానభంగమై కళ్ళు తెరిచాడు. పర్వతాలు కురచగా కనిపించాయి. మహావృక్షాలు మొక్కల్లాగ, ఏనుగులు ఎలుకల్లాగా తోచాయి; ఆకాశాన్ని పరికించాడు; సప్తర్షిమండలం ధ్రువనక్షత్రానికి దూరంగా జరిగి ఉంది; దాన్నిబట్టి యుగం మారిందని అనుకున్నాడు.

అదే సమయంలో త్రికాలజ్ఞుడైన నారదుడు అటేవచ్చి, "ఇప్పుడు ద్వాపర యుగం మొదటి పాదం ప్రారంభంలో ఉన్నది, హనుమా! ఈ ద్వాపరయుగం నాలుగోపాదంలో నీకు రామసందర్శనం కలుగుతుంది!" అని చెప్పి వెళ్ళాడు.

హనుమంతుడు తిరిగి తపస్సు అందుకున్నాడు.





# వీరహనుమాన్

ద్వాపర యుగంలో యదువంశంలో కృష్ణుడు జన్మించి, కంసాది దుష్టులను నిర్మూలించి, ద్వారకానగరంలో ఎనమండుగురు దేవేరులతో తులతూగుతున్నాడు. అతని అన్న బలరాముడు యాదవుల నాయకుడై రాజ్యపాలన చేస్తున్నాడు.

కృష్ణుడు సత్యభామతో కూడా వెళ్ళి, నరకాసురుణ్ణి సంహరించాడు. సత్యభామ కూడా యుద్ధంచేసి కృష్ణుడికి తోడ్పడింది. అప్పట్నించి సత్యభామకు కృష్ణుడి అష్టమహిషుల్లో తానే అధికురాలననే గర్వం ఏర్పడింది.

నారదుడు ఒకనాడు దేవలోకంలోని పారిజాతపుష్పాన్ని తెచ్చి రుక్మిణికి ఇచ్చాడు. కృష్ణుడికి నిజమైన భార్యను నేనై ఉండగా, నా సవతి రుక్మిణికి ఇవ్వడమేమిటి? అని సత్యభామ అలిగింది.

కృష్ణుడు తనతోబాటు సత్యభామను గరుత్మంతుడి మీద ఎక్కించుకొని, దేవలోకానికి వెళ్ళి, పారిజాత వృక్షాన్నే పెకిలించి పట్టుకుపోతూంటే, ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని గరుడవాహనం మీదకు విసిరాడు. గరుత్మంతుడు వజ్రాయుధాన్ని తన రెక్కతో అడ్డుకొని విదల్చి పారేశాడు. అప్పట్నించీ గరుత్మంతుడు విపరీతంగా గర్వించసాగాడు. సత్యభామ పారిజాతవృక్షాన్ని తన పెరట్లో నాటించుకొని, మరీ గర్వించిపోయింది.

46. కృష్ణాంజనేయ యుద్ధం



ఆ పసివాడి తల్లి కాంచనహేల అనే నాగిని పరుగున వచ్చి బిడ్డణ్ణి ఎత్తుకొని పారిపోయింది. గరుత్మంతుడు వెంట తగిలాడు. "రక్షించండి! రక్షించండి!" అని అరుస్తూ రొప్పుతుంటూ వస్తూన్న నాగినికి నారదుడు ఎదురై, "రామనామం వల్లిస్తూ హనుమంతుడి శరణుపొందు! మిమ్మల్ని రక్షించగలవాడు అతనొక్కడే! గంధమాదనపర్వతం మీద తపస్సు చేసుకుంటున్నాడు. త్వరగా వెళ్లు!" అని చెప్పాడు.

కాంచనహేలకొడుకును హనుమంతుడి పాదాలమీద వేసి, "రక్షించు! రామ, రామ!" అంటూ కూలిపోయింది.

బలరాముడు కూడా మహాబలులైన అనేకమంది దుర్మార్గులనూ, నరకాసురుడి ప్రాణమిత్రుడైన ద్వివుడు అనే మహా భయంకరుడైన తోకలేని నరవానరుణ్ణీ, తన సాటిలేని నాగలి ఆయుధంతో సంహరించి, తన బలపరాక్రమాలకు అతిగా గర్వించసాగాడు.

సత్యభామ, గరుత్మంతుడు, బలరాముడు, యీ ముగ్గురూ రోజు రోజుకూ మరీ గర్వాన్ని పెంచుకుపోతూంటే, కృష్ణుడు చిరునవ్వుతో సమయం కోసం నిరీక్షిస్తూ ఉన్నాడు.

గరుత్మంతుడు ఒకనాడు ఒక నాగుల పసివాణ్ణి కబళించాలని పట్టుకోబోతే,

హనుమంతుడు కళ్ళు తెరిచి, "నా ఆశ్రమంలో నిర్భయంగా ఉండండి!" అని అభయమిచ్చాడు.

గరుత్మంతుడు వాళ్ళను పట్టి తినడానికి అక్కడికి రావడం చూసి, "ఓ పక్షింద్రమా! నీకు ఆకలిగా ఉంటే నన్ను పొడుచుకొని తిను!" అని హనుమంతుడు అన్నాడు.

"నాగులు నా ఆహారం! నువ్వు కోతివి. పనికిరావు!" అంటూ గరుడుడు హుంకరించి ఆశ్రమంలో వున్న తల్లి బిడ్డలను పట్టుకోబోతూంటే హనుమంతుడు తన తోకతో గరుత్మంతుడి రెక్కలు విరిచికట్టి,

ఆకాశానికి ఎత్తి గిర గిరా తిప్పి విసిరేశాడు. ఆ విసురుకి గరుత్మంతుడు ద్వారకానగరంలో బలరాముడి ముందు దెబ్బతిన్న పిట్టలాగ పడ్డాడు.

కాంచనహేల హనుమంతుడికి నమస్కరించి, కుమారుడితో సురక్షితంగా పాతాళంలోని నాగలోకంలో వున్న, అన్న వాసుకి దగ్గరకు చేరుకొంది.



గరుత్మంతుడి భంగపాటు విని బలరాముడు, ''గరుడా! విచారించకు, నేను ఆ కోతి పని పడతాను. బలరామదేవుడు అజ్ఞాపిస్తున్నాడు, రమ్మని, ఆ వానరుడికి చెప్పు!'' అన్నాడు.

గరుత్మంతుడు భయం భయంగా దూతలాగ వెళ్ళి అలాగే చెప్పాడు. హనుమంతుడు వినిపించుకో లేదు. రెక్కలు విసురుగా ఆడించి గరుత్మంతుడు అల్లకల్లోలంచేసి మరీ చెప్పాడు. దగ్గిరగా వెళ్ళి ముక్కుతో పొడవబోయి, మళ్ళీ నాలుక కరుచుకొని, వచ్చిన దారినే వెళ్ళాడు.

అప్పుడు ద్వారకలో బలరాముడితో ఏదో రాజకీయాలు మాట్లాడాలని వచ్చినట్లుగా వచ్చిన కృష్ణుడు, గరుడుడు చెప్పినదంతా విని, ''వెళ్ళు. రాముడు పిలుస్తున్నాడు, అని చెప్పు!'' అని గరుత్మంతుడిని తిరిగి పంపించాడు.

గరుత్మంతుడితో హనుమంతుడు ద్వారకకు వచ్చి, ''ఓ రామా! నా రామా! రామా!'' అంటూ ఎలుగెత్తి పిలిచాడు.

బలరాముడు గర్వంగా లేచి వెళ్ళి, ''రాముడు కాదు, నేను బలరాముడిని! బలరామదేవాయ నమః అని మూడుసార్లు అంటివా, నిన్ను క్షమించగలను!'' అన్నాడు.

హనుమంతుడికి గొప్ప కోపం వచ్చింది. ''ఏమిటేమిటీ, బలరాముడివా నువ్వు, అబలరాముడివా?'' అని పళ్ళికిలించి వెక్కిరించాడు.

బలరాముడు నాగలి ఆయుధాన్ని హనుమంతుడి మీదకు ఎత్తాడు. దాన్ని తోకతో చుట్టి గిరవాటు వేశాడు హను



మంతుడు. కొట్టాలని వస్తున్న బలరాముడిని రెండు చేతులతో బలంగా పట్టుకొని మీదకు ఎత్తాడు. బలరాముడు విలవిలలాడుతూ మూర్ఛపోయాడు. ఆ మూర్ఛలో కలలాగ గత వృత్తాంతం నెమరుకు వచ్చింది....

రామ పట్టాభిషేకం జరిగిన మరుక్షణంలో, లక్ష్మణుడు జోగుతూ ఫక్కున నవ్వాడు. సభలో ఎవరికివారే తమనే లక్ష్మణుడు పరిహాసం చేశాడని ముఖాలు దించుకున్నారు. రాముడు లక్ష్మణుడి మీదకు కత్తి ఎత్తాడు. హనుమంతుడు అడ్డుకొని, లక్ష్మణుడిని బతిమాలి నవ్వుకు కారణం తెలుసుకొని సభవారికి ఇలా చెప్పాడు: "వనవాసంలో ఎల్లవేళలా సీతారాములను కాచుకొని ఉండడానికి లక్ష్మణుడు పధ్నాలుగేళ్ళు నిద్రనూ, తిండినీ మానుకొని రాముడి పట్టాభిషేకం తర్వాత నిద్రను రమ్మని చెప్పాడు. అతని నిద్ర అంతా అతని అర్ధాంగి ఊర్మిళ తీసింది. పధ్నాలుగేళ్ళు నిద్ర మాని కటిక ఉపవాసం చేసినవాడి చేతుల్లోనే ఇంద్రజిత్తు చావు కూడా రాసిపెట్టి వుంది. ఆ విధంగా నిద్ర ఒక్క క్షణమైనా ఆగకుండా పట్టాభిషేకం మరుక్షణంలో కునికిపాటు వచ్చినందుకు లక్ష్మణుడు నవ్వుకున్నాడు."

హనుమంతుడు చెప్పినదంతా విని రాముడు, "మరి నేను వనవాసంలో ఒకనాడు తినమని లక్ష్మణుడికి అరటి పండు యిచ్చానే! అది ఏమైనట్టు?" అని అడిగాడు.

అప్పుడు లక్ష్మణుడు ఛర్రున కత్తితో తొడను చీల్చి, అందులోంచి అరటి పండును తీసి, "అన్నయ్య చేత్తో ప్రేమగా ఇచ్చిన పండును రామప్రసాదంగా దాచుకున్నాను. దీనితో ఉపవాసం చాలిస్తున్నాను!" అని దానిని మింగాడు.

రాముడు లక్ష్మణుడిని గాఢాలింగనం చేసుకుని, "తమ్ముడా! వచ్చే జన్మలో నీకు నేను తమ్ముడినై నీ రుణం తీర్చు

కుంటాను!'' అని సభలో బిగ్గరగా చెప్పాడు.

బలరాముడికి తాను లక్ష్మణుడిననే పూర్వజ్ఞానం కలిగి, మూర్ఛనుండి తేరుకొని హనుమంతుడితో, ''సంజీవరాయా! సంజీవిని తెచ్చి అప్పుడు మూర్ఛనుండి బతికించావు; ఇపుడు మూర్ఛతో నేనెవర్నో నాకు తెలిసేలా చేశావు! నీ రాముణ్ణి చూద్దువుగాని పద!'' అని హనుమంతుడిని కృష్ణుడి దగ్గిరకు తోడ్కొని వెళ్ళాడు.

కృష్ణుడు హనుమంతుణ్ణి చూస్తూనే బిగించిన పిడికిటితో చేతినెత్తి, "మా అన్న బలరాముడంతటివాడినే ధిక్కరిస్తావా?'' అంటూ ముష్టియుద్ధానికి కవ్వించాడు.

కృష్ణాంజనేయుల యుద్ధం చాలాసేపు జరిగింది. తనతో ఎంతో లాఘవంగా పోరాడుతున్న కృష్ణుడిని లోలోపల మెచ్చుకుంటూనే హనుమంతుడు సత్తువపూరా ఒక్క పిడిగుద్దుతో కృష్ణుడిని పడగొట్టాడు. కృష్ణుడు ఆయాసపడుతూనే విజయహాసం చేస్తూ ఏమరుపాటున ఉన్న హనుమంతుడి మీదకు సింహంలాగ లంఘించి, రొమ్ము మీద పిడికిటితో పొడిచాడు. అప్పుడు కృష్ణుడిపాదం హనుమంతుడి మీదపడింది.

ఆ పాద స్పర్శతో హనుమంతుడికి రాముడే కృష్ణుడుగా అవతరించాడని తెలిసిపోయింది. గతంలో లంకలో అగ్ని



ప్రవేశానికి ముందు రాముడు ఆడిన పరుష వాక్యాలకు సీత కంట తడి పెట్టుకున్నప్పుడు, హనుమంతుడికి రాముడి మీద పట్టరాని ఆగ్రహం వచ్చి, పిడికిలి బిగించి చేతిని ఎత్తిపట్టి, "రామా! నాతో యుద్ధం చెయ్యి!'' అన్నాడు.

రాముడు చిరునవ్వు నవ్వి, "హనుమా! ఇప్పుడు నీతో యుద్ధం చెయ్యటానికి అశక్తుణ్ణి. ముందు కాలంలో నీ కోరిక తీర్చుకుందువు గాని!" అన్నాడు.

ఆ సన్నివేశం హనుమంతుడికి గుర్తు వచ్చింది. హనుమంతుడు, ''రామా! రాముడిగానే నాకు కనిపించి నన్ను అనుగ్రహించు!'' అని వేడుకున్నాడు.



"హనుమా! కొంచెం ఆగు! లక్ష్మణుడు యిక్కడే ఉన్నాడు గదా. సీత ఇంకా రావాలి!" అని కృష్ణుడు చెప్పి, సీతగా రమ్మని సత్యభామకు కబురు పంపాడు.

జన్మజన్మలుగా కృష్ణుడికి తానే అసలైన భార్యనని గర్వంగా అనుకునే సత్యభామ, "అదెంతపని!" అని ఏడువారాల నగలు అలంకరించుకొని పారిజాత పుష్పాలు కొప్పునిండా తురుముకొని, వయ్యారంగా వచ్చి ఠీవిగా కృష్ణుడి పక్క నిల్చున్నది.

హనుమంతుడు సత్యభామను చూసీ చూడంగానే, "ఓహో! చంద్రసేనవు గదుటమ్మా నీవు! అప్పుడు రాముడు కృష్ణావతారంలో అష్టభార్యలలో ఒకతెగా నిన్ను చేసుకుంటానన్న మాట నిలబెట్టు కున్నాడన్నమాట! ధన్యురాలివమ్మా, చంద్రసేనా!" అని అన్నాడు.

ఆ మాటలతో సత్యభామకు పూర్వ స్మృతి కలిగి గర్వం విడిచిపెట్టి, రుక్మిణి దగ్గరకి వెళ్ళి, "అక్కా, సీతవైన నువ్వు హనుమంతుడిని అనుగ్రహించు!" అని వేడుకుంది.

రుక్మిణి సీతగా వచ్చింది. కృష్ణుడు కోదండరాముడై కుడిచేత్తో హనుమంతుడిని దీవించాడు. బలరాముడు లక్ష్మణుడై వినయంగా నిల్చున్నాడు. హనుమంతుడు రాముడి పాదాన్ని తదేకంగా చూస్తూ చేతులు జోడించి, బ్రహ్మానందంలో మునిగి పోయాడు.

రామావతార రూపం ఉపసంహరించు కొని కృష్ణుడు హనుమంతుణ్ణి తట్టి, "హనుమా! నువ్వు వెళ్ళి హిమాలయ సానువుల్లో వున్న కదళీవనంలో వుండు. అక్కడికి నీకు తమ్ముడైన వాయు కుమారుడు భీముడు వస్తాడు. అతనికి గదా యుద్ధం, మల్లయుద్ధంలోని మెళకువ లన్నీ చేసి చూపించి, నేర్పు!" అని చెప్పాడు.

సత్యభామ హనుమంతుడి ముంగిటకు వచ్చి, "ఆనాడు రాముడిని నా దగ్గిరికి తీసుకువచ్చి, ఈ నాటి నా భాగ్యానికి

కారకుడివైన నీకు నా కృతజ్ఞత చెప్పు కుంటున్నాను!'' అని నమస్కరించింది.

హనుమంతుడు ఆమెకు తిరిగి నమస్కారం చేస్తూ, "అమ్మా, నీవు సత్య-భామవు; సత్యానికి దేవుడు ఎల్లప్పుడూ వశవర్తిగా ఉంటాడనే అర్థం స్ఫురించే లాగ కృష్ణుడు నిన్ను వరించి, నీ ముద్దు మురిపాలు చెల్లిస్తూ, సత్యాపతి అనే బిరుదు పొందాడు; ధన్యురాలివి! నీవు నాకు సీతతో సమానం!'' అని చెప్పాడు.

అతని మాటలకు సత్యభామ ఆనందంతోపులకించి, "ఇన్నాళ్ళకు హనుమంతునివల్ల సత్యాన్ని తెలుసుకున్నాను, గర్వాన్ని విడిచిపెట్టాను!'' అని చెప్పింది.

హనుమంతుడు రుక్మిణీ కృష్ణులకు ప్రణమిల్లి బయలుదేరబోతూండగా బలరాముడు హనుమంతుడిని కౌగిలించుకొని, "సంజీవరాయా! నీ వలన నన్ను నేను తెలుసుకున్నాను, అహంకారాన్ని వదులుకున్నాను, నీకు నా ధన్యవాదాలు!'' అని చెప్పాడు.

గరుత్మంతుడు హనుమంతుడికి వందనం చేస్తూ, "వీరహనుమా! క్షీర సాగరంలో తన సన్నిధానంలో నాకు తోడుగా నీవు కూడ వచ్చి ఉండబోతున్నావని మహావిష్ణువు నాతో చెప్పినది ఇప్పుడు గుర్తుకు వస్తున్నది!'' అని చెప్పి అతడితో కదళీవనం వరకూ వెంట వెళ్ళాడు.

కదళీవనం ఎత్తైన అరటి చెట్లతో, అనేక తోపులతో, ఇంకా అనేక ఫల వృక్షాలతో నిండుగా ఎంతో ఆహ్లాదకరంగా ఉంది. హిమశిఖరాలనుండి జారివస్తూన్న సెలఏళ్ళు మిలమిలా మెరుస్తున్నవి.

హనుమంతుడు కదళీవనం ప్రవేశించి పండు ముసలి కోతి రూపంతో ఒకపెద్ద అరటిచెట్టు బోదెను ఆనుకొని, కాళ్లు చాచుకొని, కూర్చున్నాడు. అతని తోక నిటారుగా దారికడ్డంగా పరుచుకొని వుంది. చేతికందుబాటులో గద వున్నది.

హనుమంతుడు, కన్నులు మూసి రాముణ్ణి ధ్యానిస్తూ, రామనామం జపిస్తూ వున్నాడు.





# వీరహనుమాన్

పాండవులు జూదంలో కౌరవులకు ఓడి వనవాసం చేస్తున్నారు. ద్రౌపది భీముడితో వనవిహారం చేస్తూ, ఆహ్లాదకరంగా ఉన్న ఒక ప్రదేశంలో చదునుగా వేదికలాగ ఉన్న స్ఫటికశిలపై కూర్చొని, దూరంగా కనిపిస్తున్న హిమగిరిశిఖరాల సొగసులు తిలకిస్తూన్నది. ఆ సమయంలో పెద్ద గాలి వీచింది. ఆ గాలిలో అపూర్వమైన పెద్ద పువ్వు కొట్టుకొనివచ్చి ద్రౌపది ఒడిలో పడింది. ఆ ప్రదేశమంతా దాని పరిమళంతో గుబాళించిపోయింది. దాని రేకులు లెక్కకుమిక్కిలిగా ఉన్నవి. అది కొంచెం నలిగి ఉన్నది.

అది సౌగంధికా కమలం. కుబేరుడి పట్టణమైన అలకాపురి దాపున మాన సరోవరంతో కలిసి ఉన్న దళసరోవరంలో రోజుకు ఒకటి మాత్రమే వికసిస్తూంటుంది. కుబేరుడు ప్రతి రోజూ పుష్పక విమానం మీద కైలాసానికి వెళ్లి సౌగంధికా పుష్పంతో శివార్చన చేసి, క్రితం రోజు అర్చించిన పువ్వును శివనిర్మాల్యంగా తన నగరానికి తీసుకెళ్తూంటాడు. అలాంటిదే పుష్పకం నుండి జారి, ఆకాశం నుంచి గాలితో కొట్టుకొనివచ్చి, ద్రౌపదికి దొరికింది.

ద్రౌపది అచ్చెరువుతో ఆ పుష్పాన్ని చూసి ముచ్చటపడుతూ, అలాంటి పుష్పాన్ని కొత్తది తెచ్చిపెట్టమని భీముడిని ఆప్యాయంగా కోరింది. భీముడు గదను భుజాన వేసుకొని వెతుకుతూ వెళ్ళివెళ్ళి,

47. విజయధ్వజం



హిమాలయ సానువులో ఉన్న కదళీవనం ప్రవేశించి నడుస్తున్నాడు. ఆ వనంలోనే హనుమంతుడు పెద్ద అరటిచెట్టు బోదెను పండు ముసలిరూపంతో ఆనుకొని కాళ్ళు చాచి కూర్చొని, రామస్మరణ చేస్తున్నాడు. అతని తోక చాలా దూరం వరకూ దారి కడ్డంగా పడి ఉన్నది. భీముడు దాన్ని ఒక కోతి తోకగా గుర్తించి, దాటుకొని వెళ్ళడానికి రాజసం అడ్డుపచ్చి, చుట్టూరా కలయజూచాడు. రామరామ అనుకుంటూ కునుకుపాట్లుపడుతూన్న హనుమంతుడు అతడికి కనిపించాడు. వెంటనే భీముడు నేల అదిరేలా అడుగుల చప్పుడు చేస్తూ బెదిరించాడు.

హనుమంతుడు ఆయాసంగా వగరుస్తూ, "నాయనా! పండు ముదుసలిని, ఓపికలేదు, నువ్వే దాన్ని పక్కకు నెట్టుకొని వెళ్లు, కనికరించి కాస్త శ్రమపడు!" అన్నాడు.

భీముడు గదనువాల్చి తోకను తోశాడు. అది కొంచెమైనా జరగలేదు. చేత్తో తోశాడు, రెండు చేతులతో సత్తువపూరా గట్టిగా నొక్కపట్టి కదిలించాలని విశ్వప్రయత్నం చేసినా, ఏ మాత్రం లాభం లేకపోయింది.

హనుమంతుడు విసుక్కుంటూ, "ఏమిటి నాయనా, గుప్పెట పట్టి, నొక్క, నొక్క చంపుతున్నావు? ఒక ముసలి కోతి గాడి తోకను నెట్టలేకపోతున్నావే, ఏం ఘన కార్యం సాధిద్దామని పెద్ద గద పట్టుకొని మరీ బయలుదేరావు? మీ కుర్రాళ్ళకి తొందరపాటేగాని ఆలోచన ఉండదు, అందులోనూ ప్రియమైన ఆడదాని కోరిక తీర్చడానికి మరీ తొందర, ఎక్కడలేని చురుకూ పస్తుంది; అటువంటిదేమీ కాదు గద?" అన్నాడు.

భీముడు ఉడికిపోయి, "అధిక ప్రసంగం కట్టిపెట్టు!" అంటూ హనుమంతుడిని గదతో కొట్టబోయాడు.

హనుమంతుడు నవ్వుతూ, "ఓహో! గదాయుద్ధానికి పిలుస్తున్నావా? ఇన్నాళ్లు

సాము నేర్చి మూలనున్న ముసలివాడి తోనా యుద్ధానికి దిగావు? నీలాంటి తమ్ముళ్ళుంటే అన్నలకు అరణ్యవాసాలే గతి! నాకూ ఉందిలే ఒక గద; నాతో బాటే అదీ ముసలిదైపోయింది!'' అని చెప్తూ దూరంగా ఉన్న తన గదను చేయి చాచి అందుకోబోతే అందక, ''కాస్త నా గదను అందియ్యి తమ్ముడూ, గదా యుద్ధం చేయమంటున్నావుగా మరి!'' అన్నాడు.



భీముడు ఆ గదను ఎత్తి అందియ్యడానికి ఆయాసపడుతూంటే హనుమంతుడు, ''మా కాలంలో ఇలాటి గదలే గాని, గుల్లగదలూ, రేకుగదలూ ఎరగం. ఇంకా వెనకటి కాలంలో బండరాతి గదలే వాడేవాళ్ళం!'' అంటూ గదను అందుకుని బెండులాగ ఎత్తి, భీముడి నెత్తిమీద ఆశీర్వదిస్తున్నట్టుగా సుతారంగా మోపాడు. భీముడు బాధతో మూలుగుతూ తన గదతో హనుమంతుణ్ణి కొట్టాడు. హనుమంతుడు దిగ్గున లేచి గదను ఎత్తి పట్టుకొని హుంకరించాడు. కదళీవనం దద్దరిల్లింది.

ఇద్దరూ చాలాసేపు గదా యుద్ధం చేశారు. భీముడి గద పట్టుతప్పి దూరానికి తూలిపడింది. హనుమంతుడూ తన గదను విసిరేసి మల్లయుద్ధానికి తొడ చరిచాడు.

ఇద్దరూ మల్లయుద్ధం చేస్తూండగా భీముడికి ఒక విషయం బోధపడింది. హనుమంతుడు తలచుకొంటే భీముణ్ణి చిత్తు చేసి ఏం చేసినా చేయగలడు. కాని హనుమంతుడు గదాయుద్ధంలోనూ, మల్ల యుద్ధంలోనూ తనకు తెలియని మెళుకువలన్నీ గురువు శిష్యుడికి నేర్పుతున్నట్టుగా యుద్ధంచేసి చూపించాడు. భీముడు చప్పున హనుమంతుడి ముందు మోకరిల్లి, ''మహానుభావా, తెలుసుకున్నాను! నువ్వు హనుమంతుడివే! నేను వాయుదేవుడి వరప్రసాదుణ్ణి, కుంతి కుమారుడిని, భీమసేనుడిని, ధర్మరాజు పెద్దతమ్ముణ్ణి! అనుగ్రహించు!'' అని స్తోత్రం చేశాడు.



హనుమంతుడు భీముణ్ణి వాత్సల్యంతో లేవనెత్తి, "ఔను, తమ్ముడూ! మనం ఇద్దరమూ వాయునందనులమే!" అన్నాడు.

భీముడు, "నీ బ్రహ్మండమైన రూపాన్ని చూడాలని ఉంది!" అన్నాడు.

"నాయనా! ఇది ద్వాపర యుగం; నా పూర్తి విశ్వరూపం నీవు చూడలేవు. నీ తృప్తి మేరకు చూపిస్తాను, చూడు!" అని శరీరాన్ని మేఘమండలాన్ని దాటిస్తూ పెంచి, తోకను ఎత్తి ఆకాశాన్ని చుట్టుతూ హనుమంతుడు భీకరంగా గర్జించాడు. భీముడు అదిరిపడుతూ ఆ రూపాన్ని చూడలేకపోయాడు, విశ్వరూపాన్ని ఉపసంహరించుకోమన్నాడు.

హనుమంతుడు తగ్గి, "ఇంతకూ నీవు బయలుదేరిన పని చెప్పావే కాదు!" అన్నాడు. భీముడు చెప్పాడు.

"భీమసేనా! దళసరోవరాన్ని కేశిక అనే యక్షిణి కాపలా కాస్తూంటుంది. అది చాలా ప్రచండురాలు. దాని ముందర బల పరాక్రమాలు ఎందుకూ పనికి రావు. దాని మాయాజాలానికి లొంగని వారుండరు. నేను జపించే రామనామం నిన్ను హెచ్చరిస్తుంది, అప్పుడు జాగ్రత్తపడు. గుర్తుంచుకో, ఆ యక్షిణి గొప్ప శివదీక్షాపరురాలు. నా రోమాల్ని గుప్పెడు పట్టుకెళ్ళు. యక్షిణి నిన్ను అడ్డగించినప్పుడల్లా, ఒక రోమాన్ని దాని ముందు వెయ్యి. రోమం పడ్డ చోట శివలింగం లేస్తుంది. యక్షిణి సహస్రనామాలతో దాన్ని అర్చిస్తూ కూర్చుంటుంది. ఆవిధంగా నీ పని చక్కబెట్టుకొని రా!" అని చెప్పి హనుమంతుడు తన తోక కుచ్చునుండి రోమాల్ని తీసి ఇచ్చి, భీముడికి దళసరోవరానికి దారి చూపించాడు.

కేశిక దూరంలో వస్తూన్న భీముణ్ణి చూసి, వెంటనే ఎంతటివారినైనా సమ్మోహపరచగల అద్భుత సౌందర్యవతిగా రూపుదాల్చి, ఆటపాటలు మొదలుపెట్టింది. భీముడు సమీపించి పరవశించిపోయాడు. అప్పుడు రామనామం అతని



చెవిలో మారుమ్రోగింది. భీముడు తెలివి తెచ్చుకొని ముందుకు సాగాడు. ఎన్ని విధాలుగా కవ్వించినా భీముణ్ణి మాయా జాలంలో ముంచలేక యక్షిణి విసిగి, చివరకు భయంకరాకారంతో అతణ్ణి అడ్డగించింది.

భీముడు హనుమంతుడి రోమాన్ని దాని ముందర వేయగానే సాక్షాత్కరించిన శివలింగానికి, కేశికి లెంపలు వేసుకొని సాగిలపడి మ్రొక్కి స్తోత్రపారాయణ మొదలు పెట్టింది. దాని ఆరాధన పూర్తయే లోగా భీముడు దళసరోవరంలో దిగి సౌగంధికా కమలాన్ని కాడతో త్రుంచి పట్టుకొని పలాయనమయ్యాడు. కేశిక ప్రచండ వేగంతో వెంబడించింది. దాని జుట్టు అగ్నిశిఖల్లాగ గాలిలో విరజిమ్ముకుంటూ భీముణ్ణి చుట్టుముట్టింది.

భీముడు దారి పొడవునా రోమాలు వేస్తూ భక్తురాలికి ఎడతెగని ఆరాధనా కాలక్షేపాన్ని కల్పిస్తూ తప్పించుకొని, హనుమంతుడున్న కదళీవనాన్ని చేరుకున్నాడు.

భీముడు సౌగంధికాపుష్పాన్ని హనుమంతుడికి చూపిస్తూ, "మహానుభావా! ఇప్పుడు నీ అనుగ్రహంతో నాకు విజయం చేకూర్చినట్లే, ముమ్ముందు కౌరవులతో మాకు జరగబోయే సంగ్రామంలో నీవు మాకు సహాయపడాలని మా పాండవులందరి పక్షానా వేడుకుంటున్నాను," అని చేతులు జోడించాడు.

అప్పుడు హనుమంతుడు, "భీముడా! నేను యీ కాలంలో యుద్ధం చేయను. అడిగావు గనక సంగ్రామం జరుగుతున్నప్పుడు నీ తమ్ముడు అర్జునుడి రథం మీది జండాను అంటిపెట్టుకుని రక్షగా ఉంటాను. మీకు జయం కలుగుతుంది! ఇక నీవు నిశ్చింతగా వెళ్ళి సౌగంధికను ద్రౌపదికి యిచ్చి ముచ్చట తీర్చు. మాయ లేడిని కోరి ఆనాడు సీత అన్ని అగచాట్లు తెచ్చిపెట్టుకొన్నది. ఇలాంటి కోరికలు కోరడం అంతమంచిది కాదని చెప్పానని

చెప్పు. సౌగంధికా కమలాన్ని శివార్చన చేసి అలాగే ఉండనిచ్చి, తిరిగి కొప్పు ముడి వేసుకున్నప్పుడు శివనిర్మాల్యంగా తీసి ధరించమని చెప్పు! శివార్చన చేసి నందువల్ల మీకు శుభమూ, కుబేరుడి ఐశ్వర్యమూ కలుగుతాయి. సౌగంధిక ఎప్పటికీ వాడదు!'' అని చెప్పి భీముణ్ణి ఆశీర్వదించి పంపాడు.

భీముడు సౌగంధికాకమలాన్ని ద్రౌపది చేత శివార్చన చేయించాడు. హనుమంతుడు చెప్పమన్నది కూడా చెప్పాడు. ద్రౌపది విని సిగ్గుతో క్షణం ఊరుకొని, మందహాసం చేస్తూ, ''నేను సౌగంధికను కోరినందువల్లనే కదా ఆ మహానుభావుడి రక్ష మనకు లభించింది! నా కోరిక మూలాన మనకు మంచే జరిగినది కదా?'' అన్నది.

భీముడితో సహా పాండవులందరూ, ''ఔను! ఔను!'' అన్నారు. హనుమంతుడి అనుగ్రహానికి మహదానంద పడ్డారు.

పాండవులు నియమం ప్రకారం పన్నెండేళ్ళ వనవాసం ముగించి, తరువాత ఒక ఏడాది అజ్ఞాతవాసం విజయవంతంగా చేసి, కృష్ణుడిని తమ పక్షాన కౌరవుల దగ్గిరికి సంధి రాయబారానికి పంపారు.



కృష్ణుడు చెప్పిన హితవచనాలు దుర్యోధనుడు లెక్క చేయలేదు. సంధి పొసగ లేదు. యుద్ధం తప్పనిసరి అయింది. రణదుందుభి మ్రోగింది. అర్జునుడి రథం మీద రెపరెపలాడుతున్న పతాకాన్ని హనుమంతుడు సూక్ష్మరూపంతో అంటి పెట్టుకొని ఎగిరాడు. కృష్ణుడు అర్జునుడి రథం తోలాడు. విజయధ్వజం ఉజ్వలంగా ఎగిరింది.

కురుక్షేత్రంలో మహాభారత సంగ్రామం బ్రహ్మాండంగా జరిగింది. కృష్ణుడు రథసారథిగా వుండి, గుర్రాలను అదలిస్తూ అర్జునుడి చేత దిగ్విజయంగా యుద్ధం చేయించాడు. అర్జునుడు విజ

యుడుగా పేరు పొందాడు. కృష్ణుడు విజయసారథి అనిపించు కున్నాడు.

దుశ్శాసనుడు ద్రౌపది జుట్టు పట్టి సభకు యీడ్చుకొని వచ్చినప్పుడు, అతడి రక్తంతో ద్రౌపది జుట్టు తడిపి ముడి వేస్తానని భీముడు ప్రతిజ్ఞచేసి ఉన్నాడు. అలాగే యుద్ధంలో భీముడు దుశ్శాసనుడి రొమ్ముచీల్చి ఆ రక్తాన్ని ద్రౌపది కొప్పుకు రాశాడు. అప్పుడు ద్రౌపది కొప్పు ముడి వేసుకొని సౌగంధికా పుష్పాన్ని తురుము కొన్నది. విజయధ్వజంగా ఉన్న హనుమంతుడికి, ఎంతో భక్తిశ్రద్ధలతో నమస్కారం చేసింది.

గదాయుద్ధంలో భీముడు దుర్యోధనుడి తొడలు విరగగొట్టాడు. భీముడు చేసిన ప్రతిజ్ఞలు నెరవేరాయి. కౌరవులు నిశ్శేషంగా హతులయ్యారు. పాండవులు విజయం పొందారు.

కృష్ణుడు హనుమంతుడిని అభినందించి, "హనుమంతుడా! నీ కార్య దీక్షతో ఆనాడు రాముడికి తోడుపడ్డావు. ఇప్పుడు కురుక్షేత్ర యుద్ధంలో విజయ ధ్వజంగా ఎగిరి ధర్మరాజుకు జయం చేకూర్చావు!" అన్నాడు.

అప్పుడు హనుమంతుడు వినయంగా, "మహారథుడైన అర్జునుడికి నువ్వు చక్రపాణివై సారథ్యం చేస్తూండగా జయం చేకూరక ఎక్కడికి పోతుంది? క్రియా సిద్ధికి మించిన బలమేముంది! నేను కేవలం ఒక చిహ్నాన్ని మాత్రమే!" అని అన్నాడు.

"ఔను! క్రియాసిద్ధికి నీవు చిహ్నంగా ఉంటావు! ఏ కాలంలోనైనా, ఏ రంగంలో నైనా నీ గురుతు గల జండా విజయం చేకూరుస్తుంది. విజయధ్వజంగా కల కాలం కీర్తి పొందుతుంది!" అని కృష్ణుడు భరతవాక్యం పలికాడు.

పాండవులందరి వందనాలు అందు కొని, కృష్ణుడి వద్ద శెలవు తీసుకొని హనుమంతుడు గంధమాదన పర్వతానికి ఎగిరివెళ్ళాడు. అక్కడ రామనామ స్మరణతో తపస్సులో నిమగ్నుడైయ్యాడు.






రామనామ జపంతో హనుమంతుడు గంధమాదన పర్వతం మీద తపస్సు చేస్తూండగా బ్రహ్మ వచ్చి, ''హనుమా! కలియుగం ప్రవేశించ బోతున్నది. కలి నీకు సరిపడదు. ఈ యుగాలకు అతీతంగా ఉండే క్షీరసాగరానికి వెళ్లు!'' అని హెచ్చరించి వెళ్ళాడు.

క్షీరసాగరంలో శేషపానుపుపై పవళించి ఉండే విష్ణువు దగ్గిర తుంబుర, నారదులు సదా సంగీతం వినిపిస్తూ ఉంటారు. నారదుడు మహతివీణ మీటుతూ గొప్ప భక్తి భావాలుగల కీర్తనలు పాడుతుంటాడు. తుంబురుడు, అతడిపై పోటీపడుతూ, హయగ్రీవ వీణపై మృదంగ ధ్వనులు కూడా తెప్పిస్తూ కట్టుదిట్టమైన శాస్త్రీయగానం తాళ ప్రధానంగా వినిపిస్తూంటాడు.

వారిద్దరూ, ఎవరికి వారు తానే గొప్ప సంగీత వేత్తననే గర్వంతో అసూయా ద్వేషాలు ప్రబలంగా పెంచుకుంటూ వచ్చారు.

చీటికి మాటికి పోటీపడుతూ సంగీతం కట్టి పెట్టి, దూషణ ఛీత్కారాలతో వీణలను గదాయుధాల్లాగ ఎత్తి కొట్లాడుకోవడమేగాకుండా, ''మాలో ఎవరు గొప్ప? మీరు చెప్పి తీరాలి,'' అని విష్ణువునే వేధించసాగారు.

విష్ణువు వాళ్ళను సుముదాయించలేక యోగనిద్రలోకి జారుకున్నప్పటికీ, ఇద్దరూ చెరో చెవి దగ్గిరా నోళ్లుపెట్టి పాడి, "మాలో

48. భవిష్యత్ బ్రహ్మ



ఎవరు గొప్పవాడో చెప్తావా చెప్పవా? చెప్పేవరకూ, వదిలేది లేదు.'' అని మరింత వేధిస్తూ వచ్చారు.

విష్ణువు విసిగిపోయి, ''మీ సంగీతంతో నేను పరవశించిపోయి యోగనిద్రలో పడుతూ, లేస్తూ ఉంటాను ; కనక నేను సరిగ్గా చెప్పలేను. గంధమాదన పర్వతం మీద ఒక కోతి ఉన్నది. రాముడు పిలుస్తున్నాడని చెప్పి, ఆ కోతిని యిక్కడకు తీసుకురండి. అతను మీ గొప్పలు సరిగ్గా గుర్తించి చెప్పగలడు!'' అని వాళ్ళను పంపించాడు.

తుంబుర నారదులు విస్తుబోయి, ఒకర్నొకరు కొరకొరా చూసుకొంటూ, గంధమాదన పర్వత ప్రాంతం చేరుకుంటూండే సరికి హనుమంతుడు ఏకధారగా చేస్తూన్న రామనామ జపం ఓంకారనాదంగా వినిపించింది. తుంబుర నారదులు పర్వతం మీదకు వెళ్లి, హనుమంతుడి సమీపంలో నిల్చున్నారు. హనుమంతుడు కళ్ళు మూసి, రామనామాన్ని స్థాయి హెచ్చిస్తూ, తగ్గిస్తూ స్వరయుక్తంగా గానం చేస్తూన్నట్లు జపిస్తున్నాడు. ఆ జపంలో అనేక రాగాలు వినిపిస్తూన్నవి. ఆ రాగాలసమ్మేళనంలో అనేక భావాలు కలుగుతూన్నవి.

రా - మ అనే రెండు అక్షరాలే అనేక తాళగతులతో లయవిన్యాసం చేస్తున్నాయి. తుంబుర నారదులు ఆ అపూర్వగానానికి ఆశ్చర్యపోయారు. వచ్చిన పని మరిచారు. హనుమంతుడు గొప్ప నాదోపాసకుడని గ్రహించారు. సాహిత్యం కంటే, శాస్త్రం కంటే గాత్రమాధుర్యం ఎంత గొప్పదో తెలుసుకున్నారు. వాళ్లు కూడా పరవశించి హనుమంతుడితో కలిసి రామ జపం చేశారు. హనుమంతుడి గంభీర మంద్ర గాత్రంతో, వాళ్ళ గొంతులు కలవక, అపశృతి కలిగి హనుమంతుడు కళ్ళు తెరిచాడు. ఒళ్ళు మరిచి కళ్ళుమూసి రామస్మరణ చేస్తున్న తుంబురనారదులు అతడికి కనిపించారు. హనుమంతుడు

దిగ్గునలేచి వారి పాదాలు పట్టి కళ్ళకు అద్దుకున్నాడు.

తుంబుర నారదులు తెప్పరిల్లి కాళ్లు వెనక్కు లాక్కుని, "మహానుభావా! మా కాళ్ళు నువ్వు పట్టుకోవడమేమిటి? మేం ఎవరి మనుకున్నావే, తుంబుర నారదులం!" అన్నారు.

"మీ రెవరైనా కావచ్చు. రామనామ స్మరణ చేస్తున్నవారంతా నాకు ఆరాధ్యులు. వారి పాదధూళి నా శిరస్సున చల్లుకుంటాను. అది నాకు తృప్తి, ఆనందము, భాగ్యమూను!" అని హనుమంతుడు అన్నాడు.

హనుమంతుడు ఎంత గొప్ప గానకళా కోవిదుడో, భక్తి తత్పరుడో గ్రహించి, తుంబుర నారదులు ఆశ్చర్యపోతూ, ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. తరవాత తాము వచ్చిన పని గుర్తుతెచ్చుకొని, "హనుమంతుడా! రాముడు నిన్ను తీసుకు రమ్మని మమ్మల్ని యీ గంధమాదన పర్వతానికి పంపాడు. ఆయన క్షీరసాగరంలో శేష తల్పం మీద ఉన్నాడు," అని తుంబురుడు అన్నాడు.

"సీత అతని పాదాలు ఒత్తుతూన్నది. లక్ష్మణుడు వేయిపడగల గొడుగు పడుతున్నాడు. భరత శత్రుఘ్నులు అతని భుజాల్ని అంటిపెట్టుకుని ఉన్నారు!" అని నారదుడు చెప్పాడు.

హనుమంతుడు వారి వెంట క్షీరసాగరం చేరుకున్నాడు. గరుత్మంతుడు ఎదురు





వచ్చి స్వాగతం చెప్పి, ఆనందంతో హను మంతుడి భుజాల మీద చేతులువేసి, యోగక్షేమాలడుగుతూ, అతణ్ణి విష్ణువు దగ్గిరికి తీసుకెళ్ళాడు.

హనుమంతుడికి విష్ణువు రాముడిలాగే కనిపించాడు. విష్ణువే రాముడు. రాముడు విష్ణువు అవతారం అని గుర్తు తెచ్చుకుని హనుమంతుడు వంగి చేతులు జోడించాడు.

విష్ణువు హనుమంతుడితో, "హను మంతుడా! తుంబుర నారదులు పోటీ పడుతున్నారు. నువ్వు వాళ్ళ పాండిత్యం పరీక్షించి తేలుస్తావని నిన్ను తీసుకు రమ్మన్నాను. వారిని పరీక్షించే ముందు కాస్త నీ గానాన్ని మాకు వినిపించు!" అన్నాడు.

హనుమంతుడు, "రామ రామ, నేను సంగీతవేత్తను కాను సరిగదా సరిగమలు కూడా తెలియని కపిని, వాయుపుత్రుణ్ణి. నాది కేవలం గాలిపాట. మహామహుల ముందు పాడేపాటి శక్తిమంతుణ్ణికాదు," అన్నాడు.

"హనుమా! ఎప్పుడూ నీతో వచ్చిన చిక్కు ఇదే. నీ శక్తి నీకు తెలియదు. నువ్వు సూర్యుడి దగ్గిర అన్ని శాస్త్రాలూ, కళలూ, నవ వ్యాకరణాలూ క్షుణ్ణంగా నేర్చినవాడివి. ఎవరో ఒకరు నీ సత్తువ నీకు చెప్పేదాకా, నీకు ఆవేశం రాదు. నే చెబుతున్నాగదా, ఇహ పాడు!" అన్నాడు విష్ణువు.

అప్పుడు హనుమంతుడు తన పేరు మొదటి 'హ' కారంతో హ అంటూ మంద్రగంభీర నాదంతో ప్రారంభించి విష్ణువుకు ప్రియమైన హిందోళరాగాన్ని ఆలాపన అందుకున్నాడు. తుంబుర నారదులు ఆ స్వరమాధుర్యానికీ, గాత్ర గాంభీర్యానికీ సంభ్రమాశ్చర్యాలుచెంది, నోళ్ళు తెరుచుకొని, చెవులు రిక్కించి వింటున్నారు.

హనుమంతుడు హిందోళరాగాన్ని వైజయంతిగా మళ్లిస్తూ రామనామాన్ని

అందుకున్నాడు. రామ అనే రెండక్షరాల తోనే స్థాయి భేదాలతో, ఎన్నెన్నో తాళ గతులతో అనేక రాగాలతో హనుమంతుడు పాడుతూంటే పాలసముద్రం కెరటాలు నాట్యం చేశాయి. వింటున్నవారి గుండెల్లో ఆనంద తరంగాలు పెల్లుబికాయి. తుంబుర నారదులకు ఎన్నడూ అనుభూతికి రాని భక్తి భావాలు స్ఫురించాయి. హనుమంతుడు తారస్థాయికి చేరుకున్నాడు. పాలసముద్రం కెరటాలు ఉవ్వెత్తుగా లేచి నక్షత్రాల్ని కప్పేశాయి. శేషుడి వెయ్యి పడగలు అల్లల్లాడాయి. హనుమంతుడు ఒక్కసారిగా మంద్ర స్థాయికి దిగి, దేవగాంధార రాగాన్ని అందుకున్నాడు. శాంతరసప్రధానమైన ఆ రాగానికి పాలసముద్రం క్రమక్రమంగా పేరుకొని గడ్డకట్టుకుంది. తుంబుర నారదుల హయగ్రీవ, మహతి వీణలు జున్ను ముక్కల్లో పుడకల్లాగ అందులో ఉండిపోయాయి. క్షీరసాగరం మరింత గట్టిపడి పాలరాతిలాగ తయారైంది. శేషుడు అందులో నొక్కుకుపోయి ఇబ్బందిపడ్డాడు.

విష్ణువు హనుమంతుడిని ఆగమని సంజ్ఞ చేశాడు. హఠాత్తుగా ఆగిపోయిన గానంతో తుంబుర నారదులు ఉలిక్కిపడి, పాలరాతి మంచుబండలా ఉన్న



సముద్రంలో ఉండిపోయిన తమ వీణలను చూశారు.

"మీరు పాడి సముద్రాన్ని కరిగించి వీణలు తీసుకోండి!" అని విష్ణువు ఆజ్ఞాపించాడు.

నారదుడి భక్తి సాహిత్యం వల్లగాని, తుంబురుడి పడికట్టురాళ్ళ సంగీతశాస్త్రం వల్లగాని పాలరాతి బండ కొంచెమైనా మెత్తబడలేదు. తుంబుర నారదులు లోగడ పడ్డ గర్వానికి సిగ్గుపడి తలలు దించుకున్నారు.

విష్ణువు ఆదేశం ప్రకారం హనుమంతుడు భూపాల, వసంత, జంఝూటి, దీపక మొదలైన రాగాలతో రామనామ



గానం చేశాడు. అప్పుడు రాగరాగిణులు రూపుదాల్చి నృత్యం చేశారు. హనుమంతుని గానం తారస్థాయికి చేరుకొని ప్రళయ ప్రకంపనం చేసింది. కైలాసం నుండి శివుడు ఢమరుకం వాయిస్తూ తాండవం చేస్తూ వచ్చాడు. అతని వెనుక పార్వతి, గణపతి, ప్రమథగణాలు వచ్చారు. బ్రహ్మ పద్మాసనం దిగి వచ్చాడు. అతనితో సరస్వతి వీణ వాయిస్తూ వచ్చింది. ఇంద్రాది దేవతలు వచ్చారు. పాల సముద్రం కెరటాలతో ఉయ్యాలలూగింది. అప్పుడు క్షీరసాగరం ఒక పెద్ద కళ్యాణమంటపంలాగ కళకళలాడింది. నవ వధూవరుల్లాగ లక్ష్మీనారాయణులు కనిపించారు. సీతారాముల కళ్యాణం ఇలాగే జరిగి ఉంటుందని హనుమంతుడు ఆనంద తన్మయత్వంలో మునిగిపోయాడు. తుంబుర నారదులు వీణలు తీసుకున్నారు. శేషుడు పక్క సర్దుకున్నాడు.

అప్పుడు, "హనుమంతుడు పాడిన రీతి, హనుమద్గానం అని పేరొంది చిరకాలం వర్ధిల్లుతుంది. పండిత పామరులను సమానంగా ఆకర్షించి హృదయాన్ని ఆకట్టుకుంటుంది; అదే కళకు పరమావధి. నారదుడి సంగీతం భావప్రధానమైనది. తుంబురుడి సంగీతం తాళప్రధానమైనది. భావాన్ని తాళాన్ని సమన్వయపరిచేది రాగం. భావరాగతాళాలు మూడూ సమానమే అయినా, రాగం జీవం లాంటిది, రసాత్మకమైనది, మనస్సు మీద దాని ప్రభావం హెచ్చు. హనుమద్గానం రాగప్రధానమైనది కావటం వల్ల అది ఎప్పటికీ జనరంజకంగా ఉంటుంది!" అని సరస్వతీదేవి తీర్పు చెప్పింది.

బ్రహ్మ ముందుకు వచ్చి, "హనుమంతుడా! నువ్వు ఏ కోరికా లేకుండా చేసినప్పటికీ, నీ తపస్సుకి విలువకట్టగా బ్రహ్మపదవి కూడా చాలింది కాదు; కాని అంతకు మించింది లేదు. నువ్వు కాబోయే బ్రహ్మవు! రామనామ జపంతో నీవు చేసిన

తపస్సే నీవా పదవిని నిర్వహించక తప్పేది లేదని రాసిపెట్టింది. రానున్న కల్పంలో నీ వలన సృష్టి జరుగుతుంది!'' అని చెప్పాడు.

అప్పుడు శివుడు ముందుకు వచ్చి, ''హనుమా! ఈ బ్రహ్మదేవుడి సృష్టిలో మంచివాళ్ళకంటే చెడ్డవాళ్ళే హెచ్చుగా పుట్టారు, పుడుతున్నారు, పుడతారు! తాను దేవుడిననే అహంకారం వల్ల, పరిపూర్ణ మానవత్వం మీద గురిలేకపోవడం వల్ల ఇలా జరిగింది. నీవు కోతివైనా, నీ ధ్యానంలో రాముడు ఉన్నందువల్ల నీ సృష్టిలో రాముడి వంటి పరిపూర్ణ మానవులు, సీత వంటి మానినులు, లక్ష్మణుని వంటి సోదరులు నిండుగా ఉంటారు! అంతవరకూ నీవు విష్ణు సాన్నిధ్యంలో ఉండు!'' అని చెప్పాడు.

అప్పుడు బ్రహ్మ, ''ఔను, హనుమా! శివుడు సరిగ్గా చెప్పాడు. ఎక్కువమంది మంచివారి మధ్య కొద్దిమంది దారి తప్పిన వారున్నా వారిని దారికి తీసుకువచ్చే అవకాశం బాగా ఉంటుంది. అది నీ సృష్టిలో జరిగి తీరుతుంది! రాబోతూన్న బ్రహ్మకల్పంలో విష్ణువు బొడ్డు నుంచి సరికొత్త బ్రహ్మకమలం విచ్చుకుంటుంది. ఆ పద్మాసనాన్ని బ్రహ్మగా నీవు అలంకరిస్తావు. నీవు భవిష్యత్ బ్రహ్మదేవుడివి! సృష్టికర్తవు!'' అని బ్రహ్మవాక్కుగా చెప్పాడు.

అందరూ హనుమంతుడిని మంగళ గానం వినిపించమని కోరారు. హనుమంతుడు, ''పవమానసుతుడు బట్టు పాదారవిందములకు, నిత్య జయ మంగళం!'' అని శ్రీరాగంలో మంగళ గానం చేశాడు.

హనుమంతుడు నారద తుంబుర గరుత్మంతులతో క్షీరసాగరంలో శేషతల్ప శాయియైన విష్ణువు సన్నిధానంలో లక్ష్మీ నారాయణులను సీతారాములుగా సేవిస్తూ ఉంటున్నాడు. హనుమంతుడు చిరంజీవి; అతడు కాబోయే బ్రహ్మ!

—(అయిపోయింది)

